

# రచన

విలువలు * బాధ్యతలు * దృక్పథాలు

# రచన

## విలువలు * బాధ్యతలు * దృక్పథాలు

''మారుతున్న విలువలు - రచయితల బాధ్యతలు''
గోష్ఠి సందర్భంగా ప్రత్యేక వ్యాససంకలనం


ప్రచురణ :




రిజిస్టర్డ్ సంఖ్య : 1/64

సాహితీ సాంస్కృతిక సంస్థ

5. కింగ్స్‌వే. సికిందరాబాదు-3

RACHANA

A COLLECTION OF 37 ESSAYS ON CHANGING VALUES AND WRITERS' RESPONSIBILITIES



యువభారతి

ప్రచురణ : 5

ప్రథమ ముద్రణ : 1000 ప్రతులు
జూలై 26, 1970

ద్వితీయ ముద్రణ : 3000 ప్రతులు
జనవరి 26, 1973

ముఖపత్ర రచన :
శీలా వీర్రాజు

ముద్రణ :
నాగార్జున ప్రింటింగ్ వర్క్స్, హైదరాబాదు

ముఖచిత్ర ముద్రణ :
విస్టాస్ ప్రింటర్స్

ప్రతులకు :

యువభారతి

5, కింగ్స్‌వే, సికింద్రాబాదు-3

వెల :






"రచన"
రెండవ ముద్రణకు

# ప్రేరణ

రచన రెండవ ముద్రణ అందించగలుగుతున్నందుకు ఎంతో సంతోషంగా ఉంది.

"మారుతున్న విలువలు–రచయితల బాధ్యతలు" గోష్ఠి నిర్వహించి దాదాపు రెండున్నర సంవత్సరాల కాలం గడిచింది. ఈ మధ్యకాలంలో దేశంలో, సాహితీ రంగంలో, చెప్పుకోదగ్గ మార్పులే వచ్చాయి. జాతి నిర్మాణాత్మక దృక్పథంతో పురోగమింపచేయడంలో మేధావులు తమ బాధ్యతలను విస్మరించి ప్రవర్తిస్తున్నా రని ఈమార్పు వల్ల ద్యోతకమవుతున్నది. ప్రజాస్వామ్యంపట్ల, మేధావివర్గానికే నమ్మకం సన్నగిల్లుతున్నదా అనిపిస్తున్నది. పాతికేళ్ళస్వతంత్రజీవనం గడిపినజాతి, సాధించిన ప్రగతి ప్రోత్సాహజనకంగా లేదు. వివిధరంగాల్లో, సమర్థవంతమైన నాయకత్వం ఉనికి రాలేదు. ఇది వాస్తవం. సాహిత్యరంగం ఈ వాస్తవానికి అతీతం కాలేకపోయింది. విలువలు, బాధ్యతలు, దృక్పథాలు గురించి, అడపాదడపా నగారామోతల్లా హెచ్చరికలు వినిపిస్తుంటాయి. కొద్దిపాటి కలకలం, చిరుకదలికలు కనిపిస్తాయి. మళ్ళీ, సంచలనం లేని, స్పందన లేని స్తబ్ధవాతావరణం ఆవరించుకుంటుంది.

ఈ గోష్ఠి నిర్వహించడానికి గల ప్రేరణలు, దొరకిన సమాధానాలు, సమస్యలకు పరిష్కారాలు సూచించా యని చెప్పలేము; మేధావుల, రచయితల ఆలోచనల్లో మార్పు తెచ్చిందనీ, 'బాధ్యతల' గురించి స్పష్టమైన అవగాహనతో అనుస్పందించేలా చేయగలిగిందనీ చెప్పలేము. ప్రేరణలో ప్రస్తావనకు వచ్చిన ప్రశ్నలకు సమాధానాలను అన్వేషించవలసిన అగత్యం ఇప్పటికీ ఉంది. ఈ అగత్యాన్ని మేధావివర్గంవారి దృష్టికి తీసుకురావడానికి 'రచన' రెండవ ముద్రణ కొంతవరకైనా తోడ్పడుతుం దని మా విశ్వాసం.

ఈ గోష్ఠి నిర్వహణ సందర్భంగానూ, ఈగోష్ఠి ప్రచురణ 'రచన' సందర్భంగానూ సంతరించుకున్న అనుభవం యువభారతి ఆలోచనలనూ, కార్యక్రమాలనూ ప్రభావితం చేసింది. చిన్నదీపాన్ని వెలిగించగల మన్న నమ్మకాన్ని కలిగించిపెట్టింది. మా బాధ్యతలను పెంచింది.

గోష్ఠి నిర్వహణ తీరుగురించీ, 'రచన' పుస్తకం గురించీ వివిధ పత్రికలలో వచ్చిన అభిప్రాయాలని ఈ రెండవముద్రణంలో పొందుపరుస్తున్నాము.

ప్రథమముద్రణ వెయ్యి ప్రతులూ త్వరలోనే చెల్లిపోయినవి. పలువురు సాహిత్యాభిమానులు ప్రతులు కావాలని పదేపదే కోరారు. అందుకనే ఈ వ్యాసాల్ని పునర్ముద్రిస్తున్నాము. ఈ గోష్ఠి గురించి 'ఆంధ్రభూమి' దినపత్రికలో వెలువడిన శ్రీ సురమౌళి గారి సమీక్షను పొందుపరిచాము.

1970 వ సంవత్సరంలో ఐదురూపాయలకు అందించిన 'రచన' ను ఇప్పుడు నేరుగా యువభారతినుండి పొందే సాహితీమిత్రులకు నాలుగురూపాయలకే అందిస్తున్నాము.

'రచన' ద్వితీయముద్రణకు ఆకృతి కల్పించటంలో విశేషమైన బాధ్యతను నిర్వహించిన మా ఆప్తులు డాక్టర్ జి. వి. సుబ్రహ్మణ్యంగారికి హృదయపూర్వక కృతజ్ఞతలు.

మాలో ఒకరై, ఆత్మీయులై, అందంగా అచ్చుపోసి సకాలంలో అందించిన నాగార్జునప్రింటింగ్‌వర్క్స్ అధినేత శ్రీ నారాయణరావుగారికి నమస్సులు.

ఆలోచనలను ప్రభావితం చేసి, ఆలోచనాపరిధులను విస్తృతపరచగల సాహిత్యం ఇప్పటి తరానికి అవసరం. ఉబుసుపోకకోసం సాగే రచనలను అభిమానించి, ప్రోత్సహించే పాఠకులు ఆలోచనలను ప్రేరేపించగల ప్రయోజనాత్మక సాహిత్యాన్ని సాదరంగా స్వీకరించరేమోనన్న అనుమానం ఇప్పుడిప్పుడే తొలగిపోతోంది. ఆలోచనలను ఉత్తేజపరచే సాహిత్యం అందించటానికి యువభారతి చేస్తున్న కృషికి విజ్ఞుల హృదయపూర్వక సహకారం లభించగలదని ఆశిస్తూ—

మీ

26 జనవరి 1973.

యువభారతి

## ప్రేరణ (మొదటి ముద్రణ)

సముద్రం ఒడ్డున కనబడే అలలకు ఎక్కడో ఆ వెనుక అల్లంతదూరంలో కనపడని గాలి చేసిన అలజడి కారణం. నీటిమడుగులో రాయి వేస్తే, వేసిన చోటేకాదు మొత్తం చలిస్తుంది - జలదరిస్తుంది,

### మారుతున్న విలువలు

విలువలు - వాటి నిర్వచనాలు మారుతున్నాయి. కొన్ని మరుగున పడిపోతున్నాయి. కొన్ని సరికొత్తవి వస్తున్నాయి. కొత్త రూపం దాల్చే పాత విలువలు కొన్నిఅయితే

మరీ క్రొత్త విలువలు మరికొన్ని. విలువలు వడివడిగా మారుతున్నందుకు - బాధలేదు. మార్పు - మంచికే ఐతే, బాధలేదు. ప్రతిమార్పూ - మంచికి మలుపే అని ఖచ్చితంగా చెప్పలేము. అలా నిక్కచ్చిగా చెప్పలేము కాబట్టి - మార్పుకు ప్రయత్నం చేయకూడదు, దోహదం చేయకూడదు అనుకోవడం కూడా తప్పే అవుతుంది. మార్పుకు అవకాశం ఇవ్వాలి. కాని, విశృంఖలత్వానికి కాదు. మంచితనానికీ, మరోగొప్ప సత్యానికీ అవకాశం ఇవ్వాలి. కాని విచ్చలవిడితనానికి కాదు.

## బా ధ్య త లు

మనిషి సంఘజీవి అని ఒప్పుకున్నప్పుడు కేవలం కనీసవుటవసరాలే తీర్చుకోవడం కాకుండా జీవితం అంటే మరింకేదో సాధించాల్సివుం దను ఒప్పుకున్నప్పుడు ప్రతిదానికీ సమాజం సమిష్టిగా బాధ్యత వహించాలి. సమాజంలో ఉన్న ప్రతివాడూ "బాధ్యత నాది కాదు నాది కాదు" అంటూ కూర్చుంటే, "నే నొక్కడినీ సమాజమా?" అని ప్రశ్నిస్తూ కూర్చుంటే నిజం - ఎవ్వరూ పట్టించుకోకుండా ఉన్నట్లయితే నాగరికత ఒక్క అడుగు ముందుకు వేసి ఉండేదికాదు. మానవుడు ఇన్ని రంగాలలో ఇంత పురోభివృద్ధి సాధించి వుండేవాడు కాదు. ప్రత్యక్షంగానో, పరోక్షంగానో, కొద్దో గొప్పో ప్రతిఒక్కడికీ బాధ్యత ఉంది. అలా ఉందని అనుకున్నప్పుడే సమాజం నిలుస్తుంది, నడుస్తుంది, ముందుకు కదలుతుంది.

## నేటి యువత

ఆలోచించలేనివాడు అదృష్టవంతుడు - ఏ కాస్త ఓపికా మరింకా స్త తీరికా చేసుకుని చుట్టూ వున్న పరిస్థితులను గురించి ఆలోచిద్దామనుకున్నా ఆలోచనలు పారక అర్థంకాని నిశ్చలస్థితిలో వుండిపోతుంది మనస్సు.

నేటి యువతరం క్రొత్తపోకడలు పోతోంది. వింత పోకడలు కూడా పోతోంది. ప్రతిదాన్నీ సూటిగా ప్రశ్నించే మన స్తత్వం అలవరచుకోంది. అనాదిగా అందరు అవునని తలలూపిన విషయాలను, వా స్తవాలకు ధిక్కరిస్తూంది నేటి యువతరం. నిలదీసి అడుగుతోంది సమాధానం చెప్పమని. ఒక్కోసారి అలజడి, అరాచకం మా జన్మహక్కని అనిపించేట్లు ప్రవర్తిస్తోంది.

భవిష్యత్తు గురించి కలలు కనాల్సిన వయస్సులో - భద్రత లేని బ్రతుకు కట్టెదుట కనబడుతోంది, వీరికి. భవిష్యత్తు గురించి, తాను చేయగలిగిం దేమీ లేదేమో అన్న ఆలోచన నిర్లిప్తతను అనుసరింప జేస్తూంది.-సమాజం తన భవిష్యత్తుకై భద్రత చేకూర్చ లేకపోతోందన్న అసంతృప్తి - యువతను అరాచకంవైపు హింసవైపు మొగ్గుచూపేలా చేస్తోంది. తీరని అశాంతితో నేటి యువతరం ఒక సంధియుగంలో వుందేమో అనిపిస్తోంది. ఏదో తెలియని ఆరాటం - ఏదో కొత్తదనంకోసం - పోరాటం - ఇదీ ప్రస్తుత పరిస్థితి.

కాలం వేగం హెచ్చింది. కనీసం అలా హెచ్చినట్లనిపిస్తున్నది. ఎటునుండి ఎటు పోతున్నామో తెలియనిస్థితి - ముందుకో వెనక్కో అనలే తెలీని పరిస్థితి - అదేదో

శూన్యంలోకి, అర్థంచేసుకుందామని ప్రయత్నించినా అర్థంకాని అస్తవ్యస్త వ్యవస్థలోకి - భూమ్యాకర్షణ శక్తి లోపించినచోట మనిషి నడవటానికి ప్రయత్నించినట్లు - సమాజం వంకరటింకర నడకలు నడుస్తోంది. తప్పటడుగులు వేస్తోంది. ఒక గమ్యం, ఒక లక్ష్యం చూపించి జనతను ముఖ్యంగా యువతను ఆవైపు నడిచేలా నిర్దేశించగల్గిన శక్తి - కాదు, సాహసం నేడు నిండుగా పూజ్యం.

నేటి పెద్దతరం వారు, నేటి యువతరాన్ని మారుతున్న విలువలకు బాధ్యులుగా, పరిగణిస్తారు. మరి వారు ఒనగూర్చిన దేమిటి ?

పెద్దతరంవారు ఏమీ చెయ్యలేకపోవడానికీ, ఏమీ చెయ్యకపోవడానికి, యువతరం లోని అశాంతికి, తిరుగుబాటు ధోరణికీ కారణం మారుతున్న విలువలే. నాగరికత పేరిట మరోసమాజంలోని సభ్యత అనబడే దాన్ని విచక్షణారహితంగా దిగుమతి చేసుకోవడం కొంత కారణం కావచ్చు. ఏదయినా సామాజిక జీవితం నియమరహిత మవుతున్నది. ఇది విరుగుడు దొరక్కుండా తిప్పలు పెడుతున్న సమస్య.

## విలువలు — బాధ్యతలు

కాళోజి అన్నట్లు - చాలామందికి కోపం వచ్చినాసరే - "జనంలో చాలామంది గొర్రెలమంద". అందుకే అందరూ చెయ్యాల్సిన పనిని అందరూ పట్టించుకోకుండ అందరి బాధ్యత తమ నెత్తిపై వేసుకునేవారు ఏకొందరుమాత్రమో ఉన్నారుకాబట్టే సమాజం కనీసం యిలా అయినా నడుస్తోంది. కనీసం కుంటినడకనయినా చూపిస్తోంది.

నిజానికి సమాజం యింతవరకూ సాధించిన ప్రగతికి, పురోభివృద్ధికి కారకులు బాధ్యులు ఆ పై చెప్పిన కొద్దిమంది; అంటే సగటు మనిషి తెలివితేటలకన్నా కాస్తంత ఎక్కువపాళ్ళలో తెలివితేటలు, సగటుమనిషిస్వార్థంకన్నా కాస్త తక్కువపాళ్ళలో స్వార్థమూ - తాను నివసిస్తున్న సమాజానికి తానేదో చేసిపెట్టాలన్న ఆరాటమూ కలిగిన మేధావివర్గము. అందుకే మేధావివర్గానిదే ముఖ్యమైన బాధ్యత.

గమ్యం చేరుకోగలిగిన ఓర్పు, గమ్యం చేర్చగలిగిన నేర్పు వీరిలోకూడా అందరికీ వుండదు. కొందరే చేతనయినవాళ్లు, చేతనయినవాళ్ళందరూ చేపట్టేవాళ్లు కారు. అందుకే- ఏకొందరు మాత్రమో సమాజానికి ఉపయోగపడటం తమ బాధ్యతగా భావిస్తారు.

"నీవు మేధావి కావాలంటే ప్రతివాడికీ కోపంవస్తుంది". మేధావి ఏ వర్గానికి చెందినవాడైన అయ్యివుండవచ్చు. ఏ వృత్తిని పట్టినవాడైనా అయ్యివుండవచ్చు. ఏ పని చేయనివాడైనా అయ్యుండవచ్చు.

"కలము, కుంచె కదలాడెను
గళము తోడుగా పాడెను" —కాళోజి.

అవును అవసర మేర్పడినపుడు - అన్నీ కదలి రాగలిగినప్పుడే వాటి ఉనికికి సార్థకత. అవసర మేర్పడనంతవరకు వేటిమానాన అవి "కళ కళకోసమే" అన్నట్లు

జీవిస్తే, అభ్యంతరం లేదు. అవసర మేర్పడినప్పుడు - దేశంకోసం, సంఘంకోసం, జాతి కోసం, సమాజంలోని తోటివారికోసం - అన్నీ ఉపయోగపడగలగాలి. ఎలాగైతే - భౌతిక, రసాయనశాస్త్ర విజ్ఞానమును మానవుని జీవితం మరింత మెరుగుపర్చేలా చేయ డానికి ప్రయత్నిస్తాయో - అలాగే, సాహిత్యమూ, లలితకళలూ కృషిచేయాలి. ఇందులో సందేహం లేదు. కేవలం - ప్రస్తుతాన్ని ఆనందమయం చెయ్యడానికి ప్రయత్నించడమే కాకుండా, భవిష్యత్తుకు అవసరమైన పునాదుల్ని - ప్రస్తుతంలోనే నిర్మించగలగాలి. పునాదుల్ని నిర్మించడం బాధ్యతతో కూడుకున్నపని.

## రచయితలు — బాధ్యతలు

అందరు మేధావులూ ఒక ఎత్తు, రచయితలు ఒక ఎత్తు. మిగిలిన మేధావులందరి పరిధి పరిసీమితం. కాని రచయితకు పరిధి లేదు. అనుక్షణం తన ఆవృత్తాన్ని పెంచు కుంటూ పోతాడు. పాఠకుడి (దాదాపు తెలిసేటట్టు కాకుండా) ఆలోచనా ధోరణులను దిద్దుకుంటూ, సరిదిద్దుకుంటూ, మారుస్తూ, ఏర్పరుస్తూ పోతాడు. అందుకే, ఏకాస్తో కూస్తో, రచయితలకు బాధ్యత ఉందనే మా అభిప్రాయం.

"సత్యహరిశ్చంద్ర'' నాటకం చూసి నిజ మెంతమంది చెప్పారు? ''రామాయణం" చదివి ఏకపత్నీవ్రతం అవలంబించిన పెద్దమనుష్యుల సంఖ్య ఎంత? ''భారతం'' చదివి లేక ''భాగవతం'' చదివి లేక మరి యింకేవో చదివి అందులో పోగేసిపెట్టిన మంచినంతా పాటిస్తూ కూర్చున్న జనం ఎంతమంది? అంటూ ప్రశ్నల పరంపరలతో 'నిజం' లా కన్పించే కమ్మనిమత్తు మందులాంటి మత్తుజల్లి ''దేనికీ ఎవ్వరూ బాధ్యులుకారు; రచయితలు అసలేకారు'' అని నచ్చచెప్పేవారూ ఉన్నారు. నిజమే సత్యహరిశ్చంద్ర నాటకం చూసినతరువాత కూడా అన్నివేళలా సత్యమే చెబుదా మని భీష్మించే వ్యక్తిని ఎక్కడా చూడము. ఒక్కటిమాత్రం నిజం - మంచిచెబితే విని నేర్చుకునేవాళ్లు తక్కువ విలాసాలు, బలహీనతలూ, మనస్సు నాకర్షించింతగా మంచి ఆకట్టుకోదు. అయ స్కాంతం ఇనుమునే ఆకర్షిస్తుంది. పసిడి విలువ దాని కేం తెలుసు? దరికి జేరనివ్వదు. సమాజంలో ఉన్న మంచికి, రచయితకు ఏమాత్రమూ బాధ్యత లేదన్న వాదం ప్రస్తుతానికి అంగీకరించినా ఉన్న చేదు నిజంలాంటి చెడుకు, దాని ఉనికికి కాస్తో కూస్తో బాధ్య డనక తప్పదు. రోడ్డున అమ్మే బఠాణీలను కొనుక్కున్నంత తేలికగా అపరిమిత సెక్సు స్వేచ్ఛను ప్రబోధిస్తూ వెలువడుతున్న పుస్తకాలు, పత్రికలు దొరుకుతూ ఉన్నందువలన కాస్తయినా యువతరం ఆలోచనలలోని మార్పుకు, దిగజారిన నైతిక విలువలకు రచయితలు బాధ్యులు కారని అనగలరా? మంచి సాధించలేకపోవచ్చుగాని కనీసం చెడుమార్గాన్ని పట్టకుండా నైనా చూడటం బాధ్యతకాదా?

''ఏది మంచి? ఏది చెడు? నువ్వెవరు నిర్ణయించడానికి?'' అని అడిగినా, లేక ''మాకు బాధ్యత లేదు. రచన సృజనాత్మక కృషి; దానికి స్వాతంత్ర్యం కావాలి; పైబాధ్యతల పేరిట అడ్డుగోడలు కట్టకూడదు; శృంఖాలు వెయ్యకూడదు; సమాజ మేము

యితే మాకేం'' అంటూ చెప్పినవారి తర్కానికీ, తెలివితేటలకీ దూరంనుండి నమస్కారం పెట్టడం మినహా బహూశా చేయగలిగిం దేమి లేదనుకుంటాము.

మా యువభారతి సమావేశాలలో అనేక విషయాలపై చర్చలు నిర్వహించుకున్న ప్పుడు ఇవే ప్రశ్నలు ఉత్పన్నమయ్యాయి. విలువలకు యిచ్చే నిర్వచనాలు - వ్యక్తి వ్యక్తికీ వేరు. అడుగుకూడా ముందుకు చూడలేనివాడు ఒకడయితే, అరవై అడుగుల ఆవల నున్న దాన్ని గురించి ఆలోచన సాగించేవాడు మరొకడు. ''పాత అంతా చెత్త అనీ, పరమరోత అనీ ఉన్నదంతా సమూలంగా సర్వనాశనం చేసి ఒక శూన్య స్థితిని సృజించి అందులోంచి మళ్ళీ మరేదో పునరావిర్భావానికి కృషిచేయాలి" అన్న వాదమూ కనబడుతుంది. ''అలా కాక మంచికై ప్రయత్నిద్దాం! మంచి ఎక్కడ వున్నా తీసు కుందాం, శూన్యం సృష్టించాక అసలు యిక సృష్టిఅంటూ జరగదేమో! అందుకని ఉన్న దాంట్లోని మంచిని రక్షించుకుందాం'' అన్న వాదనా వినబడుతుంది. ఈ ప్రశ్నలకు మాకు సమాధానం కావాలి. మాకు దొరికిన సమాధానాలు కేవలం మాకే కాక పదిమందికీ అందుబాటులో ఉపయోగపడేలా ఉండాలని, మా సందేహాల కొక స్వరూపాన్నిచ్చి మా సమస్యల కొక సమాధానం సూచిస్తుందేమో నని ఈ గోష్ఠిని నిర్వచిస్తున్నాము.

'మారుతున్న విలువలు-రచయితల బాధ్యతలు' అను విషయంపై నిర్వహిస్తున్న ఈ గోష్ఠిలో - ఉపయోగపడేందుకని, విభిన్న దృక్కోణాలతో పరిశీలించిన ముప్పైఏడు వ్యాసములను "రచన" రూపములో కూర్చినాము.

చుట్టూ చీకటి ఆవరిస్తున్నది. నేటి పరిస్థితుల్లో మేం వెలిగిస్తున్న ఈ చిట్టిదీపం ఏ కొంత వెలుగయినా ప్రసాదింపజేస్తే మేం పడ్డ శ్రమంతా - ఫలించినట్లే. అట్టి ప్రయోజ నాన్ని సాధించి ఈ గోష్ఠిని ఉపయోగపడేలా విజయవంతం చేసే బాధ్యత మీది, రచయిత లుగా బాధ్యత ఉందనుకున్నా లేదనుకోన్నా సరే !!

—వి. విశ్వనాథం
సమావేశకర్త

జూలై 26, 1970

యువభారతి

# మాగురించి




గతంలోని మంచిని జీర్ణించుకొని; వర్తమానాన్ని సక్రమంగా అవగాహన చేసుకుని, సమ్యక్‌దృక్పథంలో పయనించడానికి యువతరం ఉద్యమించగలిగినప్పుడే, జాతీయ శక్తులు ఉద్దీప్తిని పొందగలుగుతా యనే విశ్వాసంలో చైతన్య ముంది. ప్రగతికామన ఉంది. దేశభక్తి ఉంది. ప్రజాస్వామ్య జీవితవిధానంపట్ల నమ్మకం పెరిగి, సాహిత్యం మీద అభిమానం పెరిగి, భవిష్యత్తుపట్ల ఆశలు మొలకెత్తి, వ్యక్తి పురోగమించ గలిగే వాతావరణం ఏర్పడడం ఎంతైనా అవసరం. జాతీయజీవనంలో నిర్లిప్తత గూడుకట్టుకొని ఉన్నదనీ, ఏవేవో క్రీనీడలు వెలుగుబాటను కప్పేస్తున్నా యనీ, సామాన్యునికి అభ్యుదయం అందుబాటులో లేకుండా పోతున్న దనీ, స్వార్థం పడగెత్తి బుసలుకొడుతున్న దనీ ఎవరికైనా అన్పిస్తుంది. అందువల్లనే "చుట్టూరా ఆవరించుకొని వున్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడంకంటె ప్రయత్నించి ఎంత చిన్నదీపాన్నయినా వెలిగించటం మంచి'' దనే సూక్తి మా ఊపిరి. ఈ సూక్తి ఇచ్చిన స్ఫూర్తి 1963 విజయదశమినాడు ''యువభారతి" గా రూపుగొన్నది.

* దేశానికీ, సంఘశ్రేయస్సుకూ అనువైన పద్ధతిలో పరిపూర్ణవ్యక్తిత్వాన్ని సభ్యులలో పెంపొందింపజేసి, వారిని యుగోచితాగ్రగామిత్వానికి సన్నద్ధులను చేయడం.

* పరిపూర్ణమైన, సమగ్రమైన వ్యక్తిత్వనిర్మాణానికి తోడ్పడేవిధంగా వచోరీతినీ, రచనాపాటవాన్నీ, అలవరచే అధ్యయనశీలతనూ ఆలోచనాశక్తికి దోహదం చేసే కార్యక్రమాలను నిర్వహించడం.

* సభ్యులలో మంచి అభిరులను కలిగించేందుకు, వైజ్ఞానిక, సాహిత్య, సాంస్కృతిక కార్యక్రమాలను ఈ లక్ష్యసాధనకోసం రూపొందించి, కడచిన తొమ్మిదేండ్లుగా యువభారతి నిర్మాణాత్మకదృక్పథంతో సాహిత్యోద్యమాన్ని నిర్వహిస్తున్నది.

ప్రతినెలా, మొదటి ఆదివారం, మూడవ ఆదివారం మధ్యాహ్నం రెండున్నర గంటలకు హైదరాబాదులో నున్న శ్రీకృష్ణదేవరాయ ఆంధ్ర భాషానిలయంలో యువభారతి

నిర్వహిస్తున్న సాహితీసమావేశాలు సభ్యుల ప్రతిభోద్దీపనానికి, వ్యుత్పన్నతాసముపలబ్ధికి యథోచితమైన అవకాశాలను కలిగిస్తున్నాయి.

ప్రతిమాసం మొదటి ఆదివారం ఉదయం పదిగంటలకు అదే గ్రంథాలయంలో యువభారతి వనితా విభాగం ఇదే లక్ష్యంతో సాహిత్యకార్యక్రమాలను నిర్వహిస్తున్నది.

"క్లుప్తగోష్ఠి", "పుస్తకచర్చ", "ఊహాపథంలో", "రసధుని", "నాకు నచ్చినది-నేను మెచ్చినది", "నాగురించి", "స్వీయ కవితాపఠనం", "వక్తృత్వపరిశీలనం", "చర్చాగోష్ఠి" వంటి వివిధకార్యక్రమాలను రూపొందించి యువభారతి నిర్వహిస్తున్నది.

ఏవిధమైన కార్యక్రమాలను నిర్వహించినా సభ్యులందరూ వాటిలో పాల్గొనే విధంగా అవి రూపొందించబడుతాయి. తొలిదశలో "యువభారతి" అనే పేరుతో ఒక సైక్లోస్టైల్డ్ మాసపత్రిక ఒక ఏడాదిపాటు వెలువడింది. చక్కని నాటకాలను యువభారతి సభ్యులు ప్రదర్శించారు.

సాహిత్యాసక్తిని ఇతోధికంగా ఇనుమడింపజేయడానికీ, తక్కువవెలకు ఉత్తమ సాహిత్యాన్ని అందించటానికీ ప్రచురణ పూర్వవిరాళ పద్ధతిని రూపొందించి "సరస్వతీ సాక్షాత్కారము", "జీవనగీత", ఐదు ఆంధ్ర కావ్యాలపై ఆచార్య దివాకర్ల వారి ఉపన్యాస వ్యాసమంజరి "కావ్యలహరి", జాతిని చైతన్యవంతం గావించిన ఐదుగురు పవిత్ర మూర్తులపై ఉపన్యాససంకలనం "చైతన్యలహరి", స్వాతంత్ర్యయుగోదయంలో తెలుగు తీరుతెన్నులపై నూర్గురు రచయితల వ్యాససంకలనం "మహతి", స్వాతంత్ర్యరజతోత్సవ సందర్భంగా భారతజాతికి యువభారతి సమర్పించుకొన్న కానుక 34 గురు ప్రముఖుల ఆంగ్లవ్యాసాల సంకలనం "ఫ్రీ ఇండియా ఫోర్జెస్ ఎహెడ్" అనే గ్రంథాలనూ, సభ్యుల ఆర్థికసహకారంతో "వీచికలు", "అక్షరాలు" అనే కవితాసంకలనాలను, ఐదుగురు ప్రసిద్ధ కథారచయితల కథలను "పంచవటి" గానూ యువభారతి ప్రచురించింది. యావద్భారత స్థాయిలో శేషాచలం అండ్ కంపెనీవారి సహకారంతో విద్యార్థుల కథారచన పోటీని, స్వాతంత్ర్యరజతోత్సవ సందర్భంగా యువతీయువకులకు వక్తృత్వ వ్యాస రచనపోటీలను నిర్వహించింది.

ఇవిగాక 1970 లో యువభారతి "మారుతున్న విలువలు-రచయితల బాధ్యతలు" అనే అంశంపై గోష్ఠి నిర్వహించి ఆ సందర్భంగా 37 గురు ప్రముఖ సాహితీవేత్తల నుండి ప్రత్యేకంగా వ్యాసాలను తెప్పించి "రచన" గా ప్రచురించింది.

తెలుగుగ్రంథప్రచురణ చరిత్రలో అపూర్వమైన విజయాన్ని యువభారతి సాధించింది.

యువభారతికృషికి దోహదంచేసే మిత్రులకోసం సాహితీమిత్రపథకం రూపొందించింది. సాహితీమిత్రులుగా చేరి, మా సాహిత్యోద్యమ నిర్వహణలో బరువుబాధ్యతలు పంచుకునే సహృదయుల సహకారాన్ని ఆకాంక్షిస్తున్నది. ఇప్పటికి 1100కు పైగా,

సహృదయులు సాహితీమిత్రులుగా చేరారు. 1973 లో 3 రూ॥ల ప్రచురణ పూర్వవిరాళానికి అందజేయబడే పుస్తకం ఈ పథకంలో చేరినసభ్యులకు ఉచితం. సాహితీమిత్రులకు అనేక సదుపాయాలు కూడా ఉన్నవి

సాహిత్యాభిమానుల ఆదరాభిమానాలతో మరింత ప్రయోజనకరమైన, సాహిత్యాత్మకమైన కళాత్మకమైన కార్యక్రమాలను రూపొందించాలని యువభారతి సంకల్పం. సాహితీస్నేహమే పరమలక్ష్యంగా పెట్టుకున్న యువభారతికి సరసులైన తెలుగుప్రజల సౌహార్దం బాసటగా నిలుస్తుందని విశ్వసిస్తున్నాం. ఆంధ్రుల రాజధానీనగరంలో తెలుగుతనం తొణికిసలాడాలనీ, తెలుగు వాతావరణం నెలకొనాలనీ మా ఆకాంక్ష.

యావద్భారత ప్రజాజీవితంలో తెలుగువారి పార్థక్యానికి, వైశిష్ట్యానికి, శక్తిసామర్థ్యాలకు ఆదరణ లభించాలని మాకామన.

సాహిత్యం సహశీలతను, ఔదార్యాన్ని, సంస్కృతిని, సౌమనస్యాన్ని తెలుగుప్రజలలో కలిగించగలిగినప్పుడే జాతికి జీవంపోయగలుగుతుంది. ఉత్తమసాహిత్యప్రచారానికి సుందరమైన, సులభమైన, శుభావహమైన, సరసమైన వాతావరణం కల్పించడమే మా సంకల్పం.

యువభారతి యథోచితంగా కొనసాగగలదనీ, సాహితీతపోమూర్తుల సందేశాన్ని అందించగలదనీ, తెలుగుప్రజల ఆశీస్సులను పొందగలదనీ ఆశిస్తున్నాము.

26-1-1973.

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షుడు
యువభారతి

---



---




# ఎందరో మహానుభావులు ....
# అందరికీ మా వందనములు

నిజానికి ఈ ఒక్క రెండుమాటలు చెప్పివేయటంతో మా ఎదల్లోంచి బరువులు చాలా వరకు దించివేసుకున్నాం. కాని ఒక్కోసారి చెప్పుకున్నా ఇంకా తరగకుండా ఏదో మిగిలిపోయినట్లు మనస్సు కనిపిస్తూనే వుంటుంది. అందుకే. ఈ ప్రయత్నం.

గోష్ఠికి ప్రత్యేక వ్యాసాలు వ్రాసి పంపండని దాదాపు 50 మందికి మేం ఉత్తరాలు వ్రాశాం. అర్థించాం. కొందరు వ్రాయలే మన్నారు. కొందరు వ్రాయటాని కేముందన్నారు. మరికొందరు వ్రాయ మన్నారు. గడువుతేదీని గడపవతలకు నెట్టివేసినవారు చాలమంది. ఎలాగైతేనేం అందరూ కలిసి, అనివార్య కారణాలతో కలిసి జూన్ ఆరంభంలో నిర్వహిద్దా మనుకున్న ఈ గోష్ఠి జులై ఆఖరుకు అవతరించడంలో సహాయపడ్డారు. మేం అడిగినంతనే ప్రత్యేకంగా మేం కోరిన పద్ధతిలో వ్యాసాలు వ్రాసి పంపి సహకరించిన ఈ పెద్ద లందరికీ మా నిండు కృతజ్ఞతలు.

"ధనమూల మిదం జగత్" అని ఎవరన్నారోగాని వారు నాటికి నేటికి మాత్రమే కాక రానున్ననాటికికూడ విలువైన సత్యాన్ని కాచి వడబోశారు: డబ్బులేనిదే - నిజం - ఏమీలేదేమో ! "బిందువు బిందువును చేరి సింధు వగును"- అన్నట్లు చిన్నా, పెద్దా అన్నీ కలిసి, మే మనుకున్నంత కాకపోయినా, కనీసం ఊపిరి మిగిలేలా తోడ్పడ్డాయి, ఈ "రచన" లోని వ్యాపార ప్రకటనలు. ఒక చక్కని కార్యక్రమానికి తాము వ్యాపార ప్రకటన రూపంలో యిస్తున్న ఆర్థిక సహాయం దోహదం చేయగలదనే ఉదారబుద్ధితో మమ్మల్ని మా కృషిలో ఉత్సాహపరచిన ప్రకటనకర్తలందరికీ మా నమస్సులు. ముఖ్యంగా మా కృతజ్ఞతలు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచారశాఖవారికీ, వజీర్ సుల్తాన్ టుబాకోకంపెనీవారికి - చెప్పుకోవాలి. ఈవ్యాపారప్రకటనల సేకరణలో తోడ్పడ్డ మా

మిత్రులు, సభ్యులు, సన్నిహితులు చాలమంది ఉన్నారు. ముఖ్యంగా శ్రీ కే. రంగనాథ్, శ్రీ టి. పాంచజన్యం, శ్రీ యస్. పాండురంగారెడ్డి, శ్రీ ఎ. సీతారామారావు, శ్రీ యమ్. పాండురంగారావు, శ్రీ యిస్. పి. చారి, శ్రీ శంకరయ్య, శ్రీ యస్. యస్. ప్రసాద్, శ్రీ రంగనాథరావు గౌతమ్‌గార్లకు మా మనఃపూర్వక కృతజ్ఞతలు తెలియజెప్పుకుంటున్నాం.

అవసరమైనప్పుడు మే మున్నా మని మా అండ నిలిచి ఆర్థికంగా ఆదుకున్న శ్రీ వి. రామకృష్ణయ్య, శ్రీ యస్. పి. చారి, శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తి, శ్రీ ఎన్. పాండు రంగారెడ్డి, శ్రీ డి. రామచంద్రరావు, శ్రీ సి. మల్లిఖార్జునరావు గార్లకు మాకృతజ్ఞతలు.

గోష్ఠి నిర్వహణలో వివిధభాగాల అధ్యక్షులుగా ఉండటానికి అంగీకరించిన డా॥ అడపా రామకృష్ణారావు, శ్రీయుతులు పి. యల్. యస్. శర్మ, డా॥ ఎమ్. కులశేఖర రావు, డా॥ నాయని కృష్ణకుమారి, డా॥ ముదిగొండ వీరభద్రశాస్త్రి, కలపటపు రామ గోపాలరావుగార్లకు మా కృతజ్ఞతలు.

గోష్ఠి సందర్భంగా జరిగిన చర్చల్లో పాల్గొనేందుకు మా ఆహ్వానాన్ని పురస్కరించుకొని విచ్చేసిన కళాశాలల ప్రతినిధులకు, వారిని పంపడాని కంగీకరించిన ఆ యా కళాశాలల ప్రిన్సిపాల్స్‌కు, ఇతరప్రతినిధు లందరికీ మా కృతజ్ఞతలు.

అధ్యక్షతవహించి గోష్ఠికి అందాన్ని చేకూర్చిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ కార్యదర్శి శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికీ, మీ చేతుల్లో నున్న ఈ "రచన" ను తమచేతులతో ఆవిష్కరించిన అమాత్యవర్యులు, ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖామాత్యులు గౌరవనీయులైన శ్రీ పి. వి. నర్సింహారావుగారికి మా కృతజ్ఞతలు.

ఇది మా నాలుగునెలల కృషి ఫలితం. జంటనగరాలలో దూరదూరంగా విసిరి వేయబడిన ట్లున్న మా సభ్యులు చాల కష్టనష్టాల కోర్చి ఈ కృషి జయప్రదం కావటానికి తోడ్పడ్డారు. ముఖ్యంగా శ్రీ ఎస్. వేంకటేశ్వర్రావ్, శ్రీ డి. కృష్ణప్రసాద్, శ్రీ నాగినేని భాస్కరరావు, శ్రీ సి. సూర్యనారాయణ తదితరులు.

అచ్చువేసేపని అచ్చాఫీసువారిదే అయినా పుస్తకం పురిటినొప్పుల గొడవ చాలా ఉన్నది. ఈసందర్భంలో విరామ మెరుగక తోడ్పడిన మా సభ్యులు, ముఖ్యంగా శ్రీ అల్లంరాజు వెంకట్రావుకు (దొరితప్పి దొర్లిన తప్పులకు తాను బాధ్యత పుచ్చుకుంటాడనే నమ్మకం నాకులేదు) నిజంగా మా మనఃపూర్వక కృతజ్ఞతలు. ఈ కృషిలో పాలుపంచు కున్న శ్రీ నాగినేని భాస్కరరావు, శ్రీ జె. కామేశ్వర్రావుకుకూడ మా కృతజ్ఞతలు.

ఈ గోష్ఠి విషయం మా మనస్సుల్లో యింకా స్పష్టంగా అవతరించకముందునుంచీ మా ఆలోచనల బరువు దింపి ఒకరూపా న్నివ్వడానికి తోడ్పడిన శ్రీ ఇరివెంటి కృష్ణ మూర్తి, డా॥ భీమసేన్ నిర్మల్, శ్రీ యం. నాగభూషణశర్మగార్లకు మా కృతజ్ఞతలు.

ఈ కార్యక్రమం జరపాలన్న మా నిర్ణయానికి నిజంగా అండగా నిలచిన మా మిత్రులు శ్రీ రాఘం వీరేశలింగంగారికి, శ్రీ యస్. పి. చారిగారికి, కె. విఠల్‌రెడ్డిగారికి, శ్రీ గుత్తికొండ సుబ్బారావుగారికి, శ్రీ వి. ఆర్. ప్రబలగారికి మా కృతజ్ఞతలు

కృషికి కార్యరూపం ఇవ్వటంలో ఎంత కష్ట ముందో ఆలోచనకు రూపం ఇవ్వటం లోనూ అంతే కష్టం ఉండిఉంటుంది. మాహృదయాలకు హత్తుకునేట్టు, నిజంగా గుచ్చుకునేట్టు బలం కల్గిన కలంపాళీలను అందమైన ముఖచిత్రంలో మలచి యిచ్చినవారు మాకు దగ్గిరవారు శ్రీ శీలా వీర్రాజుగారు.

అట్టను అచ్చులో సింగారించిన విస్టాస్ ప్రింటర్స్ వారికి మా కృతిజ్ఞతలు.

పని ఎక్కువైనపుడు, విసుగు సహజం. మేం విసిగించినా విసుక్కోక, పనిచేసుకుంటూ పోయి అచ్చుపోసిన శ్రీపాద ఆర్ట్‌ప్రిటర్స్‌వారికి మా కృతజ్ఞతలు.

అందుకే ఎందరో మహానుభావులు - అందరికీ మా వందనములు.

—వి. విశ్వనాథం
సమావేశకర్త, యువభారతి.





యువభారతి
సాహితీమిత్రులుగా
చేరి
మాకృషిని
ప్రోత్సహించండి.

# రచన - సాహిత్యగోష్ఠి

రచన : శ్రీ సురమౌళి

జూలై 28 న, నగరంలో అపూర్వమైన సాహిత్యపండుగ జరిగింది. "యువభారతి" అనే సాహిత్యసంస్థ, "మారుతున్న విలువలు - రచయితల బాధ్యతలు", అన్న విషయముపై, ఏర్పాటుచేసిన గోష్ఠి ఆ పండుగ. ఆంధ్రసారస్వత పరిషత్తు భవనములో జరిగింది.

మౌనంగా, ఆర్భాటాలు, ప్రచారంకోసం ఆతురత, ఆకాంక్షా లేకుండా ఆరు సంవత్సరాలుగా నగరంలో సాహితీకృషి జరుపుచున్న యువభారతి తమ ఏడవ జన్మదినాన్ని పురస్కరించుకొని, పెద్ద ఎత్తున గోష్ఠి కార్యక్రమాల్ని తలపెట్టింది. తలపెట్టడమే కాదు. సక్రమంగా విజయవంతముగా దాన్ని నిర్వహించింది.

ఒక్కరోజు గోష్ఠి విజయవంతంగా ముగియడానికి అంతకుముందు, మూడు మాసాలుగా నిద్రాహారాలు మాని, అనవరతం యువభారతి కార్యకర్తలు, ధీరవిన నిర్విరామకృషి ఉన్నది. ఈ గోష్ఠికి ప్రసంగవ్యాసాలను రాసి పంపవలసిందిగా 45 మంది ప్రముఖ రచయితలకు ఉత్తరాలు వ్రాశారు. వారిలో 37 మంది రచయితలు తమప్రసంగ వ్యాసాలను వ్రాసి పంపారు. 37 మంది వ్యాసాలను ముందుగానే "రచన" అన్న పేరుతో పుస్తకరూపంగా ప్రచురించారు. పుస్తకానికి అందమైన అట్ట వేయించారు. సర్వాంగ సుందరంగా తయారైన పుస్తకం గోష్ఠి ప్రారంభానికి రెండురోజులుముందే చేతి కందించారు, చర్చలలో పాల్గొనే వ్యక్తుల ఉపయోగార్థం.

సాహిత్యగోష్ఠులు జరుగుతూనే ఉన్నాయి. కోపోద్రిక్తులైన యువతరం గురించీ, వారి ఆకాంక్షలను గురించీ, వారి కోపోద్రిక్తతకు కారణాలను గురించీ పెద్దలు ప్రవచిస్తూనే ఉన్నారు. అయితే అనేక సందర్భాలలో ఈ గోష్ఠులలో యువతరంపాత్ర (పార్టిసిపేషన్) ఉండడంలేదు. వారి గురించి ఇతరులు చెప్పే అభిప్రాయాలే కాని, వారికి వారుగా వ్యక్తీకరించుకునే అవకాశాన్ని కల్గించడానికి జరిగిన కృషి స్వల్పం.

యువభారతి నిర్వాహకులు అందుకు భిన్నంగా మూడు నెలలు ముందుగానే తమ సంకల్పాన్ని యువతరానికి వెల్లడి చేశారు. అన్ని కళాశాలలకూ ఉత్తరాలు వ్రాశారు. ప్రతినిధులను పంపవలసిందిగా ఆ యా కళాశాలల ప్రిన్సిపాల్సును కోరారు. విద్యార్థులే కాక అధ్యాపకులు కూడా ప్రతినిధులుగా రావచ్చునన్నారు.

విద్యార్థులూ, అధ్యాపకులూ, ప్రతినిధులుగా వచ్చారు. కళాశాలలకు సంబంధంలేని యువతరాన్ని కూడా ప్రతినిధులుగా చేర్చుకున్నారు. ప్రతినిధి రుసుం ఐదు రూపాయ లుగా నిర్ణయించారు. ఐదు రూపాయ లిచ్చి ప్రతినిధులుగా చేరినవారికి ఐదురూపాయల వెల గల "రచన" ఉచితంగా ఇచ్చారు. కొన్ని తెల్ల కాగితాలను కట్టి "యువభారతి" గోష్ఠికి సంబంధించిన అట్ట (ఫైల్ బ్యాకర్) ను పాల్గొన్న ప్రతినిధులందరికీ నోట్సు రాసుకోవడానికి ఉచితంగానే సరఫరా చేశారు. గోష్ఠి జరిగిన రోజున మధ్యాహ్నం విందు భోజనం, సాయంకాలము కాఫీ. ఈ అన్ని సౌకర్యాలకుగాను ప్రతినిధి రుసుం ఐదు రూపాయలు. "రచన" డెమ్మీ సైజులో దాదాపు 300 ల పుటలు. లాభాలు సంపాదించు కునే ఏ పబ్లిషరయినా ఈ పుస్తకానికి వెల నిర్ణయించవలచి వస్తే ఐదు రూపాయలకన్నా ఎక్కువే పెడతాడనే విషయాన్ని ఏ సామాన్య పాఠకుడైనా చెప్పవచ్చు. కళాశాలల నుండి ప్రతినిధులుగా పాల్గొన్నవారికి మళ్ళీ ప్రతినిధి రుసుములో కన్సెషను కూడా ఇచ్చారు.

సాహిత్యంలోని వివిధ ప్రక్రియలలో నిష్ణాతులైన 37 మంది రచయితలు తమ రచనలను సమయానికి అందించి గోష్ఠికి ముందుగానే "రచన" అచ్చుకావడానికి తోడ్పడ్డాడు. ఈ 37 మంది భిన్నాభిప్రాయాలను వ్యక్తంచేశారు. రచనలు పంపిన ఈ 37 మంది రచయితల పేర్లు చూస్తేనే తెలుస్తుంది. తప్పకుండా వీరందరూ భిన్నాభి ప్రాయాలను వ్యక్తంచేసి ఉంటారని. వీరు..............

"మారుతున్న విలువలు: రచయితలబాధ్యతలు" అన్న విషయంమీద ఈ రచ యితలందరికీ ఏకాభిప్రాయంలేదు. "విలువలు" అన్న శబ్దప్రయోగంనుంచి "రచయితల బాధ్యతలు" అన్న విషయంవరకూ అన్నీ భిన్నాభిప్రాయాలే! మారేవి "విలువలు" ఎలా అవుతాయి? అని మంజుశ్రీ ప్రశ్నిస్తే, "విలువలు" అన్నపదం పాశ్చాత్యపరిభాషనుండి అరువు తెచ్చుకున్నమాట ఇన్‌స్ట్రుమెంటల్ వాల్యూస్, అల్టిమేట్ వాల్యూస్ అని విలువలు రెండు రకాలు; మొదటివి మారుతుంటాయి. రెండవకోవకు చెందినవి మారవు అని ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్య సిద్ధాంతీకరించారు.

"రచయిత ప్రధానంగా రసస్రష్టమాత్రమే కాని ఉపదేశకుడూ సంఘసంస్కర్త కాడు. ఆయన రచనలో ఎక్కడైనా అప్పుడప్పుడూ ఉపదేశాలు సంఘసంస్కరణ భావాలు పరోక్షంగా కనుపించుతుండవచ్చు; అంతేకాని లోకం మరమ్మత్తుచేయాలని రచయిత కంకణం కట్టుకొని రచన చేయ ప్రారంభిస్తే ఆ రచనలోని రసపుష్టి నశించి అదొక ప్రచారసాహిత్యంగా తయారవుతుంది కనుక ఇటువంటి విశ్వశ్రేయస్సు వహిం చాల్సింది సంఘసంస్కర్తలూ, ప్రజాసేవకులే కాని రచయితలు కాదు. సంఘసంస్కర్తల మీద రసవంతమైన సాహిత్యాన్ని సృష్టించవలసిన బాధ్యత లేనట్లే రచయితలమీద కూడా సంఘాన్ని సంస్కరించాల్సిన బాధ్యత లేదు" అని శ్రీ సంజీవదేవ్ అభిప్రాయపడ్డారు.

''శ్రీశ్రీ 11 వ శతాబ్దమున జనించి యుండినచో నేపురాణమునో యనువదింప బూని యుండును; అట్లే నన్నయ యిరువదవ శతాబ్దమున నవతరించిన అభ్యుదయ కవితామార్గమునుబట్టి యుండును. మారుతున్న విలువలు గుర్తింపనివారు మార్పున కిష్ట పడక గతానుగతికమైన విధానమే యనుసరింతురు" అన్నది డాక్టర్ దివాకర్ల వెంక టావధానిగారి అభిప్రాయం.

"అనేకానేక వృత్తులు పట్టినవా రున్నారు కదా! అందరికీ అంతో ఇంతో బాధ్య తలు ఉంటాయికదా! వారందరికంటె రచయిత ఉన్నతుడా?'' అని ప్రశ్నించారు గోరా శాస్త్రిగారు. ''సమాజంపట్ల రచయితకు బాధ్యత - అనగా, అదనమూ, ఉన్నతమూ, అయినది ఉందని ఒకవేళ మాటవరుసకు అంగీకరించినా, ఏకపక్ష బాధ్యత లుండనేరవు; సంఘానికికూడా రచయితపట్ల బాధ్యత ఉండి తీరాలి; హక్కులూ, బాధ్యతలూ, ''బొమ్మా - బొరుసూ'' వంటిది అని శ్రీ గోరాశాస్త్రిగారు వివరించారు.

''విలువలు మారటం సహజం. తరతరాలుగా విలువలు మారుతునే ఉన్నవి. ముందుకూడా మారుతూనే ఉండగలవు................సమాజంలో విలువలను మార్చ గలనన్న విశ్వాసం, మారుస్తున్నానన్నధీమా, మార్చవలె నన్న ఆతురత, రచయితకు ఉంటుంది. అదంతా వట్టి భ్రమే! రచయిత కుండే ఆతురతనుబట్టి కాని, అతని కుండే ధీమాకు అనుగుణంగా గాని విలువలు మారవు అంటూ ''కమిటెడ్'' లేదా కట్టుపడ్డ మనిషి రచయిత కాలేడు" అని కాళోజీ తీర్పు.

ఇలా భిన్న భిన్న దృక్పథాలు వెలువరించిన ఈ 37 మంది రచయితల అమూ ల్యాభిప్రాయాలమీద గోష్ఠి. గోష్ఠిలో యువతరం పార్టిసిపేషన్.

మొదటి సమావేశం ''రచన'' ఆవిష్కరణ సభకు వచ్చిన ప్రతిథులందరికీ సభా ద్వారం వద్దనే సుగంధ ద్రవ్యాలు అందించి, చేతికొక ఎర్రగులాబీ పువ్వు అందించి "రచన'' పుస్తకాన్ని ఇచ్చారు. గోష్ఠిలో పాల్గొనేవారు ముందుగానే ఆయావ్యాసాలను చదువుకోవడానికి వీలుకల్పించారు.

అప్పటికీ అంత పెద్దగ్రంథం అందరూ చదువుతారోలేదో, క్షుణ్ణంగా చదివే ఓపిక ప్రతినిధులకు ఉంటుందోలేదో, అని ఆవిష్కరణ సమావేశంలో ఇద్దరు ప్రముఖులచేత మొత్తం వ్యాసాలను రెండు భాగాలుగా విభజించి, రెండు సమీక్షా ప్రసంగాలు చేయించారు. సమీక్షాప్రసంగాలు చేసిన డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం, డా॥ భీమసేన్ నిర్మల్ 37 మంది రచయితలు తమతమ వ్యాసాలలో వెలిబుచ్చిన అభిప్రాయాలను సభికులకు చెప్పారు. గోష్ఠిలో పాల్గొన దలచిన ప్రతినిథులకు ఈవిథంగా సౌకర్యం చేకూరింది. ''రచన''ను ఆవిష్కరిస్తూ విద్యామంత్రి శ్రీ పి. వి. నరసింహారావు చర్చకుసైతం ఆవిష్కరణచేశారు.

"మాంధాతల కాలంనాటి విలువలు ఈ నాడు కూడా ఉండాలనడం తప్పు. ఆ విలువలు కాలపరిమితి కలవి. కాగా, నేటికాలానికి కావలసిన విలువలు ఇవి అని నిర్ధారించుకోగలగాలి.

మానవ వ్యవస్థకు అవసరమైన శాశ్వత విలువలు మారా లనడం అసంగతం. మారుతున్న విలువలను సమాజానుగుణంగా రూపొందించుకో గలగడం ముఖ్యం. అనాదరణ దాని కది విలువకాదు. ద్వేషం, దూషణ విలువలు కావు. యువతరంలో ఉగ్రత కనిపిస్తున్నది. ఈ ఉగ్రత ఎవరిమీద? ప్రేమకైనా, కోపానికైనా ఒక ఆలంబనం ఉండాలి. అది మన పాత రస సిద్ధాంతమే. లక్ష్యం లేని సాధారణ ఉగ్రతవల్ల ప్రయోజనం ఏమిటి? రౌద్రరసంకూడా నవరసాల్లో ఒకటే. రౌద్రం అతిమాత్రంగా ఉంచరాదు. దాన్ని మూర్తిమంతం ఒక లక్ష్యస్ఫూర్తితో కావించాలి. తా మేమి చెప్పుచున్నారో ఇతరులకు చెప్పజాలనంత రౌద్రం, ఆవేశం ఉండి ఏమిటి ప్రయోజనం? ఇతరులకు అర్థమయేటట్లు చెప్పడమంత పెద్దవిలువ మరొకటి ఉండదు" అని ఆయన అభిప్రాయపడ్డారు.

ఆవిష్కరణ సభ అనంతరం ఆరు విభాగాలుగా వేర్వేరుగా గోష్ఠి సాగింది. వేర్వేరుగా జరిగిన గోష్ఠులలో మొదటిగంటలో విషయప్రతిపాదన జరిగింది. 37 మంది రచయితలలోనుండి హాజరైనవారు తమ వ్యాసాలకు మక్కీ చదివారు. తర్వాత భోజన విరామం. భోజనాలైన తర్వాత ప్రతినిధులు వేర్వేరుగా జరిగిన ఆరు గోష్ఠులలో పాల్గొన్నారు. చర్చలు జరిగాయి. ఆరు విభాగాలకు శ్రీయుతులు అడపా రామకృష్ణారావు, పి. ఎల్. యస్. శర్మ, డాక్టర్ కులశేఖరరావు, డాక్టర్ నాయని కృష్ణకుమారి, డాక్టర్ ముదిగొండ వీరభద్రశాస్త్రి, కలపటపు రామగోపాలరావు అధ్యక్షులుగా వ్యవహరించారు. ఈ ఆరుగురూ సాయంకాలం జరిగిన మూడవ సమావేశంలో తమ, తమ విభాగాలలో జరిగిన గోష్ఠులపై నివేదికలు సమర్పించారు.

డాక్టర్ అడపా రామకృష్ణారావు అధ్యక్షతన జరిగిన మొదటి విభాగం గోష్ఠిలో ఆచార్య మామిడిపూడి వెంకట రంగయ్య, గోరాశాస్త్రి, మంజుశ్రీ, సంజీవదేవ్, డాక్టర్ కేతవరపు రామకోటిశాస్త్రి, ఆర్. యస్. సుదర్శనం వ్యాసాలపై చర్చ జరిగింది.

"విలువలు" అన్నమాట పాశ్చాత్యులనుండి అనుకరణవల్ల వచ్చిన మాటలు అని ఈ అర్థాన్ని స్ఫురింపజేయడానికి మనవారు "ధర్మం" అనే మాటను వాడేవారని ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్య వివరిస్తూ సాధనసంబంధమైన విలువలూ, అనంతమైన విలువలు అని రెండురకాలుగా ఉంటాయని, సాధనసంబంధమైన విలువలు కాలంతోటే, మారుతూ ఉంటాయనీ, "పరమధర్మం" అనే అనంతమైన విలువలు మారవనీ అన్నారు. "ధర్మం" లేదా విలువలు హేతువాదంమీదకాక విశ్వాసముమీద ఆధారపడి ఉంటా యని ఆయన స్పష్టంచేసారు.

శీర్షికను "మారుతున్న జీవితవిధానంలో రచయిత బాధ్యత ఏమిటి? అని స్పష్టంగా ఉండేటట్టు మార్చవలసిందిగా శ్రీ గోరా శాస్త్రి చేసిన సూచనను అంగీకరించి ఆ విభాగం గోష్ఠి మార్చిన శీర్షికపై కొనసాగింది. సమాజంపట్ల రచయిత బాధ్యత ఉన్న దని హెచ్చరిస్తూ రచయిత మిగిలినవారికన్నా ఉన్నతుడు అనుకోవడం భ్రమ అని శ్రీ గోరాశాస్త్రి స్పష్టంచేసారు.

స్వాతంత్ర్యయుగంలో సమలక్ష్యం లేనందువల్ల నిర్వీర్యమైన రచనలు, లోపభూయిష్ఠమైన భాషలలో వెలువడుతున్నందుకు డాక్టర్ కేతవరపు రామకోటిశాస్త్రి విచారం వ్యక్తం చేసారు.

శ్రీ పి. యల్. యస్. శర్మ అధ్యక్షతన రెండవవిభాగం గోష్ఠి జరిగింది. శ్రీ యమ్. యన్. రావు, శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తి, శ్రీ యన్. ఇన్నయ్య ప్రసంగ వ్యాసాలపై చర్చ జరిగింది. ప్రచురణకర్తల సమస్యలనుగురించి శ్రీ యమ్.యన్. రావు వెలిబుచ్చిన అభిప్రాయాలపైనే చర్చ ఎక్కువభాగం కేంద్రీకృతమైనది.

సమాజంపట్ల ప్రచురణకర్తలకు బాధ్యత ఉండాలని శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తి వాదించారు.

డాక్టర్ యమ్. కులశేఖరరావు అధ్యక్షతన జరిగిన మూడవ విభాగం గోష్ఠిలో శ్రీ కాళోజీ, శ్రీ చేకూరి రామారావు, డాక్టర్ సి. లక్ష్మన్న, డాక్టర్ భీమ్‌సేన్ నిర్మల్ పాల్గొన్నారు. వాడుక భాష, గ్రాంథికభాష, మాండలికాల ప్రయోగాలపై శ్రీ చేకూరి రామారావు. శ్రీ కాళోజీలమధ్య ఆసక్తిదాయకమైన చర్చ జరిగింది.

నాల్గవ విభాగం గోష్ఠికి డాక్టర్ నాయని కృష్ణకుమారి అధ్యక్షత వహించారు. డా. అక్కిరాజు రమాపతిరావు, శీలా వీర్రాజు, తమ వ్యాసాలు చదివారు. సమస్యను హృద్యంగా చిత్రీకరించడంవరకే రచయిత బాధ్యత కాని, పరిష్కరించడం కాదని, కోడి కూయకున్నా సూర్యోదయం జరుగుతుందన్న వాస్తవాన్ని రచయిత గుర్తించాలని చర్చలలో పాల్గొన్న ఎక్కువమంది యువతీయువకులు, అభిప్రాయపడ్డారు. సమస్యలతో పీడితమవుతున్న సమాజాన్ని రోగితోను, రచయితను వైద్యునితోనూ, పోల్చుతూ, రోగి శ్రేయస్సు వైద్యునికి ఎలా ప్రధానమో, సమాజశ్రేయస్సు రచయితకు ప్రధానం కావాలని సూచించారు.

డాక్టర్ ముదిగొండ వీరభద్రశాస్త్రి అధ్యక్షతన జరిగిన ఐదవ విభాగంలో డాక్టర్ అరిపిరాల విశ్వనాథం, డాక్టర్ జి.వి. సుబ్రహ్మణ్యం, ప్రసంగ వ్యాసాలపై చర్చ జరిగింది.

శ్రీ కలపటపు రామగోపాలరావు అధ్యక్షతన జరిగిన ఆరవవిభాగం గోష్ఠిలో సినీమారచన, రేడియో రచనలపై శ్రీ నార్ల చిరంజీవి, శ్రీ పన్యాల రంగనాథరావు ప్రభృతులు పాల్గొన్నారు.

## ఫలశ్రుతి

ఈ గోష్ఠిని నిర్వహించి సాధించిన ఫలిత మేమిటి ? అన్న ప్రశ్నకు పూనుకునే ముందు ఈ గోష్ఠిని తలపెట్టడంలో నిర్వాహకుల లక్ష్యం ఏమిటో పరిశీలించాలి. "రచన" గ్రంథానికి ఉపోద్ఘాతంగా 'మామాట' అన్న శీర్షికను యువభారతి సమావేశకర్త శ్రీ వి. విశ్వనాథం రాసిన పంక్తులను ఇక్కడ పేర్కొనడం అప్రస్తుతం కాదు.

'మా యువభారతి సమావేశాలలో అనేక విషయాలపై చర్చలు నిర్వహించుకున్నప్పుడు ఇవే ప్రశ్నలు ఉత్పన్నమయ్యాయి. విలువలకు ఇచ్చే నిర్వచనాలు వ్యక్తికే వేరు. అడుగు కూడా ముందుకు చూడలేనివాడు ఒకడైతే, అరవై అడుగుల ఆవలనున్న వానినిగురించి ఆలోచించేవాడు మరొకడు. 'పాత అంతా చెత్త అనీ, పరమ రోత అనీ, ఉన్నదంతా సమూలంగా సర్వనాశనం చేసి ఒక శూన్యస్థితిని సృజించి, అందులోంచి మళ్ళీ మరేదో పునరావిర్భావానికి కృషిచేయాలి – అన్న వాదము కనబడుతుంది. అలాకాక 'మంచికై ప్రయత్నిద్దాం. మంచి ఎక్కడున్నా తీసుకుందాం. శూన్యం సృషించాక ఇక సృష్టి అంటూ జరగదేమో! అందుకని ఉన్నదాంట్లోనే మంచిని రక్షించుకుందాం' అన్న వాదనా వినబడుతుంది. ఈ ప్రశ్నలకు మాకు సమాధానం కావాలి. మాకు దొరికిన సమాధానాలు కేవలం మాకేకాక పదిమందికి అందుబాటులో ఉండేలా ఉండాలని, మా సందేహాల కొక స్వరూపా న్నిచ్చి, మా సమస్యల కొక సమాధానం సూచిస్తుందేమో నని ఈ గోష్ఠిని నిర్వహిస్తున్నాము.

ఈ గోష్ఠివల్ల సమాధానాలు లభించాయా? లభించకపోవచ్చు. ప్రశ్నలు ఉదయించడం దాని కదే ఒక ప్రయోజనం. సమాధానాలు లభించినా అవి తిరిగి మళ్ళీ ప్రశ్నలను సృష్టిస్తాయి. మళ్ళీ సమాధానాలకై అన్వేషణ. ఈ అన్వేషణ ఇలా నిరంతరం అనంతంగా సాగడమే ప్రగతి.

ఈ గోష్ఠి ముగింపు సమావేశంలో తమ విభాగంలో జరిగిన చర్చలను నివేదిస్తూ డాక్టర్ నాయని కృష్ణకుమారి "కోపోద్రిక్తులైన యువతీయువకులు గోష్ఠిని ముందుకు సాగకుండా అల్లరి చేస్తారేమో అనుకున్నాను. కలాలను అవతల పారేసి కత్తులు పట్టుకొందని రచయితలపై ఒత్తిడి తెస్తారేమో నని భయపడ్డాను. గోష్ఠి ప్రశాంతంగా సాగింది. యువతీ యువకులు చర్చలలో పాల్గొని తమ సందేహాను తీర్చుకోవడానికి ప్రయత్నించారు.'' అన్నారు. యువతరం తిరగబడుతున్న దని పెద్దతరంవారూ, ముఖ్యంగా మేధావులూ, కుళ్ళిపోయిన భావాలు మేధావుల వని యువతరంవారూ ఎవరి పరిధిలో వారు ఒకరినొకరు అనస్యాంచుకుంటూ గడిపేకన్నా, ఉభయులూ ఒక్క వేదికమీదికి వచ్చి "అయ్యా! నీది కుళ్ళుకంపు కొడుతున్న భావం!'' అని మేధావుల ముఖంమీదే యువతరం ప్రకటించడం, "బాబూ! నీది అరాచకం, వినాశకర విశృంఖలత్వం'' అని మేధావి యువతరం ముఖంమీదే అనడానికి అవకాశం చేకూరడం దాని కదే ఒక ఫలితం కాదా!

యువతరంలో జిజ్ఞాస ఉన్న దనీ, దాన్ని జాగృతం చేసి. దానికి సమాధానాలు చెప్పా లన్న అకాంక్ష మేధావులలో ఉన్న దనీ, గోష్ఠి ఋజువు చేసింది. ఈ ఉభయుల మధ్య సంధానం కుదర్చడానికి యువభారతి ఈ గోష్ఠిద్వారా ప్రయత్నించి యత్న సాఫల్యాన్ని పొందింది.

ఇటువంటి గోష్ఠులు అనేకం నెల కొక్కటైనా జరగవలసిన అవసరాన్ని ఈ గోష్ఠి చెప్పింది. సమస్యలు, ప్రశ్నలు, అనుమానాలు తీరడానికి మార్గం ఏమిటో ఈ గోష్ఠి చూపించింది.

నిజాయితీతో, చిత్తశుద్ధితో జరిగే ఇటువంటి కార్యక్రమాలకు ధనసహాయం చెయ్యడానికి ప్రభుత్వం ఇంతవరకు ముందంజ వేయకపోవడం శోచనీయం.

పండుగ విజయవంతంగా జరిగినందుకు తృప్తిపడ్డ భవదీయుడు ఆర్థిక వ్యవహారాలను గురించి నిర్వాహకులను ప్రశ్నించగా ఆశ్చర్యకరమైన విషయాలు తెలిశాయి. 'రచన'ను అచ్చువెయ్యటంతోసహా మొత్తం ఖర్చులన్నీ కేవలం ఆరువేల రూపాయలేనట! (30 వేలూ, 35 వేలూ కాదు). ఈ ఆరువేల రూపాయలకుగాను ప్రతినిధి రుసుముల మూలంగాను, రచనలో మధ్యమధ్య వేసిన వ్యాపారప్రకటనల మూలంగాను దాదాపు ఐదువేలు వసూలైనాయట. ఒక్క వెయ్యి రూపాయలుమాత్రం నష్టం వచ్చిందట! దాన్ని పూడ్చడం ఎలాగని సతమత మౌతున్నారు ఇటువంటి గోష్ఠుల ప్రాధాన్యతను ఉగ్గడించిన విద్యామంత్రి శ్రీ పి. వి. నరసింహారావు...... ఎన్నో పుస్తకాల ప్రచురణలకు వేలాది రూపాయలు విరాళాలిస్తున్న విద్యాశాఖనుండి ధనసహాయం గురించిన మాట ఇంతవరకు తెలియరాలేదు.

దాదాపు వెయ్యిరూపాయల నష్టాన్ని పూడ్చుకొని. ఆయావిభాగాల అధ్యక్షులు సమర్పించిన గోష్ఠి నివేదికలను సంకలనంగా మరొక పుస్తకం ప్రచురించాలి; ఇదీ యువభారతి నిర్వాహకుల సంకల్పం. ఈ సంకల్పం ఎలా నెరవేరుతుంది? ధనం కావాలి.

'రచన' ప్రతులను ఉచితంగా పంచేవి పంచగా మరొక నాలుగువందల ప్రతులు మిగిలాయి. వాటి విక్రయంద్వారా వచ్చిన ధనంతో ఈపనులు చెయ్యవచ్చు. కాని పుస్తకాలను కొనేవా రెవరు? ఆసక్తి ఉన్నవా రందరికీ అందనే అందాయి. గ్రంథాలయాలకు పుస్తకాలను సప్లయి చెయ్యడానికీ బోలెడు తతంగం. విద్యాశాఖచుట్టూ తిరగాలి. ఆతర్వాత గ్రంథాలయాధికారులచుట్టూ తిరగాలి. పెద్ద తలనొప్పి.

ఈవిషయాలను పత్రికల కెక్కించడం యువభారతి నిర్వాహకులకు సుతరామూ ఇష్టంలేదు. ఆర్థికసహాయానికి అర్హులైనవారు ఇదిగో ఇక్కడున్నా రని చూపడం భవదీయుని కర్తవ్యంగా భావించి ఈ వాక్యాలను రాస్తున్నాను.

గోష్ఠిని సంకల్పించినప్పటినుండి నిర్వహించిన విధానం అపూర్వమైనది గోష్ఠి రోజునకూడా ప్రచురించిన కార్యక్రమం ప్రకారం ప్రతిదీ ఠంచన్‌గా సమయానికి ప్రారంభం కావడం, సమయానికి ముగించడం విశేషం. సమయం ఒక్కరోజు అయినా సరిపోకే దన్న ఫిర్యాదు ప్రాసంగికులకూ లేదు. ప్రతినిధులకూ లేదు. సక్రమంగా గోష్ఠిని సాగించిన యువభారతి నిర్వాహకులు ఎంతయినా అభినందనీయులు.

(ఆంధ్రభూమి 3-8-70 సంచికలో ప్రచురణ)

# 'రచన' – పత్రికల ప్రశంసలు

## "భారతి" మాసపత్రిక

అక్టోబర్ 1970

యువభారతి సాహిత్యసంస్థవారు "మారుతున్న విలువలు - రచయితల బాధ్యతలు" గోష్ఠి సందర్భంగా ప్రకటించిన ప్రముఖరచయితల వివిధవ్యాసాలసంపుటం ఇది. సంఘంలో మారుతున్న విలువలు - వివిధసాహిత్యప్రక్రియలు, వీటి పరస్పరప్రభావం అన్న విషయాలపై ప్రసిద్ధులైన కవులు, కథకులు, విమర్శకులు, సాహిత్యవేత్తలు చర్చించి, ఆలోచించి, నిగ్గుతేల్చి రచించిన ముప్పైఏడు వ్యాసాలీసంపుటిలో ఉన్నాయి. ఇందరిరచయితలవ్యాసా లొక్కపుస్తకంలో ప్రచురించడంలో ఒకవ్యాసానికి ఇంకొక వ్యాసానికీ కొంత అభిప్రాయభేదం కనిపించడం సహజం. అయినా ఈ వ్యాసాలన్నీ సాంతంగా చదువుతే ఈ ప్రసిద్ధరచయితలందరూ నేటి అస్తవ్యస్త సమాజస్థితికి ఎంత ఆరాటపడుతున్నారో పాఠకుడికి ప్రముఖంగా స్ఫురిస్తుంది.

ఒక ప్రత్యేకమైన, నేడు చాలాముఖ్యమైన ఈ సాహిత్యవిషయంగురించి ఇందరు సుప్రసిద్ధరచయితలవ్యాసాలని ఏకత్ర కూర్చిన ఈ వ్యాససంపుటి ప్రతిసాహితీపరుడూ తప్పక చదువవలసినది. ఈ పుస్తకం చదవడం ఒకగుణం అనడంమాత్రమే కాదు, చదవక పోవడం ఒకలోపం అనికూడా చెప్పవచ్చును. ఇంత ప్రయోజనవంతమైన వ్యాస సంపుటిని ముచ్చటగా ముద్రించి, సరసమైన వెలకు అందజేస్తున్న 'యువభారతి' సంస్థ వారు మిక్కిలి అభినందనీయులు.

## "విశ్వరచన" మాసపత్రిక

ఆగస్టు 1970

ఉత్తమసాహిత్యం సమాజంలోకి బాగా చొచ్చుకుపోయి ఆసక్తి కలిగించటానికి సాహితీచర్చలు, సదస్సులు, నేడు వాదవాదలా జరపడం అవసరం. అటువంటిసదస్సు 'మారుతున్న విలువలు - రచయితలబాధ్యతలు' గూర్చి ఈ మధ్య యువభారతి, హైదరాబాదులో జరిగింది. సదస్సునిర్మాణం, రచనావ్యాసంగం ఉదాత్తధోరణిలో నడిచింది. మారుతున్న విలువలపై రచయితల బాధ్యతలు ఎంతగా నిర్దుష్టపరచగలవో అన్నది వివాదాంశం అయినా, సదస్సుతీరుతెన్నులు సాహితీలోకానికి ఒకవిధమైన విజ్ఞానవంతమైన ఆలోచనలకు దోహద మిచ్చింది.

## "విశాలాంధ్ర" దినపత్రిక

9-8-1970 (సాహితీ స్రవంతి)

సుమారు 40 మంది ప్రముఖరచయితలు తమదృక్పథాన్ని వివరిస్తూ వ్రాసిన వ్యాసాలు ఇందులో ఉన్నాయి.

"తనకు తోచినది, ఆత్మసంతృప్తి కలిగేది రాయడం రచయిత బాధ్యత. జీవిత విధానాన్ని సాహిత్యం ఎన్నడూ మార్చలేదు." అని ఘంటాపథంగా ప్రకటించిన గోరా శాస్త్రి ఒకవైపున ఉన్నారు.

"కమిటెడ్ లేక కట్టుబడ్డ మనిషి రచయిత కాలేడు." అంటారు కాళోజీ. "రచయిత బాధ్యతలు అనేమాట కళాసృష్టికి గొడ్డలిపెట్టు" అని తమగొంతు కలుపుతున్నారు శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తి.

ఎన్నోవ్యాసాలు ఇందులో ఉన్నాయి. సాహితీప్రియులకు ఆసక్తిదాయకమైన సంకలనం ఇది.

## "కృష్ణాపత్రిక" జాతీయ వారపత్రిక
## 3-10-1970

జంటనగరాలలో ఉన్న సాహిత్యసంస్థలలో నిర్మాణాత్మకమైన కృషి చేస్తున్న వాటిలో యువభారతి ఒకటి.

అభిప్రాయాలు వ్యాసరూపంగా సేకరించడం, గ్రంథరూపంగా ప్రచురించడం ఎంత వ్యయప్రయాసలకు గురిచేస్తుందో వేరే చెప్పనవసరం లేదు. ఇన్ని వ్యయప్రయాసలకు తట్టుకుని కార్యకర్తలు ఈ పుస్తకం వెలువరించడం ముదావహం.

ఆలోచనలను రేకెత్తించే అభిప్రాయాలు ఎన్నో ఎందరివో వున్నాయి.

యువభారతికృషి ప్రశంసనీయం.

## "ఆంధ్రవాణి" ప్రజాస్వామ్య వారపత్రిక
## 11-10-1970

దినదినం మారిపోతున్న ఈనాటివిలువలమధ్య రచయితలబాధ్యత ఏమిటి? అనే అంశంపై విభిన్నదృక్కోణాలనుంచి ఏర్చికూర్చిన ముప్పైఏడు వ్యాసాల సంపుటి ఇది.

ఈవ్యాససంకలనం ఒకభావప్రపంచాన్నే మనముందు వెలయించగల దనటంలో అతిశయోక్తి లేదు. ఇది మారుతున్నవిలువలమధ్య రచయితలబాధ్యతల్ని విపులంగా వివిధ దృక్కోణాలనుంచి ప్రదర్శిస్తున్న ఉత్తమవ్యాససంపుటి.

## "స్వాతి" సచిత్రమానపత్రిక

'మారుతున్నవిలువలు - రచయితల బాధ్యతలు' అనే అంశాన్ని సాహిత్యంలోని వివిధశాఖలలో పేరందినరచయితలకు యిచ్చి, వారిచేత రాయించినవ్యాసాల సంకలనమే యీ 'రచన'. ఈనాటిసాహిత్యం తేటతెన్నులగురించి క్షుణ్ణంగా తెలుసుకోవడానికి ఈరచన ఒక చక్కటివేదికగా ఉపయోగపడుతుంది. తెలుగులో యిటువంటిపుస్తకం యింతకుముందు రాలేదు. సాహిత్యరంగంలో జరుగుతున్నకృషిని సమీక్ష చేయడానికి యిటువంటి పుస్తకాల అవసరం ఎంతయినా వుంది. కొత్తగా రచనలు చేసేవాళ్ళకు, సాహిత్యాన్నిగూర్చి తెలుసుకోదలచినవారికి, చివరకు పెద్దరచయితలకు సైతం యిటువంటి పుస్తకాలు మార్గదర్శకంగా వుంటాయి. ఇది ఒక డాక్టరేట్ థీసిస్‌లాంటిది. ఆధునిక సాహిత్యంలో డాక్టరేట్ చేయడానికి మన విశ్వవిద్యాలయాలు అంగీకరించినప్పుడు

ఈ'రచన'కన్న మించిన రిఫరెన్సుపుస్తకం మరోటి లేదు, తెలుగుతో యింతమంచిపుస్త కాన్ని ప్రచురించిన యువభారతివారిని అభినందించక తప్పదు.

## "ఆంధ్రసచిత్రవారపత్రిక"

11—9—1970

'మారుతున్న విలువలు- రచయితలబాధ్యతలు' గోష్ఠి సందర్భంగా విభిన్నదృక్కోణాలతో పరిశీలించినప్రముఖులవ్యాసాలు ముప్పైఏడు ప్రకటించబడినసంపుటం ఇది మొదట్లో గోష్ఠి ఆవశ్యకతనుగురించీ, యువభారతి యింతవరకూ సాధించినవాటినిగూర్చీ, యికముందు జరుపదలచిన కార్యక్రమాలనుగురించీ దాని నిర్వాహకులు తెలిపారు కేవలం నవ్యమార్గంపైనే పురోగతి ఆధారపడి ఉన్నదనే యువరచయితలే కాకుండా ప్రాచ్యసంప్రదాయాలలో పండిపోయి - అన్నిమార్గాలనూ ఆమోదిస్తున్న ఆచార్య వెంకట రంగయ్యగారు, డాక్టర్ అవధానిగారు మున్నగువారి వ్యాసాలుకూడా ఇందులో ఉండటం విశేషం। మారిన- మారుతున్నవిలువలనూ, విమర్శకుల- రచయితల, ప్రకాశకుల బాధ్యతలనూ, వివిధదృక్పథాలనూ వివరించే చక్కనివ్యాసా లిందులో ఉన్నాయి.

ఈవిధంగా వివిధదృక్పథాలలో ఉన్నరచనలనుగూర్చిన వ్యాసాలను ఒకచోట చేర్చి ప్రకటించిన యువభారతివారిప్రయత్నం మెచ్చుకోదగినది. ఇదివరలో కవితా ప్రకటన మూలంగాచేసిన సేవకంటె వ్యాసప్రకటన ఎంతో విలువైనది.

ఈవ్యాసాలనుబట్టి చాలామందికి- వెనుకటిసాహిత్యాన్ని విస్మరించినా బాధ లేదనీ, నూతనకవితమాత్రం ఉపాదేయమనీ అభిప్రాయం ఉన్నట్లు తోస్తున్నది. విశిష్టమైన జ్ఞానాన్ని సంపాదించినప్పుడే రచయిత ఉత్తమమకృతులను అందివ్వగలుగుతాడు. అజ్ఞానం కలగడానికి వెనుకటి గ్రంథాలు తప్పక కావాలి. ఈవిషయాన్ని విస్మరించ కూడదు.

నేటి సాహిత్యంలో కాలప్రవాహా న్ననుసరించి మారిన, మారుతున్న విలువలను గురించీ, రచయితలు మున్నగువారిబాధ్యతలనుగురించీ, విభిన్నదృక్పథాలనుగురించీ తెలుసుకోవాలంటే ఈ'రచన' తప్పక చదవవలసి ఉన్నది.

## ఆంధ్రపత్రిక, దినపత్రిక

9-8-1970, ఆదివారం సారస్వతానుబంధం

నగరజనాభానుబట్టో, ఔత్సాహికతను బట్టోకాని నగరంలో ఏదో సాహితీ, రాజకీయ, సాంస్కృతిక, సాంఘిక, సంగీతసంచలనం జరుగుతూనే వుంటుంది. ఇవి ఏవీ లేనినాడు సమ్మెలు, తత్సంబంధమైన విపరీతసంచలనం తప్పనిసరిగా వుండితీరుతుంది. యువకులలో సాహితీసంచలనం కలిగించడానికి యువభారతి అనే సంస్థ "మారుతున్న విలువలు - రచయితలబాధ్యతలు" అన్న అంశంపై గతవారం ఆంధ్రసారస్వతపరిషత్తు హాలులో గోష్ఠి నిర్వహించింది. కవిత్వానికి తీరుతెన్నులు మరుగైన ఈ సమయంలో రచయితలబాధ్యతంటూ ఏదని ఈ గోష్ఠివారు చర్చింపపూనారు. సాహిత్యంలో అనేక

రకాలయిన దృక్కోణాలు, దృక్పథాలు అలవడిపోయిన నేడు రచయిత మొదట సామాజికుని తీర్చిదిద్దడానికి పూనుకున్నాడో లేక తన కలానికే అక్షరాభ్యాసం చేస్తున్నాడో తెలియరావడం లేదు. ఏమైనప్పటికీ రచయిత తన భావపరంపరలను కలంలో పోసి సామాజికుని నెత్తిన రుద్దటం జరుగుతోం దని ఇటీవలి కవిత్వాలు, కవితలు, రచనలు, తేటతెల్లం చేస్తున్నాయి.

అసలు రచయిత అంటే ఎవరు? ఈరచయిత అనే పదానికి నిర్వచనం చాల అగమ్యగోచరంగా ఉంటుంది. తన భావావేశాన్ని మరొకడు ఆవేశంగానో, ఆనందంగానో, బాధగానో గ్రహించాలని రచయిత వుద్దేశమని అర్థమవుతుంది. అయితే రచయిత లక్ష్యమే అటువంటిది. అతని పరిసరాలు, ప్రభావాలు, ఉద్దేశాలు, వూహలు, ఒక్కొసారి ఉన్మాదంకూడా కలంలో ప్రదర్శిస్తాడు రచయిత. రచయిత పూర్వం, ఇప్పుడూ, ఒకలాగే వుంటాడు. కాని ప్రకృతిలో ఋతుక్రమంలా అతని భావావేశాన్ని ఒక్కొ ఋతువుగా కలంద్వారా వర్షిస్తాడు. రచయిత మారాలంటే బాహ్యంగా మారుతాడేమో.గాని అంతర్ముఖంగా మారడం అనుకోని విషయం. రచయితను ఆదరించడం ఆయాకాల పరిస్థితులనుబట్టి యుంటుంది.

శ్రీ వి. వి. నరసింహారావు ఈ గోష్ఠిని ప్రారంభిస్తూ ఉద్రేకపూర్వకకవిత్వాలు లక్ష్యంలేనికవితలుగా పోల్చారు. ఆవేశం కవితాలక్ష్యం కాదని అన్నారు. తమ అభిప్రాయాలను సమాజం ఎంతవరకూ వుపయోగకరంగా వుంటాయో ఆలోచించాల్సిన బాధ్యత రచయితలపై వున్న దని శ్రీ నరసింహారావు అన్నారు.

ఈగోష్ఠిలో సాహిత్యంపై చాలా విలువైనచర్చ జరిగింది. మంత్రి ఆవిష్కరించిన పుస్తకంలోకూడా 40 మంది రచయితలవ్యాసాలు వున్నాయి. నగరకళాశాలల విద్యార్థులు, పెక్కురు సాహితీప్రియులు, కళాశాలల ఉపాధ్యాయప్రతినిధులు ఈసమావేశానికి నిండుదనాన్ని కలిగించారు. పాత రోతయినా రోతలో రవ్వంత మంచి వుంటుంది క్రొత్త కొరివిలా తయారయి పాతక్రొత్తలను కరువుచేస్తుంది. కనుక పాతను మరచిపోక, క్రొత్తను సమకూరుస్తూ రచన సాగిపోవాలనీ పలువురుప్రముఖులు అభిప్రాయపడ్డారు.

ఒక్కరోజు జరిగిన ఈ సదస్సులో కొన్నివిభాగాలుగా విద్యార్థిఉపాధ్యాయవర్గాలు విడిపోయి తీక్షణంగా సాహిత్యపర్యావలోకనం చేశారు. కాని ఈ సదస్సులో పాల్గొన్న సాహితీమిత్రు డొకడు 'రచనాప్రియులందరికీ ఆవేశం ఎక్కువగానే వుంది. మరి ఆవేశం లేనదే కవిత్వం రాదంటున్నారు చాలా మంది' అన్నాడు సమావేశానంతరం.

## "ప్రజాతంత్ర"
## 6–8–1970

యువతరంలో జిజ్ఞాస వున్న దని, దాన్ని జాగృతం చేసి, దానికి సమాధానం చెప్పాలన్న ఆకాంక్ష మేధావులలో ఉన్నదని, ఈ గోష్ఠి ఋజువు చేసింది. ఈ ఉభయుల మధ్య సంధానం కుదర్చటానికి 'యువభారతి' ఈ గోష్ఠిద్వారా ప్రయత్నించి, యత్న సాఫల్యాన్ని పొందింది.

## THE DECCAN CHRONICLE

*6th August 1970*

TELUGU WORLD, A LITERARY FEAST

YUVA BHARATHI, a literary organisation of Secunderabad recently organised a seminar on 'Writers' Responsibility' – in the context of changing values.

The very arrangement of sessions was carefully planned and there was much young blood that actively participated in the sessions.

There is a great need for seminars of this nature and it is really creditable that this young organisation has made serious efforts in this direction...... deserve congratulations for this literary feast.

## THE DECCAN CHRONICLE

*27th July 1970*

Mr. Ramanuja Rao complimented the members of Yuvabharathi, who, during the last six years, had organised three or four literary conferences. He was glad that Yuvabharathi did not have any political leanings, and that it aimed at training the youth to speak and think clearly and constructively.

## THE INDIAN EXPRESS

*18th September 1970*

TELUGU BOOK REVIEW - CHANGING VALUES IN SOCIETY

Change and evolution may be synonymous but they are by no means synchronous. While evolution implies progress, change connotes either progress or regress. Every society has its own values. With change of times values change. For example, the present youth the world over is not satisfied with merely following or perpetuating customs and conventions of earlier generations. It is more critical, questioning and incisive.

This trend is not a catastrophe – so long as it does not turn berserk. The majority of people in society are blissfully ignorant, indifferent or apathetic. It is a section of the intellectuals which directly or indirectly establishes new and better ideas and values.

The writer, among them, occupies, a special place and functions on a special plane. His province has no boundaries or barriers. He has therefore a heavy responsibility in setting up healthy values. At least he must try. These and similar sentiments constitute the cornerstone of the anthology of literary articles reviewed here. Each writer has been asked to discuss values in relation to a particular aspect of journalism, and nearly all the contributors have done their assignments assiduously and admirably. However, I find the introductory remarks and reports by V. Viswanatham, the sponsor, especially exhilarating.

**Clash of Opinions**

Naturally in a book of this kind some ideas and sentiments recur with whom platitudinous monotony 'All old values are not necessarily - bad nor are all new values necessarily good'. Since the contributors include representatives of older and younger generations it is natural that there should be a clash of opinion. Thus while M. Venkatarangaiah believes that social values justify the inequality of people in regard to power, prestige and property, Sanjiva Dev questions the rationale of distinction of man from man. He bemoans the perpetuation of caste affiliations by youngsters who being of an ideal disposition should have fought them out of socicty. That even in this modern age superstition should reign supreme is unfortunate - 'The number of even young and educated people frequently visiting Tirupati for a clean shave is increasing day by day'.

As in my view, Sanjiva Dev's is one of the few best articles. It needs a little more attention. Referring to the writer's responsibility, he observes that a literary piece should not be judged by the eternity of its survival 'The rainbow is short-lived and yet its beauty is unquestioned'. The writer should not consciously introduce changing values into his writings : they should enter into them spontaneously. The writer's responsibility must manifest itself in the dual role of a mirror and a lamp. The mirror reflects reality-life as it exists, and the lamp throws light on the ideal - how life ought to be.

Dr. D. Venkata Avadhani, K. V. Ramana Reddy and others discuss the duty of critics in the context of changing values and point out that criticism, contrary to popular belief, is not merely to pinpoint the shortcomings in a literary work but atleast its assets also. K. V. Ramana Reddy, recalling the thoughts of T. S. Eilot, feels that instead of an incompetent and one-sided critic doing harm to both the writer and the reader, it might be better if the writer himself plays the role of critic. In the second part of the book, the several facts of literary composition – criticism, novel, story, drama, poetry, film script, radio script, journalism - are discussed by seasoned writers. As should be expected there is an occasional disagresment or even diametrically opposite views on some aspects.

## Women Writers

While critics like, S. Veera Raju are caustic and sarcastic about the growing number of women story-writers. K. Ramalakshmi, one of the two women contributors, takes up the cudgels and tellingly argues that the number of men writers has also increased several-fold. Her calculation is that women constitute only a fourth of Telugu novelists. She puts up a spirited attack on the hypocrisy and cussedness of society, for which she impliedly holds men more responsible than women. One feels like adding that quality novels as well as frivolous ones are written by both men and women. Accordingly it is unfair to accuse women of producing second-rate literature. unless of cource, the accuser is a misogvnist. Veera Raju's charge that women generally lack boldness does not stand a test of scrutiny. Does he not know our Prime Minister ? Here is a book which throws a flood of light on the trends in contemporary Telugu journalism and except for a very few articles, the entire discussion provides the reader with a rich fare of ideas and ideals operating in the writers' minds.

The printing and the get-up are extremely pleasing. Yuvabharati should continue to serve Telugu literature with more such publications.

# ఇదీ మేం వ్రాసిన ఉత్తరం




**యువభారతి**

సాహితీ సాంస్కృతిక సంస్థ

**5, కింగ్స్‌వే, సికింద్రాబాదు-3.**

శ్రీ.................................................................గారికి

మా సాహితీ సాంస్కృతిక సంస్థ ''యువభారతిని'' మీకు పరిచయం చేయడానికి ఆనందిస్తున్నాము. రాయిరాయికి మధ్య పరాయితనము తగ్గింపగ ఉడుత రాల్చినట్టి ఇసుక మాదిరిగా - ఉడుతాభక్తిగా - జంటనగరాల సాహిత్య సాంస్కృతిక జీవితములో ఈ ఆరు సంవత్సరాలలో మేము చెప్పుకోదగ్గపాత్రను నిర్వహించాము. నాలుగు ప్రచురణలు, రవీంద్రభారతిలో మరో నాలుగు సాంస్కృతిక కార్యక్రమాలు మాకృషికి పతాక శీర్షి కలు. కేవలం సంవత్సరాని కొకసారి కళ్లు తెరచి, ఏదో కార్యక్రమం జరుపుకొని, మా బాధ్యత తీరిపోయిం దనుకునే మనస్తత్వం కాదు మాది. ప్రతి నెల రెండు సమావే శాలు - ఆ రెండు సమావేశాల్లోను వ్యక్తికిని విశిష్టవ్యక్తిత్వం గలవాడుగా తీర్చిదిద్దేందు కని దాదాపు తాలింఖానాలాంటి కృషి. స్పష్టంగా ఆలోచించి ఎదుటివారి హృదయం మెచ్చుకోగలిగినట్లు మాట్లాడగలిగినప్పుడే మనిషి ఏదైనా సాధించగలుగుతాడని మా నమ్మకం. అందుకనే అటు ఆలోచించటం, ఇటు మాట్లాడటం, అటు చదవటం, ఇటు వ్రాయటం, అన్నీ తగుపాళ్ళలో మేళవించి వ్యక్తి జీర్ణంచేసుకోగలిగిన మోతాదుల్లో తరి ఫీదు నిచ్చే శిక్షామందిరం మా యువభారతి.

నేటి యువతరం క్రొత్తపోకడలు పోతోంది. వింతపోకడలుకూడా పోతోంది. ప్రతి దాన్నీ సూటిగా ప్రశ్నించే మనస్తత్వం అలవరచుకొంది. అనాదిగా అందరు అవునని తలలూపిన విషయాలను, వాస్తవాలను ధిక్కరిస్తోంది నేటి యువతరం, నిలదీసి అడుగు తోంది సమాధానం చెప్పమని. ఒక్కోసారి అలజడి, అరాచకం మా జన్మహక్కని అని పించేట్లు ప్రవర్తిస్తోంది. ఇది నడుస్తున్న చరిత్ర. సాంఘికవిలువలు త్వరత్వరగా మారి పోతున్నాయి. క్రొత్తరూపం దాల్చే పాతవిలువలు కొన్ని అయితే, మరీ క్రొత్తవిలువలు మరికొన్ని. పాతవిలువల నన్నింటినీ పాతరవెట్టేసెయ్యాలనే కంఠాలుకూడా వినిపిస్తు న్నాయి.

దేశభవిష్యత్తుకోసం, సోదరమానవుడి భవితవ్యంకోసం కృషిచెయ్యాల్సిన బాధ్యత అందరిపై నున్నా, చదువుకొన్నవారిపై, నలుగురినీ నడిపించగలిగిన శక్తిగలవారిపై

మరింకాస్త ఎక్కువగా వుంటుంది - ముఖ్యంగా రచయితలకు. "మారుతున్న విలువలు - రచయితల బాధ్యతలు" అన్న విషయంపై రచయితలకు, పాఠకులకు, విమర్శకులకు గల నిశ్చితాభిప్రాయాలను ఒకచోట కూర్చి ఒక నిశ్చితరూపం ఇద్దామని మేము తలపెట్టాము

మేము నిర్వహిద్దామనుకొంటున్న "మారుతున్న విలువలు - రచయితల బాధ్యతలు'' అను శీర్షికపై "సెమినార్'' సందర్భంగా వివిధ సాహిత్యప్రక్రియలలో పేరెన్నికగన్న వ్యక్తులనుండి వ్యాసాలరూపంలో అభిప్రాయాన్ని సేకరించి ప్రత్యేక సంచికగా అచ్చువేద్దామని మా ప్రయత్నం.

మీరు పేరెన్నికగన్నవారు. మీ అభిప్రాయాలను తెలుగుజనానికి తెలపటానికి మేము ఆరాటపడుతున్నాము. మా కార్యక్రమ విజయానికి తోడ్పడుదని చనువుతో మీపై చిన్నభారాన్ని మోపుతున్నాము. మీ రచన పంపమని ప్రార్థిస్తున్నాము.

అసలువిషయాన్ని చిన్నచిన్న విషయాలుగా విభజించాము. నాలుగయిదు పేజీలకు మించకుండా ఆయా విషయాలపై అభిప్రాయసేకరణ చేసేద్దామని మా అభిప్రాయం. పదిహేను రోజులకన్నా ఎక్కువ గడువు ఇవ్వకుండా మిమ్మల్ని తొందరపెడుతున్నందుకు మీరు మమ్మల్ని మన్నించాలి. తేదీ దాటకుండా మీ రచన మాకు చేరేటట్లు చూడండి. మీ రచనకై దిగువ నున్న విషయాన్ని సూచిస్తున్నాము.

యువభారతి

అంటూ............ మేము వ్రాసిన ఈ ఉత్తరానికి ..............

# ఇవిగో : ఇవీ రచనలు

## మొదటి భాగము

## రెండవ భాగము

# విలువలు - నాడు, నేడు

శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య

మానవజీవితములో విలువల మూలమున తీరు అవసర మెట్టిదో ప్రప్రథమము తెలుసుకొనవలెను.

సమాజములో మానవులు విశ్వసించు విలువలు ప్రధానముగ మూడు అవసరములను తీర్చుచున్నవి. వీటిలో మొదటిది : జీవితమునకు లక్ష్య మేదైన ఉన్నదా? ఉన్న పక్షమున అది ఎట్టిది? అను ప్రశ్నలకు సమాధానము చెప్పుట ; రెండవది : సామాజిక జీవితమును, సమాజములోని వ్యక్తుల జీవితమును నియమబద్ధముగచేయుట ; మూడవది : సమాజములోని తరతమ భేదములను సమర్థించుట. ఈ మూడు అవసరములు తీరినప్పుడే సమాజము నిలబడగలదు. ఇవి తీరనినాడు సమాజము విచ్ఛిన్నమగును.

మనదేశమందును, సమాజమందును వేలకొలది సంవత్సరములుగ ప్రాధాన్యము గాంచిన విలువలు ఈ మూడు అవసరములను తీర్చగలవిగ నుండెను. విలువలకు మానవుల విశ్వాసమే ప్రధానాధారము. వాటిలోని సత్యమును హేతువాదముచేతగాని యుక్తిచేతగాని రుజువుచేయుట సాధ్యముకాదు.

ఆనాటి విలువలు జీవితమునకు పారలౌకికసౌఖ్యమే పరమార్థమని ప్రతిపాదించినవి. అనేకపరిస్థితుల కారణముగ ఐహికజీవితము దుఃఖమయముగ నున్నది. దుఃఖమును పూర్తిగ తప్పించుకొని సుఖముగ జీవితము నంతను సాగించిన మానవు డెవ్వడు లేడు. అట్టివాడు భవిష్యత్తులో ఉండగలడని చెప్పుటకు హేతువు లేమియు లేవు. కాని, ప్రతి మానవుడు సుఖమును వాంఛించుచున్నాడు. అది అతనికి సహజ లక్షణము. అది దుర్లభము కాదు. కాని అది మరణానంతరము పరలోకమందు మాత్రమే లభించును. ఐహిక జీవితమునకు అట్టి సౌఖ్యమే లక్ష్యము. దానిని సంపాదించుటకు అనుగుణముగ ప్రతి మానవుడు వాని జీవితమును సాగించవలెను.

ఇదివరలో మనసమాజమందు ప్రాబల్యము గాంచిన విలువలు జీవితమును నియమబద్ధముగ చేయగలిగెను. నియమము లేక సామాజికజీవితము సాధ్యముకాదు. ఎవడు ఎవరిపట్ల ఏవిధముగ ప్రవర్తించవలెనో ఏవిధముగ ప్రవర్తించరాదో నిర్ణయించు సూత్రమునకు నియమమని పేరు. ప్రతి సమాజములో ఇట్టి నియమములు అసంఖ్యాకములుగ నున్నవి. భర్త భార్యపట్ల, తల్లిదండ్రులు పిల్లలపట్ల, శిష్యులు ఉపాధ్యాయులపట్ల, యజమానులు కార్మికులపట్ల, సామాన్యముగ ఒకవ్యక్తి మరియొకనిపట్ల ఏ విధముగ ప్రవర్తించవలెనో ప్రతి సమాజములోనివారికి స్పష్టము. ఒక సమాజములోని నియమములకును మరియొకదానిలోని నియమములకును భేదము ఉండవచ్చును. కాని నియమ మన్నది లేక

ప్రతివ్యక్తికి ఇష్టానుసారము ప్రవర్తించుటకు పూర్తిగ స్వేచ్ఛను ఇచ్చు సమాజము ఏదియు లేదు. తోటిమానవుడు సాధారణముగ ఎట్లు ప్రవర్తించునో తెలిసిన కారణము ననే ప్రతివ్యక్తియు దానిని గుర్తించి, తన జీవితమున కొక మార్గమును కల్పించుకొని, నిర్భయముగను, నిస్సందేహముగను అందు నడవగలిగి యున్నాడు. నియమమువలన కలుగు ప్రయోజన మదియే. అందుచేతనే మన పూర్వులు, "మానవులందరికి అహింస, సత్యము, శుచిత్వము, అనసూయ, దయ, క్షమ స్వధర్మ'' మనిరి. సామాన్యముగ మనతో వ్యవహారముచేయువారు సత్యమును తప్ప రను నమ్మక మున్న కారణముననే వర్తక వ్యాపారములు, అప్పులను యిచ్చిపుచ్చుకొనుట మొదలగు వ్యవహారములు జరుగుచున్నవి. దౌర్జన్యమునకు, హింసకు ఉపక్రమించు దారిదోపిడిగాండ్రు ఉండరను విశ్వాసముచేతనే ధారాళముగ రాకపోకలు, వస్తువుల రవాణాలు జరుగుచున్నవి. ఉపాధ్యాయులు శిష్యులకు విద్య నేర్పుదు రను నియమ ముండునంతవరకే విద్యావ్యాప్తి సాధ్య మగుచున్నది. నియమము లేని జీవితము స్థిరత్వము లేనట్టి జీవితము. భవిష్యత్తును ఉద్దేశించి జీవితమును రూపొందించుకొనుట నియమబద్ధమగు సమాజములోనే సాధ్యము కాగలదు. అహింస, సత్యము మొదలగువాటికి ప్రాధాన్యము కల్పించి, ఆ నాటి మన విలువలు సామాజిక జీవితమును నియమబద్ధముగ జేసి, మానవజీవితము శాంతియుతముగ నుండునట్లు చేసెను.

సమాజములో నుండదగిన నియమములను ఒక్కొక్కతరమువారికి నేర్పవలసిన అవసరమున్నది. కుటుంబము, విద్యాలయములు, మతసంస్థలు మొదలగునవి దీనికి సాధనములు. ఈ సాధనములు సౌష్ఠవముగ పనిచేసినప్పుడే కొత్తతరమువారు తాము అనుసరించవలసిన నియమముల నేర్చుకొనుటయు, తదనుసారముగా ప్రవర్తించుటయు వీలగును. ఈనాడు ఇట్టి సాధనములు చక్కగ పనిచేయకపోవుటచేతనే సామాజికజీవితము రోజు రోజునకు నియమరహిత మగుచున్నది.

విలువలమూలమున తీరునట్టి మూడవ అవసరమును గుర్తించుటలో సామాజిక జీవితము తరతమభేదములతో కూడుకొనినట్టిది అను విషయమును విస్మరించరాదు. అన్నికాలములలో అన్నిసమాజములకు తరతమ భేదములు ఒక ప్రధాన లక్షణము. ఈ సందర్భములో మూడురకములగు సామాజికవ్యవస్థలను గమనించవలెను.

మానవుడు వాంఛించు ప్రయోజనములన్నియు వానికి కావలసినంతమట్టుకు (సమృద్ధిగ) లభించునట్టివికావు. మితత్వము వాటి అన్నిటికి లక్షణము. ఆహారపదార్థములు, బట్టలు, ఇండ్లు, ఇతరవాడకపు సామానులు, ఆరోగ్యసాధనములు, విలాససాధనములు—అన్నియు మితములుగ లభించునట్టివి. ఇవికాక అతడు గౌరవ మర్యాదలను, అధికార పదవులను వాంఛించుచుండును. కాని, ఇవికూడ మితముగ లభించునట్టివే. ఈ కారణము చేత అన్నిసమాజములలో వీటి పంపకము ఒక సమస్యగ పరిణమించినది. ఇవి కొందరికి ఎక్కువ దామాషాలో లభించుటయు, మరికొందరికి తక్కువ దామాషాలో లభించుటయు జరుగుచున్నది. కొందరు ధనికులుగను, కొందరు మధ్యవర్గమునకు చెందినవారుగను, కొందరు దరిద్రులుగను ఉన్నారు. ఇదేవిధముగ కొందరు మాత్రమే గౌరవ పద

వులను అనుభవించువారుగ నున్నారు. ఈ తరతమ భేదములు న్యాయమా ? వీటినన్నిటిని సమానముగ పంపకముచేయుట సాధ్యముకానిపని. వాంఛితముకూడ కాజాలదు. కాని ఈ తరతమభేదములు అనేకులకు అంగీకారయోగ్యములుగ లేవు. దారిద్ర్యము ననుభవించువారు, పదవులు లభించనివారు దీనిని ఆక్షేపించుట సహజము. వారికి సమాధానము చెప్పవలసియున్నది. తృప్తికరమగు సమాధానము చెప్పవలసియున్నది. తృప్తికరమగు సమాధానము చెప్పనిపక్షములో దౌర్జన్యము వృద్ధిగాంచి, శాంతిభద్రతలకు ప్రమాదము సంభవించి, సామాజిక జీవితము దుస్సాధ్యమగును. సమాజములోని విలువలు ఈ తరతమభేదములను సమర్థించుచున్నవి. ఎట్లు సమర్థించుచున్నవో తర్వాత సూచింపబడును.

రెండవవ్యవస్థ సమాజములోని వృత్తివిభాగము. (మనపూర్వులు దీనికి వర్ణవిభాగమని పేరుపెట్టిరి). వృత్తివిభాగముమూలమున ఆయావృత్తులలో పనిచేయువారి నైపుణ్యము పెరుగుటయు, ఉత్పత్తి అధికమగుటయు జరుగుచున్నది. సమాజములో అన్ని వృత్తులకు అవసరమున్నది. ఉపాధ్యాయవృత్తికి ఎంతఅవసరమో చాకలివృత్తికి, వీధులు తుడుచువాని వృత్తికి, చర్మకారునివృత్తికి అంత అవసరమున్నది. కాని, సమాజములో అన్నివృత్తులకు సమాన గౌరవము లేదు. కొన్నివృత్తులు ఉచ్చములుగను, కొన్ని నీచములుగను పరిగణింపబడుచున్నవి. నీచములుగ పరిగణింపబడునవి ఎక్కువకష్టముతో కూడుకొనియున్నను వాటికి గౌరవము లేదు. గౌరవకరము లని భావింపబడు వృత్తులలో పనిచేయువారికి ఎక్కువ ఆదాయముకూడ లభించుచున్నది. ఇది ధర్మమేనా ? వృత్తిమూలమున ఆయావృత్తులలో పనిచేయువారికి ఆదాయము లభించి జీవనము గడచుటయే గాక సమాజముయొక్క అవసరములుకూడ తీరుచున్నవి. తమ ఆదాయము స్వల్పముగ నున్నదని భావించి, వారు తమతమపనులను నిజాయితీతో నిర్వహించని పక్షమున సమాజ మెంతయో నష్టపడును. ఈ అసమానతలను తగువిధముగ సమర్థించగలిగినప్పుడే వారివారిపనులను చక్కగ నిర్వహించుటయు, సమాజము నష్టపడకుండుటయు జరుగును. విలువలు ఈ సమర్థనములో సాధనములుగ నున్నవి.

నియమానుసారము తమ జీవితములను సాగించుటకు వ్యక్తులు సిద్ధపడినపుడే సమాజమునకు స్థిరత్వము లభించుచున్నది. అందుచేతనే శాస్త్రవేత్తలనేకులు సమాజమునకు నీతియే ఆధారమని చెప్పుట. కాని, ప్రతిసమాజములో నియమములను ఉల్లంఘించువారు కొందరు ఉందురు. అట్టివారిని శిక్షించి సమాజపు నియమములను రక్షించుటకు ప్రభుత్వము అవసరమగుచున్నది. ప్రభుత్వము లేని సమాజము ఉండదు. అవసరమైనపుడు బలప్రయోగము చేసి తన అధికారములను నిలబెట్టుకొనగల సంస్థ ప్రభుత్వము. కాని, ఎవరు అధికారములో ఉండతగినవారు ? కొందరు మాత్రమే అధికారపదవుల సంపాదించుటయు, తక్కినవారికి అవి లభ్యము కాకపోవుటయు న్యాయమా ? దీనిని సమర్థించుటకుకూడ విలువలు ఉపయోగపడుచున్నవి.

ఆనాటి విలువలు ధనము, వృత్తి, అధికారములకు సంబంధించిన తరతమ భేదములను అసమానతలను, ప్రధానముగ ఎలాగు సమర్థించినవో తెలుసుకొనుట అవసరము.

ప్రపంచము, మానవులు, మానవ సమాజములు — వీటినన్నిటిని నిర్మించినవాడు భగవంతుడు. సమాజములోని తరతమ భేదములకుకూడ అతడే కర్త. వాటిని ఖండించుటయు విమర్శించుటయు భగవంతుని ఖండించుటయే అగును. కావున అవి సమర్థనీయములు కావు. ఇదిగాక మానవుడు కర్మఫలములను అనుభవించవలసినవాడు. ప్రతిమానవునికి జన్మ లనేకము లున్నవి. దారిద్ర్యము, నీచవృత్తులను అనుసరించవలసివచ్చుట- ఇవిఅన్నియు పూర్వజన్మదుష్కృతఫలితములు. ఈజన్మలో ఎవనివృత్తిని వాడు నిజాయితితో నిర్వహించిన పక్షమున మరుజన్మలో గౌరవప్రదములగు వృత్తుల ననుసరించ గలవాడై జన్మించును. కర్మసిద్ధాంతము, పునర్జన్మ సిద్ధాంతము — వీటిని ఆధారము చేసుకొని మనపూర్వులు సమాజములోని తరతమభేదములను సమర్థించి వాటిలో అన్యాయముగాని అధర్మముగాని లేనట్లు ప్రచారము గావించిరి. ప్రజలకు ఈ సిద్ధాంతములలో పూర్తివిశ్వాస మున్నందునను, వీటికి విరుద్ధములగు సిద్ధాంతములేవియు వారి అందుబడిలో లేనందునను వారు సమాజములో మొత్తముమీద శాంతియుతముగ జీవితమును సాగించ గలిగిరి. నాటివిలువలన్నిటికి భగవద్భక్తి, కర్మసిద్ధాంతము, జన్మాంతరసిద్ధాంతము మూలాధారములు.

ప్రస్తుతము భారతీయసమాజము యుగసంధిలో ఉన్నది. ఇట్టి కాలములో విలువలు మారుచుండును. కాని, అవి ఏవిధముగ మారుచున్నవో నిర్ణయించుట సులభసాధ్యము కాదు. అయినను రెండుమూడువిషయములు స్పష్టమగుచున్నవి.

జీవితపరమార్థము పారలౌకికసౌఖ్యము అనువిలువలో విశ్వాసము సన్నగిల్లినది. జీవితమునకు ఎట్టి పరమార్థము లేదనియు, ఏదియో ఇష్టము వచ్చినట్లు దానిని సాగించుటయే పరమార్థమని కొందరు, ఐహికసౌఖ్యము ననుభవించుటయే పరమార్థమని మరి కొందరు భావించుచు, తదనుసారము జీవితమును సాగించు పరిస్థితులు ఏర్పడుచున్నవి. ఇటీవలికాలమున ప్రకృతిశాస్త్రజ్ఞానము ఎన్నియోరెట్లు అభివృద్ధిగాంచినది. ప్రకృతి శక్తులనేకములు — విద్యుచ్ఛక్తి, మొదలగునని — మానవునికి వశమైనవి. దూరము, కాలము అనువాటిని అతడు జయించగలిగెను. అందుచేత అతనిలో ఆత్మవిశ్వాసము అధికమయ్యెను; మానవునికి అసాధ్య మెట్టిదియు లేదను భావము వ్యాపించెను. భగవంతుని అస్తిత్వమును శంకించుటయు, పుణ్యపాపములకు జన్మాంతరకర్మసిద్ధాంతములకు స్వస్తి చెప్పుటయు కొంతవరకు సంభవించినది. ఐహికసౌఖ్యమే వాస్తవమగు సౌఖ్యమను భావము ప్రబలుటచేతను, జన్మాంతరము లేదను భావము, భగవంతుడు లేడనుభావము ప్రాబల్యము గాంచుటచేతను జీవితము నియమరహితమగు ప్రమాద మేర్పడినది.

మితముగ లభించు ధనము, అధికారము — వీటిలో — తనకు గల భాగమును ఏవిధముగనైన వృద్ధిచేసుకొని తనసౌఖ్యమును పెంచుకొనుటయే అనేకులకు పరమార్థమగుచున్నది. ''జన్మ లనేకము లున్నవి; ఈజన్మలో కాకపోయినను మరియొకజన్మలో సుఖము ననుభవించుటకు అవకాశమున్నది. పాపఫలము అనుభవించక తప్పదు''- అను విశ్వాసము ధనకాంక్షకు ఒక హద్దును కల్పించుచు వచ్చెను. కాని, ప్రస్తుతము ఇట్టిహద్దు

నకు బలము లేకున్నది. తోటిమానవుని కష్టసుఖములను, సామాజికసౌఖ్యమును గమనించక ప్రతివ్యక్తియు ఏదియో ఒకవిధమున ఎక్కువ ధనమునో, ఎక్కువ అధికారమునో సంపాదించుటయందు నిమగ్నుడగుచున్నాడు. ఇదియే నియమరహిత జీవితము. దౌర్జన్యము, హింస, దీని బాహ్యస్వరూపము.

కాని, నియమము లేక ఎట్టిసమాజము నిలబడజాలదు. నియమరహిత జీవితము వృద్ధి కానుకాను నియంతృత్వ ప్రభుత్వాధికారమును వాంఛించు ప్రజలసంఖ్య పెరుగుట తప్పదు. నియమములను విధించి అమలుజరుపు ప్రభుత్వమునకు ఎక్కువ అవసరమేర్పడుచున్నది. నాస్తికత్వము ప్రాబల్యము గాంచిన కమ్యూనిష్టుదేశము లన్నిటిలో నియంతృత్వపరిపాలనవిధానము నాటుకొన్నది. కావున విలువలలో ఇట్టి విధానమునకు ప్రాబల్యము కలుగును. అనాదిగా భగవంతుని దాసుడుగా నున్న మానవుడు నియంతలకు దాసుడు కావలసిన వాడగుచున్నాడు.

అనాదిగ ప్రతిసమాజములో తరతమభేదములు నాటుకొనియుండినవి. కాని ఈ నాడు అట్టిభేదములను సమర్థించువారి సంఖ్య తగ్గినది. విలువలలో మానవసమత్వము ప్రాధాన్యము వహించుచున్నది. వర్ణ భేదములు, కులభేదములు, స్త్రీపురుషులమధ్య భేదములు, ధనవంతులు ధనహీనులమధ్య తదితర ఆర్థిక సాంఘిక భేదములు ఉండరాదను సిద్ధాంతము ప్రాబల్యము గావించినది. మానవులందరు ఎందులో సమానులు? ఏయే రంగములలో ఎంతెంతవరకు సమత్వసిద్ధాంతము ఆచరణయోగ్యము? అను ప్రశ్నలు అనేకములు బయలు దేరినవి. వీటికి తగిన సమాధానములు ఇంకను లభించలేదు. ఎట్టి సమాధానములు లభించునో వాటినిబట్టి ఈనాటి విలువలు ఏవిధముగ మారునో చెప్పవలసి వచ్చును.

మన పూర్వులు 'విలువలు' అనుమాటను వాడినవారు కారు. ఈ మాటను మనము పాశ్చాత్యప్రపంచమునుండి ఎరువు తెచ్చుకొన్నాము. ఇదే అర్థమును సూచించుటకు మనవారు 'ధర్మము' అనుమాటను వాడిరి. అన్నియుగములో ధర్మ మొకరూపమున ఉండదనియు, ఒక్కయుగమునకు ఒకవిధమగు ధర్మము లక్షణము కాగలదనియు వారు విశ్వసించిరి. వారి భావములో మనము ఈనాడు కలియుగధర్మమును పాటించుచున్నాము. కలియుగ ధర్మము లెట్టివో వారు పురాణములలో చెప్పియున్నారు. నాటి విలువలకు నేటి విలువలకు మధ్య నుండు భేదమును తెలియకోరినవారికి పురాణములలో యుగధర్మముల వివరణము కొంతవరకు తోడ్పడగలదు. ఆధునిక తత్వదృష్ట్యా, ఐహికసౌఖ్యమే జీవిత పరమార్థ మగుట, సామాజికనియమములను ప్రభుత్వాధికారమును వహించినవారు విధించుట, మానవులందరు సమానులు అని భావించుట — ఇవి ఈనాటివిలువలలో ప్రధానములని చెప్పవచ్చును.

# మారుతున్న విలువలు - రచయిత బాధ్యత

శ్రీ సంజీవదేవ్

ఉదయం మధ్యాహ్నం కావటం మార్పు; మధ్యాహ్నం సాయాహ్నం కావటం మార్పు; సాయాహ్నం రాత్రి కావటం, రాత్రి తిరిగి ఉదయం కావటం మార్పు; మారని క్షణం అంటూ ఉండదు. విశ్వసృష్టి అంటేనే మార్పు. ఈమార్పు మానవుడు సృష్టించేదానిలో కూడ ప్రతిబింబించకుండా వుండడం అసంభవం. మానవుడు సృష్టించే సాహిత్యం, సంగీతం, శిల్పం, చిత్రం, నర్తనం, నటన, ఇవన్నీ పుట్టినప్పటినుండీ ఎన్నో మార్పులను చెందినయి, చెందుతున్నాయి, చెందుతుంటయి.

మానవజీవితమే అనంతరూపాల్లో మారుతూ వచ్చింది. ఒకమార్పుకు, మరొక మార్పుకూ విలువల్లో ఎంతో ప్రభేదం. ప్లీస్టసీన్ యుగారంభపు మానవజీవితపు విలువలకూ తరువాతి ప్రాచీన శిలాయుగ, మధ్యశిలాయుగ, నవ్యశిలాయుగ మానవజీవితపు విలువలకూ సామ్యమే లేదు. నవ్యశిలాయుగ మానవజీవితపు విలువలకూ, తామ్రయుగ, కాంస్యయుగ, లోహయుగపువాటికి భూమ్యాకాశాలంత తారతమ్యం.

ఈనాడు మనం నివసిస్తున్నది లోహయుగం దాటిన పరమాణుయుగంలో. ఈనాటి జీవితపు విలువలు పూర్తిగా భిన్నమైనవి. జీవితపు విలువల ననుసరించే సృజనాత్మక కళల విలువలుకూడా భిన్నంగానే వుంటయి. అందుకే మారుతున్న విలువలు రచయిత మీద నూతన ప్రభావాలను ప్రసరిస్తయి. ఈ ప్రభావాలను గుర్తించక తన కల్పనా ప్రపంచములోనే మునిగి, తామరపూలను తిని ఆకలి తీర్చుకొంటూ, దంతపుశిఖరాల్లోనే నివసించే రచయిత సజీవరచయితగా వుండజాలడు. అందుకని మారుతున్న ప్రతి విలువా గొప్పదే అని భ్రమించి, నవ్యమైనదంతా సవ్యమే అని అపార్థంచేసుకొని, మారుతున్న ప్రతినీడనూ అమాయికంగా అనుసరించి ఎండమావులను వేటాడే రచయితకూడా సక్రమరచయిత కాడు.

మారుతున్నది మాత్రమే మంచిదని విశ్వసించటం, మారనిది మాత్రమే మంచిదని విశ్వసించటం ఎంత బేసబబో అంతబేసబబు. మారనిదానిలో మంచీ చెడూ రెండూ వున్నట్లే మారుతున్నదానిలో కూడ మంచీ చెడూ రెండూ వుంటయి. నిజానికి మారనిదంటూ ఏమీ వుండదు, అంతా మారేదే. మారనిది అన్నప్పుడు నేటిదికాక నాటిది అని అర్థం. అంటే మారేది అర్వాచీనమనీ, మారనిది ప్రాచీనమనీ. నిజానికి ఇది సరైన నిర్వచనం కాదు.

ఈ మారుతున్న విలువల మూలం ప్రత్యేకంగా క్రీ. శ. 1789 లో జరిగిన ఫ్రెంచివిప్లవంలోకి చొచ్చిఉంది. పద్దెనిమిదో శతాబ్దంలో జరిగిన ఈ ఫ్రెంచి విప్లవం

పాశ్చాత్య ఖండాల్లో ప్రథమంగానూ, ప్రాచ్యఖండాల్లో తరువాతా, మానవజీవితపు ప్రతి రంగంలోనూ, విజ్ఞానంలో, ప్రజ్ఞానంలో, సాహిత్యం, సంగీతం, ఇంకా మిగతా లలిత కళల్లో చెప్పరానంతమార్పును తెచ్చి సరికొత్త విలువలను సృష్టించింది. ఈ మార్పుల్లో ప్రధానంగా గోచరించేది స్వేచ్ఛ. నైతికవిషయాల్లో రాజనీతికవిషయాల్లో, ఆర్థికవిషయాల్లో, పారమార్థికవిషయాల్లో, సాంఘికవిషయాల్లో, సాంస్కృతికవిషయాల్లో, మానవతా విషయాల్లో, మనోవైజ్ఞానికవిషయాల్లో, ఒకటేమిటి, జీవితానికి సంబంధించిన సర్వ విషయాల్లో ప్రవేశించింది ఈ స్వేచ్ఛాప్రవృత్తి. జీవితంలోని ధ్యేయం, శ్రేయం, ప్రేయం అన్నీకూడ స్వేచ్ఛపైనే ఆధారపడినవని, స్వేచ్ఛను ప్రతిబింబించని జీవితం మృత్యువనీ, స్వేచ్ఛను ప్రతిధ్వనించని రచన రచనే కాదనీ.

స్వేచ్ఛ దేనినుండి ? నియతినుండి స్వేచ్ఛ. నియమాలనుండి స్వేచ్ఛ. సంప్రదాయంనుండి స్వేచ్ఛ, రీతిరివాజులనుండి స్వేచ్ఛ, నిబద్ధతనుండి, క్రమబద్ధతనుండి పరపీడననుండి, పాతవిధానాలనుండి స్వేచ్ఛ. బంధన అనేది ఏదైనాసరే, అది బహిరంగమైంది కావచ్చు, అంతరంగమైంది కావచ్చు, అటువంటి బంధనమీద తిరుగుబాటు. ఇటువంటి నూతన చైతన్య స్రవంతిని ప్రవహింపచేసింది ఆనాటి ఫ్రెంచివిప్లవం. క్రమేణ సాహిత్యంలోని ఛందోబద్ధకవిత సగంఛందోబద్ధ కవితగా (Blank verse), సగం ఛందోబద్ధకవిత ముక్తచ్ఛందకవితగా (Free verse or verse libre) ప్రాధాన్యం వహిస్తూ వచ్చింది. ఇదేవిధంగా చిత్ర, శిల్ప, సంగీత, నాట్యకళల్లో ఈ నూతన స్వేచ్ఛా ఉద్యమం రూపొందుతూ, నిబద్ధసృష్టిలోని ప్రాధాన్యాన్ని పోగొట్టి అనిబద్ధసృష్టికి ప్రాధాన్యానిస్తూ వచ్చింది.

నేడు వ్యాప్తిలో వున్న ఆధునికకవిత, ఆధునిక కథానిక, ఆధునిక నాటిక, ఆధునికచిత్ర, శిల్ప, సంగీత, నాట్యకళలు మొదలైనవాటన్నిటిలో ఈ స్వేచ్ఛ, యీ అనిబద్ధత సర్వత్రా ప్రత్యక్షం. నూతనమైన విషయవస్తువుల ఎన్నిక, నూతనరచనావిధానాల సృష్టి ఈనాటిరచనల్లోని ప్రముఖవిశిష్టత.

మారుతున్న విలువల్లో రచయితబాధ్యత ఏమిటి అనేది అంతవిశిష్టమైన సమస్య ఏమీ కాదు. తన ఇష్టమైన విలువల ననుసరించి తానూ మారుతుంటాడు. తన రచనలనూ మారుస్తుంటాడు. ఈ సత్యం ఈకాలానికి మాత్రమే సంబంధించిందికాదు; అన్ని కాలాల్లోనూ ఈ ధోరణి అమల్లో వుంది. వాల్మీకి మొదలు ఇటీవలనే మరణించిన టి. యస్. ఇలియట్ వరకూ తమకాలాల్లో మారుతున్న విలువలను గమనించినవారే. అయితే కవి దూరదర్శి. తాను జీవిస్తూన్న సమకాలీన వాతావరణాన్నేకాక రానున్న వాతావరణాన్నికూడా చిత్రిస్తాడు. కవి తా నుంటున్న వర్తమానకాలానికే గాక రానున్న భవిష్యత్తుకు కూడా ప్రతినిధి; అంటే మారుతున్న విలువలకేకాక మారనున్న విలువలకు కూడా రూపం ఇస్తాడు. ఇటువంటి వ్యక్తినే 'He is in advance of his times' అంటారు.

అసలు లోతుగా ఆలోచించిచూస్తే ఈనాడు, పరమాణుయుగం అనుకునే ఈనాడు విలువలు అనేవి ఎంతవరకు మారుతున్నవా అని సందేహం వేస్తుంది. నేటి వైజ్ఞానిక యుగంలో, హేతువాదయుగంలో మనం జీవించాల్సిన స్థితిలో జీవిస్తున్నట్టు కనిపించదు. కులతత్వాలూ, మూఢనమ్మకాలూ లేకుండా జీవించటం ఈనాటి యుగధర్మం. కాని, ఈ రెండూ కూడా వెర్రితలలు వేస్తున్నయి. నవీనుల్లోకూడ కులతత్వాలు విపరీతంగా పెరిగిపోయినయి. నవీనుల్లోకూడ తిరుపతి వెళ్లి తలలు గొరిగించుక వచ్చే భక్తి ఇదివరలో కంటే చాలా ఎక్కువవుతున్నది రోజురోజుకి. మంత్రులు, సినిమాతారలు, విద్యార్థులు (యీ విషయంలో విద్యార్థినులు చాలనయం!) తిరుపతి భక్తిలో పోటీలు పడుతున్నారు; రచయితలుకూడ వెనుకబడిలేరు ఈ విషయంలో! జీవితంలో తాత్త్వికదృక్పథం వుండ కూడదని కాదు, ఆధ్యాత్మికచింతన అవసరంలేదనీ కాదు. కాని, తిరుపతిభక్తి తాత్త్వికదృక్పథమూ కాదు, ఆధ్యాత్మికచింతనా కాదు. అదొక మూఢనమ్మకం. ఇటువంటి చౌకబారు మానసికవిధానం వృద్ధిపొందుతున్న రోజుల్లో విలువలు మంచివైపుకు ఎంత వరకు మారుతున్నవో మరి!

పాఠకుల మనస్తత్వాన్నిబట్టి రచయిత బాధ్యతవుంటుందా? అంటే పాఠకులు రచయితను మారుస్తారా లేక రచయితయే పాఠకులను మారుస్తాడా? లేక ఉభయులూ ఒకర్ని మరొకరు మారుస్తారా? లేక, ఎవర్ని ఎవరూ మార్చరా? ఇవన్నీకూడా జరగటానికి అవకాశం వుంది.

రచయిత ప్రధానంగా రసస్రష్టమాత్రమేకాని ఉపదేశకుడూ, సంఘసంస్కర్తా కాడు. ఆయన రచనల్లో ఎక్కడైనా అప్పుడప్పుడు ఉపదేశాలు, సంఘసంస్కరణ భావాలు పరోక్షంగా కనుపించుతుండవచ్చు. అంతేకాని లోకం మరమ్మతు చేయాలని రచయిత కంకణం కట్టుకొని రచనచేయ ప్రారంభిస్తే ఆ రచనలోని రసపుష్టి నశించి అదొక ప్రచారసాహిత్యంగా తయారవుతుంది. కనుక ఇటువంటి విశ్వశ్రేయస్సు బాధ్యత వహించాల్సింది సంఘసంస్కర్తలూ, ప్రజాసేవకులేకాని రచయితలు కాదు. సంఘసంస్కర్తలమీద రసవంతమైన సాహిత్యాన్ని సృష్టించాల్సిన బాధ్యత లేనట్లే రచయితలమీద కూడ సంఘాన్ని సంస్కరించాల్సిన బాధ్యత లేదు.

మనిషిలోని శక్తిసామర్థ్యాలను పెంపొందించడానికి జరిగే మార్పుల విలువలు చాలగొప్పవి. మారుతున్న విలువల్లో శాశ్వతత్వంపై వ్యతిరేకత గమనార్హం; ఏపని చేసినా, ఏది రచించినా అది నాలుగుకాలాలపాటు వుండాలి అనే ఆకాంక్ష కొంతకాలం క్రిందటివరకూ ఉంటుండేది. నేడు దానివిలువ మారిపోయింది. శాశ్వతంగా నిలువగలిగిన రచనమాత్రమే గొప్పదికాదు. అది ఎంతతక్కువకాలం నిలచినప్పటికీ ఆ రచన గొప్పది కాకుండాపోదు. రచనలో గొప్పతనం వుంటే అది ఎక్కువకాలం నిలుస్తుందని, తక్కువతనం వుంటే అది కొద్దికాలం నిలుస్తుందనీ తలంచడం ఒక భ్రమమాత్రమే అని. ఒక రచనలోని గొప్పతనాన్నీ కొద్దితనాన్నీ కొలవడానికి ఎక్కువకాలం తక్కువకాలం అనేవి కొలబద్ధలు కావని, శాశ్వతత్వంలో ఎంతవిలువ వున్నదో క్షణభంగురతలోకూడ

అంతవిలువ ఉన్నదని. ఇంద్రధనుస్సు చాలా సుందరమైనది. అయితే, అది క్షణభంగుర మైంది. అది క్షణభంగురమైందికదా అని దానివిలువ తగ్గిందా? ప్రతిభావంతుడు ఎంత కొద్దికాలం బ్రతికినా గొప్పవాడే. పనికిమాలినవ్యక్తి నూరేళ్లు జీవిస్తేమాత్రం ఏమి? అతడు అల్పుడే. ఇటువంటి క్రొత్తవిలువలకు రచయిత తన రచనల్లో రూపకల్పన చేయాలి.

లైంగికవిషయాల్లోకూడ విలువలు మారిపోయినయి. కొత్తవిలువలు ప్రవేశించినయి. లైంగికసంబధాలలో నియతిరాహిత్యం, స్వేచ్ఛ, వరస కానిప్రేమ(incest) మొదలైనవన్నీ ఫ్రాయిడ్ స్థాపించిన మనోవిశ్లేషణ ద్వారా ప్రజల్లో ప్రవేశించినయి. సాంప్రదాయిక నైతికపు విలువలు పెట్టి కొలిస్తే ఇవి మంచివి కాకపోవచ్చుకాని మారుతున్న విలువలకొలతకు ఇవి చెడ్డవి కావు. ఈ విషయాలు చాలా సూక్ష్మమైనవి. వీటిని సంపూర్ణంగా స్వీకరించినా లేక సంపూర్ణంగా నిరాకరించినా ప్రమాదంవుంది. వీటిని అసంపూర్ణంగా స్వీకరించడంలోనూ అసంపూర్ణ గా నిరాకరించడంలోనూ ప్రమాదం వుండదు. ఇటువంటి విలువలకు రచయిత విలువ ఇవ్వకపోతే తాను అసత్యంలో సంచరిస్తునట్లే అవుతుంది; జీవితపువాస్తవానికి దూరమవుతాడు. అందుకని ఈవిలువలనే సర్వస్వం అని నమ్మి వీటిని గురించి తనరచనల్లో అద్భుతాలను చిత్రించ ప్రారంభిస్తే ఈ విలువలు వెర్రితలలువేసి వెగటు జనింపచేస్తవి పాఠకబృందంలో. అందుకే మారుతున్న విలువలను ఉపయోగించుకోవటంలో రచయితబాధ్యత చాలాసున్నితమైంది; మారుతున్న విలువలను ప్రదర్శించేనిమిత్తం రచన చేస్తే ఆరచన నీరసరచనమాత్రమే అవుతుంది. తాను రచనచేస్తుంటే మారుతున్న విలువలు అందులో ప్రవేశించాలి.

రచయిత బాధ్యత అద్దమూ, దీపమూ రెండు రూపాల్లోనూ రూపొందాలి. అద్దం తనఎదుట వున్నవాటన్నిటినీ వున్నవి వున్నట్లుగా ప్రతిబింబిస్తుంది. దీపం కనపడని వాటిని కనువింపచేస్తుంది. అద్దం వాస్తవవాదానికి చెందితే, దీపం ఆదర్శవాదానికి చెందుతుంది. రచయిత అద్దాన్ని మాత్రమే ఆదర్శంగా తీసుకొంటే తనచుట్టూ వున్న సమాజాన్ని, ఆసమాజంలో జరిగే సంఘటనలనుమాత్రమే చిత్రించి కేమెరాయంత్రంగా వుండిపోతాడు. రచయిత సమకాలీన జీవితాన్ని చిత్రించితే మాత్రమే సరిపోదు. జీవితం "ఎట్లా వున్నది" అని చిత్రించినట్లే "జీవితం ఎట్లా ఉండాలి" అనేదాన్నికూడ చిత్రించాలి. దీపాన్ని వదిలి కేవలం అద్దంమీదే ఆధారపడితే రచన కేవలం అనుకరణమాత్రమే అవుతుంది. అద్దాన్ని వదలి కేవలం దీపంమీదనే ఆధారపడితే రచన వాస్తవానికి దూరమై కేవలం ఊహాగానంగానే వుండిపోతుంది. ప్రతిభ గల రచనలో వాస్తవరూపమూ ఊహాగానమూ రెండూ వుండాలి సమభాగాల్లో కాకపోయినాకూడ. భౌతికజగత్తులో నివసిస్తున్నాం కనుక వాస్తవికత అవసరం. మానసజగత్తులోకూడ జీవిస్తాం కనుక కల్పన అవసరం. కొందరిరచనల్లో మొదటిది ఎక్కువగా వుండి రెండవది తక్కువ వుండవచ్చు. మరికొందరిరచనల్లో రెండూ సమభాగాల్లో వుండవచ్చు. ఇంకొందరి రచనల్లో మొదటిది తక్కువగా ఉండి రెండవది ఎక్కువగా వుండవచ్చు.

మారుతున్న విలువలు రచయితను మార్చటంతో మాత్రమే సరిపోదు. రచయిత కూడ విలువలను మార్చాలి. కనువించేవాటిని అద్దంవలె ప్రతిబింబింప చేయడం మాత్రమే గాక కనువించనివాటిని దీపంవలె కనువించేటట్లుచేయడం రచయిత బాధ్యత.

ప్రజాస్వామ్యదృక్పథం మారుతున్న విలువల్లో ప్రాధాన్యం వహించివుంది. అన్నీ అందరికీ అందుబాటులో వుండాలి. ప్రతివారి జీవనవికాసానికీ సమాన అవకాశాలు లభించాలి. సాంస్కృతిక విషయాలు అందరికీ అర్థమయేట్లు వుండాలి. ప్రతివానికీ సులభ గ్రాహ్యంగా వుండేటట్లు సాహితీరచన జరగాలి. ఇటువంటి ప్రజాస్వామ్యదృక్పథాన్ని ఎంతవరకు అనుసరించాలి అని నిర్ణయించే బాధ్యత రచయితమీద ఉంది. అందరకూ అర్థమయే విధంగా రచన చేయాలి అనేది ఎంతవరకు సమంజసమా అని ? ఎంత సులభ శైలిలో రచించినాకూడ ఆ రచనను సులభంగా అర్థంచేసుకోలేని పాఠకులు ఇంకా ఉండిపోతూనే వుంటారు. పాఠకులంతా ఒకేమానసికస్థాయికి చెందినవారు కారు. ఒకరి దృష్టిలో కఠినం అనుకున్నరచన మరొకరిదృష్టిలో సరళంగా వుంటుంది. ఏవిషయాన్నయినా తెలియజేసే భోగట్టాకు చెందిన రచనను కొంతవరకు అందరికీ అర్థమయే విధంగా వ్రాయవచ్చుకాని సృజనాత్మక సాహిత్యరచనను మాత్రం అందరికీ అర్థమయే విధంగా రచించడం అసాధ్యం. పోని, భాషను సరళపరచిననప్పటికి భావాలను సరళపరచడం సులభంగాదు. భావౌన్నత్యం లేని సాహిత్యరచన వార్తాపత్రికల్లోని వార్తమాత్రమే అవుతుంది.

మారుతున్న విలువలను రచయిత నిర్లక్ష్యంతో చూడకూడదు. కాని, మారుతున్న విలువలన్నిటినీ తు. చ. తప్పకుండా అనుసరించాల్సిన బాధ్యత కూడా రచయితకు అవసరంలేదు. ఏ విలువలను ఎంతవరకు స్వీకరించాలో, ఏ విలువలను ఎంతరకు నిరాకరించాలో అనేస్వేచ్ఛ రచయిత కున్నది. ఆ స్వేచ్ఛ ననుసరించే సంచరిస్తాడు రచయిత. అతని రచనలు సమాజానికి అద్దంగానూ వుంటయి, దీపంగానూ వుంటయి. మారుతున్న విలువల ప్రతిబింబాలూ వుంటయి; మారాల్సిన విలువల కాంతిరేఖలూ వుంటయి అందులో.

*

చితిమంటల యుద్ధానికి
ప్రతి కవి ఒక ఫైర్ బ్రిగేడ్.
అణ్వస్త్రపు టర్కరుచికి
ప్రతి పద్యం మబ్బు ముక్క.

— దాశరథి
( "పునర్నవం" నుండి)

# రచయిత : సాంఘిక బాధ్యత

శ్రీ ఆర్. యస్. సుదర్శనం

రచయిత అంటే ఎవ్వరు ? పత్రికలకి దైనందినపరిణామాలను గురించి వ్యాసాలు వ్రాసే వాళ్లున్నారు. రాజకీయ, సాంఘిక, ఆధ్యాత్మిక విషయాల్లో నిర్దిష్టాభిప్రాయాలూ, దృక్పథాలు ఉన్నవాటిని ఎంచుకుని ఆయా పరిధుల్లో రచనసాగించేవాళ్లున్నారు. వాళ్లు వ్యాసాలే కాదు, కవిత్వం, కథ, నాటకం, నవల వంటి సృజనాత్మకసాహిత్యంకూడా రచిస్తున్నారు. వీళ్ళందరూ రచయితలే అయినప్పుడు, వీళ్ళసాంఘిక బాధ్యతను గూర్చి ప్రత్యేకంగా చర్చించవలసిన అవసరంలేదు. ఎందుకంటే వీళ్లు అందరూ ఏదోవిధంగా సంఘ పురోభివృద్ధిని కాంక్షిస్తూ, వాళ్ళకు తోచినవిధంగా నిర్దిష్టంగా ఆ బాధ్యతను నిర్వర్తిస్తూ ఉన్నవాళ్లే కాబట్టి ! ఉదా॥ కమ్యూనిస్టు లేదా సోషలిస్టు దృక్పథాన్ని ఆలంబనం చేసుకున్న వాళ్ళకి సాంఘిక బాధ్యతలనుగూర్చి క్రొత్తగా చెప్పేదేముంటుంది ? అలాగే ఒకానొక మతాన్ని పునరుద్ధరిస్తేగాని సంఘం బాగుపడదు అనే విశ్వాసమే ఏది వ్రాసినా వ్యక్తంచేసే రచయితకి, ఆయనకి ఉండవలసిన సాంఘిక బాధ్యతనుగూర్చి ఎవరూ చెప్పనక్కరలేదు ! అందువల్ల రచయితలయొక్క సాంఘికబాధ్యతను చర్చించడమంటే ఎవరికి వారు మళ్ళీ తమ తమ ప్రత్యేక దృక్పథాన్నీ, విశ్వాసాన్నీ ఏకరువు పెట్టడమే అవుతుంది. అలా కాకుండా దృక్పథవైవిధ్యం గల రచయితలందరికీ, వాళ్లు రచనచేస్తూ ఉండడంకారణంగా, అన్వయించే ముఖ్య విషయాలు అంటే రచయితకూ సమాజానికీ గల మౌలికమైన సంబంధంతాలూకు విషయాలు, ఉన్నవేమో పరిశీలించి చూడాలి.

వృత్తిగా రచన చేపట్టిన పత్రికా రచయితలవంటి వారికి ఒక దృక్పథం అంటూ పత్రికాధిపతులూ లేక సంపాదకులూ నిర్దేశం చెయ్యడంవల్ల, అటువంటి రచయితల ప్రసక్తి యిక్కడరాదు. అలాగే రచనలో ఆసక్తికంటే, రాజకీయ ప్రయోజనం ప్రధానంగా వ్రాసేవాళ్ళని గూర్చి పట్టించుకోనవసరంలేదు. పోతే కేవలం రచనలో ఆసక్తికారణంగా కథ లేక కవిత్వం లేక నవల వ్రాసి, సమాజంతో రచనద్వారా ఒక సంబంధం ఏర్పరచుకున్న వర్ధమాన రచయితకు, సృజనాత్మక రచయితకు, "నా బాధ్యత ఏమిటి" అనే ప్రశ్న ఒకానొక సందర్భంలో ఎదురవుతుంది. అతడు వ్రాసిన మొదటి నవల పాఠకుల్ని ఆకర్షించింది. ఇంకా వ్రాయాలని ఉత్సాహం, ఆసక్తి ఉన్నాయి. ఏమి వ్రాయాలి ? ఎలా వ్రాయాలి ? అని ప్రశ్న. అంటే ఏది వ్రాస్తే పాఠకులకు నచ్చి మరిన్ని కాపీలు అమ్ముడుపోయి డబ్బూ, పేరూ వస్తుందో అదే వ్రాయడమా ? అలా చేయడం కూడా ఏమంత సులువుకాదనుకోండి. పోనీ అలా చెయ్యడం సులువైతే అటుతర్వాత

అలాచెయ్యకుండా ఉండడం అవసరమా? ఎందుకు? ఒకవైపు ధనమూ, కీర్తి ఆకర్షిస్తున్నవి: కానీ ఆ ఆకర్షణే ప్రధానం కానివిధంగా ఆలోచించి తన ధ్యేయాన్ని ఏర్పరచుకోవడం రచయితకు ముఖ్యమా? అది అతని సాంఘిక బాధ్యతా? ఈ విషయం ఆలోచింపదగ్గది. డబ్బుకోసం, పేరుకోసం, పదిమందికీ నచ్చేవిధంగా వ్రాసే వెరవు తెలిసిన తర్వాత, అలా చెయ్యడం, చేస్తూవుండడం సాంఘిక బాధ్యత కాకపోతుందా? రచయిత పదిమందికీ సరదా కలిగిస్తూ ఉండడం సాంఘికంగా తన కర్తవ్యం నిర్వర్తిస్తున్నట్లు కాదా? అని యిక్కడ ప్రశ్న.

రచన మొదలుపెట్టకపూర్వం రచయితకు సమాజంతో గల సంబంధం సామాజికుడిగా తప్ప విశేషమైనది కాదు. రచనద్వారా, ఆ రచన సమాజంలో కొంత ఆసక్తిని (అంటే ఆమోదమయినా కావచ్చు, చర్చ, వివాదము, ఖండనము అయినా కావచ్చును) రేకెత్తించడంద్వారా రచయితకు సమాజంతో ఒక విశేషమైన సంబంధం ఏర్పడుతుంది. సమాజాన్ని ఒక వ్యవస్థగా, ఒక సంప్రదాయంగా, ఒక పరిణామంగా చూచినప్పుడు దాన్నిగూర్చిన సమర్థనమో, విమర్శనమో, వ్యాఖ్యానమో, రచనలో సూటిగా కాని, వ్యంగ్యంగా కాని ఉండకతప్పదు. సంఘం స్వభావసిద్ధంగా మారుతూ ఉంటుంది. ఈ మార్పులో ఏది వాంఛనీయం? ఏది కాదు? అనే నిర్ణయం ఎవరు చేయాలి? ప్రభుత్వం, రాజకీయపక్షాలు, మేధావివర్గాలు ఈ నిర్ణయాన్ని ఏదోవిధంగా చేస్తూనే ఉంటాయి. తద్వారా సంఘంలో సమకాలీన భావసంచలనం ఒకటి ఏర్పడే ఉంటున్నది. రచయిత ఈ భావాలకు, అంటే సర్వత్ర ఒక నినాదంగా అంగీకరింపబడుతున్న భావాలకు, కేవలం మద్దతు నిచ్చేవిధంగా రచన చేయాలా? లేక ఆ భావాలను రచనలో పరీక్షకు పెట్టి వాటిలో గట్టి, పొల్లు తేల్చి చూపాలా? ఏది అతని బాధ్యత? ఇది తెలుసుకోవలసిన ప్రశ్న. మొదటిదానికంటె రెండవమార్గం కష్టతరమైంది. నేటి సమాజపరిస్థితుల దృష్ట్యా యువత చర్చించదగిన అంశం యిది.

ఒక సిద్ధాంతం ఉంటే అది సూత్రప్రాయంగా చాలామందికి సామూహికంగా వర్తించేవిధంగా ఉంటుంది. అన్వయంలో, ఆచరణలో వ్యక్తులమీద ఆ సిద్ధాంతం ఎలా పనిచేస్తుందో సామాన్యంగా ఊహకు అందేవిషయం కాదు. సమాజాన్ని సంస్కరించి, మార్చి, ఒకానొక మార్గంలో దాని పరిణామాన్ని నిర్దేశింపబూనుకున్నవాళ్ళు— వీరేశలింగం కావచ్చు, కార్ల్ మార్క్స్ కావచ్చు— సమూహంమీద కొన్ని లక్షణాల్నీ, ధోరణుల్నీ ఉద్దేశించి సిద్ధాంతీకరిస్తారేకాని, వ్యక్తికీ. వ్యక్తికీ గల సూక్ష్మ భేదాల్ని అందులోకి తీసుకుని పరిణామాల్ని ఊహించరు; అలా ఊహించడం సాధ్యంకాదు. ఇక్కడే రచయిత, ముఖ్యంగా సృజనాత్మకరచయితయొక్క బాధ్యత, నిర్దిష్టమైఉన్నట్లు నాకు తోస్తుంది. సాంఘిక పరిణామ దృక్పథానికి మద్దతు నిచ్చినా, దాన్ని సర్దుబాటుచేసినా, విమర్శించినా, సృజనాత్మక రచయిత తనవైయక్తిక దృక్పథంనుంచే ఆపని చేయాలి. అలా కాక రచయితకూడా సామూహికమైన, సిద్ధాంతప్రాయమైన సూచనలు చేస్తూ వ్రాస్తే ఆ రచన సిద్ధాంత ప్రచారసాధనమై, సాహిత్యప్రతిపత్తికి నోచుకోనిదిగా ఉంటుంది.

ఇది నా అభిప్రాయం. (ఈ దృష్టితోచూస్తే మార్క్స్ గ్రంథం "కేపిటల్" సాహిత్య గ్రంథం కాక శాస్త్రీయ గ్రంథం అవుతుంది).

మానవుడు సంఘజీవే అయినా వ్యక్తిగా ఒంటరివాడు. అతని ఊహలూ, ఉద్వేగలూ, వ్యాపకాలూ, వ్యవహారాలూ అన్నింటిలోనూ సంఘంతో ఏదో ఒక సంబంధాన్ని మనం చూడవచ్చు. సంఘంనుంచి సంక్రమించని భాగంఅంటూ ఏదీ కనిపించదు. విశ్లేషణకూ పరీక్షకూ యిలా తోచినా వాటి అన్నింటివెనుకా మనిషిని వ్యక్తిగా నడుపుతున్న జీవశక్తి, చైతన్యశక్తి మాత్రం నిర్దేశించడానికి వీల్లేని విశిష్టమైన వస్తువు. అది కారణం గానే ఇవాళ ఆమోదించినదాన్ని రేపు కాదనటం, ప్రాతను కాదని క్రొత్తవైపు వ్యక్తి ఉన్ముఖుడు కావటం జరుగుతున్నది. ఆచైతన్యశక్తి కొందరిలో జిగీషగా కార్యరూపేణా వ్యక్తం అవుతూ ఉంటుంది; రచయితలో ప్రతిభావంతమైన రచన రూపేణావ్యక్తం అవుతూ ఉంటుంది. పచ్చికబయలులో యథేచ్ఛగా పచ్చిక మేస్తున్న ఆబోతుకీ, గాట కట్టివేయబడి యజమాని పెట్టిన ఎండుగడ్డిని ఆకలితీర్చుకోవటానికి అలవాటుగా మేసే ఎద్దుకీ ఎంతో భేదం ఉన్నది. ఒక రకంగా చూస్తే ఆబోతుకంటె ఎద్దు ప్రవృత్తి మానవసంఘానికి ఎక్కువ ఉపయోగకరంగా కనిపిస్తుంది: కాని ఆబోతుకి ఉన్న చైతన్యంతాలూకు విశిష్ట లక్షణం ఎద్దులో కనిపించదు: ఇక్కడ రచయిత రచనావ్యాసంగం విషయంలోనూ యించుమించు అదే ప్రశ్న ఎదురవుతుంది. అతడు ఆబోతులా ఉండాలా? ఎద్దులా ఉండాలా? ఆబోతులా ఉంటూ ఎద్దులా పనిచేస్తే ఎంత బాగుంటుంది, అని మన ఆశ: కాని అది సాధ్యమో కాదో స్వయంగా రచయితకానివాడు చెప్పలేడు: రచయిత కాబోయే ప్రతియువకుడూ, యువతీ, రచయిత కావడంతోటే ఎదుర్కోవలసిన ప్రశ్నే యిది: దానికి రచయితే వ్యక్తిగతంగా సమాధానం చెప్పుకోవాలి. దీన్నిగురించి ఆత్మవిమర్శ చేసుకుంటూ, రచయితలు పరస్పరం అనుభవాలు అభిప్రాయాలూ వ్యక్తం చేసుకోవడం అవసరం. అప్పుడు రచయితసాంఘికబాధ్యత అనేవిషయం కొంతకు కొంత అవగాహనకు రావచ్చు. ఆత్మవిమర్శ, స్వానుభవప్రసక్తి లేని చర్చ యీ విషయంమీద నిరుపయోగమని నా అభిప్రాయం.

రచయితలో చైతన్యశక్తి అంటే ప్రతిభ (క్రొత్తఊహలుచేసి క్రొత్తదారులు త్రొక్కే చొరవ) ఎప్పుడూ వ్యక్తంఅవుతూవుండాలని నా ఆకాంక్ష. నిజాయితీ, ధైర్యంవంటి గుణాలు జీవితానికే కాదు రచనకూ అవసరమే. అప్పుడే ఆ రచన సమాజానికి రచనగా (ప్రచారసాధనంగాను) ఉపయోగిస్తుంది. సమాజంయొక్క జీవలక్షణమైన మార్పుకి నిజంగా దోహదం చేస్తుంది. 'నిరంకుశాః కవయః' అంటే భాష, ఛందస్సువిషయంలో రచయిత నిరంకుశుడని, పండితులకి కవి జవాబు చెప్పనక్కర లేదనీ మాత్రమే అన్వయం కాదు. నేడు మన తెలుగు రచయితలు చాలామంది ఈమాత్రం స్వేచ్ఛతోనే తృప్తి చెందుతున్నారు: రచయిత సంఘానికి క్రాంతదర్శి కావడమేకాదు, తోటిరచయితలకు కూడ మార్గదర్శి అయ్యే ప్రతిభకోసం తపస్సుచేయాలి. ప్రతిభ అనేది అనుకరణ అనే పొగమంచుతో ఆవృతమయ్యే వుంటుంది ప్రతి రచయితలోనూ. తపస్సుద్వారా దాన్ని

మంచునుంచి బయల్పరిస్తే తప్ప అది ప్రకాశించదు ! అలా స్వయంప్రతిభను ఆవిష్కరించుకొనే ప్రయత్నం ఏకమనస్కతతో చేసేకంటె, రచయిత చేపట్టవలసిన మరొక బాధ్యత నాకు తోచదు. అందులోనే వ్యక్తిబాధ్యతా, సాంఘికబాధ్యతా రెండూ సమన్వయం చెంది ఒకటవుతాయి !

*

పరమ పవిత్రుడు, మహాపుణ్యాత్ముడు ఎవడైనను,
మీలోని దైవాంశము యొక్క ఔన్నత్యముకన్న పైకి పోజాలడు.
ఎంతటి దుర్మార్గుడైన, పతితుడైన
మీలోని మురుగుజ్జు నీచత్వముకన్న క్రిందికి దిగజారలేడు,
చెట్టంతయు మౌనముగా ఎరుగనిదే
మార్పులకు గురికానిదే,
ఏ ఆకుగూడ పండుటాకుగా మారదు, రాలదు.
అదే తీరుగ,
సంఘము - సంపూర్తిగ ప్రచ్ఛన్నముగానైనను
సంకల్పము చేయనిదే,
యే ఒక్కడు నేరము చేయలేడు.

— కాళోజీ
( "జీవనగీత" నుండి )

# మారుతున్న విలువలు, విమర్శకుల కర్తవ్యము

డాక్టర్ దివాకర్ల వేంకటావధాని

కవి, రచయిత, కథకుఁడు మున్నగువా రెంత ప్రతిభాసంపన్నులైనను సంఘమునందలి సభ్యులే వారి మానసములపై సాంఘికాది పరిస్థితుల ప్రభావ మెన్నో విధములఁ గాని పించు చుండును. అందుచే సంఘమునకును సారస్వతమునకును సన్నిహిత సంబంధ ముండుట అపరిహార్యము. సాంఘిక పరిస్థితు లెప్పుడు నొకే మాదిరిగా నిశ్చలములై యుండవు. దేశకాలముల ననుసరించియు బాహ్య సంపర్క సంబంధముల ననుసరించియు నవి పరివర్తనము చెందుచుండును. ఆ పరివర్తనమును బట్టి సారస్వతమునఁగూడ మార్పులు గోచరించును. ఏ వాఙ్మయముయొక్క పరిణామమును బరిశీలించినను ఈ విషయము విస్పష్టము కాఁజాలును.

ఆంధ్రవాఙ్మయ మారంభకాలమున నప్పటి సాంఘికమతపరిస్థితుల ననుసరించి పురాణేతిహాసముల యనువాదములతో నారంభించినది. తరువాత శైవమత ప్రచారము నకు ఫలితముగా శైవవాఙ్మయ ముద్భవించినది. పిమ్మట కథాకావ్యములు కావ్యానువాద ములు బయలుదేఱినవి. విజయనగర సామ్రాజ్యకాలమున స్వతంత్రములు, తత్కాల భోగైశ్వర్యసూచకములు నైన ప్రబంధములు రచింపఁబడినవి. దక్షిణాంధ్రయుగమున వచనైక రచనలు, యక్షగానములు, పద్యకీర్తనాదులు వెలువడినవి. ఆంగ్లభాషాసారస్వత సంపర్క మలవడిన పిమ్మట భావకవిత్వము, ఖండకావ్యములు పుట్టినవి. తరువాత నభ్యు దయకవిత్వము, వచనకవిత్వము ప్రచారము పొందినవి. ఈ విధముగా సంఘకాల పరి స్థితుల ననుసరించి ఆంధ్రసారస్వతమున భాషా ప్రక్రియా రచనా విధానములందుగూడ బరివర్తనము కానివించుచున్నది.

విమర్శకుఁ డనఁగా దోషైకదర్శనుఁ డని భావించుట పరిపాటియైనది. కాని యది పొరపాటు. వస్తువును సమగ్రముగా పరిశీలించి యందలి గుణదోషములను రెండిం టిని నిష్పక్షపాతబుద్ధితో వెల్లడించుటయే సద్విమర్శకుని లక్షణము. అతని విమర్శ దోషపరిహరణమునకును గుణవర్ధనమునకును దోడ్పడును. కావ్యవిమర్శకునికి విమర్శనవిధానమున ప్రతిభావంతులైన పూర్వమేధావులు వెలువరించిన లక్షణ గ్రంథ ములు, ప్రజల అభిరుచులు, బాహ్య ప్రభావములు మున్నగునవి మార్గదర్శకములుగా నుండును. విమర్శించునెడ నతఁ డొకప్పుడు తనలో నాటుకొనియున్న గాఢములైన యభిరుచులనుగూడ నుపేక్షింపవలసియుండును. అనఁగా నతఁడు తన కేది రుచించును

అను దృష్టితోడనేకాక లోకమున కేది రుచికరము, అభ్యుదయావహము అగునను దృష్టితో బరిశీలింపవలయును. ఈ విధముగా ద్వంద్వరహితుఁడైన యోగికి వలెనే విమర్శకునికిని మమతాపరిత్యాగపూర్వకమైన సమదృష్టి అవసరము. నిజమునకు సారస్వతమునకు సరియైన విలువ నిర్ణయించువా డతడే. కాలమునుబట్టి సారస్వతపు విలువలుకూడ మాఱుచుండును.

కావ్యమునకు కీర్తి, అర్థము, వ్యవహారనేతృత్వము, అమంగళ పరిహరణము, సద్యఃపరనిర్వృతి, ఉపదేశము ప్రయోజనము లని సంస్కృత లాక్షణికులు నిర్వచించిరి. వీనిలో మఱల నానందమునకే వా రధికప్రాధాన్యము నొసంగిరి. ఉపదేశమును వా రుపేక్షింపక పోయినను దాని కానందము తరువాతి స్థానమునే యొసంగిరి. ఆనందోపదేశములు రెండు నొసంగు కావ్య మత్యుత్తమ మని వారియభిప్రాయము. ఆంధ్రవాఙ్మయమును పరిశీలించినచోఁ దొల్లింటి కాలమునఁ గవులు ధర్మనీతి తత్త్వరూపమైన యుపదేశమునకు దరువాతికవు లానందమునకును అధిక ప్రాధాన్య మొసంగినట్లు కనుపించును. దక్షిణాంధ్రయుగమున పలువు రుపదేశము విషయమును పూర్తిగా విస్మరించి రని చెప్పవచ్చును. అందుచేతనే అప్పుడు అహల్యాసంక్రందనము, తారాశశాంక విజయము, సారంగధర చరిత్ర మున్నగు కావ్యములు వెలువడినవి. మొత్తముమీఁద ఆధునికయుగారంభము వఱకును వెలువడిన వాఙ్మయమున సంఘదృష్టి తక్కువగాఁ గనిపించును.

''కావ్య మానందము కొఱకే; కావ్య ముపదేశము కొఱకే; కళ కళకొఱకే; కళా కావ్యములు సంఘశ్రేయముకే'' అను నభిప్రాయములలో నొక్కొక్కకాలమున నొక్కొక్కదానికిఁ బ్రాచుర్యము లభించినది. ఆ ప్రాచుర్యమునుబట్టియే కవులు రచనలు సాగించిరి, వాని విలువయుఁ దదనుగుణముగనే వర్తిల్లినది. ఉపదేశదృష్టితోఁ జూచిన నానందప్రధానమైన కావ్య మధమ మనిపించును. సంఘశ్రేయోదృష్టితోఁజూచిన కళాప్రధానమైనకావ్యము కమనీయ మనిపించును. అందుచే విమర్శకులు విమర్శించునపుడు మాఱుచున్న విలువలనుగూడ దృష్టియం దుంచుకొనవలసిన ఆవశ్యక మెంతైన నున్నది. అట్లు చేయనిచో సారస్వతమునందలి కొంతభాగము కొఱమాలినదిగాఁ గనిపించును. రచయితలు సహితము మాఱుచున్న విలువలు గుర్తించవలసిన అవసరమున్నది. సంఘ తత్కాలపరిస్థితులే కొంతవఱకు వారియం దిట్టి పరివర్తనము కలిగించును. వా రది గ్రహించి ప్రతిభాసంపదచే దానికి ప్రశంసనీయము, పరమోదాత్తము నైన రూప మొసంగి రచనలు సాగింపవలయును. ''శ్రీ శ్రీ'' 11వ శతాబ్దిలో జనించియుండినచో నే పురాణమునో యనువదింపఁబూనియుండును; అట్లే నన్నయ యిరువదవశతాబ్దమున నవతరించినచో అభ్యుదయ కవితామార్గమును బట్టియుండును. మారుచున్న విలువలు గుర్తింపనివారు మార్పున కిష్టపడక గతానుగతికమైన విధానమునే యనుసరింతురు.

విలువ లెంత మాఱినను ప్రాణభూతమైన లక్షణ మేదోవిధముగా నిల్చి ప్రాభవము వహించుచునేయుండును. కవులను రచయితలు మాఱుచున్న విలువలదృష్టితో సానుభూతితో పరిశీలింపవలసిన యావశ్యకత సద్విమర్శకుల కెంత కలదో విమర్శకుల విమర్శ

లను పరిశీలించి తమ రచనలందలి దోషములను బరిహరించి వానిని గుణోత్తరములుగా చేయవలసిన యావశ్యకత రచయితలందును అంత కలదు. విమర్శకులును రచయితలును ఈ ఆవశ్యకతను గుర్తింపనినాఁడు వారి విమర్శల వలనను రచనల వలనను సారస్వతమునకుఁగాని లోకమునకుఁగాని యెట్టిలాభము నుండదు. సద్విమర్శకుఁడు రచనలందలి గుణమును చక్కఁగా గ్రహించి తదభివర్ధన మార్గములను సూచింపవలయును. రచయితలు సద్విమర్శకసూచితమార్గముల నవలంబించి గుణవద్రచనా సృష్టిచే వాఙ్మయమును పెంపొందింపవలయును.

వస్తువు, భావము, భాష, ఔచిత్యము, విలువ లేక ప్రయోజనము అనునవి కవి బ్రహ్మసృష్టి కుపాధులైన పంచభూతములు. కవు లీ పంచభూతముల విషయమున నెంతైన శ్రద్ధ వహింపవలయును. విమర్శకుఁడు దేశకాలపరిస్థితుల ననుసరించి యవి యేవేవి యెట్లుండవలయునో యెట్లుండిన లోకమునకును సారస్వతమునకును శ్రేయ మావహిల్లునో సూచింపవలయును. రచయిత లా సూచనలను బరిశీలించి యుపాదేయములైనవానిని గ్రహింపవలయును. ఈ విధముగా విమర్శక రచయితల కపరిహార్యమైన సంబంధమున్నది. ఆ సంబంధము గుర్తింపఁబడనినాఁడు విమర్శకులదారి విమర్శకులది, రచయితలదారి రచయితలది అగును. అప్పు డొకదానివలన నింకొకదానికి ప్రయోజనముండదు. ఆధునికకాలమున నట్లే జరుగుచున్నది. విమర్శకులును, రచయితలును తమ కర్తవ్యమును గుర్తించి వాఙ్మయమును శ్రేయస్కరమైన అభ్యుదయమార్గమున ప్రవర్తింపఁ జేయుదురుగాక.

*

శ్లో॥ ఇదమంధం తమః కృత్స్నం జాయేత భువనత్రయం
యది శబ్దాహ్వయం జ్యోతి రాసంసారం న దీప్యతే ॥

* *

ఏమైనా జీవితాన్ని సమగ్రంగా దర్శించడమూ, జీవిత వైవిధ్యాన్ని గుర్తించి స్పందించడమూ చాలా అవసరమేమో అనుకుంటాను. పాక్షికవాదులు జీవితంలో ఒక వైపే, ఒకభాగాన్నే చూసి ఎంతో విశిష్టమైన అనుభూతి ఆవరణని miss అయిపోయారేమో నని అనిపిస్తుంది.

— తిలక్.

# రచయితలు - విమర్శకులు

శ్రీ కె. వి. రమణారెడ్డి

ప్రతికూలవిమర్శలతీవ్రతకు తట్టుకోలేక సుకుమార హృదయుడైన కీట్సుకవి కృశించి నశించాడనే కథ ఒకటి తరచూ వినబడుతుంది. ఇది కట్టుకథ. విమర్శకుడు కామరూపియై క్షయవ్యాధిక్రిమిగా మారి కీట్సుప్రాణాన్ని బలితీసుకొంటేనే ఈ కథకు కాళ్లూచేతులూ ఉంటాయి. అయితే దేహానికి తగిలిన గాయాలు మరునాటికల్లా చెక్కుగట్టి త్వరలో మానిపోతాయిగాని ''సుకుమారపు హృదయానకు'' తగిలిన గాయాలు చాలాకాలం సెలవేస్తూ సలుపుతూ పోతాయి

విమర్శలవల్ల ఏ రచయితా కలం దించి రచనాసన్యాసం చేసి ఉండడు. అలాగే అయితే, ఇటీవలి కాలంలో ఇబ్సెన్ నాటకాలు గానీ విట్మన్ వచనపద్యాలుగానీ లోకానికి దక్కుఉండేవే కావు. విమర్శల సుడిగాలి కెదురుగా నడిచి ఆ ఇద్దరూ తమ వ్యక్తిత్వాన్ని నిలుపుకోగలిగారు. విమర్శకులు వీగిపోయారు. సాహసమంటే సరికొత్తప్రయోగ మంటే భూతంలా కనుపించడం సంప్రదాయవాదులకు రివాజే. మూసలో పోసి తీసినట్లుగా రచనలు వెలువడే రోజుల్లో కొత్తపుంతులు తొక్కేవాళ్ళకు విమర్శకులవైపునుంచి తీవ్రమైన వ్యతిరేకత వెలువడుతుంది. ఆ రచయితలకు ఇది అక్షరాలా అగ్నిపరీక్ష. దానిలో నెగ్గినవాడే చరితార్థుడు.

అంటే విమర్శకుడు త్రికాలవేది కాడు, కాలేడు, అన్న మాట. అలా అహంకరించేవాడు దూరుపడకతప్పదు. ఉదాహరణకు మేక్స్ నోర్డోనే తీసుకుందాం. ఆధునిక కవిత్వరీతులమీద పరశుధాటిగా విరుచుకుపడి అందులో చెడునే గాని మంచిని ఇసుమంతైనా చూడలేక పోయాడు. చివరి కేమయ్యాడు? చూపు పోయినవాడిగా కటిక మనిషిగా తనపేరును చలామణి చేసుకున్నాడు. తెలుగులో భావకవిత్వం రెక్కలు పూన్చుకొంటూన్న రోజుల్లో అక్కిరాజు ఉమాకాన్తుడు కూడా ఇలా ఏటికి ఎదురీదబోయి రెక్కలు విరుచుకున్నవాడే. ఇంకా ఇటీవలికివస్తే రా. రా. వంటి విమర్శకులమీద వాళ్ళచేత చావుదెబ్బలుతిన్న రచయితలవైపునుంచి రాక్షసమనస్కు లనే నింద వచ్చిపడుతున్నది.

గుణదోషనిరూపణంలో దోషాలను ఆవగణించి, గుణాలను నిరూపించగలవాడే మంచి విమర్శకు డనిపించుకుంటా డని అంటారు. దోషాలను అవగణించడమంటే వాటికి కళ్లు మూసుకోవడం కాదు. అవి ఎంత కొమ్ములుదిరిగిన రచయితలోనైనా ఉంటాయి. పైకి కనిపించకపోయినా వెదకడం మొదలుపెడితే మంచంలో నల్లుల్లా బయటపడకపోవు. అయితే దోషనిరూపణమొక్కటే విమర్శకుని పని కాదు. అందులో సగమైనా కాదు. నగమే

అని లెక్కవేసి ఒప్పించినా, మేలైన సగం కాదు. చంద్రుడిలో కళంకాన్ని మాత్రమే చూస్తే ఎట్లా? మేఘంలోని నల్ల డాగునే చూసి దాని మెరుగంచును చూడకపోతే ఎట్లా? గుణాన్ని గ్రహించి, దాన్ని వివరించి చెప్పి, రచయితకూ రచనకూ న్యాయం చేకూర్చడమే నిజమైన విమర్శక ధర్మం. రాయప్రోలు సుబ్బారావుగారి పద్యాల్లోంచి కీతసరుకును మాత్రమే ఏరి తమ గ్రంథంలోని దోషప్రకరణానికి ఉదాహరణలు చూపించిన అలంకారశాస్త్రపండితు దేమనివించుకొన్నాడు?

విమర్శకుడు సహృదయుడు అయితీరాలి. సహృదయు డనే మాట ఈ రోజుల్లో బాగా వాడుకలోకి వచ్చి బాగా తేలికపడిపోయింది. కృష్ణ శాస్త్రిగారి ఊర్వశిని గురించి నే నొక వ్యాసం వ్రాశాను. రవీంద్రుని ఊర్వశికంటె ఇది భిన్న మని వివరించాను. కృష్ణ శాస్త్రిగారిని అనరానిమాట లంటున్నా ననుకొన్న పత్రికాసమీక్షకు డొకరు నా విమర్శలో సహృదయత లోపించిందన్నారు. ఇలా రచనను ఏమాత్రం "విమర్శగా" చూసినా అదిగో నీలో సహృదయత కొరవడిందని ఎత్తిచూపే సహృదయులు ఎందరో ఉన్నారు. వీరి ఉద్దేశంలో సహృదయత అంటే సుహృదయతమాత్రమే. హృదయం మంచిది అయి ఉండాల్సిందే విమర్శకుడికి, సందేహంలేదు. అయితే అది పాదరసం వెలిసిన అద్దం లాంటిది కాకూడదు. దానిలో ప్రతిబింబాలు స్పష్టంగా పడాలి. రచనలోని నాయికా నాయికలయొక్కగాని, ఘటనలయొక్కగాని మారురూపాలు ఎవని స్వచ్ఛమైన మనో ముకురాన పడి రచయిత ఉద్దేశించిన భావాల్లాంటివి ఎవనిలోకూడ కదలాడుతాయో వాడే సహృదయుడు. అతగాడు పాఠకోత్తముడు కాగలగాలి. రచయిత కోరుకొనేదల్లా అలాంటి వాణ్ణే. రచన సఫలమయ్యేదల్లా అలాంటివా డుంటేనే.

రచయితే విమర్శకుడు కాగలిగితే ఎలా ఉంటుంది? బాగానే ఉంటుందేమోగాని అలాంటి విమర్శకుడు నిర్మమంగా ఉండడం సాధ్యపడకపోవచ్చు. అయితేనేమి, కనీసం తన రచనలో పొదివిపెట్టుకున్న సొగసులను పూర్తిగా తన దృక్పథం నుంచయినా అనన్యంగా విమర్శించి చూపగలడు కదా! రచయితకూ పాఠకుడికీ మధ్య విమర్శక నామధేయుడై మూడో మనిషి వచ్చిదూరి ఉభయులకూ అన్యాయం చేయడంకంటే రచయితే విమర్శకరూపం తాల్చివస్తే నయం కాదూ? స్విన్‌బర్న్ గురించి రాస్తూ టి. యస్. ఇలియట్ ఇలాంటి మాటలే ఒకచోట అంటాడు. నిజానికి తానూ ఆలాటి ఇంకో ఉభయచరజీవేకాబట్టి ఈ మాటలు తనకూ అన్వయిస్తాయి.

అయితే ఒక చిక్కు. అది పెద్దదే. ఏమిటంటే, విమర్శకవ్యాపార మనేది స్వతంత్ర రచనోత్సాహంమీద నీళ్లు చల్లి రచయితను చల్లబరచివేస్తుందని కొంద రంటారు. అంటే, స్వతంత్రరచనావ్యాసంగమూ విమర్శకవ్యాపారమూ పరస్పర బాహ్యాలని ధ్వని. అంతే కాదు, విమర్శ అనేది పరోపజీవి మాత్రమే ననికూడా ధ్వని. ఇది అందరికీ అన్ని కాలాల్లో వర్తించవలసిన సార్వజనీనమైన సత్యం కానక్ఖర్లేదు. స్విన్‌బర్న్, ఇలియట్‌లకంటె ముందు కోలరిజ్, డ్రైడన్‌లు ఇటీవలి ఆర్నాల్డ్, ఆడెన్‌లు అపవాదంగా నిలుస్తారు. మన శ్రీశ్రీ నే తీసుకొందాం. లేకుంటే విశ్వనాథవారిని తీసుకొందాం. ఇతరవిమర్శకులకు

ఎందులోనూ తీసిపోనివిధంగా, సామాన్యవిమర్శకులకు కనిపించని రచనారహస్యాలనూ, శిల్పసూక్ష్మాలనూ ఆ ఇద్దరు రచయితలు అనాయాసంగా చూపించగలుగుతున్నారు. కాబట్టి విమర్శకజాతి, రచయితలజాతి అంటూ రెండు విడివిడిగా, ఆ యింటిమీద వాలిన కాకి ఈ ఇంటిమీద వాలకూడదన్న చందంగా ఎడపెడగా, జీవించ నక్కర్లేదు.

ఇంతకీ విమర్శకుడూ రచయితా శత్రువు లేమీకాదు. వెనకటికి మన కవులంతా కుకవినింద పేరిట తమ రచనల విమర్శకులను దుయ్యబట్టారనే ఊహ ఒకటి ఉంది. ''కుకవి'' విమర్శకు డెలాగయ్యాడో ! కవిగా రాణించలేక విమర్శకు పూనుకొనేట్లు విమర్శకులను ఆక్షేపించడమనేది అన్ని కాలాల్లోనూ, దేశాల్లోనూ ఉంది. ఇదికూడా సార్వజనీనమైన యథార్థం కాకపోవచ్చు. జమీందారీయుగానికి ముందునుంచి కూడా, పండితులకూ కవులకూ మధ్య పచ్చిగడ్డివేసినా భగ్గుమనేంత వైరం మన తెలుగుదేశంలో ఉంటూ వచ్చింది. విద్వత్కవులమాట అటుంచి పాండిత్యసంభారం శిరోభారంగా మారి రచయితను విమర్శకుడిగానో ఆక్షేపకుడుగానో మారుస్తుం దనడంకూడా అలాంటి పాక్షిక సత్యమే. అడిదం సూరన, కేకపల్లి సోమప్ప కవుల పద్యవివాదం, పాండిత్య, కవిత్వాల అంతరాన్నిమట్టుకే పురస్కరించుకొని వెలువడింది కాదు. నియోగి వైదీకి కాట్లాటలు, సంస్కృతాంధ్రాల పోట్లాటలు - ఇవికూడా అందులో దూరి ఉన్నాయి.

విమర్శకుడు పరోపజీవి (Parasite) మాత్రమేనా ? నిజమే. రచన అనే ఆధారం లేకుండా విమర్శ సాగదు, సాగే వీలూలేదు. అట్లని విమర్శలో కూడా రకాలు, అంతరాలు ఉంటాయి. ఉత్తమమైన విమర్శ గొప్పరచనగా తన కాళ్ళమీద తానే నిలువగలదు. విమర్శకుని సాయంలేకుండా గొప్ప రచనకూడా నిర్లక్ష్యంవాతపడి మాటుబడి ఉంచవచ్చు.

రచయిత - విమర్శకుడు కులవైరులు కారు, దాయాదులు కారు. ఒకే చేతిలోని పక్కపక్క వేళ్ల అంటే బాగుంటుంది.

*

"చావు పుట్టుకలమధ్య సందేహంలాంటి
జీవితంలో నలువైపులా అంధకారం
మంచిగంధంలాగ పరిమళించే మానవత్వం
మాకున్న ఒకే ఒక అలంకారం."

—తిలక్.

# రచయితలు - ప్రభుత్వం

## శ్రీ అక్కిరాజు వాసుదేవరావు

సాహిత్యకారునికి సమాజంలో అనాదిగా గౌరవస్థానం వుంది. నవపథనిర్దేశకునిగా, ప్రగతిరథచోదకునిగా అతను పరిగణించబడుతున్నాడు. చరిత్రను పరిశీలించినట్లయితే సాహిత్యకుడు అన్నికాలాలలోనూ అటు పాలకుల ఆదరణనూ, ఇటు ప్రజల అభిమానాన్నీ పొందినట్లు విదితమవుతుంది. ఈవిధంగా రచయిత సంఘంలో విశిష్టప్రతిపత్తిని కలిగివుండడానికి అతని కార్యక్షేత్రమే కారణం. ప్రజలకు ఉత్తమ వినోదాన్నీ, విజ్ఞానాన్నీ, ప్రబోధాన్ని కలిగించే ఉత్కృష్టమైన, మార్గదర్శకమైన సాహిత్యాన్ని సృష్టించడం రచయిత ధర్మం. ఇట్టి ఉదాత్తధర్మాన్ని ఆచరించవలసినవాడు కనుకనే అతడు గౌరవనీయుడయ్యాడు.

రవికి సాధ్యం కానిదికూడా కవికి సాధ్యమవుతుందనీ, అతను నిరంకుశుడనీ అన్నారు. అంటే అతని భావనాపరిధి ఎల్లలు లేనిదనీ, అతని సాహితీకృషికి అసంబద్ధమైన పరిమితులు, నిర్బంధాలు విధించే అధికారం ఎవ్వరికీ లేదనీ అనుకోవచ్చు.

తనకాలానికీ, యుగానికీ సంబంధించిన ధర్మాన్ని తన రచనల్లో ప్రతిఫలింపజేయడం ఉత్తమ రచయిత లక్షణం. సార్వజనీనమైన సంప్రదాయాలనూ, మర్యాదలనూ అతను సాధించవలసివుంటుంది. ప్రవాహానికి ఎదురీదే నిరర్థకమైన ప్రయత్నాలకు అతను స్వస్తిచెప్పవలసివుంటుంది. అప్పుడే అతను జనరంజకుడైన సాహిత్యకుడుగా మనగలుగుతాడు. కనుక అతను నిరంకుశుడే అయినప్పటికీ ఈ మినహాయింపునకు మాత్రం అతీతుడు కాడు.

రచయిత వర్తమానయుగధర్మాన్ని తనరచనలద్వారా ప్రబోధించాలని పైన చెప్పాను. నేటి యుగధర్మం ప్రజాస్వామ్యం. కనుక ప్రజాస్వామిక విధానం, వ్యవస్థ, మూడుపూలు, ఆరుకాయల చందంగా పరిఢవిల్లడానికి రచయిత తోడ్పడాలి. సమాజంలో చైతన్యంవెల్లివిరియడానికీ, అభ్యుదయకరమైన మార్పులు రావడానికీ అతను తన ''కలం'' ద్వారా ప్రజలను సమాయత్తం చేయాలి. ఆరోగ్యప్రదమైన ఆలోచనలను, భావాలను ప్రోత్సహించడానికీ, అవాంఛనీయమైన ధోరణులను అరికట్టడానికీ అతని లేఖిని ఉపకరించాలి.

కవులకు లభించిన ఆదరణలోనూ, వారి రచనా ప్రయోజనంలోనూ నాటికీ, నేటికీ వ్యత్యాసంవుంది. పూర్వకాలంలో కవిపండితులను చక్రవర్తులు, రాజులు, జమీందార్లు ఇతర కులీన వంశస్థులు ఆదరించారు, పోషించారు. దీనికి తగ్గట్టుగా వారు తమ కవితా ప్రతిభను, పాండితీప్రకర్షను తమ పోషకుల గుణగణాలను, ఔదార్యాన్ని స్తుతించ

డానికి, వారికి ప్రియముల్తైనటువంటి విషయాలను వర్ణించడానికీ వినియోగించవలసి వస్తుండేది. అయితే ఆనాటి కవిత్వమంతా యీలాంటిదేనని నా ఉద్దేశంకాదు. ఈకోవకు జెందని అపూర్వమైన గ్రంథాలు ఎన్నో ఆకాలంలో వెలువడ్డాయి. వాటి సృష్టికి ఎందరో ప్రభువులు ప్రోత్సాహం యిచ్చారు.

ప్రజాస్వామ్యంలో పాలకులంటూ ఒకవర్గం వుండదు. ప్రజలు ఎన్నుకున్న ప్రతినిధులు పరిపాలన నిర్వహిస్తారు. అందరికీ తెలిసిన ఈ విషయాలను వివరించి చెప్పనవసరంలేదు. పరిపాలనా వ్యవస్థలో వచ్చిన ఈ తీవ్రమైన మార్పు ప్రభావం కవుల అస్తిత్వంలో, వారి కవితాప్రయోగంలో కూడా ప్రతిఫలిస్తున్నది. ఈ నాడు కవులకు రాజపోషకులు, మహారాజ పోషకులు లేరు. అతని జీవనభారాన్ని అతనే మోయవలసివుంటుంది. అలాగే తమనుకీర్తిస్తూ కృతులు కూర్చమనికానీ, ఫలానా విషయంపై కవిత్వం చెప్పమనికానీ, కవిని శాసించేవారుకూడా యిప్పుడులేరు. కనుక లోకహితమైన,ప్రయోజనాత్మకమైన అంశాలను తన రచనకు వస్తువుగా స్వీకరించి సమాజంపట్ల తనకు గల బాధ్యతకు పూర్తిగా న్యాయం చేకూర్చడానికి యిప్పుడు రచయితకు మంచి అవకాశం వుంది. యీ అవకాశాన్ని చక్కగా ఉపయోగించుకొననట్లయితే అతను తన బాధ్యతను విస్మరించినవాడు, నిర్లక్ష్యం చేసినవాడు అవుతాడు.

స్థూలంగా ప్రభుత్వధ్యేయం ఏమిటో రచయిత లక్ష్యం కూడా అదే. ప్రజాశ్రేయస్సుకోసం, సమాజకళ్యాణంకోసం వీరుభయులూ పాటుపడాలి. కనుక ప్రభుత్వం అమలుజరిపే అభివృద్ధికరమైన కార్యక్రమాలకు రచయిత తగు విధంగా మద్దతు నివ్వాలి. ఇవేవిధంగా ప్రభుత్వం చేపట్టే కార్యక్రమాలు ప్రజాహితమునకు వ్యతిరేకంగా వున్నయెడల అతను నిర్భయంగా ఖండించాలికూడా.

తన రచనల ద్వారా సమాజాన్ని ప్రభావితంచేసే శక్తి రచయితకు వుంది. దీనికి దృష్టాంతరాలు చరిత్రలో అనేకం కనిపిస్తాయి. ఫ్రెంచివిప్లవం సందర్భంలో ప్రజలను ప్రభావితులను చేయడంలో రచయితలు అత్యంతప్రధానపాత్ర వహించారు.

అటు జాతిని జాగృతంచేసే వైతాళికుడుగానూ, ఇటు ప్రభుత్వానికి కనువిప్పు కలిగించే మార్గదర్శిగానూ రచయితను చెప్పుకోవచ్చు. ఒకవిధంగా అతను ప్రజలకూ, ప్రభుత్వానికీ మధ్య అనుసంధాతకూడా, ప్రజాభిప్రాయాన్ని తనరచనలో వ్యక్తం చేయడం, ప్రభుత్వం నిర్వహించే అభ్యుదయకరమైన ప్రణాళికనుగురించి ప్రజలకు వివరించడం అతను చేయాలి. అతను చేసే వ్యాఖ్యలు, విమర్శలు పాక్షికమైనవిగా కాక నిర్మాణాత్మకమైనవిగా వుండాలి. అతను చేసే సూచనలు, సలహాలు ప్రజలను పెడత్రోవలు పట్టించేవిగా కాక సక్రమమార్గంలో నడిపించేవిగా వుండాలి.

ఇటీవల మనరాష్ట్రంలో విపరీతమయిన ధోరణులు తలెత్తిన సందర్భంలో రచయితలు వాటిని గట్టిగా వ్యతిరేకించినందుకు వారు అభినందనీయులు. ఇటువంటి పరిస్థితులు ఏర్పడినప్పుడు మౌనంగా, ముభావంగా వుండిపోకుండా విజ్ఞతతో వ్యవహరించినప్పుడే వారికి సార్థకత్వం వుంటుంది.

సాహిత్యకుడు ప్రభుత్వంపట్ల, ప్రజలపట్ల కొన్ని బాధ్యతలను నిర్వర్తించవలసి వున్నట్లే వీరుభయులు కూడా సాహిత్యకుని విషయంలో కొన్ని విధులు నిర్వహించవలసి వుంది. రచయిత తన రచనావ్యాసంగాన్ని నిరాటంకంగా కొనసాగించడానికి అనువైన పరిస్థితులను ప్రజలూ, ప్రభుత్వమూ కల్పించవలసివుంటుంది.

రచయితల కష్టనిష్ఠూరాలను గురించి ప్రభుత్వానికి తెలుసు. తాము వ్రాసిన పుస్తకాలను అచ్చువేసుకోవడంలోనూ, అమ్ముకోవడంలోనూ వారు అనేకఅవస్థలు పడుతున్నారు. రచయితల సంక్షేమాన్ని గురించిన ఆలోచన ప్రభుత్వానికివుంది. సాహిత్య అకాడమీ, రచయితల సహకారసంఘాలు మొదలైనవి యీ ఆలోచనతో ఏర్పాటు చేయబడినవే.

ఏమయినప్పటికీ రచయిత, సమాజంలో తాను నిర్వర్తించవలసిన గురుతరమయిన పాత్రను గుర్తించి తదనుగుణంగా నడుచుకున్నప్పుడు ప్రభుత్వము, ప్రజల సహాయ సహకారాలు అతనికి అవశ్యం లభించితీరుతాయి. కనుక యీ విషయంలో చొరవతీసుకొనవలసిన బాధ్యత రచయితలమీదనే వుంది.

*

సమానదర్శుల హృదయస్పందనం శిరఃకంపనం
అదీ గీటురాయి అసలైన కవిత్వానికి
వానలాగ ప్రజల హృదయాల్లో వర్షించి
కొత్తభావాల బీజాలు జల్లేది కవిత్వం.

* *

ప్రజాస్వామ్యాన్ని అంగీకరిస్తూనే కవి
మెజారిటీకి అందని ఊహలు వెదకాలి.

—శ్రీశ్రీ

# రచయితలు - ప్రచురణకర్తలు

శ్రీ యం. యస్ రావు

ఈ వర్తమానకాలంలో — సాంఘిక విలువలు త్వరత్వరగా మారిపోతున్న రోజుల్లో రచయితల, ప్రచురణకర్తల పరస్పరానుబంధము ఏమిటి ? ఎలా వుండాలి ? ఈ ప్రశ్నకు సమాధానము వెతకటమే ఈ వ్యాసముయొక్క ఉద్దేశ్యము.

రచయితల భావాలపట్ల, ఉద్దేశ్యాలపట్ల ప్రచురణకర్త ఏకపక్షవాదిగా వుండరాదు. ఏ ఉద్దేశ్యమైనా, ఏ భావమైనా, దానిలో నిజాయితీ, కొత్తదనము, సరిగా, సవ్యముగా, అర్థమయ్యేటట్లుగా ఉంటే దానిని ప్రచురణజేసి ప్రజాబాహుళ్యానికి భావనాప్రపంచానికి అందజేయటం ప్రచురణకర్తయొక్క కర్తవ్యము. ఆ భావములో ప్రజలకు ఆసక్తి ఉంటుందా ? ఉన్నట్టయితే ప్రజాబాహుళ్యమునకు ఆ భావనలు, ఉద్దేశ్యాలు తెలుసుకునే అర్హత, హక్కు వున్నది. దాని మంచి చెడులు నిర్ణయించేది ప్రజలేకాని ప్రచురణ కర్తకాదు.

పుస్తకప్రచురణ ఒక వ్యాపారమూ కాదు, ఒకవృత్తీ కాదు, ఒక కళా కాదు — యీ మూడింటి సమన్వయమే పుస్తక ప్రచురణ. యీ సమన్వయము చాలా కష్టమైనపని· దీనికి కావలసిన గుణగణాలుకూడ అతి క్లిష్టమైనవే. ప్రచురణకర్తకు కొంచెము సాహిత్యములో అభిరుచి ఉండాలి. దానికోసం ఎక్కడ వెతకాలో కొంత తెలిసివుండాలి. దానికంటేగూడా వ్రాతప్రతులు ఎన్నుకోవడంలో ఒక విధమయిన చురుకుదనము, చురుకుదనముతోకూడిన ఆస్థ వుండాలి. ఇవే కాకుండా దానిని ఆకర్షణీయంగా పుస్తక రూపంలో ఏవిధంగా తయారుచేయాలి అనేటటువంటి సాంకేతిక విజ్ఞానము, కళాదృష్టి కొంత కావాలి. దానికి కావలసిన కాగితము, అచ్చు అక్షరముల కుదింపు, దానికి కావల సిన బైండింగు ఇత్యాది విషయాలలో సాంకేతిక విజ్ఞానము, నిపుణత, దానిని అంద ముగా తయారు చేయాలనేటువంటి కళాదృష్టి వుండాలి. తాను తయారుచేసిన పుస్తక ములకు సరిగా న్యాయము చేకూరాలంటే వాటిని ప్రజలదృష్టిలోనికి, అందుబాటులోనికి తీసుకొనివెళ్ళి అమ్మగలిగి వుండాలి. ఏ విధముగా ఎక్కడ వానిని అమ్మవలెనో, ఎక్కువమంది పాఠకుల అందుబాటులోనికి ఏవిధముగా సరసమైనధరలో అందజేయ వలెనో అతనికి బాగుగా తెలిసి ఉండాలి. ఇవన్నీకూడా చాలవు. ఇంకా అతనికి కొంత న్యాయశాస్త్రపరిజ్ఞానము అవసరము. రచయితలతో ఎగ్రిమెంటులు రాయడము, వారితో సవ్యముగా సంబంధ బాంధవ్యాలు పెట్టుకోవడము, ఉత్తరప్రత్యుత్తరాలు జరపడము, కాపీరైటు ఆక్టుకు సంబంధించిన వివరాలు తెలుసుకోవడము ఇవన్నీ చాలా అవసరము.

యీ విధముగా పుస్తక ప్రచురణలోని అన్ని విభాగములందు కొంత పరిజ్ఞానము కలిగి వుండటము కొంత క్లిష్టతరమే. కాని ఈ రోజుల్లో పుస్తకప్రచురణ కొంత వృత్తినిపుణతతో చేయాలంటే ఇవి చాలా అవసరము.

ప్రచురణకర్త అంటే కొన్ని అపోహలు, కొన్ని వేరే అభిప్రాయాలు వున్నాయి. ప్రచురణకర్తలు పూర్తిగా పరోపకారులుకారు. పూర్తిగా దొంగలూ కారు. అలాగే వారు కుబేరులు కారు. అడుక్కుతినే బైరాగులు కారు. ఒక క్లిష్టతరమైన వృత్తిలో జీవనోపాధి సంపాదించుకునేందుకు ప్రయత్నంచేసే సామాన్య మానవులే. ప్రచురణకర్త గావటము తేలికే, గాని దాంట్లో నిలబడటము చాలాకష్టము. దీనిలో బాలారిష్టాలు చాలా ఎక్కువ.

రచయితలకు ఒక మనవి. ప్రచురణకర్తకు మీమీదకంటే మీరచనలో ఎక్కువ ఆసక్తి వుంటుందని గ్రహించాలి. మీరచనే మిమ్మల్ని గురించి ఎక్కువగా చెప్పేటటు వంటి రాయబారి. అందుచేత మీ రచనలనుగురించి వేరే సిఫార్సులను తీసికొనివెళ్ళి ప్రచురణకర్త కాలం వృధాచేయకండి. మీరచన బాగుంటే మీదగ్గరకే వస్తాడు ప్రచురణకర్త.

మీరచన ప్రతిభావంతముగావచ్చు. కాని అది ప్రతిభావంతమని మీరే చెప్పకండి. ఎందుకంటే ప్రచురణకర్తవద్ద ఆ విధముగా ప్రతిభావంతములని చెప్పియిచ్చిన రచనలు చాలా వుండి వుండవచ్చు. ఒక్కొక్కప్పుడు ప్రతిభావంతమైన రచనలు వానినిగురించి గొప్పగా చెప్పకుండానే వస్తూవుంటాయి. వానికోసమే ప్రచురణకర్త ఎదురు చూస్తుంటాడు.

మీరచన మీ ముద్దుబిడ్డ కావచ్చు. ఈమాదిరి చాలా ముద్దుబిడ్డలు ప్రచురణకర్త కార్యాలయంలో అతని దృష్టికోసము ఎదురుచూస్తుంటాయి. అందరికీ ఒక్కసారిగా శ్రద్ధ చూపలేడు కదామరి. ఎంత ఉదారుడైనా మీ ముద్దుబిడ్డమీద అతను చూపగలశ్రద్ధ కొంతవరకే నని గ్రహించండి. అది ఎక్కువగా చూపలేదని అనవసరంగా అతన్ని విసిగించకండి.

మీ రచన - మీ వ్రాతప్రతి - సరిగా ప్రచురణకర్త దృష్టిలోనికి పోవాలంటే మీ వ్రాతప్రతిని తయారుచేయడంలో శ్రద్ధచూపండి. మీరు ఎంతజాగ్రత్తగా మీ వ్రాతప్రతిని క్రమపద్ధతిలో తయారుచేస్తారో ప్రచురణ కర్తకు దానిమీద శ్రద్ధచూపి ఎన్నికచేయటం అంతతేలిక. ప్రచురణకర్తతో సమావేశముకంటే మీ వ్రాతప్రతిని తగురీతిలో తయారు చేయటము ఎక్కువ ముఖ్యము.

ప్రచురణకర్త సామాన్య మానవుడే కనుక అతని ఎన్నికలలోను నిర్ణయాలలోను లోపాలు, పొరపాట్లు వుండవచ్చు. ఈ ప్రచురణ పొరపాట్లు ప్రచురణకర్త వ్యాపార ఖాతాలో చాలా ఖరీదైనవద్దు.

మీ రచనను ప్రచురణకు వీలులేదని మీకు తిప్పిపంపుతే ఆ నిర్ణయం పొరపాట్లు చేయగల ప్రచురణకర్త చేశాడని అనుకోండి. దానికి కారణాలు ఏమిటని గట్టిగా అడ

క్కండి. సామాన్యముగా అతను కారణాలు చెప్పనట్టి అవివేకిగా వుండడు. ఎవరి రచన ఆ రచయితకు ముద్దుబిడ్డ కాబట్టి ఆ ముద్దుబిడ్డ పొగడ్తలే వినాలనుకుంటాడు రచయిత.

మీ రచనను ప్రచురణకు తీసుకున్నట్లయితే, చివరకు దానియొక్క విలువలు, రాబడి నిర్ణయించేది, పాఠకులే. ఒక్కొక్కప్పుడు పాఠకుల ఆవస్థలు నిలుకడలేనివిగా వుంటాయన్న సంగతి గుర్తుంచుకొండి. ఒక్కొక్కప్పుడు సాహిత్య విలువలు లేని రచనలు ఎందుకో తెలియకుండా వారు విపరీతముగా ప్రోత్సహించవచ్చు. అదే సమయములో మంచిసాహిత్యపు విలువలను వారు సరిగా ఆదరించకపోవచ్చు. దీనికి బాధ్యుడు ప్రచురణకర్త కాడు. పాఠకులు మీ పుస్తకాన్ని కొనకపోయినచో తనకి డబ్బుచేసుకోలేడు మీకు డబ్బు చేసిపెట్టలేడు.

తళ తళా మెరిసేదంతా బంగారము కాదు, దినపత్రికలోను. వారపత్రికలోను, పెద్ద పెద్ద ప్రకటనలు కనిపించినంత మాత్రాన అది బాగా అమ్ముతున్నదని భ్రమపడ రాదు. పుస్తకాలను విరివిగా పంపిణీచేసి దేశం నలుమూలలా పాఠకులకు అందుబాటులో వుండేటట్లు చేయడం చాలా శ్రమతోకూడినపని, ఇది పేకమేడలా కాకుండా ఇటిక ఇటికతోను చాలా జాగ్రత్తగా కట్టుకురావాలి: ఒక పుస్తకాన్ని ప్రచురణ అయిన వెంటనే రెండు మూడు నెలలు అమ్మటము ఒకఎత్తు. దానిని ఎక్కువ కాలము అనగా పది పది హేను సంవత్సరములుపైగా అమ్మటము ఇంకొక ఎత్తు.

మీ మీ ప్రచురణకర్తలను ఎన్నుకోవడములో గమనించదగ్గ విషయాలు ఇవి. ఇవేకాకుండా ముఖ్యముగా చూసుకోవల్సినవి మీ ప్రచురణకర్తకు తనవృత్తిలో నిపుణత వుందా ? తన విద్యుక్తధర్మాలు తెలుసా ? అని తెలుసుకోండి. అవి అతనికి తెలుసును అని మీరు అనుకుంటే అతనికి మీ రచనను అప్పచెప్పి వూరుకోండి. అవి తెలియదు అనుకుంటే అతని దగ్గరకు పోవద్దు. ఇంకొకటి : అతనికి ఆర్థిక స్తోమత సరిగావుందా ? లేక ఒక వేళ ఒక ప్రత్యేక అవకాశముబట్టి ప్రచురణ మొదలుపెట్టాడా ? అని తెలుసు కోండి. ఎందుకంటే మీకు రావలసిన రాయల్టీలుగాని పారితోషికాలుగాని సరిగా సకాలానికి రావాలికదా మరి ?

ఏ ప్రచురణసంస్థ అయినా ఆర్థికంగా నాలుగు కాలాలపాటు నిలబడాలంటే వారి ప్రచురణ జాబితాలో ఎప్పుడూ విరివిగాఅమ్మే ప్రచురణలు ఎక్కువగా వుండాలి. అప్పుడే వారు కొత్తప్రచురణలతో జూదమాడగలరు.

మీ ప్రచురణకర్తను ఎన్నుకున్న తర్వాత అతనితో సహకరించండి. అతను తనపని ఎలాచెయ్యాలి అని మీరు పాఠాలు చెప్పకండి.

మీ పుస్తకము తమ వూరిలోని స్థానిక విక్రేతవద్ద కనిపించలేదని మీ స్నేహితు లెవరైన ఆశ్చర్యపోయి మీకు వ్రాస్తే మీరు ఆశ్చర్యపోకండి. ఆంగ్లనానుడి ప్రకారం ఏ విధముగానైతే గుఱ్ఱాన్ని నీటిదగ్గరకు తీసుకొని వెళ్ళగలమేగాని, నీరు తాగించలేమో, ఆవిధముగానే ప్రచురణకర్త పుస్తకాలను పుస్తక విక్రేతవద్దకు తీసుకొని వెళ్ళగలడే

కాని, అతనిచేత కొనిపించలేడు. సంవత్సరానికి కొన్నివందలూ వేలూ పుస్తకాలు ప్రచురణ అవుతున్నప్పుడు అవన్నీ పుస్తకవిక్రేత కొనలేడు, అమ్మలేడు కాని ఎవరైన కోరితే ఏ పుస్తక విక్రేత అయినా ఆ (మీ) పుస్తకాన్ని వెంటనే తెప్పించి ఇవ్వగలిగి వుండాలి. అట్లా కానిపక్షములో ఆవిషయము మీ ప్రచురణకర్తదృష్టికి తీసుకొనివెళ్ళండి. అపుడు ప్రచురణకర్త తగుఏర్పాట్లు చేసేందుకు వీలవుతుంది.

మరోవిషయము గుర్తుంచుకోవడం మంచిది. నేటి ప్రఖ్యాత రచయితలు ఒకప్పుడు అజ్ఞాత రచయితలే. మీ అజ్ఞాతరచనలను ముందుకు తీసుకొనివచ్చి ప్రచురణచేసి మిమ్మల్ని వెలుగులోనికి తీసుకొని వచ్చిన ప్రచురణకర్తను విడువకండి. మీకు పేరు ప్రఖ్యాతులు రాగానే మీరు ఇంకోప్రచురణకర్తను చూసుకొని మీకు మొదట సహాయపడిన ప్రచురణకర్తను విడవడం భావ్యంకాదు. అది ఏరు దాటినతర్వాత తెప్పను తగలబెట్టడము వంటిది.

ఇంకొక ముఖ్యవిషయము. ప్రచురణకర్త మీకు వ్రాసియిచ్చిన కాంట్రాక్టు; లేక ఎగ్రిమెంటు జాగ్రత్తగా చదువుకోండి. మీరు ఏవిధముగా అయితే మీ ప్రచురణకర్తను తన ఎగ్రిమెంటును పాటించాలనుకుంటారో అతనుకూడా మిమ్ములను మీ ఎగ్రిమెంటు ఆదేవిధముగా పాటించా లనుకుంటాడు.

ఈ విధముగా రచయితలను గురించి చెప్పటములో అందరు రచయితలు ఒకే కోవకు చెందుతారన్న ఉద్దేశము కాదు. వారిలో ఎందరో మహానుభావు లున్నారు. వారు ప్రచురణకర్తల పాలిటి దేవతలు. వారికి ఇవేవి వర్తించవు.

రాను రాను ఈ రోజుల్లో సాహిత్యము వ్యాపారముగా మారుతూవుంటే, రచనా, పుస్తకమూ బజారులో కొన్ని అమ్మే వర్తకపు సరుకుగా తయారవుతున్న ఈ రోజుల్లో రచయితలకు ప్రచురణకర్తలకు మధ్య సన్నిహితసున్నితసంబంధాలకు తావు లేకుండా పోయే అవకాశ మున్నది. కాని ఇది పోకుండా కాపాడేబాధ్యత ప్రచురణకర్తమీద రచయిత మీదకూడా వున్నది.

ప్రచురణకర్తలో రెండుపాత్ర లున్నాయి. ఒకటి వ్యాపారి. రెండవది సంపాదకుడు. కొన్నికొన్ని ప్రచురణ సంస్థలలో ఈ పాత్రను ఒక్కడే నిర్వహిస్తాడు. కొన్ని సంస్థలలో ఈ పాత్రలు వేరువేరుగా వుంటాయి. రచయితలపట్ల వర్తించేది ముఖ్యముగా ఈ రెండవపాత్రే — సంపాదకుడు. ఈ సంపాదకత్వమే రచయితల ప్రచురణకర్తల సన్నిహిత, సున్నితసంబంధాలను పెంచేది. ఈ సంపాదకుడు రచయిత. దృష్టితో, రచయిత కళ్ళతో చూస్తాడు. ఏ రచనలో ప్రతిభ వుందో ఆ రచన వెంటనే గుర్తుపట్టగల సామర్థ్య ముండాలి. ఆ ప్రతిభను గుర్తించడమే కాకుండా దానిని ప్రోత్సహించి దానిని రాణింపచేయడము అతనివిధి, కర్తవ్యము.

ఈ సంపాదకునకు చాలా నెమ్మదితనము, ఓర్పు చాలా అవసరము. ఇతరులు చెపితే ఓర్పుగా, శాంతముగా వినగలశక్తి వుండాలి. శ్రద్ధగా విన్నప్పుడే రచయితల దృక్పథం తెలుస్తుంది. ఒక్కొక్కప్పుడు విసిగించినప్పటికి విసుక్కోకూడదు.

ముఖ్యముగా తెలుసుకోవలసినది ఆ రచయిత భావనలో, ఆ రచయిత దృక్పథములో, ఆ రచనల్లో ప్రతిభ వున్నదా ? లేదా ? ప్రతిభ వున్నట్లయితే పాఠకులకు, ప్రజా బాహుళ్యానికి అందజేయాలని ఇది భావనా ప్రపంచానికి చేరవలెనని ప్రచురణకర్తలోని రెండవపాత్రకు (వ్యాపారికి) నచ్చచెప్పాలి. ఈ రోజుల్లో సాంఘిక విలువలు అతిత్వరగా మారుతున్నకాలంలో కొత్త కొత్త విలువల్ని, కొత్త రచనలద్వారా వస్తున్నట్లయితే వాటిని గుర్తుపట్టి వాటిని పాఠకలోకానికి, ప్రజాబాహుళ్యానికీ అందజెయ్యడం ప్రచురణకర్తల విధి. అంటే ప్రచురణకర్త అన్నీ ప్రతిభావంతమైన రచనలే ప్రచురణ చేస్తాడని కాదు.

ఈ ప్రతిభ భావనాచాతురిలో వుండవచ్చు, భాషాపటిమలో వుండవచ్చు, సామాన్య పాఠకుని ఆకట్టుకునేటట్టుగా వుండవచ్చు, కథాసంవిధానములో వుండవచ్చు. కాని సాహిత్య విమర్శకులను వుత్సాహపరచేవిగా వుండకపోవచ్చు. అట్లయినప్పటికి కొంత ప్రతిభ వుండవచ్చు. గొప్పరచనలనేవి రెండు తరగతుల పాఠకులకూ - సామాన్య పాఠకులకూ సాహితీవేత్తలకు ఇద్దరికీ అర్థమయ్యి, ఇద్దరి మెప్పు పొందేవిగా వుంటాయి. గొప్ప పుస్తకాలనేవి అందరిమెప్పు ఆదరణ పొందుతాయి. ఆ గొప్పపుస్తకాన్ని సరిగా గుర్తించ గలిగినప్పుడే ప్రచురణకర్త తన ఆదర్శానికి చేరుకోగలుగుతాడు.

*

కవిత్వం ఆంతరాంతర జ్యోతిస్సీమల్ని బహిర్గతం చెయ్యాలి
విస్తరించాలి చైతనపరిధి—
అగ్ని జల్లినా, అమృతం కురిసినా
అందం ఆనందం దాని పరమావధి.

—తిలక్.

# సాహిత్యం - సంఘం - మారుతున్న విలువలు

మంజుశ్రీ

మారుతున్న విలువల ప్రసక్తి వచ్చినప్పుడు, అసలు సాహిత్యపు విలువలనుగూర్చిన నిశ్చితాభిప్రాయం ఒకటి ఉండాలిగదా! సాహిత్యపు విలువలంటే ఏమిటి? అవి ఎలావుండాలి. ఇదివరలో ఎలా వుండేవి? ఇకముందు ఎలా వుండాలి. ఇప్పుడు వచ్చిన మార్పేమిటి? ఈ మార్పు మనం కోరుకోదగినదేనా! కాకపోతే ఏం చెయ్యాలి? అన్న ప్రశ్నలు తలఎత్తటం సహజమే. ఇటువంటి ప్రాథమికమైన విషయాలనుగూర్చిన జిజ్ఞాస, చాలా కాలాలలో, చాలాదేశాలలో, ఇదివరలోనే తలయెత్తకపోలేదు. అందరికీ సంతృప్తి కరంగా, సిద్ధాంత ప్రతిపాదనం చెయ్యడం శ్రమసాధ్యం. ఎందువల్లనంటే, అసలు సాహిత్యానికీ, వ్యక్తివికాసానికీ సంబంధం వున్నాదా? తద్వారా, సాంఘిక విలువలను సాహిత్యం అనుశాసించగలదా? లేక కనీసం ప్రభావితం చెయ్యగలదా? అన్న ప్రాథమికమైన ప్రశ్నలకు, అవును, కాదు అన్న సమాధానాలనుకూడా, వితర్కించే అవకాశం లేక పోలేదు. గాంధీగారిని ప్రభావితం చేసిన సాహిత్యం అందరినీ ఎందుకు ప్రభావితులను చేయలేకపోయింది? అన్న ప్రశ్నకు సమాధానం ఏమిటి? నన్నుమార్చిన పుస్తకం అని గానీ, నన్ను ప్రభావితుణ్ని చేసిన రచయిత అనిగాని ఎవరైనా, సాహిత్యం వ్యక్తిజీవితంపైన, తన ప్రభావం నెరపగలదన్న, స్వానుభవాన్ని ప్రతిపాదించినంతమాత్రాన, ఆ ప్రతిపాదనను సార్వజనీనమైన సిద్ధాంతంగా అంగీకరించాలా, అన్న ప్రశ్న ఎదురుకావటంలేదా? మనిషి జీవితంలో అంటే అభిరుచుల్లో, దృక్పథంలో, విశ్వాసాలలో, ఏదైనా ఒక సంఘటనకూడా, అటువంటి మార్పునే తేవచ్చు. తాను గౌరవించేవ్యక్తి సాన్నిహిత్యంవల్లకూడా, వ్యక్తిగతమైన అభిప్రాయాలూ, నమ్మకాలూ మారిపోవచ్చు. ఫలాని గ్రంథం చదివినందువల్ల, నా జీవితం ఈవిధంగా రూపొందిందని ఎవరైనా చెప్పగలరా? ఉంటే వాళ్ళు సామాన్యమైన ప్రమాణాలకు అతీతులనే చెప్పాలి.

అసలు సాహిత్యానికి, వ్యక్తిజీవితంలో ఎటువంటి స్థానంవున్నది సాహిత్యంతో మానవుడి సంబంధం ఏమిటి? ఇవి చాలా చిక్కుప్రశ్నలు. మనిషి జీవితంలో, శారీరకమైన అవసరాలను, ఆకర్షణలను, ఒప్పుకుంటేనే వీటికి భిన్నమైన అనుభూతికూడా, కోరుకొన్నవాడికి, ఉన్ముఖమైన చిత్తవృత్తికలవాడికి, లభించే అవకాశం ఉన్నది అని చెప్పవచ్చు. అదే సాహిత్యంవల్ల కలిగే అనుభూతి అయితే కేవలం రసానందము, మానసికమైన అనుభూతి, చిత్తవిద్రుతి మొదలైన పెద్దపెద్ద మాటలు, స్ఫురింపజేసే ప్రయో

జనం మాత్రమేనా, సాహిత్యం కూర్చేది ?! తదన్యమైన దేదీ లేదా అన్న ప్రశ్నకూడా వెంటనే కలుగుతుంది. సాహిత్యం సాధించే సాంఘిక ప్రయోజనం పరిమితమైనదే. అయినా సాంఘికమైన సుస్థితికి, ఉత్తమసాహిత్యం ఎంతో పోషకకారి. ఉత్తమ సాహిత్యానికి ప్రమాణాలను ఏవిధంగా నిర్ణయించటం ?

అభిజ్ఞాన శాకుంతలము, ఉత్తరరామ చరిత్రము, మనుచరిత్రము, వసుచరిత్రము వంటి గ్రంథాలు ఉత్తమసాహిత్యమా, కాదా ? అయితే అవి ఏ సాంఘిక ప్రయోజనాన్ని సాధిస్తున్నాయి. కాకపోతే ఎందుకుకాదు !

దీనివల్ల తెలుసుకోవలసింది ఏమిటంటే, విలువ లనేవి అవి నిజంగా విలువలే అయితే, ఎప్పుడూ మారవు. అంటే న్యాయంగా వాటి విలువలు తగ్గిపోగూడదు. ఉత్తమ మైన విలువలు, ఎప్పుడూ తమ ప్రమాణాన్ని కోల్పోవు. ఇక మారిపోయేవి అభిరుచులు సాంఘికావసరాలు. ఆ యా కాలాలకు, అవసరాలకు అనుగుణమైన ఆచారాలు, అభిప్రాయాలు. అంతేకాని సాహిత్యానికి సంబంధించినంతవరకు మౌలికమైన విలువలలో మార్పు అంటూ ఉండదు.

పాతకొత్తలకు ఎప్పుడూకూడా సంఘర్షణ వుంటూనే వుంటుంది. సంప్రదాయమూ, సంప్రదాయనిరాసమూ, వెలుతురూ, వెన్నెలలాగా, ఒకదానిని వొకటి వెన్నంటి వుంటూనే వుంటాయి. అంటే అవి అహోరాత్రాలవంటివి. ఇందువల్ల సంప్రదాయం పగలూ, సంప్రదాయనిరాసం చీకటి అనుకోకూడదు. చీకటికూడా అవశ్యం అనుభవనీయమైనదే. ఎందుకంటే చీకటి లేకపోతే వెన్నెల లేదు. సంప్రదాయాన్ని నిరసించడంలో తప్పు లేదు. సంప్రదాయాన్ని అనుసరించటంలోనూ తప్పులేదు. కాని పాత అంతా అవశ్యం పరిహార్య మనికాని, కొత్త అంతా అపరిహార్య మనికాని, అనుకోవాల్సిన అవసరం లేదు. ఇవాల్టి నవ్యత రేపటి సంప్రదాయం కావచ్చు. ఈవిధంగా కొత్త కొత్తగా నెలకొన్న సంప్రదాయాలన్నీ అవసరానుగుణ్యమైన నవ్యతలనే చెప్పాలి. భావకవిత్వం, నవ్యకవిత్వం, అభ్యుదయ కవిత్వం, అటుతరువాత దిగంబర కవిత్వం, ఇలాంటి నవ్యతాదృష్టితో పుట్టినటువంటివే. వీటివల్ల సాంఘిక ప్రయోజన మేదో సిద్ధిస్తుం దనుకోవడం భ్రమ. సాంఘికమైన సమస్యలను, ఆర్థికమైన, రాజకీయమైన పరిణామాలే చాలవరకు పరిష్కరించగలుగుతాయి. అంతేకాని సాహిత్యంలో బయలుదేరే చిల్లరమల్లరధోరణులు, సాంఘికమైన గతిని మార్చడం కల్ల. అవి తాత్కాలికమైన వినోదాన్నో, విప్లవధోరణినో, వింతపోకడలనో మాత్రమే, ఆశ్రయిస్తాయి. ఇవన్నీ అల్పకాలికమైన సంప్రదాయాలుగా మాత్రమే, పరిణమిస్తాయి. సాహిత్యం విధిగా సాంఘికప్రయోజనాన్ని సిద్ధింపజేయాలంటే, అటువంటిదే ఉత్తమ సాహిత్య మనుకొంటే కృష్ణశాస్త్రి కవికాడు. కాళిదాసు అంతకుముందే కాడు. వీళ్ళెవరూ సాహిత్యకులు కారు. అట్లా అనుకోవటంలో ఔచిత్యం లేదు కాబట్టి, సాహిత్యానికి సాంఘికదృష్టికూడా ఒక ప్రయోజన మనిమాత్రమే అనుకోవాలి. ఉత్తమ సాహిత్యానికి సంబంధించిన విలువలు, ఎప్పుడూ మారవు. మార్పులన్నీ విలువలు కావు.

మారకద్రవ్యాలు, మత్తుపదార్థాలు, సేవించడం, అభిలషణీయం కాదు. శరీరం పైనా, మనస్సుపైనా, అవి ప్రసరింపజేసే ఫలితాలదృష్ట్యా. కాని, అధికసంఖ్యాకుల వినియోగదృష్ట్యా, అది ఒక విలువ కాలేదు. ఎక్కువమంది లంచాలు తీసుకుంటూన్నారు కాబట్టి, సాంఘిక విలువలలోని మార్పుగా దానిని స్వీకరించలేము.

ఒక ప్రొఫెసరుగారు కాదు, అధికసంఖ్యాకులైన ప్రొఫెసర్లే అనుకుందాము, అనుచితమైన, అన్యాయమయిన మార్గం తొక్కి, డబ్బుతీసుకొని మార్కులు వేసి, లేదా యితరత్రా ప్రయోజనాలను ఆశించి, అవమార్గంలో నడిచి విద్యారంగంలోని పావిత్రాన్ని భ్రష్టుపరచినంత మాత్రాన, సర్వసంగపరిత్యాగుల మని చెప్పుకొనే ఆధ్యాత్మికాచార్యులు, ప్రచారంకోసం, పేరుప్రతిష్ఠలకోసం, రాజకీయనాయకులను, అధికారవర్గాన్ని చేరదీసినంతమాత్రాన, వీటిని ఆయారంగాల కొత్తవిలువలుగా జమకట్టగలమా ? అవి విలువలు కావు. దిగజారిపోయిన, పరిస్థితులను మాత్రమే వ్యక్తంచేస్తాయి. పదిచోట్ల జరిగిన సాహిత్యసమావేశంలో ఒకరి నొకరు వక్తలు పొగడుకొన్నమాత్రంచేత, వెకిలి ప్రసంగాలు చేసినంతమాత్రంచేత, మారినవిలువలు అవి అనలేము. విలువలెప్పుడూ మారవు. గాంధీగారు ప్రతిపాదించిన సిద్ధాంతాలు, నేడు అక్కరకు రానివై పోయినంతమాత్రంచేత, ఆచరణయోగ్యమయినవి కావని నిరూపణం అయిపోయినతరువాత కూడా అవే విలువలు కాని ప్రచురంగా కొనసాగుతున్న అస్తవ్యస్త పరిస్థితులే నేటి విలువలని చెప్పకూడదు.

అధికారంలో వున్నవాళ్ళు, అజమాయిషీ చేయవలసినవాళ్ళు, అలసులైతే అక్రమపరులైతే, సంఘంలోని సామూహిక బలహీనతలన్నీ, విజృంభిస్తాయి. అవకాశాన్నిబట్టి వ్యక్తిగతమైన బలహీనతలు, తలఎత్తేట్లుగానే, స్వార్థపరులు, కుత్సితులు, అధికారులైనప్పుడు, సాంఘికవ్యవస్థలో అక్రమాలు తలఎత్తుతాయి. చీకటి పడగానే, గుడ్లగూబలూ, గబ్బిలాలు, ఇంకా వివిధజంతువులు ఆహారంకోసమూ, బయలుదేరినట్లుగా, సామూహికమైన అక్రమాలు బయలుదేరుతాయి. అంతటితో అశాంతి, దౌర్జన్యం, సంఘర్షణలు, రక్తపాతాలు, తిరుగుబాట్లు చెలరేగుతాయి. సకాలంలో వర్షాలుపడి, ఇంకేమీ ఆధివ్యాధులు లేకుండా వాటికి గురి కాకుండా, పంటలు బాగా పండితే, ఆహారధాన్యాల ధరలు నిలకడగా వుంటాయి. నలుగురికీ దొరుకుతాయి. అంతే కాని తుఫానులు, ఉప్పెనలు, వర్షాభావం మొదలైన విపత్తులన్నీ ఎదురైన సంవత్సరం, క్షామపరిస్థితులు, ఆక్రోశం, పగలూ, కార్పణ్యాలు, దొంగతనాలూ, ఎక్కువవుతాయి. అట్లానే పాలకులు బుద్ధిమంతులై, సాంఘికన్యాయాన్ని చక్కగా అమలుజరిపితే, అనుశాసిస్తే, ఈ తిరుగుబాటుధోరణులు హింసాత్మక ప్రవృత్తి, అశాంతి, కలిమిలేములమధ్య కలహాలు, కార్పాణ్యాలు తలెత్తవు.

ఇప్పుడు మనం దేశంలో చూస్తున్న పరిస్థితు లివి. ఈ పరిస్థితులను సాహిత్యం ప్రతిఫలిస్తున్నదా ?? అంటే లేదనే చెప్పాలి. అయితే ఈ పరిస్థితులవల్ల కలిగిన అయోమయం, అనిశ్చిత విప్లవధోరణులు, హింసాత్మకప్రవృత్తివలన కలిగిన తదితర ప్రభావాలు, సాహిత్యంలో కూడా కొంతకొంత కనబడుతున్నాయి. దిగంబరకవిత్వం ఆధోనిర ప్రతిధ్వని. ఇంకా కొన్నిరకాల ధోరణులున్నాయి. ఆ ధోరణులు వాస్తవ విషయాలను గమ

నించకుండా, కలల్లోకి. కల్పనలలోకి వెళ్ళిపోతున్నాయి; శిల్పం దృష్ట్యాకాని, సాంఘిక ప్రయోజనం దృష్ట్యాకాని, ఉత్తమమైన కళాత్మకరూపాలు,సాహిత్యంలో ఇప్పుడు వెలువడటంలేదు. దీనికి కారణం ఏమిటి? సాంఘిక పరిస్థితులే! అక్రమార్జనపట్ల,సుఖాలానత్వంపట్ల, మానవుడి అభిప్రాయాలు మారిపోయినయ్. పోటీపరిస్థితుల్లో, ఐహికభోగపరత్వం, ప్రాపంచిక విషయాలపట్ల, విపరీతమైన తగులమూ, తప్పుకాకపోవచ్చునేమో కాని, వాటిని పొందడానికి తొక్కే మార్గమూ, ఉచితమైనదిగా ఉండాలి. కాని, సంఘంలో ఈ దృష్టి ఇప్పుడు బాగా తగ్గిపోయింది. ఏదో ఒకవిధంగా, డబ్బు సంపాదించటం, కీర్తి సంపాదించటం, సుఖపడటం పరమప్రాప్యాలై పోయినయ్. అలాంటి ప్రయత్నాలు ఫలించడం జరుగుతున్నది. దాంతో, సంఘంలో వర్గసంఘర్షణం అనివార్యమైనది. ఒకడు తన అవసరాలకు మించి కూడబెట్టుకొని కులుకుతున్నాడు; ఒకడు తన అవసరాలైనా తీరక అలమటిస్తున్నాడు. దీంతో ఈర్ష్యాద్వేషాలు పెచ్చుపెరిగిపోయినయ్. ప్రభుత్వం సాంఘిక దురన్యాయాలపట్ల, నిస్సహాయంగా వుండిపోవడమే కాక, కొన్ని కొన్ని సందర్భాలలో వేరు వేరు కారణాలను పురస్కరించుకొని, అక్రమాలను ప్రోత్సహించడం కూడా జరుగుతున్నది. ఇవన్నీ సామాన్యుడికి విశదంగా, విశ్లేషించి చూపేవాళ్ళు లేకపోతున్నారు. ఈపని ఎవరు చెయ్యాలి. రచయితలు చెయ్యాలి. కాని వాళ్ళు చెయ్యటంలేదు. నవలకాని, కథకాని, కవిత్వంకాని, నేడు వెలువడుతున్న ఏ ప్రక్రియను పరిశీలించిచూసినా, అయోమయం, ఆక్రోశం, అశాంతి. సరైనరూపంలో ప్రతిధ్వనించటం లేదు. లేకపోగా కాల్పనికమైన సన్నివేశాలతో, ఊహాలోకంలో, విహరిస్తున్నారు. కొందరు సాంఘిక చైతన్యాన్ని ప్రబోధించాలని, ఆరాటపడుతున్నవాళ్ళు కూడా, ఆ పనిని సక్రమంగా నిర్వహించలేకపోతున్నారు. మన్నుదిన్నపాముల్లాగా నిద్రపోవడమూ; వీధుల్లో విశృంఖలంగా కేకలువేసి కనపడినదానినల్లా నాశనంచేయడము, రెండూ విపరీతధోరణులే. ఇవాళ మనదేశంలో, మన సంఘంలో, మనం అనుభవిస్తున్న, అసంతృప్తికి, అరాచకానికి ఆందోళనలకు అయోమయ పరిస్థితులకు, బాధ్యులయినవాళ్ళు పాలకులే. వాళ్ళవల్లనే ఈ పరిస్థితులు వచ్చాయి. ఒక కుటుంబములో నలుగురువ్యక్తు లుంటే, వాళ్ళందరి బాగోగులు చూసే యజమాని, అందరి మంచిచెడ్డలకు, సుఖదుఃఖాలకు, బాధ్యత ఎట్లా వహించవలసి వుంటుందో, అట్లానే పరిపాలనా యంత్రాంగాన్ని నడుపుతున్న నాయకమ్మన్యులు, అవినీతిని, అశ్రితపక్షపాతాన్ని, అలసత్వాన్ని, అన్యాయాలను, తమ కళ్ళముందు--గోళ్ళు, కోరలు పెంచుకొని పెరిగిపోతుంటే, చూస్తూ వూరుకున్నారు. అలసభావం వహించారు. ప్రోత్సహించారు. పాముకు పాలు పోస్తే కరవకుండా వుండదు. ఎప్పుడో ఆ రోజు రాకపోదు. బహుజనహితము, బహుజనసుఖము, అని నినాదాలు వల్లించినంతమాత్రంచేత ఈషత్తూ ప్రయోజనం వుండదు. ఇవీ ఇప్పటి సాంఘికపరిస్థితులు. వీటిని పురస్కరించుకొనే యువతరం తిరగబడుతున్నది. ఇదివరకు అంగీకరించిన ప్రతిసిద్ధాంతాన్ని, విసుగుతో, కసితో, హింసాత్మకప్రవృత్తితో, నిరసించటానికి కారణం ఈ పరిస్థితులే. భీతావహమైన పరిస్థితుల్లో, మనుషులు చల్లాచదరైపోయేవిధంగా, పాతఆలోచనలు, పాత

పద్ధతులు పాతకాలపు ఆశయాలు, ఆచారాలు, కకావికలై పోతున్నాయి. ''కదిలేది, కదిలించేది, మారేది మార్పించేది, పెనునిద్దుర వదిలించేది, పరిపూర్ణపు బ్రతుకిచ్చేది కావాలోయ్,'' అని కవి అంటే, పాతకాలపు అలంకారాలకన్నా, ప్రత్యేకత ఏమున్నదికనుక: పొగగొట్టపు భూంకారధ్వని, అరణ్యమున హరీంద్రగర్జన, కలకత్తా కాళిక నాలిక, రుద్రాళికనయనజ్వాలిక ...ఏమి టివన్నీ ...పులి చంపిన లేడినెత్తురు... అంటే కవిగారు, అనాలోచితంగా బలవంతులు, అధికారులు, ధనవంతులు, బలహీనులను దోపిడిచేసిన చారిత్రక సత్యాన్నే ప్రతిపాదించారు. ఉద్రేకంతో వొళ్ళుమరిచిపోవడం, కేకలువేస్తూ చిందులుతొక్కడం, ఆక్రోశంతో గొంతు చించుకోవడం, ఇవి కాదు సాహిత్యం సాధించవలసింది.

మనిషిని మానవత్వపు విలువలపట్ల మగ్నమానసుణ్ణి చేయడమే ఉత్తమ సాహిత్యపు ధోరణిగా ఉండాలి. మనస్సుకి ఒక బలమూ, సంస్కారమూ, అన్యాయాలను ప్రతిఘటించగలశక్తి, జీవితానికి వొకధ్యేయమూ, ఆలవరిచేదే సాహిత్యపు ముఖ్య ప్రయోజనంగా వుండాలి.

ఫిజిక్సుతో పదార్థభౌతికలక్షణాలను వివరించే ఒకసిద్ధాంతం వుంది. అది ఏటవాలుబల్లసిద్ధాంతం, వాలుతలకోణం పెరిగినకొద్దీ, బల్లమీద వున్న పదార్థం అమితవేగంగా, పడిపోతుంది. వాలుకోణం తగ్గించినకొద్దీ, పైనుంచి కిందకి పడిపోయే కాలవ్యవధి ఎక్కువవుతుంది. ఈ సిద్ధాంతాన్ని సాహిత్యపు విలువలతో సమన్వయం చేస్తే, మనిషిలోని మేలిమి భావాలను జారిపోకుండా, వేగంతో కిందికి పడిపోకుండా, వాలుకోణాన్ని, సంఘంలో మనం బాగా తగ్గించాలి. ఇటీవల ఉత్తమాభిరుచులను ప్రోదిచేసే సాహిత్యం వెలువడటం లేదు. సెక్సుసాహిత్యం విపరీతంగా విజృంభిస్తున్నది. పత్రికలవాళ్ళుకూడా, సాంఘికాభ్యున్నతిదృష్టితో కాక, వ్యాపారదృష్టితోను, వ్యక్తిగతాభిమానాలతోను, రచనలను, రచయితలను ప్రోత్సహిస్తున్నారు.ఇప్పుడు పత్రికలలో వెలువడుతున్న కథల్లోనూ, నవలల్లోనూ, ఎక్కువగా, కాల్పనికధోరణే కనిపిస్తున్నదికాని, వాస్తవికమైన ధోరణి కనిపించటంలేదు. ఇది ఒక సంధియుగం. పాతవిశ్వాసాలు సడలిపోయినాయి. కాని, కొత్తదైన వొకసంస్కారం, బహుజనహితంకరమైన వొక వ్యవస్థ రూపొందలేదు. ప్రాంతీయమయిన దురభిమానాలు, నైతికవిలువలపతనం, సంఘర్షణ, కులం, మతం, భావ, రాజకీయసిద్ధాంతపరమైన అభినివేశాలు, దేశాన్ని అల్లకల్లోల పరుస్తున్నాయి. తన కుటుంబాన్ని తాను బాగుపరచుకోవాలని మనిషిపడే తాపత్రయమే, తన సంఘం, తన దేశం, తన వారసులు, ఒక సువ్యవస్థలో జీవించాలని, తాపత్రయపడితేతప్ప ఈ పరిస్థితులు మారవు.

ఇంత అశాంతిలో, జీవిస్తున్నాం కనుకనే నైతిక విలువలపట్ల నిరాదరణం ప్రబలిపోతున్నది. నైతిక విలువలపట్ల, శ్రద్ధాసక్తులు సన్నగిల్లిన కాలంలో ఉత్తమ సాహిత్యం వెలువడే అవకాశం లేదు. అశాంతి, ఆందోళనలమధ్య, మానసికమైన వినోదంకొరకు, మనిషిలోని బలహీనతలను రెచ్చగొట్టే రచనలకే ప్రాచుర్యం లభిస్తుంది.

యువతరం మేలుకోవాలి. సామూహికమైన శాంతి, భద్రతలకోసం, తమమార్గాన్ని సువిస్పష్టం చేసుకోవాలి. ఆ గమ్యానికే పయనించాలి. సాంఘిక పరిస్థితుల ప్రభావం, సాహిత్యంపైనా, సమకాలీన సాహిత్యవిలువల ప్రభావం సంఘంపైనా ఎప్పుడూ వుంటూనే వుంటాయి. మనిషి మనిషిగా మనుగడ సాగించనినాడు, ఎన్ని ధర్మపన్నాలు వల్లించినా, ఎన్ని నినాదాలు సృష్టించినా, ఎన్ని సదోధ్బలు చేసినా ఏమీ ప్రయోజనం వుండదు. మనిషి తప్పుచేసినప్పుడు ఆ తప్పును శిక్షించగల, సరిదద్దగల ప్రభుత్వమూ వుండాలి. దీనిని ఉద్బోధించగల, ఈ విధమైన సంస్కారాన్ని నేర్పగల సాహిత్యం ఇప్పుడు మనకు అత్యంతావశ్యకం.

*

కుహనాసంస్కారాల కుటిలతనుండి, కృత్రిమతనుండి
నుడులనుండి, జడులనుండి
వలలనుండి, జలగలనుండి
విడివడే స్వేచ్ఛ స్వేచ్ఛ స్వేచ్ఛ
స్వేచ్ఛ కావాలి నాకు.
పాడవోయి సోదరుడా!
కవీ! కవీ! మానవుడా!

—వే. నరసింహారెడ్డి

# రచయితలు - క్రమశిక్షణ

**డా. భీమసేన్ 'నిర్మల్'**

పోలీసులకు, సైనికులకువలె, రచయితలకుకూడా క్రమశిక్షణ ఏమిటి అన్న ప్రశ్న కలిగింది. రచయిత "స్వాంతఃసుఖాయ" రచనలు చేస్తాడనేవారు, ''ఆర్ట్ ఫర్ ది సేక్ ఆఫ్ ఆర్ట్'' (Art for the sake of Art) అనే సిద్ధాంతాన్ని అనుసరించి, రచయిత స్వేచ్ఛగా తన అభిప్రాయాలను అభివ్యక్తీకరించవచ్చుననేవారు, దీనిని త్రోసి రాజన వచ్చును. ఏవిధమైన నిబంధనలను నియమాలను కాని వారు అంగీకరింపకపోవచ్చును. కాని ఎవరు ఏమన్నా పాఠకుల హృదయాలను ప్రభావితంచేసి, తను పొందిన అనుభూతినే వారు పొందేట్లు చేయగలగటమే ప్రతి రచయిత లక్ష్యంకదా! సాధన చేయని, క్రమశిక్షణ లేని రచయిత తన మనోభావాలను, సిద్ధాంతాలను పాఠకుల హృదయఫలకంపై హత్తుకు పోయేట్టు వ్రాయలేడు. జనసంకులమైన రాజమార్గంలో వాహనాన్ని నడిపే రథచోదకుడు (Driver), అతిజాగ్రత్తగా, చాకచక్యంతో తన గమ్యాన్ని చేరుకోవడానికి ప్రయత్నించి నట్లే. రచయితకూడా తన లక్ష్యసాధనకు ప్రయత్నంచేయాలి. అంటే పాఠకుని హృద యాన్ని ప్రభావితం చేయకలగాలి, దానికై క్రమబద్ధమైన పంథాను అనుసరించాలి.

పాఠకుడు లేనినాడు రచయిత ప్రయత్నం వ్యర్థమేకదా! అనంతకాల సాగరంలో, విపులమైన పృథ్వీమండలంలో, ఎన్నడైనా తన రచనకు పాఠకుడు దొరక్కపోతాడా అని అనుకున్న మహాకవికూడా తన రచనకు పాఠకుడు కావాలని కోరుకున్నాడు. కనుక రచయితకు పాఠకునికి గల అవినాభావసంబంధం త్రోసిరాజనడానికి వీలులేనిది.

ప్రయత్నపూర్వకమైనది లేక ప్రయత్నజన్యమైనది ప్రచారసాహిత్యం అవుతుంది కాని సార్వజనీనమైన, శాశ్వతత్వంగల సాహిత్యం ఎలా అవుతుందనే సందేహం కలుగ వచ్చును. ఇక్కడ సాధన, క్రమశిక్షణ అంటే అప్రయత్నంగా (Spontaneous) దొర్లు కువచ్చే కవితా ప్రవాహాన్ని సరియైన పంథాలో ప్రవహింపచేయటము. ఈ ప్రయత్నము బాహిరమైనదే కాని, ఆంతరికమైనదీ, కవితోద్వేగానికి చెందినదికాదు. ఆ ఉద్వేగం కలిగి, కవిత్వం పొర్లుకొని వచ్చినపుడు, దానికి సరియైన మార్గం కలిగించడమేనని భావం. ఇలా అనటంతో కవిత్వానికి ఒక ప్రయోజనం ఆపాదించినట్లవుతుంది. ప్రయో జనరహితమైన పదార్థం ఈజగత్తులోనే లేదని ప్రతివారు ఒప్పుకొనకతీరదు. కళయొక్క మనోముగ్ధకరమైన సౌందర్యమే దాని పరమప్రయోజనమని చెప్పవచ్చును. కాని ఆ సౌందర్యభావనను, శ్రేయోభావనతో జోడించిననాడే, అది మంగళమయం కాగలదు. ప్రాచేతసుని మొదలుకొని, నేటి యువకవి వరకుగల రచయితల రచన లన్నింటికి ఏదో ఒక ప్రయోజనం, అభిప్రాయం ఉండనే ఉన్నది. నిరుద్దేశ్యమైన నిర్మాణం ఉంటుందనడా నికి వీలులేదు. కనుక ఆదర్శవాది అయిన రచయిత కానివ్వండి యథార్థవాది అయిన

రచయిత కానివ్వండి, ఏదోఒక ప్రయోజనాన్ని ఆశించే రచన సాగిస్తాడు. ఆదర్శవాది అయిన రచయిత సమస్తసృష్టిలోగల గుణాలనే, మంచివిషయాలనే—పద్మపాణి అయిన బుద్ధుడు, పంకంనుండి పద్మాన్ని పైకి లేవనెత్తినట్లు— చెడులోకూడా అంతతః మంచినే చూసి వర్ణిస్తాడు. తన రచనలవల్ల మానవజాతి సాంస్కృతికంగా పురోభివృద్ధి చెందుతుందని, లోకకల్యాణం విశ్వశ్రేయస్సు ఉపలబ్ధమవుతవని ఆశిస్తాడు. యథార్థవాది మంచిచెడులను, గుణదోషాలను యథాతథంగా వర్ణించి, విషయాన్ని పాఠకుని నిర్ణయానికి వదిలేస్తాడు. దృక్పథం వేరయినా, సమకాలీన జీవితంలోని సార్వజనీన సత్యాలను అభివ్యక్తీకరించి, వీరిద్దరుకూడా పాఠకుని ప్రభావితం చేయాలనే అనుకుంటారు. దీనినే శాస్త్రీయపరిభాషలో "సాధారణీకరణం" అంటారు. తనకు కలిగిన అనుభూతే, పాఠకునికి కూడా కలగజేయడం కవికర్మయొక్క సార్థకత్వం. రచన సార్థకం కావాలంటే, రచన పాఠకుని హృదయాన్ని కదిలించాలంటే రచయిత తన రచనలోని భావపక్షాన్ని, కళాపక్షాన్నికూడా సమన్వయపరచుకొని, కలం సాగించాలి.

ప్రాచీనకాలంలో రచయితలకు శక్తి, నిపుణత, అభ్యాసము అవసరమనుకునేవారు !* ఈనాడు గుణగణాలు అవసరమని తలంచబడటంలేదు. కాని ఇంతో అంతో ప్రతిభ లేకుండా ఎవరూ రచన సాగించలేరు. ఒకవేళ సాగించినా, అది మఖలో పుట్టి పుబ్బలో మాడిపోవడటం జరుగుతుంది. ప్రతిభ కలిగిఉండి, నైపుణ్యాన్ని సముపార్జించుకొని, దాన్ని అభ్యాసంతో మెరుగుపెట్టుకోగలిగితే రచయిత తన రచనకు సార్వజనీనమైన శాశ్వతత్వాన్ని ఆపాదింపచేయగలడు. భాషమీద సరియైన అధికారంలేని రచయిత రచనల వల్ల అర్థంకంటే అనర్థమే ఎక్కువ జరుగుతుంది. ప్రభావోత్పాదకములయిన విషయాలను ప్రకటించడానికి గల సాధన బాషతప్ప మరొక్కటి లేదు. భాషలోని పదాలను ఏర్చి, కూర్చి, తీర్చి రసవంతంగా విషయాన్ని వెల్లడించగల నేర్పు నిరంతర సాధనచే వచ్చేదే కాని తనంతట తానుగా వచ్చేదికాదు.

రచన చేయటమన్నా, రచనను చదివి ఆనందించటమన్నా సులభమయినపనికాదు. కనుకనే రచయితల సంఖ్యవలెనే, సహృదయులయిన పాఠకుల సంఖ్యకూడా పరిమితమే. పరిమితమైన సంఖ్యకల అట్టిపాఠకులను మెప్పించకలిగేట్టు రచయిత రచనసాగిస్తే, అది మిగతావారిని గూడా ఆనందపరచగలదు. ఇతరుల దూషణ-భూషణలతో నాకు నిమిత్తం లేదనుకునే రచయితకు ముద్రణతో నిమిత్తంలేదు !

కళాకారుని హృదయంలోని వేదన, ఆర్తి అతన్ని ఆత్మాభివ్యక్తికై పురికొల్పుతాయ్. రసోద్రేకం, భావనాశక్తి, ప్రజ్ఞావిశేషం కలిగి, రచనా పద్ధతితో చక్కగా పరిచితుడైన రచయిత పాఠకులను ప్రభావితం చేయగలడు: పరిష్కృతమనస్కతతో, క్రమబద్ధమయిన పద్ధతిలో చేయబడిన రచన జీవనమహాసాగరంలోని ఒక ఉత్తుంగ తరంగం కాగలదు.

---

* శ్లో॥ శక్తిర్నిపుణతా లోకశాస్త్ర కావ్యాద్యవేక్షణాత్
కావ్యశిక్షాభ్యాస ఇతి హేతు స్తదుద్భవే ॥ —(మమ్మటుడు).

# సాహిత్యమూ - జాతీయకరణ

డా. సుప్రసన్న

దేశ రాజకీయసాంఘిక రంగంలోని అవ్యవస్థయే నేటి సాహిత్యరంగంలోనూ ప్రతిఫలిస్తున్నది. రాజకీయధోరణుల్లో సాంస్కృతికవ్యవహారాల్లో వైదేశికముద్ర సర్వత్రః కానవస్తున్నది. సాహిత్యరంగంలోకూడా రూపవిషయంలో, వస్తువిషయంలోనూ ఇదే విదేశీయ ప్రాబల్యం కానవస్తున్నది. పరాసుదేశంలో చేసి పాతపడ్డ ప్రయోగాల విషయంలో మోజు, రష్యాదేశంలో చెప్పబడే సిద్ధాంతాలపై ఆసక్తి, అమెరికాలో కొందరు మానసిక అవ్యవస్థగల యువకులు ప్రవర్తిస్తున్న తీరుపై మోహం - ఇలా మొత్తంమీద ఆధునికధోరణిపేర స్వదేశీచింతన లోపిస్తున్నట్లు తోస్తున్నది.

మనకు జాతీయజీవనంలో స్వదేశీమంత్రం గాంధీజీ చెప్పింది. ఈ జాతి సర్వతోముఖాభివృద్ధికి దీన్ని మించిన మార్గంలేదు. సాహిత్యంలో, ముఖ్యంగా కవిత్వంలోకూడా ఈ మార్పు అవసరం. భావకవిత్వం రోజుల్లో దాని అభివ్యక్తిలో, ప్రగతివాద ధోరణిలో దానివస్తువులో, ప్రయోగవాదమార్గంలో దాని అనేక లక్షణాల్లో ఈ విదేశీముద్ర ఉండేది. స్వాతంత్ర్యం తరువాత వచ్చిన 'నవకవితా' మార్గంలో ఈ లక్షణం కొంత సన్నగిల్లినది.

మనసాహిత్యవిమర్శలో ఈకాలంలో ఏర్పడ్డ అవ్యవస్థకుకూడా ఇదే కారణం. మనదేశముసాహిత్యాన్ని విదేశీ ప్రమాణాలతో కొలవడం, దానిని ఎలాగో అన్వయించాలనే కోరిక ఎన్నో తప్పుడు నిర్ణయాలకు కారణం అవుతున్నది. ఆ దేశాల్లో సంస్కృతి, సాంఘిక పరిస్థితులు, దానివల్ల ఉద్భవించిన సారస్వతమూ, తద్విమర్శా మనదేశంలో తద్భిన్నపరిస్థితుల్లో యథారూపంలో అన్వితం కావడం ఎలా జరుగుతుంది ?

ఈ సంక్లిష్టవేళలో మన సారస్వతాన్ని విమర్శననూ అన్నివిధాలా జాతీయం చేయవలని యున్నది. ఈ జాతీయీకరణంవల్ల సారస్వతంలోని ఎన్నో అనారోగ్య లక్షణాలు వాటంతట అవి తొలగిపోగలవు. మన పరిస్థితులు, మనభాషల జీవలక్షణం, మన అవసరాలు, మన సంస్కృతీ, సంప్రదాయాలూ, మనసాహిత్యశాస్త్రసంపద ఇవన్నీ ఆధారంగా మనం ఆధునిక సాహిత్య దర్శనాన్ని నిర్మించుకోవలసి ఉన్నది. అది ఆధారంగా ఒక వ్యవస్థ ఏర్పరచవలసి ఉన్నది.

మన సువ్యవస్థితమైన పరిస్థితిలో ఏ వైదేశికమయిన సంప్రదాయమయినా మనం స్వీకరించదలిస్తే అది మన వ్యవస్థలో అంతర్భవించిపోతుంది. ఈ సువ్యవస్థయే మనలను ఆధునిక జీవన చైతన్యాన్ని స్వీకరించేందుకు అనువుగా తీర్చగలుగుతుంది. ఆ వ్యవస్థ లేనప్పుడు మనం ఏది స్వీకరించినా అది పైపై మెరుగుల్లాగానే ఉంటూ జాతి జీవన ప్రవాహంలో లీనమయి ప్రవహించదు. మార్పు ఏ వ్యవస్థలోనూ తప్పదు. కాని అది క్రమంగా జరుగుతుంది; ఈ దశలన్నింటికీ ఒక అనుస్యూతి ఉంటుంది.

జాతీయాకరణంవల్ల సారస్వతం ఎప్పుడూ సజీవంగా నవం నవంగా సార్వజనీనంగా ఉంటుంది. దేశీయసంపదలో భాగమౌతుంది.

సారస్వతాన్ని జాతీయం చేయడం అంటే ఈ దేశప్రజల జీవనాడిని దానిలో స్పందింప జేయడం. ప్రజల అనుభూతులు, భావనలు ఆసేతుశీతాచలం వ్యాపించిఉన్న ఏకభావన ఇవన్నీ సారస్వతంలో ప్రతిఫలిండడం. అంతవరకూ అవిదితంగా ఉన్న విభిన్నభారతీయభాషలమధ్య సాన్నిహిత్యాన్ని పెంపొందించడం - ఆ విధంగా ఈ సమైక్యతకు ఎక్కువ దోహదం చేయడం.

దేశమంటే మట్టికాదని పెద్దలు చెప్పినారు. దేశమంటే జీవిస్తూవున్న మనుష్యులు మాత్రమేకాదు. ఇదివరలో జీవించిన, భావికాలంలో జీవింపబోతున్న మనుష్యులూ, వారి సఫలజీవనానికి కారణాలైన నదీనదపర్వతములు మాత్రమేకాదు-ఇంకా వారి తాత్త్విక, కళాత్మక, సారస్వత సంప్రదాయాలుకూడా వీటన్నిటి సమాహారమయిన సమన్విత మయిన లక్షణమే జాతీయత. ఇదీ కాలంవంటి అవిచ్ఛిన్న ప్రవాహమే. మన సారస్వతానికి ఈలక్షణం అంతఃస్రోతస్సు కావాలి.

స్వాతంత్ర్యానంతరం తెలుగు కవితా రంగంలో ప్రచండమైన మార్పు ఈ జాతీయాకరణకు అభిముఖంగా జరిగింది. తత్పూర్వం విజృంభించిన తిరుగుబాట్లు త్వరలోనే సమసి ఒక సమన్వితమైన దృక్పథం ఆ స్థానంలో నెలకొంటున్నది. కవితలో పరిచ్ఛినములైన వైయక్తిక ప్రతీకల స్థానంలో ప్రజాసామాన్యం వ్యక్తం చేసే భాషామార్గం నెలకొన్నది. దేశాన్ని విడిచి "మరోప్రపంచం" వైపు పరుగులెత్తే ధోరణి తొలగి స్వదేశీయుల సౌభాగ్య సాధనలో కవి కంఠమెత్తి పలుకడం జరిగింది. సర్వ సారస్వతాన్నీ సర్వసంప్రదాయాన్నీ తిరస్కరించిన ప్రగతివాదస్థానంలో అవిచ్ఛిన్నమైన సంప్రదాయం పునాదిగా వర్తమానంలోకి ఎదుగుతున్న వర్థమానకవులతరం ఒకటి వెలసింది.

ఈ మార్పు నిజంగా స్వాగతించ దగిందే. సారస్వతంలో సంప్రదాయమూ ఆధునికతా ఆరంభంలో పరస్పర విరుద్ధంగా యుద్ధసన్నద్ధాలు అన్నట్లుగా కానవవస్తవి. కాని, ఇవి ఈ విధంగా సమన్వయం కావడానికి భారతజాతి యొక్క కొత్తదనాన్ని స్వాయత్తీకరించుటకునే తత్త్వం కారణం.

వర్తమాన కవుల దృష్టి ప్రయోగాలనుంచి రసనిర్భరమయిన కావ్యాల నిర్మాణం వైపుగా మళ్ళింది. ఇది మానవజీవనంలోని ఏక దేశాన్ని కాక సర్వసమగ్రంగా అన్ని పార్శ్వాలనూ దశలనూ, ఎత్తులనూ, లోతులనూ చిత్రించడానికి ఆధునిక భారతీయ జాతీయాత్మను దర్శించడానికీ మార్గం.

ఆధునిక సాహిత్యపునరుజ్జీవనంలో భారతీయభాషలు మిక్కిలి సన్నిహిత మవుతున్నవి. పరస్పరభావవినిమయంతో, ఆదానప్రదానాలతో, తమలో తమకు ఒక ఐక్యతాబంధాన్ని భావించడం జరుగుతున్నది. ఇది క్రమముగా ఒక భారతీయసాహిత్యావిర్భావానికి కారణం కాగలదు.

# విద్యార్థిరచయితల విలువలు

**శ్రీ ఎన్. ఇన్నయ్య**

**విలువలచర్చ :**

విలువలన్నీ మానవసృష్టి. ఆధ్యాత్మిక, నైతిక విలువలకు విపరీత ప్రాధాన్యత యిచ్చిన దీమానవుడే. కనుక విలువలంటే మానవవిలువ అన్నమాట. ఇందులో స్వేచ్ఛ, స్వాతంత్ర్యం, న్యాయం, సమానత్వం, నీతి మొదలైనవి బేరీజువేసి చూస్తే, స్వేచ్ఛకు ప్రథమస్థానం లభిస్తుంది. మిగిలిన విలువలన్నీ అందులోనుండి వ్యుత్పన్నమయ్యేవే.

విలువ అంటే యేది అనుసరించటంద్వారా మానవుడు ప్రగతి చెందగలడో అదే. ఆధ్యాత్మిక, మానవతా విలువలకు స్పర్థమాత్రమే గాక, పరస్పర విరుద్ధత్వంకూడా వున్నది.

ఆధ్యాత్మిక విలువలుకూడా మానవునిసృష్టి అయినప్పటికీ, వాటికి అలౌకికశక్తి ఆపాదించి, అవి శాశ్వతమనీ, అపౌరుషేయమనీ, దైవం చెప్పాడనీ, మానవుడు శాసించాడు. అవి పాటించకపోతే పాపమన్నాడు. ఆధ్యాత్మిక విలువలు పాటించటం భయం వలననే. మరణానంతరం ఆత్మకు ఏదో జరుగుతుందనే భయమే యిందుకు కారణం. అందుండి చాలా సంస్థలు జనించి మానవుని స్వేచ్ఛకు సంకెళ్లువేశాయి.

మానవవిలువలలో అలాంటి భయాలేవీ లేవు. విజ్ఞానశాస్త్రీయపంథా ననుసరించే యీ విలువలు యేర్పడినయ్. అవి పాటించకపోతే సమాజం సరిగా నడవదు. ప్రగతి వుండదు. కనుక యీ విలువలు తప్పనిసరి. అంతకు మించిన పవిత్రత వాటిలో లేదు. స్వేచ్ఛ కావాలనుకోవటం, యితరుల స్వేచ్ఛను కాపాడటం, తద్వారా వ్యక్తి ప్రతిభా వ్యుత్పన్నతలు విప్పారజేసుకోటం మానవత. అందరి స్వేచ్ఛను అరికట్టి కొద్దిమంది చెప్పినట్లు శాసించటం అమానుషం. మానవ విలువలు సరిగా వెంపొందటానికి రాజకీయ ఆర్థిక, సాంఘిక వ్యవస్థలుకూడా దోహదం చెయ్యాలి. ప్రజాస్వామ్యంలో యివి పని చేస్తయ్. నియంతృత్వం వీటికి చుక్కెదురు. ప్రజాస్వామ్యం ప్రాతిపదికగా అంగీకరించినంతమాత్రాన చాలదు. అందులో ఆర్థిక సాంఘిక సమానత్వం, న్యాయం చేకూర్చుతూ, దోపిడీలేని విధానం రూపొందించుకోవాలి. మానవవిలువలన్నీ నియంతృత్వంలో అమలు పరచగలిగితే తప్పేముంది అనే ప్రశ్న వేసుకుంటే కూలంకషచర్చ అవసరం. ప్రజాస్వామ్యంలో తప్పులు చేస్తాం దిద్దుకుంటాం విమర్శించుకుంటాం. అది పురోగతి. నియంతృత్వంలో నిర్ణయాలు, విమర్శకు గురికావు. తప్పులు దిద్దుకునే పద్ధతిలేదు. కనుక బాగోగులు విడమరచి చూసే అవకాశంలేదు. అలాంటప్పుడు వారు అనుసరించేదే సరైనది అని నిర్ధారించటం యెలా ? కనుక ప్రజాస్వామ్యంలోనే విలువలు అమలు పరచటం సాధ్యం.

అంతరాత్మ ప్రాతిపదికగా అధ్యాత్మికవిలువలు వుంటయ్. అక్కడ హిమాలయాలంత దోషాలు చేసినా, నియంతృత్వంలోవలె కనుగొనటం దుర్లభం. విలువలు వ్యక్తి ప్రయివేటుజీవితానికి సంబంధించినవి కావు. సమాజంలో ఇతరవ్యక్తులతో సంబంధం యేర్పడినప్పుడే విలువల ప్రసక్తి వస్తుంది. కనుక ఆచరణ అనేది విలువలకు కొలమానం.

ఈ చట్రంలో, రచయితగా విద్యార్థిపాత్ర చూడటం సబబు.

**విద్యార్థి రచయిత లక్షణాలు :**

సర్వసాధారణంగా రచయితలు తమ ఆలోచనలను ఇతరులకు చెప్పాలని కాంక్షిస్తారు. యువరచయితలు తమ ఆలోచనలు ఇతరులకు చెప్పటమే గాక, ఆచరణలో రావాలని కోరతారు. విద్యార్థిదశలో రచయితకు వివేచనతోపాటు ఉద్వేగం జాస్తి. ఉద్వేగంమోతాదు హెచ్చుగా వున్న రచయిత తన రచనలకు వివేచనతో పదును పెట్ట లేడు. మానవులందరిలోను ఉద్వేగం సహజప్రేరణ లక్షణం. విద్యార్థిరచయిత తన రచనలద్వారా ఈ ఉద్వేగ లక్షణానికి నచ్చేటట్లు వ్రాస్తాడు: దేశభక్తి, అవినీతి ఖండన, ఆదర్శాలు పల్లెవేయటం, కామం, అపరాధపరిశోధన యిలాంటి యితివృత్తాలు ఏవి స్వీకరించినా ఉద్వేగలక్షణాలు విపరీతంగా ద్యోతకమౌతాయ్. కనుక పైన చర్చించిన మానవ విలువలు అతనికి యింకా అపక్వాలే. విద్యార్థిదశలో వూహించేవన్నీ సరైనవి కావని తాత్పర్యం కాదు. కాని తాము చెప్పేది చిత్తశుద్ధితో చెబుతున్నామని, సమాజం బాగుపడాలని కోరుతున్నామని, కనుక తమదే మంచి మార్గమని వారు భావిస్తారు. అలా భావించటంలో దోషం లేదుగాని, ఆ భావన సరైనదో కాదోననే విమర్శ చూడరు. విమర్శ సహించలేని వయస్సు విద్యార్థిది. ఒక విధంగా విద్యార్థి నియంత. రచయితగా అతనిలో ఆ లక్షణాలు తొంగి చూస్తుంటయ్. ఈ సున్నితదశలో ప్రజాస్వామిక మానవ విలువలు సరిగా వంటబట్టకపోతే ఆ విద్యార్థిరచయిత సరిగా పెంపొందడు. కనుక విద్యావిధానం సరిగా మలచబడటం అవసరం. ఇదొక వలయం:

వివేచనకు పదును పెట్టే విద్యావిధానం వుంటే విద్యార్థి రచయిత మానవ విలువల్ని సరిగా అవగాహన చేసుకుంటాడు. అప్పుడు భిన్నాభిప్రాయం వున్నా ఫరవాలేదు. అది నిజమైన ప్రజాస్వామ్య భవిష్యత్తుకు పునాది.

ఇంతవరకు జరిపిన చర్చ దృష్ట్యా చూస్తే నేడు విలువలకు ప్రాధాన్యత యివ్వటం లేదనీ, విద్యార్థిరచయిత అపక్వంగా పెంపొందుతున్నాడనీ సులభంగా అర్థంచేసుకోవచ్చు.

ఉన్నపళంగా తాము కోరింది అమలు జరపకపోతే వీల్లేదంటూ ఘెరావ్, ధర్నా, సమ్మె, నిరాహారదీక్షలు వివిధరంగాల్లో వ్యాపించినట్లే, రచనల్లోనూ విద్యార్థులు ఈ ధోరణి చూపుతున్నారు. ఇక్కడ విద్యార్థి అన్నప్పుడు కొంతవరకు యువతరంవారినికూడా స్వీకరిస్తున్నాను. ఉదాహరణకు దిగంబరకవులు బయలుదేరి పచ్చినిజాన్ని నగ్నంగా చెబుతున్నామంటూ జుగుప్సకలిగించే భాషలో తిట్లతో రచనలుచేస్తే, అనుకున్న ప్రయో

జనం చేకూరకపోగా సమాజం తిరగబడుతుంది. సమాజం బాగులేదనేది నిర్వివాదాంశం. బాగుచేయటానికి యేమార్గం అవలంబిస్తా మనేది ప్రశ్న. కొందరు రచయితలు ఒక మార్గాన్ని సూచించారనుకోండి. అదే సరియైనది అని యెలా భావించడం? ఆ చర్చ రచయితలు చేయటంలేదు. యువరచయితలు బొత్తుగా దూకుడుగా వున్నారు.

అయితే కాలం మారుతున్నది. విలువలపట్ల ధోరణి మారుతున్నది. అన్ని మార్పులూ చెడ్డవి కావు. మారిందంతా మంచిదికాదు. ఆ విషయం చూద్దాం.

సమాజంలో పెత్తందారీతనం విపరీతమైపోయింది. యువరచయితలు కర్ర పెత్తనంపై ధ్వజమెత్తి చాలావరకు విజయం సాధించారు. ఈ విజయం కవిత్వంలో, ఛందస్సు, భాష మెదలు, భావాలు, ధోరణులు, కట్టుబాట్లు, ఆచారాలు మొదలైనవి అనేక విషయాలలో పేర్కొనవచ్చు. ఇందుకు యువతరాన్ని అభినందించాలి. పెద్దలు మార్పుల్ని గమనించకపోవటం కూడా ఒక పెద్ద లోపమే. అయితే స్వాతంత్ర్యం, స్వేచ్ఛ పొందిన యువరచయితలు వెర్రితలలు వేయకుండా, నిలబెట్టుకోగలరా అనేది ప్రశ్న. సమాజంలో అస్థిరత్వాన్నే వారూ ప్రతిబింబిస్తున్నారు. కాని, దారిచూపటంలేదు. ఆధునిక పరికరాలు వాడటం, సాంకేతిక జ్ఞానార్జన వున్నంతగా, ఆధునిక భావాలు లేవు. సంప్రదాయాల్నే అనుసరిస్తున్నారు. సమాజంలోగల కుల, మత, ప్రాంతీయ తత్త్వంపైనా, కట్టాలపైనా రచయితలు ఆచరణలో తిరుగుబాటు చేయలేకపోతున్నారు. ఆధ్యాత్మిక బానిసత్వంనుండి బయటపడలేకపోతున్నారు. రచయితలో కూతూహలం వున్నంతగా పట్టుదల లేదు.

విద్యార్థిదశ విలువల ప్రాతిపదికకు మంచి దశ. అవి సరిగా పాదుకుంటే రచనలు మంచివి వస్తాయ్. నేడు ఆ లోపం కవిపిస్తున్నది. రచనలలో అయోమయం, పులుముడు, శాఖాచంక్రమణం వున్నదంటే రచయిత ఆలోచన గందరగోళంగా వున్నదని తాత్పర్యం. విలువలు విస్మరించిన రచనలు వుత్తరోత్తరా చాలా హాని కలిగిస్తాయ్.

రచయితభావాలప్రభావం సమకాలీనులపైనే గాక వుత్తరోత్తరా చాలా వుంటుంది. కనుక రచయిత రచనపట్ల శ్రద్ధవహించటం అవసరం. విలువలు తెలియని యువ రచయిత సమాజానికి చేటు; ఉద్వేగాన్ని వివేచనతో పదును పెట్టని రచన నిలబడదు. ఈ దృష్టితో పరిశీలిస్తే మన యువరచయితల స్థాయి, ప్రమాణం అవగాహనచేసుకోవచ్చు.

*

అనుకరణం అనవసరం
అంతేకాదు అనర్థకం.

—ఆరుద్ర.

## పాఠకులు - రచయితలు

### శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తి

**చూ**సేవాళ్ళులేని నాటకప్రదర్శనాన్ని ఊహించుకోలేనట్లే, పాఠకులు లేని రచయితను ఊహించలేము. ఆనందమో, ఉద్వేగమో కలిగినప్పుడు రచయిత మనస్సు స్పందిస్తుంది. ఆ స్పందనమే అతణ్ణి రచనకు పురిగొల్పుతుంది. ఈ స్పందన గుణమే ఆదికాలమునుంచి మానవునికి బ్రతుకుమీద, బ్రతుకులోని కమ్మదనంమీద ఆసక్తిని, విశ్వాసాన్ని కలిగిస్తూన్నది. ఈ స్పందనానికి దేశంతోకాని, కాలంతోకాని, ఒక ప్రత్యేక సిద్ధాంతంతో కాని సంబంధం అంతగా ఉండదు. ఆకాశంలో మేఘాలు అనేక రూపాలతో మనకు కన్పిస్తుంటాయి. ఏ పక్షంలో ఏ మేఘం ఏరూపం దాలుస్తుందో మనం చెప్పలేము. ఆ విధంగానే మనిషి ఊహాస్వరూపాన్ని అది బహిర్గతమయ్యేవరకు కనుగొనలేము. దేశకాల పరిస్థితుల ప్రభావం మనిషిపై ఉంటుందన్నమాట వాస్తవమే అయినా అతని ఊహ లెల్లప్పుడూ వీటికి అతీతంగానే ఉంటాయి. అలా ఉన్నప్పుడే అవి ఇతరులకు ఆనందాన్ని కలిగిస్తాయి.

పాఠకులు అందుకోలేని ఆనందాన్ని రచయిత సృష్టిస్తే అది రచనా పరిధిలోనికి రాదు. పాఠకులందరు ఆ రచనాస్థాయికి సరిపోయిన సంస్కారం, కలిగిఉన్నప్పుడే అది సాధ్యం. మరి ఈ సంస్కారం వివిధంగా ఉంటుంది-కనుక ఒకరకమైన రచయిత పాఠకులందరికీ సమానమైన అనుభూతిని కలిగించలేడు. రచయితకుగూడ కొన్ని ఆటంకాలున్నాయి. అతడు జనసామాన్యంలోనికి తన రచనలద్వారా చొచ్చుకునిపోవటానికి వాళ్ళ ఆలోచనా పరిధులను, మనస్తత్వాలను, దైనందిన జీవితవృత్తాలను అర్థం చేసుకోవలసి ఉంటుంది. ఈమాత్రపు సంస్కారం కలంపట్టినవానికి ఉండి తీరవలసినదే. ఆపైన తాను చెప్పదలుచుకున్నది చెప్పినపుడు అతణ్ణి అనుసరించడానికి పాఠకులకు క్లేశం ఉండదు.

నాటికీ నేటికీ ప్రాయికంగా అక్షరాస్యులే పాఠకులు చదువుతుండగా విని, లేక చెప్పుతుండగా విని విషయపరిజ్ఞానాన్ని పెంచుకునేవారిని, రసాస్వాదనం చేసేవారిని మనము పాఠకుల కోవలోనికి చేర్చుకొనవచ్చును. ప్రాచీనకాలంనుంచీ నిన్నమొన్నటిదాకా మనదేశంలో అక్షరాస్యులసంఖ్య తక్కువ. ఆనాడు హరికథాపురాణ కాలక్షేపాల మూలంగా, బొమ్మలాటలమూలంగా, పెద్దలవల్ల అనేకవిషయాలు తెలుసుకునేవారు. ఆనందం పొందేవారు. మరి పుస్తకాల నుపయోగించుకునేవారికి పాండిత్యం, సంస్కారం ఉండేవి. తమకు కావలసిన పుస్తకాలను తిరిగి వ్రాసుకొని, చదువుకొనేవారు. అంతేకాని జనబాహుళ్యానికి పుస్తకాలు అందుబాటులో ఉండేవి కావు. కులవృత్తికి సంబంధించిన అనేక విషయాలు పరంపరాగతంగా పైతృకంగా లభించేవి కనుక ఆయావిషయాలను చదువుకోవలసిన అవసరం ఉండేదికాదు పుస్తకాల అవసరం లేకుండానే అనేకవిషయాలను తెలుసుకునే అవకాశాలు సహజంగా దైనందిన జీవనంలో, సామూహికజీవనంలో అయాచితంగా లభిస్తూండేవి.

నాటి సమాజంలోని ప్రతిఆలోచనకు మతం, ధర్మం ప్రాతిపదిక అయ్యేవి. ప్రతి విషయాన్ని ధర్మదృష్టితో పరిశీలించే గుణం రచయితలకు సంప్రదాయబలంవల్ల అబ్బేది. కనుకనే నాటి రచయిత ఏది వ్రాసినా ధర్మ దృక్పథాన్ని దృష్టిలో ఉంచుకొని వ్రాసేవాడు. అందుకే నాటికాలంలో రచన ఒక ఆరాధనా విశేషంగా పరిగణింపబడింది. వారి రచనల్లో కళాదృష్టి గౌణమేగాని ప్రధానంగాదు. తమకు ఒకవేళ నాటి ప్రజల ఆలోచనలకు అతీతమైన భావం కలిగినా దాన్ని కుదించి సంప్రదాయపు మూసలలో పోసి బయలుపరిచేవాడు. ఎందుకంటే రచనకు ఉద్దేశ్యం ఉపదేశమే. విశ్వశ్రేయస్సు కావ్యానికి లక్ష్యమని వాళ్ళ ఉద్దేశం. నాటికి నేటికి ఇంచుమించు ఇదే దృష్టి రచయితకు వుండితీరాలని ప్రాచీన లాక్షణికులు, నేటి విమర్శకులు పేర్కొంటున్నారు. మతం ప్రభావం ఉన్నవాళ్ళకు శ్రేయస్సు స్వరూపం అదే నిర్ణయించేది. కాని ఇప్పుడు దాని ప్రాబల్యం తగ్గిపోవడంవల్ల శ్రేయస్సుకు రాజకీయ సిద్ధాంతాలే అప్పటికప్పుడు రూపకల్పన చేస్తున్నవి. ఈ రాజకీయ సిద్ధాంతాలలో వైవిధ్యమేకాదు, పరస్పర వైరుధ్యంకూడా ఉన్నది. వైజ్ఞానిక, సాంకేతిక శాస్త్రాభివృద్ధివలన నేటి ప్రపంచంలోని దేశాలు పొరుగిండ్లుగాను, మహాసాగరాలు చిన్న చిన్న సరస్సుల్లాగాను కన్పిస్తూన్నాయి. ప్రపంచాన్నంతా తమగుప్పిట్లో ఉంచుకోగలమనే అహంకారంతో ఈనాడు కొన్నిశక్తులు నిర్లక్ష్యంగా ప్రవర్తిస్తున్నాయి. కాని మరో వక్క ప్రపంచంమంతా ఒక్కటేనని, మానవులంతా ఒక్కటేనని, మానవుని కష్ట, సుఖాల స్వరూపం ఒక్కటేననే భావాలుకూడా శక్తిని పుంజుకుంటున్నాయి. మానవాత్మ ఎప్పుడూ లేనంత వ్యాప్తంగా ఇప్పుడు మనకు కన్పిస్తున్నది. నేటి రచయితలు ఈ మార్పును గమనించాలి. గడచినకాలం, దాని విలువలు చాల గొప్పవని ఇప్పుడవి నశిస్తున్నాయని వాపోవడంకంటె మేధావియైన రచయిత నేటిపరిస్థితులను పరిశీలించాలి. ఇది స్థూలంగా రచయితల బాధ్యత. కాని, హృదయమున్న రచయిత పొట్టకూటికోసం వ్రాయని రచయిత అన్ని కాలాల్లోనూ ఉన్నాడు. అతనికి అన్యాయమని తోచిన విషయాన్ని గొంతెత్తి చాటాడు. అతన్ని గొంతు నొక్కటానికి ప్రయత్నాలు జరిగాయి. కాని వాడు చచ్చి బ్రతుకుతున్నాడు. దీనికి కారణం అతసహృదయం. ఏ రాజకీయ సిద్ధాంతాలకు లొంగని మనస్సు స్పందించి కళాసృష్టికి పూనుకుంటుంది. శత్రువు రక్తాన్ని చూచినా, మిత్రుని రక్తాన్ని చూచినా గాయవడే హృదయం ఉన్నపుడే రచయిత కళాస్రష్టగా మనగలడు. లోకం పోకడనుబట్టి తన రచనలను మలచుకొనేవాడు అతిసామాన్యుడైన రచయిత. పోకడలు మారగానే ఆ రచనకు విలువ నశిస్తుంది.

సూక్ష్మంగా పరిశీలిస్తే రచయిత బాధ్యతలు అనేమాట అచ్చమైన కళాసృష్టికి గొడ్డలిపెట్టు వంటిది. తనకు తోచిన, తన మనస్సును కదిపిన, తన మెదడును ఊహాధీనం చేసిన సంఘటనను నిర్భయంగా చాటగలిగినపుడే రచయిత సత్యాన్ని ప్రకటించ కలుగుతాడు. మరి ఆ సత్యాలు కటువుగాను తోచవచ్చు. తీయగాను తోచవచ్చు. కాలానికి విరుద్ధంగాను తోచవచ్చు, అనుకూలంగా తోచవచ్చు. ఆమాత్రం స్వేచ్ఛ రచయితకు ఉండాలి. అది లేనప్పుడు రచనలు వార్తాపత్రికలుగా, పంచాంగాలుగా, దస్తావేజులుగా,

మారే ప్రమాదముంది. ప్రజాస్వామ్యంమీద నమ్మకమున్న సమాజంలో రచయితల కున్న ఈ స్వేచ్ఛను గుర్తించాలి ; రక్షించాలి.

ఇప్పుడు మహారచయితలుగా, క్రాందదర్శులుగా, వైతాళికులుగా ఆరాధింపబడుతున్న రచయితలందరూ, ఒక కాలంలో కాలానికి, సంఘానికి కరడుగట్టిన సంప్రదాయాలకు ఎదురుతిరిగినవారే.

ముద్రణా సౌకర్యాలు అధికంగాపెరిగిన యీ రోజుల్లో రచయితలకు స్వేచ్ఛవుంటే వాళ్లభావాలు, పుస్తకాలద్వారా బహుళవ్యాప్తి కావచ్చు. మరి ఆ స్వేచ్ఛను రచయితలు దుర్వినియోగపరచుకొనే ప్రమాదంకూడా లేకపోలేదని కొందరి విమర్శకుల అభిప్రాయం. కాని పాఠకులు లేనిదే రచయిత బ్రతుకడు. తన రచనలకు చలామణి ఉన్నందుకే అతడు వ్రాయ కలుగుతున్నాడు. అశ్లీలమైన, జుగుప్సాకరమైన సాహిత్యం సృష్టి అవుతున్నదే అని మనం భయపడనవసరములేదు. మానవాత్మ సహజంగా అభ్యుదయాన్నే ఆకాంక్షిస్తుంది. రచనా స్వేచ్ఛగల దేశాలలోకూడ కొందరు మాత్రమే విశ్వజనీనమైన సాహిత్యాన్ని సృష్టించకలుగుతున్నారు. కనుక రచయితల కేదో బాధ్యత లుండటము అవసరమని అనుకోవటం పొరపాటు. ఆలోచనలను అరికట్టటము బర్బరత్వం. మానవత్వంమీద నమ్మకము ఉన్నవాడు స్వేచ్ఛకోసం పోరాడుతాడు. స్వేచ్ఛకోసం పోరాడే వాళ్ళలో రచయితలే కాదు రకరకాల మానవులుంటారు. స్వేచ్ఛకోసం పోరాటం సల్పడం రచయిత బాధ్యత కాకపోవచ్చు. కాని అది అతని లక్షణం.

అందుకే మన భారతరాజ్యాంగం ఆలోచనా స్వేచ్ఛను ప్రసాదించింది. రాజ్యాంగం చూపిన వెలుగుబాటలో మనం పయనిస్తున్నాం.

రచయితలకు బాధ్యతవున్నా లేకపోయినా వాళ్ళు మానవునికి బ్రతుకుమీద ఆశను మమతను కలిగిస్తారు. ఆదర్శశిఖరాలకు చేరువగా తీసుకునిపోతారు. చెప్పినట్లు వ్రాస్తే చెప్పినవానిమాటే చెప్పినట్లవుతుంది. గాని తన మాట గాదు. రాచరికాలు, మూఢ విశ్వాసాలు నశిస్తున్నాయి. విజ్ఞానం పద్మంలాగా విచ్చుకుంటోంది. పొడుస్తున్న సూర్యునిలాగా అనుక్షణం అధికాధిక ప్రకాశంతో వెల్గును ప్రసరిస్తున్నది. తర్కానికి హృదయానికి అంటే మేధకు హృదయానికి జరుగుతున్న సంఘర్షణలో హృదయమే జయించి తీరుతుందని రచయితకు నమ్మకముంటే చాలు. మరే బాధ్యతా నిర్దేశం అక్కర్లేదనే విశ్వాసం ఉన్నవాళ్ళు మనదేశంలోనేకాదు, ప్రపంచమంతా వ్యాపించిఉన్నారు. ఇటీవల వెలువడుతున్న విశ్వసాహిత్యం ఈ యాథార్థ్యానికి ప్రమాణం. సదసద్వివేక పరిజ్ఞానాన్ని, దారిద్ర్యనిర్మూలమార్గాలను సూచించే రచనలు సాహిత్యపరిధిలోనికి రావు. ఆయా విషయాల రచయితలు తాత్త్వికులు, శాస్త్రజ్ఞులు, తార్కికులు. వారికి బాధ్యత లున్నవి. అది వేరే విషయం. కాని హృదయసంబంధి అయిన సాహిత్యసృష్టిచేసే రచయితలకు బాధ్యత లుండవు. వారి రచనల్లో సందేశం సూచింపబడవచ్చును. అంతేకాని సందేశమే రచనోద్దేశం అయినప్పుడు, మరి ఆ సందేశం దేశకాలపరిస్థితుల చట్టాల్లో బంధింపబడే ప్రమాదం ఉంటుంది. అప్పుడు స్వేచ్ఛను కోల్పోయిన రచయిత వ్రాసినా వ్రాయకపోయినా ఒరిగేది ఏమీ వుండదు.

# సంఘంలో మార్పు : శాస్త్రీయదృక్పథము

డా. సి. లక్ష్మన్న

నవభారతసమాజము పరిణామానికి మారుపేరుగా వుంటున్నది. సంఘములో అనేక మార్పులు వస్తున్నవి. స్వాతంత్ర్యము సాధించడముతో పరిపాలనా వ్యవస్థలో మార్పు వచ్చింది. ప్రజాస్వామ్యబద్ధమైన పరిపాలనా యంత్రాంగము నెలకొనింది. భారత రాజ్యాంగము విభిన్నమైన హక్కులను గుర్తించింది. సామాన్యమానవుని పాలన యేర్పడాలని ఆకాంక్షించింది. రాజకీయస్వాతంత్ర్యము ఆర్థిక విధానములో మార్పును సూచించింది సమాజ సామ్యవాద సిద్ధాంతాల ప్రాతిపదికగా నూతన ఆర్థిక వ్యవస్థను సాధించాలని భారతప్రభుత్వము, ప్రజలు – ఆసక్తి, ఉత్సుకత చూపుతున్నారు. ఈ విధంగా మార్పులు చెందుతున్న ఆర్థిక, రాజకీయ వ్యవస్థలు నూతన సాంఘిక వ్యవస్థతోనే సాధ్యమవుతాయి. అంటే అనాదిగా దేశంలో నెలకొన్న సాంఘికవ్యవస్థ మార్పుకు అనుకూలంగాలేదు. కాలంతోపాటు, సమాజము కొన్ని మూఢనమ్మకాలను, సాంఘికనియమాలను ఉత్పన్నముచేసి, వాటిని పాతుకొనిపోయేలా చేసింది. ఈ మూఢనమ్మకాలు, అహేతుకవాదాలు పరిణామానికి అడ్డంకులుగ ఉంటున్నాయి.

నేటి పరిస్థితిని సంధియుగంగా పేర్కొనవచ్చును; ఈ యుగసంధిలో పాతవిలువలకు స్థానము, హోదా, ప్రతిపత్తి, స్థిరత్వము లేకుండపోతున్నది. వాటికి హేతుబద్ధత సన్నగిల్లిపోతున్నది. సనాతన సంఘానికి, సనాతన కట్టుబాట్లకు గిటురాళ్ళుగా మాత్రమే మిగిలిపోతున్నాయి. సాంఘిక ప్రయోజనాలకు సాంఘిక లక్ష్యాలకు, ఈ విలువలకు ఎలాంటి సంబంధములేకుండ పోతున్నది. గట్టిగ చెప్పాలంటే, అవి కేవలము శిథిలావస్థలోవున్న సాంఘిక వ్యవస్థకు నిష్ప్రయోజనమైన పునాదులుగ మాత్రమే వ్యవహరిస్తున్నాయి. కాని పునాదులన్ని కదిలిపోయి, యివ్వాడో అప్పుడో కూలిపోతుంది అనే భావాన్ని మరిమరి గుర్తుచేస్తున్నాయి, అయితే దురదృష్టమేమిటంటే, అటువంటి సంధియుగములో నూతన విలువలకు ఒక ప్రస్ఫుటమైన రూపురేఖ యేర్పడి వుండలేదు. మసక మసకగ నూతనవ్యవస్థ యొక్క ఆకృతి కనిపిస్తూవుంటున్నది. అంటే నూతన విలువలు, సాంఘిక ప్రయోజనకారి అయివుండికూడా, సామాజిక వ్యక్తుల సంపూర్ణ ఆమోదాన్ని పొందలేదు. వాటినిగూర్చిన సంశయము, అనుమానము కొట్టవచ్చినట్లు కనీసము కొన్ని వర్గాలలోనైన కనిపిస్తుంటున్నది. అందుచేత, నూతన విలువలను స్వంతము చేసుకొనడములో, సామాజీకరణ యంత్రాంగంగా రూపొందడములో కొంత జంకు, తడబాటు, బిడియము అగుపిస్తుంది. ఇది కాకుండ యింకో అంశము కూడ తలెత్తుతుంది. ఒకసారి పాతుకుపోయిన, స్థిరపడిపోయిన విలువలను త్రోసిపుచ్చినప్పుడు, వాటి వునికిని ప్రశ్నించినప్పుడు, క్రొత్తరూపు

దాల్చుకొంటున్న నూతన విలువలపట్లకూడ కొంత సంశయాత్మక దృక్పథము చెప్పకుండానే ప్రజానీకములో ప్రస్ఫుటమవుతున్నది. అందుచేత సమాజము కొంత గందరగోళంగా వుంటున్నది. చలనము సంఘములో ఒక విధమైన అస్థిరత్వము (Unrest) ను కలుగజేసి, ప్రజలలో నిస్పృహ, చేతగాని తనము (helplessness) వగైరాలను కలిగిస్తున్నది. దాదాపుగ నేటి భారత సమాజము అటువంటి స్థితిలోనేవుంది. గ్రామీణ ప్రజానీకము నగరవాసులవైపు దృష్టిని నిలిపి, వాళ్లను అనుకరిస్తున్నారు. నగరవాసులు పాశ్చాత్య నాగరికతా లక్ష్యాలపై, లక్షణాలవైపు మొగ్గుచూపుతున్నారు. అంటే నేడు ఒకవిధమైన భయాత్మక సందిగ్ధ స్థితిలో సంఘము వుంటున్నది. విచక్షణ, హేతుకత పూర్తిగ సన్నగిల్లిపోయింది. పాశ్చాత్య సమాజములో ధృఢత్వము కలిగి, సాంఘికాభివృద్ధికితోడ్పడి, తోడ్పడుతున్న విలువలను మనము పాటించటము మనవిధి. పాశ్చాత్యసమాజము శాస్త్రీయ సాంకేతిక రంగాలలో అనర్గళమైన కృషి సాధించినది. శాస్త్రీయ, సాంకేతిక అంశాల, ఆధారంగా కొన్నిస్థిరమైనవిలువలను వెంపొందించింది.వాటిని మనము అనుసరించడములో కాని, మనవిగా చేసుకోవడముగాని యెటువంటి తప్పులేదు. పైగా వాటిని మన సంస్కృతిలోనికి, నాగరికతలోనికి, మన సాంకేతికాభివృద్ధిలోనికి అంగాలుగా చేసుకోవడము అతిముఖ్యము. పోతే పాశ్చాత్య సమాజములో రేకెత్తిన అసంతృప్తి సూచకమైన పైపై మెరుగులను మాత్రమే అనుకరిస్తూ, అంతర్లీనమైయున్నవుత్తమ విలువను (Intrinsic values) ను మరచిపోవడముతోనే తప్పటడుగు వేస్తున్నాము. అంటే సాంఘిక మార్పులపట్ల సహేతుకమైన శాస్త్రీయ దృక్పథము నేడు చాల ముఖ్యమని నొక్కి చెప్పవచ్చు. సంఘంలో కలుగుతున్న ప్రతి మార్పును తులనాత్మకంగా పరిశీలించి, శాస్త్రోక్తంగా సమాజ ప్రయోగకారి అయినప్పుడే, యే మార్పునైన ఆమోదించి, ప్రోత్సహించవలసివుంది. పాతకొత్త విలువల బాగోగులు క్షుణ్ణంగా అవగాహన చేసుకోవలసివుంది. అంటే సమాజాన్ని పరిశోధనాత్మక దృష్టితో నిరంతరము సమీక్షించి, విశ్లేషించి, విచక్షణాజ్ఞానముతో మెలుగవలసివుంది. అప్పుడే నవసమాజానికి గట్టి పునాదులు వేయగులుగుతాము. ప్రజానీకములో సుఖశాంతులకు స్థానము ఏర్పాటు చేయగలుగుతాము.

ఇటువంటి దృక్పథము వెంపొందాలంటే, సామాజిక పరివర్తనము యొక్క రూపురేఖలు, గతి, వేగము మొదలైన అంశాలగూర్చి సూక్ష్మంగా తెలుసుకోవడము అవసరము. స్థూలంగ చెప్పాలంటే సంఘములో మార్పు సామాజిక పరివర్తనము రెండు రకాలు. (1) సామాజిక వృద్ధికోసము. (2) యోజనాత్మకమైన ప్రణాళికాబద్ధమైన సాంఘిక పరివర్తనము. ఇంతో కొంతో సంఘము నిరంతరముగ మార్పుచెందుతూనే వుంటుంది. పోతే కొన్నిసార్లు (చాలామారులే కావచ్చు) యీ మార్పు కంటికందక, మందకొడిగవుండి, అచలంగా వుందా అనే అపోహకు, సంశయానికి దారి తీస్తుంది. కాని సూక్ష్మంగా పరిశీలించినట్లైతే, మార్పును సూచించడము అంతకష్టముగాదు. సమాజములో అంతర్లీనమై కొన్నిశక్తులు నిరంతరంగా పనిచేస్తుంటాయి. జననమరణాలవల్ల, స్థానచలనమువలన, నైసర్గిక మార్పులవలన, సాంఘిక, రాజకీయ, ఆర్థిక వ్యవస్థలలో కొద్దికొద్ది మార్పుల

వలన సంపూర్ణసమాజము కొంతకు కొంత మార్పుచెందుతూనే వుంటుంది. ఈ అంశములో గూడ సంఘములో ప్రజానీకము యొక్క కార్యకలాపాల యొక్కయు, దృక్పథము యొక్కయు ప్రభావము కొంతవరకు ఉంటుందిగాని యీ పరివర్తనము చాలవరకు ప్రజానీకము యొక్క ప్రమేయము లేకుండానే జరిగిపోతూ వుంటుంది.

రెండోకోవకు చెందిన సాంఘికపరివర్తనమే ప్రస్తుతము మనకు ముఖ్యము. అంటే సమాజములో సహజగతిలో వున్న పరిణామముతో సంతృప్తి పొందలేక నూతన సమాజ నిర్మాణానికి అంచనాలు, పథకాలు, వేసి, సాంఘిక పరివర్తనానికి కృషి ప్రయాసలు చేస్తుండడంలోనే మనకు చాల సంబంధము వుంటుంది. ఈ ప్రణాళికారచనలో, మార్పుల నుద్దేశించడములో శాస్త్రీయదృక్పథము ప్రస్ఫుటము కావాలి. ఈ పరిణామాలను సాధించడములో సమాజములో నూతనశాస్త్రీయదృక్పథాన్ని మలిచి, దానిని ప్రోత్సహించవలసి వుంది. ఈ కోవకు చెందిన సాంఘిక పరివర్తనము అర్థవంతము, ప్రయోజనాత్మకము గావాలంటే ప్రజానీకము యావత్తుకు దానితో సంబంధ బాంధవ్యాలు నెలకొల్పుకోవాలి. ఈ నూతన సమాజ నిర్మాణములో తాము భాగస్వాములము అనే భావము వ్యక్తంగావాలి. ప్రజలలో వివేచనాజ్ఞానము, హేతుకత్వము, సమీక్షదృష్టి, శాస్త్రీయదృక్పథము కలిగిన నాడే ఆ భావము సాధ్యమవుతుంది. మూఢనమ్మకాలు పిడికట్టు వాదాలు వున్నంతకాలము ఇలాంటి సంపూర్ణ ఆమోదముతో గూడిన కలుపుగోలుతనము, భాగస్వామ్యము నెలకొనదు.

ఒకవిధంగా చెప్పాలంటే సామాజికప్రగతిలో సాంఘికఅభ్యుదయములో, మానవ పరిణామములో నేటి 'మానవ' సమాజము శాస్త్రీయ యుగంగా పేర్కొనవచ్చును. అనేక అంగాలలో, రంగాలలో యీ శాస్త్రీయత పాతుకునిపోతూ వున్నది. ఇంకా యేమైనావుంటే, యీ శాస్త్రీయత, శాస్త్రీయవాదము ఒకవిధమైన నూతనమూఢనమ్మకాలకు దారితీసేటంతగా సమాజములో శాస్త్రీయ సంచలనము కలిగివుంది. ఆగస్టుకోమ్టు (Auguste comte) మహాశయుడు అనాదినుండి నేటివరకు సాంఘికాభివృద్ధిని, మానవ పరిణామాన్ని మూడు దశలుగా విభజిస్తాడు. (1) ధార్మిక (మతసంబంధమైన) సమాజము (Theological) (2) తార్కిక (అతిభౌతిక) (Metaphysical) సమాజము (3) శాస్త్రీయ (నిర్మాణాత్మక) (Positive) సమాజము. వీటికి అనుగుణంగా వరుసగా 1. సైనిక (Military) 2. చట్టమూలమైన (Legalistic) 3. పారిశ్రామిక (Industrial) సమాజాలూ యేర్పడుతాయి. అంటే అధునాతన సమాజము పారిశ్రామిక యుగంగా రూపొందిందన్నమాట. ప్రపంచము మొత్తము పర్యావలోకన చేసినప్పుడు, ఈ విషయము సత్యసహితమే అన్నదాంట్లో యెలాంటి సందేహములేదు. ప్రపంచములో పరిణతి చెందిన దేశాలు, పరిణితి చెందుతున్న దేశాలు, అన్నికూడ పారిశ్రామిక పురోభివృద్ధికి నిరంతరంగా కృషిచేస్తున్నాయి. భారీపరిశ్రమలు విస్తృతంగ నెలకొన్ననాడు, ప్రజలలో దృఢమైన శాస్త్రీయదృక్పథము ఏర్పడితేనే, పారిశ్రామిక వ్యవస్థయొక్క సమస్యలను, సాంకేతిక పరిజ్ఞానాన్ని, యంత్రాంగముపై తగిన చాకచక్యము, అధికారము, దక్షత యేర్పడజాలవు.

అంటే పారిశ్రామికీకరణము ఆధునికీకరణానికి గీటురాయి. ఈ పారిశ్రామికీకరణము చిరకాలంగా గృహాంగణానికి అంకితులైన స్త్రీవర్గాన్ని బంధవిముక్తులను చేయడము లాంటి చర్యలకు దారితీస్తుంది. ఈ మారుతున్న విలువను గుర్తించకుండ, సనాతన ధర్మానికి కట్టుబడి స్త్రీ గృహిణిమాత్రమే అని యెంత ఆరాటపడినా ప్రయోజన ముండదు. అలాగే సమానత్వము, స్వాతంత్ర్యము, సహోదరత్వములాంటి నూతన విలువలకు ఎక్కడ లేనిబలము ప్రాప్తమవుతున్నది. వ్యక్తి వ్యక్తిపై, వ్యక్తి వర్గముపై, వర్గము వర్గముపై పెత్తనము చలాయిస్తూ, దోపిడీకి దారితీసే విధానానికి స్వస్తిచెప్పవలసి వస్తూన్నది. అంటే సమాజవాద ఛ్చాయలు నలుమూలల ప్రాకుతున్నాయి. ఇది నూతనచరిత్రగతికి ప్రస్ఫుట తార్కాణము. ఈ చరిత్రగతిని శాస్త్రీయ దృక్పథముతో అర్థముచేసికొని, ఆ గతివేగాన్ని పెంచడానికి సహాయపడాలేకాని, మొండిగ అడ్డుకోవడానికి ప్రయత్నిస్తే, కదులుతున్న రథచక్రాలక్రింద పడి నశించిపోవలసి వస్తుంది.

సంఘములో మార్పు, శాస్త్రీయ దృక్పథము అన్న అంశాన్ని రెండు కోణాలనుండి చూడవచ్చును. 1) సంఘములో వస్తున్న మార్పులపట్ల శాస్త్రీయ దృక్పథము అలవరచుకొని, హేతుబద్ధంగా, వివేచనాత్మకంగా పరిశీలించి, నూతనవిలువలను సక్రమమార్గములో సాధించడము అంటే శాస్త్రీయ, సాంకేతిక అభివృద్ధివలన వస్తూన్న ప్రతిపరిణామము ఎంతవరకు సాంఘిక ప్రయోజనాలకు దోహదకారిగవుంది, యెంతవరకు సుఖశాంతులకు నిలయమైన నూతన సమాజ నిర్మాణానికి అవసరము, ఉపయోగము అనేదాన్ని క్లిష్టంగ, సూక్ష్మంగ పరిశీలించగల ఒరవడి, దక్షత సమాజంలో అభివృద్ధి అవడానికి తగిన వాతావరణాన్ని సృష్టించగలగాలి. ప్రతివ్యక్తి స్వశక్తిపై, స్వంత ఆలోచనపై సామాజిక ప్రక్రియలను అవగాహన చేసుకొని ఆచరించగలిగిన స్థోమత కలుగజేసే ప్రయత్నాలు సంఘములో జరగాలి. మూఢనమ్మకాలను అంటిపెట్టుకొనడమువలన సాంఘికంగా, వ్యక్తిపరంగా యెలాంటి లోటుపాట్లకు, అనర్థాలకు దారితీస్తుందో స్వతహాగా విమర్శించుకొనే శక్తి ప్రజానీకములో పెరగాలి. ఆనాడు శాస్త్రీయ దృక్పథము దానంతటదే ప్రజలలో యేర్పడుతుంది. 2) సంఘములో రచింపబడిన, తీసుకురాబడిన ప్రతిమార్పు సహేతుకము, శాస్త్రోక్తము కావాలి. అంటే ప్రణాళికరచనలో, అభివృద్ధిపథకాలలో ఆ శాస్త్రీయత స్పష్టంగా కానరావాలి. ఇది జరగాలంటే పాలకవర్గము, మేధావివర్గము అప్రమత్తత, సామర్థ్యము కలిగి, అటువంటి పరిణామాలను భావితరాలవారికి అందజేయకలిగి వుండాలి. అంటే యీవర్గాలపై గురుతరమైన బాధ్యత వుందన్నమాట. సమాజములో ఉపరితలములో గానవస్తున్న రూపురేఖలను కాకుండ, అంతర్గతమై అంతర్లీనమైవున్న శక్తులను, అంశాలను అవగాహన చేసుకొని వానిని ప్రణాళిక రచనలలో ఉపయోగించుకొనేశక్తి సామర్థ్యాలు కలిగివుండాలి. అలా సమస్తప్రజానీకము సూక్ష్మంగా, తులనాత్మకంగా, చిత్తశుద్ధిగా సాంఘిక పరివర్తనమును ఆకాంక్షించి, కృషిచేసిననాడు, సమాజము కొత్త తొడుగులను తొడిగి, శాంతికి సహనతకు, సమానత్వానికి మారుపేరు గాగలదు. అటువంటి శాస్త్రీయ దృక్పథము పెంపొందుతుందనే ఆశిద్దాము.

# రచయితల సంఘాలు

## శ్రీకాంత

రచయితల ఆర్థికమైన అభివృద్ధికి పాటుపడే ట్రేడ్‌యూనియన్లవంటి సంఘాలేవీ ఈనాటికి మనదేశంలో ఏర్పడకపోయినా వారి వారి సాహిత్యవ్యాసంగానికి దోహదంచేసిన సమితులో, సంఘాలో, పరిషత్తులో ఈ శతాబ్ది తొలిరోజుల్లోనే తెలుగుదేశంలోనే ఏర్పడినట్లు చెప్పుకోవచ్చు. అటువంటి సంఘాల్లో, పిఠాపురం మహారాజావారి సహాయ సహకారాలతో 1911 ప్రాంతంలో ఏర్పడిన ఆంధ్రసాహిత్య పరిషత్తును మొట్ట మొదటి సంస్థగా పేర్కొనవచ్చును. పూర్వాంధ్ర సాహిత్యంలో సుసంపన్నమైన తాళపత్రగ్రంథాలను సేకరించడం ఆ విధంగా సేకరించిన గ్రంథాలను పరిష్కరించి ముద్రించడం, సూర్యరాయ నిఘంటువను పేర సమగ్రమైన తెలుగు నిఘంటువు తయారుచేయడం ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక అనే సాహిత్యపత్రికను నడిపించడం, గ్రాంథికభాషా ఉద్యమానికి పెట్టని కోటగా నిలవడం, ఇవన్నీ అరవై ఏండ్లుగా ఆంధ్రసాహిత్య పరిషత్తు సాధించిన అపూర్వమైన విజయాలు. ఈ పరిషత్తు స్థాపనలోనూ ఆనాటి పండిత ప్రకాండులైన శ్రీయుతులు కందుకూరి వీరేశలింగంపంతులు, వేదము వేంకటరాయశాస్త్రి, కొమఱ్ఱాజు లక్ష్మణరావు, వావిలికొలను సుబ్బారావు, జయంతి రామయ్యపంతులు గారలు సల్పినకృషి చిరస్మరణీయమైనది. అయితే యీ పరిషత్తు ఆధునిక సాహిత్యాన్ని చిన్నచూపు చూసింది. అప్పటికే వెల్లువయై వెల్లుబుకుతోన్న వ్యావహారిక భాషాఉద్యమానికి అడ్డుకట్టలు కట్టబోయి విఫలమైంది. ఆ కారణంగానే పూర్వాంధ్ర సాహిత్యానికి ఎంతసేవ చేసినా ఆంధ్ర సాహిత్యపరిషత్తు ఆధునిక సాహితీపరుల మన్ననలను అందుకొనలేకపోయింది.

కాలానుగుణంగా వస్తోన్న మార్పులను గమనిస్తూను, ఆధునిక సాహితీపరులైన రచయితలకూ, కవులకూ ప్రోత్సాహం కల్పిస్తూనూ అనేక సంఘాలు ఆ తర్వాత వెలిశాయి. అందులో శ్రీ తల్లావఝ్జల శివశంకరశాస్త్రి, నోరి నరసింహశాస్త్రి ప్రభృతుల అధ్వర్యవంలో వెలసిన సాహితీసమితి, శ్రీ పురిపండ అప్పలస్వామి, శ్రీ శ్రీరంగం శ్రీనివాసరావు, వడ్డాది సీతారామాంజనేయులుగార్ల కృషిఫలింగా ఆవిర్భవించిన కవితాసమితి ముఖ్యమైనవి. వీటిని సంఘాలని వ్యవహరించడంకన్న సాహితీ మిత్రబృందాలుగా పరిగణించడం మంచిది. ఇవి రెండూ తమ తమ కవిమిత్రులను ప్రోత్సహిస్తూ, వెన్నుతట్టి ముందడుగు వేయించడంలో మంచి కృషిచేశాయి. తత్ఫలితంగానే కృష్ణశాస్త్రి, శ్రీశ్రీ మొదలైన కవులకు తమశక్తిపై అపారమైన ఆత్మవిశ్వాసం కుదురుకొనడం, ఆ తర్వాత వారిరువురూ నవ్యసాహిత్యోద్యమనిర్మాతలుగా రూపుదిద్దుకొనడం జరిగింది.

అటువిమ్మట అంతకన్న విస్తృతమైన ప్రాతిపదికమీద నెలకొల్పబడి విశేషంగా కవులనూ, రచయితలనూ ఆకర్షించి, నవ్యసాహిత్యాన్ని ప్రచారంచేసిన సంస్థ నవ్య సాహిత్య పరిషత్తు. యీ సంస్థలన్నీ తమ తమ సభ్యుల గ్రంథాలను ప్రచురించడం' వార్షికోత్సవాలను జరపడం, పత్రికలను ప్రచురించడంద్వారా నవ్యసాహిత్య అభివృద్ధికీ, ప్రచారానికీ ఎంతగానో తోడ్పడ్డాయి.

అటుతర్వాత వచ్చిన ఆంధ్ర అభ్యుదయ రచయితలసంఘం భారతీయ అభ్యుదయ రచయితల సంఘానికి అనుబంధసంస్థ. భారతీయ రచయితల నందరినీ మొట్టమొదటి సారిగా ఒకే వేదికమీద సమీకరించిన గౌరవం యీ సంస్థకే దక్కుతుంది. భారతీయ భాషల్లో వెలసిన అభ్యుదయ రచయితల సంఘాలన్నీ సాహిత్య దృక్పథంతోనే విప్ల వాత్మకమైన మార్పులు తీసుకొచ్చి, సంఘశ్రేయస్సే సాహిత్యప్రయోజనంగా నిర్వచిం చాయి. ఆ ప్రభావానికి లోనైన రచయితలు సమకాలీన సాంఘికేతివృత్తాలనూ, సమస్య లను కావ్యవస్తువులుగా గ్రహించి, వాటి పరిష్కారమార్గాలను అన్వేషిస్తూ రచనలు సాగించారు.

ఇవన్నీ 1940 ప్రాంతాలకే ఆంధ్రప్రాంతంలో ఏర్పడిన సాహిత్యసంఘాలు. యీ సంఘాల ప్రభావం అప్పటి నైజాం రాజ్యంలో ఉన్న తెలంగాణా సాహితీపరులపైన విశేషంగా ప్రసరించింది. ఆంధ్రప్రదేశంలో ఏర్పడిన ఆంధ్రసాహిత్య పరిషత్తు మాదిరి గానే హైద్రాబాద్‌లోనూ 1943 లో ఆంధ్రసారస్వత పరిషత్తు ఉదయించింది. యీ సంస్థ నిర్మాణ, నిర్వహణ కార్యకలాపాల్లో శ్రీయుతులు లోకనంది శంకరనారాయణరావు, సురవరం ప్రతాపరెడ్డి, దేవులపల్లి రామానుజరావు, నూకల నరోత్తమరెడ్డి, ప్రభృతుల కృషి ప్రశంసనీయమైనది. సభలూ, సమావేశాలూ జరిపి, రచయితలను ప్రోత్సహించి, గ్రంథాలను ప్రచురించి, యీ సంస్థ ఎనలేని సాహిత్యసేవ చేసింది. అన్నిటికన్నా ముఖ్యంగా భాషా విషయకంగా వెనుకబడివున్న తెలంగాణా ప్రాంతంలో సారస్వత పరీక్షలు ప్రవేశపెట్టి యీసంస్థ చేసిన కృషి ప్రశంసార్హమైనది.

ఆ తర్వాత 1953 ప్రాంతాలలో శ్రీయుతులు దాశరథి, నారాయణరెడ్డి, కాళోజీ ప్రభృతుల కృషితో వెలుగులోకి వచ్చిన తెలంగాణా రచయితల సంఘం, యువకవులనూ, రచయితలనూ సమీకరించి తెలంగాణాప్రాంతంలో ఆంధ్రప్రదేశ అవతరణకి పూర్వమే బ్రహ్మాండమైన సాహిత్య చైతన్యాన్ని కలుగజేసింది.

ఇలాగే అఖిలాంధ్రదేశంలోనూ చిన్నవీ పెద్దవీ అయిన అనేకసంస్థలే రచయితల సంఘాలుగా యీదశాబ్ది ప్రారంభదశనుండే పనిచేస్తూ, ఆంధ్ర సారస్వతవ్యాప్తికి అవిరా మమైన కృషిని సాగించాయి. ఇటీవల ఏర్పడిన ఆంధ్రప్రదేశ సాహిత్యఅకాడమీ ఇప్పుడే బాధ్యతలన్నీ స్వీకరిస్తున్నది.

మరి యీ సంఘాలన్నిటినీ రచయితల సంఘాలుగానే పరిగణించవలసివస్తుంది. అయితే యీ సంఘాల లక్ష్యాలనన్నిటినీ దృష్టిలో పెట్టుకొంటే మూడు ముఖ్యమైన ప్రయో

జనాలను సాధించడానికే రచయితల సంఘాలు ఎప్పుడూ పనిచేయవలసి వున్నట్లుగా విశదమౌతుంది.

**ఒకటి :** పూర్వాంధ్రకవుల కావ్యాలను పరిష్కరించి ప్రకటిస్తూఉండడం, మాండలికపదకోశాలూ, వ్యాకరణాలూ, భాషాశాస్త్రాలవంటి గ్రంథాలను రచింపజేసి ప్రకటిస్తూ ఉండడంవంటి పనులు ఒక సంఘం చేయాలి. ఇటువంటి సంఘాలే ఎక్కువగా సాహిత్య భవితవ్యాన్ని తీర్చిదిద్దగలవు. అయితే ఈ సంస్థల్లో ఎక్కువగా దిగ్దంతులైన పండితులే సభ్యులుగా ఉండవలసివస్తుంది. ఒకవిధమైన స్థాయి లేనటువంటివాళ్ళు ఇటువంటి సంఘాల్లో సభ్యులై సారథ్యం వహిస్తే, ఇంక ఆ సాహిత్యానికి పుట్టగతులుండవు. ఇటువంటి సంఘాలే ప్రాచీనాంధ్రగ్రంథాలను సేకరించే పథకాన్ని కూడా చేపట్టాలి. ప్రతిభామణులైన సమకాలీన రచయితల కృషిని గుర్తిస్తూ వారిని సత్కరిస్తూ, వారి గ్రంథాలకు బహుమతులను ప్రకటిస్తూ ఉండాలి. భాషాభివృద్ధికీ, సాహిత్యాభివృద్ధికీ తోడుపడే పత్రికలను నడపాలి. మారుతోన్న సాహిత్యపు విలువలను సూచించే సూత్రాలను కనుగొనాలి. ఏయేటా దేశంలో జరుగుతోన్న సాహిత్యకృషినికూడా ఇటువంటి సంఘాలే సమగ్రంగా పరిశీలించి సమీక్షించాలి. యీ సంఘాలు దేశంలో వ్యాప్తిలోఉన్న ఏ రకం సాహిత్యంమీదా ప్రత్యేకాభిమానం వహించక, అన్నిరకాల సాహిత్యాలయెడా నిష్పక్షపాత వైఖరిని అవలంబించేవిగా ఉండాలి. యీ పనులన్నీ సక్రమంగా జరిగితే యీ సంఘమే దేశీయసాహిత్యాన్ని అజరామరం చేయగల ఏకైక సంస్థ కాగలదు.

**రెండు :** ఈ సంఘాలు పూర్తిగా సృజనాత్మకమైన రచనలు చేయగల వ్యక్తులకు మాత్రమే పరిమితమై ఉండాలి. ఆ యా రచయితలు స్వీకరించే రచనామార్గాన్ని బట్టి ఇటువంటి సంఘాలు ఎన్నైనా ఉండవచ్చు. ఒకేమార్గాన్ని అనుసరించే పదిమంది రచయితలు ఒక మిత్రమండలిగా వ్యవహరిస్తూ, పరస్పరం ప్రోత్సహించుకొంటూ, సహకారాన్ని అందించుకొంటూ, రచనల్లోని లోపాలను సహృదయతతో సరిదిద్దుకుంటూ యీ సంఘాలు వ్యవహరించాలి. ఇటువంటి సంఘాలే రచయితలకు ఆత్మవిశ్వాసాన్ని కలిగిస్తూ వారి రచనా వ్యాసంగానికి విశేషంగా తోడుపడగలవని నిస్సందేహంగా చెప్పవచ్చు.

కేవలం లాభాలు సంపాదించడమే ప్రధానలక్ష్యంగా పెట్టుకున్న పత్రికాధిపతులూ, ప్రచురణకర్తలూ, సాహిత్యంలో సరిక్రొత్త ప్రయోగాలమీద పెట్టుబడి పెట్టడానికి ముందుకురారు. ఏరకమైన సాహిత్యం తేలిగ్గా అమ్ముడుపోతుందో, అటువంటి సాహిత్యాన్నే సేకరించి ప్రచురించడానికి వారు ప్రయత్నిస్తారు. అందువల్ల నూతనమార్గాల్లో పురోగమించడానికి రచయితలకు అవరోధం ఏర్పడుతుంది. ఈ అవరోధాలనుండి బయటపడి నవనవోన్మేషమైన సాహిత్యాన్ని సృష్టించడానికి యీ సంఘాలు ఎక్కువగా తోడ్పడగలవు. అటువంటి సంఘాలు ఎన్ని ఎక్కువగావుంటే అంత వైవిధ్యం సాహిత్యంలో రావడానికి సావకాశం ఉంటుంది. ఈ సంఘాలే పాఠకులలో వినూత్నమైన అభిరుచులను కల్పించడానికి దోహదం చేయగలవు; రచయితల వ్యక్తిత్వాన్ని పెంచగలవు.

ఎటువంటి నూత్నప్రయోగాలకైనా మొదటిలోనే విశేషంగా ప్రజాదరణ లభించదు. అయితే వాటిని పనిగట్టుకుని ప్రచారంచేసి పలుకుబడి సంపాదించిపెట్టే కృషి ఆ ప్రయోగ రహస్యాలు తెలిసివున్నవారే చెయ్యాలి. అప్పుడు అందులోని సత్తాని బట్టి ఆ ప్రయోగాలకు క్రమంగా ప్రజాదరణ లభిస్తుంది. ఈ పని రచయిత ఒక్కడుగా చేయలేడు. తన కృషిని మెచ్చుకుని ప్రోత్సహించే మిత్ర రచయితల సహకారసంపత్తిమీదనే ఆప్రయోగం యొక్క విజయం ఆధార పడివుంటుంది.

ఏమైనా ఒకే లక్ష్యశుద్ధితో రచనా వ్యాసంగంచేసే రచయితలందరూ కలిసి సాగించే సమిష్టికృషియే లోకంలో ఒక సంచలనం తేగలుగుతుంది. దాని మంచి చెడ్డలు ఆ తర్వాత చరిత్ర నిర్ణయిస్తుంది. అయితే సాహిత్యంలో నూత్నప్రయోగాలు రావాలంటే మాత్రం దానికి తగిన ప్రోత్సాహం కావాలి. ఇందు కీవిధమైన మిత్రమండలులే ఎక్కువగా ఉపకరిస్తాయి. వర్తమాన సాహిత్యంయొక్క మంచిచెడ్డ లెప్పుడూ యిటువంటి సంఘాలమీదనే ఆధారపడి ఉంటాయి.

**మూడు**: రచయితలను ఆర్థిక పరిస్థితులను మెరుగు పరచే సంఘాల అవసరం ఎంతగానో ఉన్నది. ఒక విధంగా చూస్తే పూర్వం రాజాస్థానాలను ఆశ్రయించుకున్నకవుల పరిస్థితులే బాగున్నాయేమో అనిపిస్తుంది. ఎవడో ఒక రాజుని పట్టుకొని ఇంద్రుడో చంద్రుడో అని అతణ్ణి పొగిడి ఒక కావ్యం అంకితమిస్తే జీవితాంతం వారికి సుఖంగా జరిగిపోయేదేమో. కారణాలు ఏమైనా వారి జీవితాలు పూర్తిగా సాహిత్య వ్యాసంగానికే అంకితమై ఉన్నట్లు తోస్తుంది. ఇప్పుడు అలా కేవలం గ్రంథరచన మీదనే ఆధారపడి జీవించే సావకాశం ఎ.తటి పెద్ద గ్రంథకర్తకీ లేదు. కనుక ఏస్కూల్లోనో, కాలేజీలోనో, ఆఫీసులోనో పనిచేస్తూ తీరిక వేళల్లో సరదాగానే రచనా వ్యాసంగాన్ని చేపట్టే రచయితలే అందరూ! కనుక వీరికందరికీ రచన చేయడమన్నది ఒక హాబీయేగాని జీవితసర్వస్వం కాదు. అందువల్ల లక్ష్యశుద్ధిగా రచనలు రావడానికి తగిన సావకాశం అరుదైపోతున్నది. ఈ పరిస్థితి ఇలా నిరాటంకంగా కొనసాగినట్లయితే వర్తమాన సాహిత్యానికి పెద్ద విఘాతము ఏర్పడుతుంది.

వాస్తవానికి యీవేళ విదేశాల్లోని రచయితలందరూ రచనా వ్యాసంగం మీదనే ఆధారపడి జీవితం కొనసాగిస్తున్నారు. అయితే మన సాంఘిక వ్యవస్థలోకూడా ఇంకా డబ్బుపెట్టి పుస్తకాలు కొనుక్కుని చదువుకొనే ఆర్థికస్తోమత అందరికీ రాలేదు. అంతే కాదు, జనసామాన్యాని కంతకీ ఎప్పుడూ ఎదో విధంగా పొట్టకూటికై దేవుళ్ళాడడంతోనే సరిపోతున్నది. విశ్రాంతిగా విజ్ఞాన సముపార్జనను సల్పేకృషి నేటి సమాజంలో బొత్తిగా శూన్యమనే చెప్పాలి. ఇతర దేశాల్లో అయితే ఫ్యాక్టరీలు, ఆఫీసులు, పొలాలు వెంపలాడే వదలివచ్చి, తీరికకాలమంతా గ్రంథపఠనానికే వినియోగిస్తారు. ఇటువంటి పాఠకులు లేని ఏ దేశంలో అయినాసరే రచయితల జీవితాలు ఆర్థికంగా హెచ్చరికగా ఉండే సావకాశం ఉండదు.

అటువంటి పరిస్థితులు దేశంలో ఏర్పడేవరకూ చేతులు ముడుచుకు కూర్చుంటా మంటే కర్తవ్యాన్ని విస్మరించడమే అవుతుంది. కనుక ఒకప్రక్క దేశపరిస్థితులను మెరుగుపరిచే కృషిసాగిస్తూనే వేరొకప్రక్క నుంచి తమ పరిస్థితులను రచయితలే మెరుగు పరచుకొనే సంఘాలు ఏర్పడాలి. రచయితల కృషిఫలితాలమీద ఆధారపడి లాభాలు చేసుకొంటోన్న పత్రికలూ, ప్రచురణకర్తలూ, రేడియోలూ, సినిమాలు రచయితల కిచ్చే పారితోషికాలరేటు బాగా పెంచే ఏర్పాట్లుచేయాలి. అన్నిటికన్నా ముఖ్యమైనది కాపీ రైటు హక్కు! ఏపరిస్థితుల్లోనూ కూడా పుస్తకాల కాపీరైటు హక్కులు రచయితల చేజారిపోకుండావుండే బలమైన శాసనం వంటిది ఒకటి ఉండాలి. అందుమీదవచ్చే ధనమో, పణమో ఎప్పుడూ రచయితకే ముడుతూ ఉండాలి. కాపీరైటు హక్కులనేది ఇతర ఆస్తి హక్కులవలెనే రచయితకు జీవనాధారమై ఉండాలి. దేశంలో ప్రైవేటు ఆస్తులు వున్నంతవరకూ కాపీరైటు హక్కుకూడా వంశపారంపర్యంగా సంక్రమిస్తూ రచ యితకు తనకుటుంబ పురోగతి విషయమై ఏ బెంగా లేకుండా నిశ్చింతగా జీవింపగలిగే అవకాశాన్ని కలుగచెయ్యాలి. అప్పుడే రచయితకు కొంతస్థిమితమూ, స్తోమతా కలగ డానికి వీలవుతుంది.

**మరొక ముఖ్యవిషయము:** గ్రంథప్రచురణ కార్యక్రమంలో రచయితలూ, ప్రచురణకర్తలూ, పుస్తక విక్రేతలూ సమాన భాగస్వాములే కనుక ఈ ముగ్గురికీ కూడా ఇందులో బ్రతకడానికి సమానావకాశాలే ఉండాలి. యీ ముగ్గురూ పరస్పర సహకార భావంతో వ్యవహరింపగలిగితే పరిస్థితులు ఇంతకన్నా మెరుగవడానికీ, రచయితలు తమ కృషి ఫలితంపై ఆధారపడి స్వతంత్రంగా జీవించడానికి మంచిసావకాశం లభిస్తుంది. మరి యీ విషయాలన్నీకూడా రచయితలసంఘాలే దృష్టిలో ఉంచుకొని పనిచెయ్యాలి.

యీ మూడు ముఖ్య ప్రయోజనాలను ఆశించి రచయితల సంఘాలు కనుక పని చేసినట్లయితే మన దేశీయ సాహిత్యం మూడు పువ్వులూ ఆరుకాయలుగా సర్వతోముఖాభి వృద్ధిని సాధించగలదని దృఢంగా విశ్వసించవచ్చు.

*

మనిషికోసం కవిత్వం
మంచికోరి నవ్యత్వం
నవ్యత్వం ప్లస్ మానవత్వం ఈజీక్వల్‌టు కవిత్వం.

* *

కవిత్వం సైన్సు కారాదు. కవి రచన కఠినమైన థీసిస్సు
కావాలి అది ఎడారిలో ఒయాసిస్సు, అనుభవాలతేట సరస్సు

—శ్రీశ్రీ

# విలువలు మారిన సాహిత్యము

## డా. కేతవరపు రామకోటిశాస్త్రి

భారతదేశమునకు స్వాతంత్ర్యము వచ్చినది. ఇక పని అయిపోయినది. స్వాతంత్రో ద్యమము సాగినంత కాలము మన కొక లక్ష్యమున్నది. అప్పుడు మన కొక శత్రువు వున్నాడు. మన మందరము కలిసి వానిమీద విరుచుకపడితిమి. వానిని వెళ్ళదరిమి మన దేశమును మనము స్వాధీనపరచుకొనుటయే అప్పటి మన లక్ష్యము. ఆ లక్ష్యసాధనకై మనము జలపాతముల వలె సాగితిమి. ఆ ఉద్యమ కాలమున మన దన్నిరంగముల యందును జలపాత ప్రవృత్తియే. ఆధునికాంధ్ర సాహిత్యమున మహాకవు లందరును ఆ ఉద్యమాగ్నియందు తప్తులై నిర్మలాంతఃకరణముల బోల్చి నిల్చిన హిరణ్మయులు. లక్ష్యశుద్ధిగల ఉద్యమము నడిపించు కాలమున జనుల కున్న నిష్కామ కర్మ ప్రవృత్తి లక్ష్యసిద్ధి కలిగి ఉద్యమము లేని కాలమున నుండదు. స్వాతంత్రోద్యమమున నడుము బిగించి దూకిన సామాన్య మానవున కప్పటి యావేశము పొంగున స్వాతంత్ర్యము వచ్చిన తరువాత తనకీ ప్రయోజనము కలిసివచ్చునన్న జ్ఞానము గాని, కలిసిరావలయునన్న ఆశగాని లేదు. దేశమున కసలు స్వాతంత్ర మెందుకు కావలయునో కూడా వానికి తెలియదు. కావలయును. అది అంతే.

స్వాతంత్ర్యము వచ్చినది. జాతీయోద్యమము పని యైపోయినది. రాజకీయోద్యమము మొదలయినది. జాతీయోద్యమమున కున్న ఏకైక లక్ష్యశుద్ధి రాజకీయోద్యమమున కుండదు. రాజకీయోద్యమము బహురూప ప్రజాస్వామ్యమున ఎన్ని రాజకీయపక్షములైనను లేవవచ్చును. ఒక్కొక్క పక్షము దాని ఉద్యమమును కొన్నాళ్ళొక దిక్కుగా నడుపును. ఏ పక్షమును పరిశుద్ధమైనది కాదు. అన్ని పక్షములందలి వారును అవకాశములను చూచుకొని పక్షములు మారుదురు. కొన్ని కొత్తపక్షములను నెలకొల్పుదురు, కొన్ని పాత పక్షములను విలీనము చేయుదురు. జాతీయోద్యమము వలని లాభమును పంచుకొనుట లక్ష్యముగా రాజకీయోద్యమము బయలు దేరినది. సాధారణముగా పంపకములు కుదురవు. బలాబలములు చూచుకొందురు. స్వాతంత్ర్యానంతరము వచ్చిన మన రాజకీయోద్యమము స్వరూప స్వభావము లవ్వి.

బలాబలములు చూచుకొను స్థితి వచ్చినదాదిగా జయాపజయములు రెండే ప్రాధాన్యము వహించుచున్నవి. ఎట్లయినను జయమును పొందుటయే ముఖ్యము. ఈ మార్గమనుసరింపవచ్చును, ఈ మార్గ మనుసరింపరాదని లేదు. ఇక్కడ మానవు డెంత పతనముగా వీలున్నదో అంతకంటె కొంచె మెక్కువగనే అగుచున్నాడు. రాజకీయముగా మన

మెంత శోచనీయావస్థలో నున్నామో సాంస్కృతికముగను అట్లే యున్నాము. ఈ నాడు సంఘమంతయు రాజకీయ ప్రవృత్తియే కలిగియున్నది.

రాజకీయ నాయకుల ఉపన్యాసవస్తువే కవుల కావ్యవస్తువు. రాజకీయనాయకుల చిత్తశుద్ధి వంటిదే కవుల చిత్తశుద్ధియును. రాజకీయవాక్కు సర్వత్ర రాజ్యము చేయుచున్నది. మనోవాక్కాయకర్మలకు స్వతంత్ర భారతదేశమున సంబంధము తెగిపోయినది. మనస్సులో అనుకున్నది చెప్పుటలేదు. చెప్పినది చేయుటలేదు. తమ కిష్టముకాని పనులను కూడ రాజకీయ నాయకు లెన్ని యిష్టములయినట్లే చేసిచూపుచున్నారో, కవులును అట్లే తమ హృదయములు స్పదించని అనేక విషయములను గూర్చి సమయానుకూలముగా కవితలు వెలయించుచున్నారు. రాజకీయకవిత ఎక్కువగా వ్రాయబడుచున్నది.

ప్రతివానికిని ఒక రాజకీయ నాయకుడు కావలయునని ఉన్నట్లే కలము పట్టిన ప్రతి కవికిని తనరచనారీతి అదొక ప్రత్యేకమార్గమని - దానికి తానే ప్రతినిధి నని మిగిలినవారందరును ఆ మార్గమును బట్టి రావలయుననియు నున్నది. పదిమందితో కలిసియుండి వారి జీవిత సమస్యల నవగాహన చేసికొని ఒక పరిష్కార మార్గమును భావించి వర్ణించుట తన కర్తవ్యమన్న మాటనే ఇప్పుడు కవి విస్మరించినట్లు కన్పించుచున్నది. ఎంతసేపటికిని తాను, తన నాయకత్వము-ఇవితప్ప కావ్యవస్తువును గూర్చి ఈనాడు కవి ఆలోచించుటలేదు. ఆలోచించనివాడు, అనుభవము లేనివాడు ఏమి వ్రాయును ? శుష్కప్రియములు వ్రాయును. శూన్యహస్తములు చూపును. ఇంతవరకు ఏది చెప్పబడినదో అది స్వాతంత్ర్యము వచ్చిన తరువాతి మొదటితరము వారి మాట.

ఇక వర్తమాన కవితరమును గురించి కూడ విచారింపవలయును. వర్తమానాంధ్ర కవులందరును కూడ - సంప్రదాయమార్గమున బోవువారు కాక - మొత్తముమీద సోషలిస్టు దృక్పథము కలవారు. ఇంతవరకు మంచిదే.

వీరందరును యువకులు. అనగా కాలేజి విద్యార్థులును విద్యార్థులవంటి వారును అన్నమాట. వీరిలో ఎక్కువమంది రెంటికింజెడిన రేవడులు. ఏమనగా వీరికి సంప్రదాయ బలము లేదు. ఆధునికమైన విజ్ఞానము లేదు. చదువుసంధ్యలయందు విశ్వాసము లేదు. ఒక సంప్రదాయమును నిందించి త్రోసిరాజని నూత్నవిజ్ఞానమును ఆకళింపుజేసుకొనుట కెంత చదువు కావలయును ? ఎంత శ్రద్ధ కావలయును ? ఈ తరమువారియం దీ రెండును లేవు. చదు వక్కరలేదు. చదువు లేనివాడు గొప్ప గొప్ప పదవులలో నుండుట లక్షలకు లక్షల నార్జించుటను ప్రత్యక్షముగా ఈ తరమువారు చూచుచున్నారు. జీవితమున సాధింపవలసిన లక్ష్యములు — పదవి – డబ్బు – యీ రెండింటికిని చదువక్కరలేదు. కనుకనే చదువుకొనుట లేదు. పదవి డబ్బు ఉన్నచో ఇక మిగిలిన వన్నియును వానిని వెదకికొనుచు వచ్చి చేరును. వాడు కవికూడ అగును.

పాప మీతరమువారిలో కొందరి కేదో వ్రాయవలయు నన్న మంచి యుత్సాహమున్నది. నిజమే. వ్రాయుట కేమి కావలయును ? మంచి భాష కావలయును. మంచి

భావము రావలయును. మంచి భాష ఎక్కడ దొరుకును ? కావ్యములయందు దొరుకును. చదువుటనే మానుకొన్నవారు కావ్యములనేమి చదువుదురు ? అందువలన యీ యువతరము వారికి చేతిలో చెప్పినట్లాడుగులు పోవుభాషలేదు నిత్యవ్యవహారపుభాషయే వారికి కావ్యభాష కూడ. అందువల్ల యువతరమువారు భాష విషయమున వట్టి దరిద్రులు. ఉత్సాహ మున్నది గనుక ఉన్నదానితోడనే ఏదో తంటాలు పడుచున్నారు. ఇక మంచి భావము సామ్యవాద తత్త్వపు ప్రచారభావములే. ఈ యువతరమున కందుచున్న భావములు వాని కవిగా కవిత్వమున కనుకూలమైనవి కావు. సమాజములోని అట్టడుగు మానిసిని చూడమన్న హెచ్చరిక లవ్వి. కవియైన వాడా మానిషిని చూడవలయును. వానితో కలసి మెలసి బ్రతుకవలయును. వాని సమస్యలను సానుభూతితో అర్థము చేసికొనవలయును. యీ పని చేయకుండ యీ కవులందరును కూడ ఆ హెచ్చరికలనే మాటలు మార్చి చేయుచున్నారు. సామ్యవాద సిద్ధాంత గ్రంథములలోను హెచ్చరికలే. సామ్యవాద సాహిత్యములోను హెచ్చరికలే. అందరును హెచ్చరికలు చేయువారే గాని వినువారు లేరు. ఇక ఆ హెచ్చరికలవల్ల ప్రయోజన మేమున్నది ? మరియు నీ యువతరము వారి నిత్యానుభవమున పాశ్చాత్యదేశముల సంస్కృతిసభ్యతయం దాదరము కనిపించుచున్నది. అవి ధనవంతము లయిన దేశములు. వాని మర్యాదలును అట్లే యుండును. దేశమున ఏమూల చూచినను పాశ్చాత్య సభ్యత ఏదో రూపమున ప్రత్యక్షమగుచునే యున్నది. ఇదియే యువతరము వారి నాకర్షించుచున్నది. అది సహజముకూడ. ఈనాడు మన యువసమాజ మెట్లున్న దనగా పైకి డబ్బులో కన్పించును. లోపల సోషలిస్టుగా కన్పించును. పైకి కన్పించినది ప్రత్యక్షము. లోపల విషయము కన్పించదు. అది వట్టి భావము. ఈ విధముగా పైకి ఒకటి – లోపల ఒకటిగా సమాజమున్నపుడా సమాజము చేయు ప్రతిపనియు నట్లే యుండును. కవిత్వము కూడ అట్లే యుండును. కవిత్వ మట్లుండరాదు. నీవు లోపల ఏమనుకొనుచున్నావో అది బయటకు రావలయును. సమాజమునకు కవి తాను భావించిన దానిని ప్రదర్శింపవలయును. సమాజమును తాను మహోన్నతపథమునకు నడిపింపవల యును. అట్లుకాక సమాజ మనుకొచున్న దానిని కవి తిరిగి వినిపించుటను పెట్టుకొన రాదు. ఈనాటి యువ కవి సమాజమున కీదోషము చేయక తప్పుటలేదు.

వస్తువు పుష్కలముగా చేతిలోలేక భాషచేత దరిద్రులై, అనుభవము లేని – స్వాభి మానములేని నిజాయితీ నశించిన, కావ్యప్రయోజనము నాశించని, అన్య భాషా, అన్య దేశాభిమానములుగల కవు లున్నచో ఎట్టి కావ్యములు సృష్టింపబడునో అట్టి కావ్యలక్షణ ములు, చాలవర కీనాటిసాహిత్యమున ప్రతిబింబించుచున్నవి. ఈవిధముగా విలువలు మారిన సాహిత్యము ఉత్పత్తియగుచున్న రోజులివ్వి. మన యిష్టాయిష్టములతో నిమి త్తము లేకుండ – మార్పు ప్రకృతి లక్షణము కనుక – ఈ దశ ఇక ముందెప్పటికిని ఇట్లే యుండదుకదా !

ఇంతవరకు ఏది చెప్పబడినదో అది వట్టి కవిత్వమును గురించియే. అందువలన ముగిలిన సాహిత్య ప్రక్రియలంతకంటె మహోదాత్తములుగా భావింపబడుచున్నవని యర్థము

కాదు. అన్నింటి స్థితియు నట్లేయున్నది. అందరి స్థితియు నట్లే యున్నది. మనము స్వతంత్రులమైన తరువాత మనకు మనదేశభక్తి నశించినది. మన భాషాభిమానము నశించినది. మన సాహిత్యాధ్యయన శీలము నశించినది. మరియు మన సంస్కృతి సంప్రదాయముల మీద ఏహ్యభావ మేర్పడినది. ఈ దృశమైన మనఃప్రపంచమునుండి ఇప్పుడు సాహిత్యము సృష్టింపబడుచున్నది. మన నవలలు - మన కథలు - మన నాటికలు ఈ మొదలైన ప్రక్రియలన్నియు నట్లే యున్నవి. రాజకీయ వాతావరణ మెంత కలుషితముగా నున్నదో సాహిత్యరంగ మంత కేమాత్రమును తక్కువగాలేదు. Writers and artists of the Russian Federation portray not only the lives of their own peoples but of other peoples as well : This extends the bounds of their aesthetic cognition of reality and enriches their works with description of the life, character, culture and geography of the fraternal peoples populating the vast Soviet Union (**PROBLEMS OF MODERN AESTHETICS** - Pavel Trofimou. P. 95) ఈ దృష్టితో చూచినచో మన నేటి సాహిత్యమున సాహిత్యము కానరాదు.

ఇది ఒక పరిణామదశావిశిష్టమైన కాలము. ప్రజాస్వామ్యము - సామ్యవాదము - కమ్యూనిజము ఈ దృశమైన పరిణామము జరుగుచున్నది. భూమి తిరుగుట మనకు తోచనట్లే యీ పరిణామము జరుగుటకూడ తత్కాలమున తోచదు. ఈ నాడు జనసామాన్య మట్లున్నది. రచయిత లయినను బుద్ధిమంతులు కావలయును. అందుకు తగిన శిక్షణ కవులకు కరువైనది. ప్రజాహితము కొరకు ప్రభుత్వము, ఆనందానుభవము కొరకు ఆర్థిక విధానము, విజ్ఞానముకొరకు విద్య, సర్వమానవ విశిష్టానుభవాభివ్యక్తి కొరకు సాహిత్యము - ఇవన్నియు ఇప్పుడు లేవు. ఈ నాటి సాహిత్యమున వీని లేక పోవుటయే ప్రతిబింబించుచున్నది. వీని కలిమిని ప్రతిబింబించుట ముందు జరుగవచ్చును.

*

"చావు పుట్టుకలమధ్య సందేహం లాటి
జీవితంలో నలువైపులా అంధకారం
మంచిగంధంలాగ పరిమళించే మానవత్వం
మాకున్న ఒకే ఒక అలంకారం"

—తిలక్.

# రచయితలు - గ్రంథాలయాలు

## శ్రీ ఎస్. పాండురంగారెడ్డి

గ్రంథాలయాలు భావసమరక్షేత్రా లన్నాడు జోనాథన్‌స్విఫ్ట్. పరస్పర విరుద్ధాలైన భావాలు సహజీవనం చేస్తూఉంట వీ గ్రంథాలయాల్లో. పాఠకుల కుతేజం కలిగిస్తూ, మనోవికాసానికి తోడ్పడుతూ, భావపరిపుష్టికి దోహదం కలిగించే కేంద్రాలు గ్రంథాలయాలు. ఇప్పుడిప్పుడే సామాన్యుడైన అక్షరాస్యుడుకూడా గ్రథాలయం అవసరాన్ని, ప్రాధాన్యాన్ని గుర్తించి తన పురోభివృద్ధికి, విజ్ఞానానికి వినోదానికి సాధనంగా ఉపయోగించుకోవడానికి ముందుకు వస్తున్నాడు.

కాని గ్రంథాలయాలకు రచయితలకు ఏమి సంబంధం ? అని తర్కించుకుంటే అవినాభావసంబంధ ముండి తీరుతుం దని తేల్చుకోవచ్చు. ఈ సంబంధాన్ని గూర్చి వివరించడమే ఈ వ్యాసోద్దేశం.

రచయితలకు ప్రత్యక్షంగాను, పరోక్షంగాను ప్రోత్సాహాన్ని ప్రసాదించగలిగేశక్తి గ్రంథాలయాని కున్నది. రచయితకు శాశ్వతకీర్తిని ఆర్జింపజేస్తూ, భావప్రచార కేంద్రంగా తోడ్పడుతూ తరతరాలకు రచయిత భావాలను అందిస్తూ ఉంటుం దీసంస్థ. మానవుని శరీరంలో నరాలు ఏ పని చేస్తుంటాయో, దేశంలోని నదీనదాలు ఏ పని చేస్తుంటాయో, జ్ఞానప్రసారణంలో గ్రంథాలయాలు తద్వారా రచయితలు ఆ పని చేస్తుంటారు.

విజ్ఞానపరిధులు బహుముఖంగా విస్తృతమవుతున్న నేటియుగంలో విజ్ఞాన సముపార్జనాప్రయత్నంలో పరిపూర్ణత, పరిపక్వతను ఎ ఒక్కవ్యక్తి తనకు తానై సాధించలేడు. వివిధదేశాలలోని రచయితలరచనలు, సాహిత్యకృషి మనకు గ్రంథాలయంలో ఒక్కసారిగా లభ్యమౌతవి.

విదేశాలలో రచయితల, పాఠకుల ఆర్థికస్తోమతతో మనకు పనిలేదు. మనదేశంలో రచయితలేమి, పాఠకులేమి పుస్తకాలను కొని నిరుపహతి స్థలంలో కూర్చుని శాంతంగా, నెమ్మదిగా చదువుకోగలిగే స్థితిలో లేరు. ముందు ప్రజోద్యమంగా ఉన్న గ్రంథాలయాలు ఇప్పుడు ప్రభుత్వ పరమైనవి గాను, ప్రభుత్వ సహాయంతో నిర్వహింప బడేవిగాను రూపొందుతున్నవి. కనుక నిన్నటిమాట ఎలా ఉన్నా ఇప్పుడు విద్యార్థులకు కళాశాలల్లో విద్యాలయాల్లోనే కాక ఇతర ప్రదేశాల్లో గ్రంథాలయాలు సహాయపడుతున్నాయి. అన్ని శాస్త్రాలకు సంబంధించిన గ్రంథాలు ఉచితంగా, సవ్యంగా చదువుకోగలిగే అవకాశాలు లభిస్తున్నాయి.

రచయితల్లో రకరకాల వాళ్ళున్నారు. కేవలం కల్పనాత్మకసాహిత్య సృష్టికి పూనుకునేవారికి గ్రంథాలయాలు అంతగా ఉపయోగపడకపోవచ్చు. కల్పనా సాహితికి

కూడా కొంచెం అధ్యయనం అవసరం. అప్పుడే ఆరచనలలో చిక్కదనం, చక్కదనం, గోచరిస్తాయి. నిన్నటిదాక మనదేశభాషల్లో ముఖ్యంగా తెలుగులో కేవలం కల్పనా సాహిత్యమే పెంపొందుతూ వచ్చింది. విశ్వవిద్యాలయస్థాయిలో తెలుగులో బోధన జరుపబడుతున్న ఈ తరుణంలో, రకరకాల పాఠకులు అక్షరాస్యుల్లో నానాటికి సిద్ధమౌతున్నారు. శాస్త్రీయ, సాంకేతిక, వైజ్ఞానిక, సాంఘిక, రాజకీయ విషయాలపై అనేక పుస్తకాలు ప్రచురింపబడుతున్నాయి. వానిస్థాయి పెరిగేకొద్దీ రిఫరెన్సు గ్రంథాల అవసరం పెరిగిపోతుంది. అపార గ్రంథసామగ్రిని ఒక వ్యక్తి సమకూర్చుకోలేడు. ఒక పద్ధతిలో అమర్చుకోలేడు. కనుక రచయితలకు గ్రథాలయాలు కల్పతరువులుగా సాక్షాత్కరిస్తాయి.

రచయితలకు ప్రోత్సాహాన్నిచ్చే మరో అంశం విమర్శ. పుస్తకాల మంచిచెడ్డలను స్థూలంగా నిర్ణయించేది పాఠకులే. ఆ యాపాఠకులకు నచ్చని గ్రంథం మరుగునపడిపోతుంది. రచయితలను పలువురికి పరిచయంచేసి పాఠకులలో పఠనాభిలాషను అభివృద్ధిపరచే కార్యక్రమాన్ని గ్రంథాలయాలు సుగమంగా నిర్వహించగలుగుతవి. అనేక విషయాలను సేకరించి జిజ్ఞాసువులకు అందించే బాధ్యత గ్రంథాలయాలది. మననశీలతను, ప్రజాభిరుచులను, ప్రజలఆలోచనాస్థాయిని రచయితలు గ్రంథాలయాలద్వారా తెలుసుకో గలుగుతారు.

భావాలకు అపారమైన శక్తిసామర్థ్యాలున్నవి. భావాలను ప్రకటించిన రచయిత ఈ లోకాన్ని వదలివెళ్ళినా, అతని భావాలు సజీవంగానే ఉండి పఠితృ లోకానికి స్పందనం కలిగిస్తూనే ఉంటాయి. గ్రంథాలయం ఆ సజీవభావాల కునికిపట్టుగా వ్యవహరించగలుగుతుంది. చాణుక్యుడు, ప్లేటో, అబ్రహాంలింకన్, షేక్స్పియర్, కాళిదాసు, వాల్మీకి ఇప్పుడు మనమధ్య లేకపోయినా వారి రచనలు మనలను ప్రభావితం చేస్తూనే ఉన్నవి. ప్రతి కొత్తతరం తన అనుభూతిని వాళ్ళ రచనల్లో పొందుతూనే ఉన్నది. ఆ మహారచయితల భావదీప్తు లిప్పటికి వెలుగులను విరజిమ్ముతూనే ఉన్నవి. రచయితలను సమాజాన్ని కలుపటానికి సారధిగా ఉపయోగపడగలుగుతుంది గ్రంథాలయం. రచయితలను పాఠకు లిక్కడ గ్రంథరూపంలో దర్శనం చేసుకుంటే, రచయితలు తాము తమవంటివారి భావాలకు ఏ యే విధంగా విలువకట్టుతున్నదీ తెలుసుకోగలుగుతారు.

గతకాలంలోని రచనలను భద్రపరుస్తూ, కొత్తగా వస్తున్న రచనలను సేకరిస్తూ గ్రంథాలయం పాత కొత్తల మేలు కలయికకు కూడలి అవుతుంది.

గ్రంథాలయం ఒక వినూత్న లోకం. రుచిమరిగిన పాఠకుల కది సుధాభాండం. చరిత్రలో ఎందరి జీవితాలనో మలచిన యశస్సు గ్రంథాలయానికి దక్కింది. నాటి నుంచి నేటి దాక గ్రంథాలయాలు అనంత రూపాలతో నిలిచివున్నాయి. సావర్కర్, అంబేడ్కర్, కారల్‌మార్క్స్, మెకాలే వంటి మేధావులు గ్రంథాలయాల్లోనే ఎక్కువకాలం గడిపి గ్రంథాలను మథించి అమృతం పిండుకొని తెచ్చి తమ భావామృతాలను చేర్చి తమ పుస్తక భాండాలుగా మలచి తిరిగి గ్రంథభాండాగారాలకు అందించారు. రచయితలు పెరుగుతున్న కొద్దీ గ్రంథాలయాలకు పని పెరుగుతుంది. రచయితలకు అధ్యయనావ

కాశాలు ఎక్కువౌతున్నకొద్దీ సునిశితమైన రచనలు వచ్చే అవకాశాలు ఏర్పడుతవి. నూత్న రచనలు చేసేందుకు ఎందరికో యీ గ్రంథాలయాలు ప్రోత్సాహాన్నిస్తాయి. గ్రంథాలయాలు సక్రమంగా పాఠకుల రచయితల సహకారంతో పెంపొందితే ఒక భావవిప్లవం వచ్చితీరుతుంది.

గ్రంథాలయాల్లో మంచిరచనతో పాటు కాలానుగుణంగా పాఠకులు పట్టించుకోని గ్రంథాలుకూడా ఉండవచ్చు. ఒక కాలంలో అశ్లీలమైనవి ప్రమాదకరమైనవి మరొక కాలంలో పాఠకుల నాకర్షించవచ్చు. ఒకప్పు డుత్తమశృంగారకావ్యంగా భావింపబడిన గ్రంథాన్ని మరొకప్పుడు తృణీకరించ వచ్చు. కనుక గ్రంథం అంటూ ఉండాలి. నిన్నటిదో, మొన్నటిదో, నేటిదో, మంచిదో, చెడ్డదో, చిన్నదో, పెద్దదో అన్నీ ఉండాలి. అప్పుడుకాని తారతమ్యత, తూలనాత్మక పరిశీలనం ఏర్పడదు. మంచిచెడ్డలూ అన్నీ కలిసి ఉంటవి. ప్రవాహంలో అన్నీ కొట్టుకువచ్చినట్లే గ్రంథాలయంలో అన్నీ వచ్చి చేరుతవి. ఆదరింప బడుతవి. నాటి బాగోగులను విలువలను కాపాడవలసింది, త్యజింపవలసింది పాఠకులే. సమకాలీన పరిస్థితులవల్ల నిరాదరణ పొందిన రచనలు ఉత్తరోత్తరంగా బహుళ ప్రజాదరణ పొందవచ్చు. సాధారణంగా పాఠకుల తీర్పులకు నిలబడగలిగినరచయిత ధన్యుడు.

గ్రంథాలయాలు నిష్పాక్షిక నిక్షేపాలు. అచయితలకు అవి మార్గదర్శకం కావాలె. అప్పుడే లోకానికి ఉపయోగపడగలిగే రచనలు సృష్టిఅవుతాయి. ఒక మహాత్ముని జీవిత రక్తమే ఒక మంచిపుస్తకం అన్న సూక్తి ననుసరించి మహారచయితను గ్రంథరూపంలో దర్శించుకోగలిగే భాగ్యం గ్రంథాలయం కలుగజేస్తుంది. రచయితకు యింతకంటే కావలసింది లేదు.

*

"గ్రంథాలయం మౌన విద్యాలయం
ఉత్తమ గ్రంథాలే, ఉపాధ్యాయులు
అవి రేకెత్తించే, అనుభూతులు, ఆలోచనలు
వెలలేని పాఠాలు"

—డా. సి. నారాయణరెడ్డి.

# రచనలలో సామాజికస్వరూపం

శ్రీ కొడవటిగంటి కుటుంబరావు

లేఖనం రాక పూర్వమే మానవులు రచనలు ప్రారంభించారు. తొలికాలపు రచనలు ఋక్కులుగానో, గేయాలుగానో, శ్లోకాలుగానో, పద్యాలుగానో మనుషుల నోళ్ళద్వారా ప్రచారమయాయి. ఆనాటినుంచి ఈనాటిదాకా జరిగిన రచనలన్నీ జీవితానికీ, సమాజానికీ సంబంధించినవే. సామాజికుల కోసం రచించబడినవే.

ఒక్క వ్యక్తికోసమే రాయబడి, చదవగానే చించివేయబడే ప్రేమలేఖ వెనకకూడా సామాజికశక్తు లున్నాయి. రహస్యప్రేమ సామాజికం. అలాగే ఊహాప్రేయసికి రాసే బహిరంగ ప్రేమలేఖలలో కూడా సమాజం ప్రతిబింబిస్తుంది.

మనం సమాజమనే పంజరంలో బంధించి ఉన్న పక్షులం. కొందరు పంజరాన్ని మనస్ఫూర్తిగా ఆమోదిస్తారు. మరికొందరు ఏదోవిధంగా సమాధానపడతారు. ఇంకా కొందరు ఆ పంజరం యొక్క స్వరూపాన్ని మార్చటానికి హైరానపడతారు. దాన్నుంచి పూర్తిగా బయటికి పోవటానికి ఎవరూ చూడరు. అలా ఎవరైనా పోతే వారికి ఆశ్రయం ఉండదు. దిక్కులేని పక్షులై పోతారు.

అయితే ఈ పంజరం మార్పులేనిది కాదు. అది మారుతున్నది. మార్చబడుతున్నది కూడా.

"సంఘం అంటే ఇలా ఉండాలి" అని ఏనాడు ఎవరు చెప్పినా వారిమాటలు అబద్ధమయాయి. సంఘం ఎలా వుండాలి ? అన్న ప్రశ్న అంత ముఖ్యమైన ప్రశ్న కాదు. దానికి సమాధానం స్పష్టంగా తెలిసే లోపుగా మరికొంత మార్పుకు అవసరం కలగనే కలుగుతుంది. అసలు ప్రశ్న "ఇప్పుడున్న సంఘం ఎలా మారాలి ?" అన్నది.

ఈ ప్రశ్నకు సరిఅయిన సమాధానం కనుక్కున్నవాళ్ళే సమాజంయొక్క పరిణతికి దోహదం చేశారు. వేదకాలంనాటి ఆర్యుల అభ్యున్నతికి మిత్రుడూ, వరుణుడూ, ఇంద్రుడూ మొదలైనవారు దోహదం చేశారు. ఈ యుగంలో మానవ సమాజాలలో జరగవలసిన మార్పులు నిర్ణయించిన లెనిన్, మావోల వంటివాళ్లు తమతమ దేశాలలో విస్మయకరమైన సామాజిక పరిణామాలను సాధించారు.

ఎన్నోవేలమంది ఎన్నోవేలశతాబ్దాలమీదట సమాజంయొక్క బాటలను నిర్దేశించిన కారణంగానే రాతియుగం నాటి మానవులు ఈ అణుయుగం దాకా రాగలిగారు.

రాను రాను సాంఘిక పరిణామవేగం అధికమవుతున్నది: గడచిన 50 ఏళ్ళలో కలిగిన పరిణామాలతో పోలిస్తే అంతకుపూర్వం 50 ఏళ్ళలో కలిగిన పరిణామాలు చాలా అల్పమైనవి.

ఈ మార్పును గురించీ, దాని అవశ్యకతను గురించీ మనసాహిత్యం మనకు తగినంతగా జ్ఞాపకం చెయ్యటంలేదు. రచనలు చేసేవాళ్ళు ఎప్పటికప్పుడు తామున్న సమాజం శాశ్వత స్వభావం కలదన్నట్టూ, అది ఎప్పుడూ ఇలాగే ఉన్నదన్నట్టూ రాయటం ఆచారంగా ఉన్నది. (దేనికీ ఎవరూ బాధ్యులు కారు; అంతా విధికృతం; విధిని ఎవరూ తప్పించుకోలేరు!)

కొందరు సమకాలిక సమస్యలను చిత్రిస్తారు. కాని వాటికి పరిష్కారం ఉంటుందనీ, ఉండవచ్చుననీ వారికి తెలీదు. అందుచేత దారిద్ర్యం పూర్వజన్మ దుష్కృతఫలమనీ, దురాశ నాశనానికి దారితీస్తుందనీ, పాపానికి శిక్ష — ఎప్పుడో! ఎక్కడో! — ఉండకపోదనీ అంటారు. సామాజిక నియమాలను ఉల్లంఘించి దారిద్ర్యంనుంచి తప్పించుకున్నవారు దురాశ ఫలించి కోట్లకు పడగెత్తినవారు, సమస్తమైన పాపాలు బహిరంగంగా చేసి నెగ్గుకొచ్చినవాళ్ళూ తమ ఎదుటేఉన్నా వారినుంచి ఏమీ గుణపాఠం నేర్చుకోరు. సామాజిక వ్యవస్థలో లోపాలు ఏర్పడ్డాయనీ, వాటిని ప్రయత్నపూర్వకంగా సరిచేసుకోవచ్చుననీ వారికి తట్టదు.

ఈనాడు పురుషస్వామ్యం అమలులో ఉన్నది. ఈ సమాజంలో స్త్రీకి పురుషుడితో సమానత్వం అన్నది అసాధ్యం. అది గుర్తించని స్త్రీలు తప్పంతా పురుషుల దృక్పథంలో ఉన్నదనీ, దాన్ని హితోపదేశాల ద్వారా మార్చితే స్త్రీకి జీవితం లోపరహితంగా ఉంటుందనీ భ్రమపడుతున్నారు. వివాహవ్యవస్థా, కుటుంబ స్వరూపమూ, సమాజవ్యవస్థా గొప్ప మార్పులకు గురిఅయితేనేగాని స్త్రీ పురుషుల సమానత్వం సాధ్యంకాదు. ఇప్పుడు వారిమధ్య ఉండే అసమానత కేవలమూ వ్యక్తిగతమైనది కాదు-సామాజికమైనది.

అలాంటి అసమానతే ధనికులమధ్యా దరిద్రులమధ్యా ఉన్నది. ధనికులు గాంధీగారి మాట నమ్మి తమకున్న సంపద యావత్తూ పేదలదేననీ తాము దానికి ధర్మకర్తలమనీ లక్ష సంవత్సరాలపాటు అనుకున్నా ఈ అసమానత పోదు. మనం జీవిస్తున్నది ధనస్వామ్యంలో. ఈనాటి దారిద్ర్యం ఆ భావంవల్ల ఏర్పడినది కాదు. ధనస్వామ్యంవల్ల సృష్టి అయినది. పేదలకు కావలసిన వన్నీ అంగళ్ళలో ఉన్నాయి. పేదల చేతిలో డబ్బు లేదు - నోట్లో శని ఉన్నది. ప్రపంచ జనాభాలో చాలా శాతం ఆకలితో బాధపడుతున్నారు; అమెరికా, కెనడాల వంటి దేశాలలో వ్యవసాయ క్షేత్రాలు సంక్షేపిస్తున్నారు. అదే ధనస్వామ్యమంటే.

ఒక్క తిండే కాదు. ఈనాడు నిరుద్యోగమూ, తిండీ, బట్టా, ఇళ్ళూ, రోగాలకు మందులు లేకపోవటమూ, నిరక్షరతా - అన్నీ కృత్రిమంగా ఏర్పడిననే. వాటన్నిటికీ ధనస్వామ్యమే కారణమని అతిసులువుగా ఎవరన్నా గ్రహించవచ్చు. ఇవన్నీ విధి నిర్ణయంవల్లా, పూర్వజన్మ దుష్కర్మల ఫలితంగానూ, ఏర్పడతాయని రాస్తున్న పేరుబడ్డ రచయిత లున్నారు. వారి అజ్ఞానం ఆశ్చర్యకరం.

రచయితల అజ్ఞానం కళారూపంలో ఎంతగా ప్రచారమవుతున్నదో చూస్తే ఆశ్చర్యం వేస్తుంది. ఒకరు పేదవాళ్లు పడేపాట్లను హృదయవిదారకంగా చిత్రిస్తారు. హీరోకు

చదువుసాగదు. ఉద్యోగం దొరకదు. అవమానం పాలవుతాడు. అప్పులపాలవుతాడు. వాడికి అందరూ శత్రువులే అవుతారు. భార్యకూడా చీదరించుకుంటుంది. చివరకు ఉరి పోసుకు చావడమో ఏదో చేస్తాడు. ఇటువంటి రచన సామాజికులకు ఏ విధంగా ఉపకరిస్తుంది ?

ఇలాంటి కథలోని హీరో ఎంత అసమర్థుడో, రచయితా అంత అసమర్థుడే. ఇదే రచయిత ఈ హీరోకు ఒక ధనికుడి ప్రాపకాన్ని, అపురూప సౌందర్యవతి అయిన భార్యనూ, ఉద్యోగాలలో ప్రమోషన్లనూ, అంతర్జాతీయఖ్యాతినీ సంపాదించి కథను సుఖాంతం చెయ్యగలడు ! అదీ నిరుపయోగమైన కథే !

కీకారణ్యంలో సిమెంటురోడ్లూ, విద్యుద్దీపాలూ, కూల్‌డ్రింక్ షాపులూ ఉండవు. ఈ నాటి సామాజికవ్యవస్థలో బీదవాళ్ళకు జీవితం ముళ్ళబాటే. వాళ్ళకు కనీసపు కోరికలు కూడా తీరేమార్గం లేదు. వాళ్ళకు న్యాయం జరగదు. వాళ్ళు జీవితంతో పోరాడటమంటే సామాజికవ్యవస్థతో పోరాడవలసిందే. ఉన్న పరిస్థితిలో పోరాటం అవసరంలేని వర్గానికీ, పరిస్థితులతో ఏదోరకంగా సర్దుకుపోయే అవకాశం ఉన్న వర్గానికీ చెందిన రచయితలు దరిద్రులనుగురించి అశ్రుతర్పణాలు విడవటం చాలా నిరుపయోగంగా కనబడుతుంది. అందులో ద్యోతకమయ్యేదల్లా ఏమిటంటే, అయ్యో ! ఈ పేదవాడికి నాలుగెకరాల సుక్షేత్రమైన భూవసతీ, ఒక చిన్నడాబా, ఓ నాలుగువందల రూపాయల నెలజీతమూ లేకపోయెనే అన్న విచారంతప్ప మరేమీకాదు.

చాలా మధ్యతరగవాళ్ళ రచనలు వాళ్ళ తరగతియొక్క చిత్తవృత్తిని ప్రతిబింబిస్తున్నాయి గాని, పేదల దృష్టితో సమాజ స్వరూపాన్నికాదు. మనం "బార్బారిజం" నుంచి బయటపడలేదు. అందుకే మనలో నిమ్నజాతు లున్నట్టు ఒప్పుకుని వారిని ఉద్ధరించటానికి గర్విస్తున్నాం. అస్పృశ్యు లున్నారన్నది గుర్తించి వారికోసం ప్రత్యేక సదుపాయాలు చేస్తున్నాం ! నిజమైన నాగరిక జాతి ఎక్కువతక్కువ కులాల విచక్షణను తీవ్రంగా శిక్షిస్తుంది; అస్పృశ్యతను ఏ రూపంలో పాటించినా శిక్షిస్తుంది. అతి ధనికుడైన వాడు తన ఔదార్యాన్ని ప్రకటించుకోవటానికి పేదలకు దానధర్మాలు చెయ్యటం ఏలాటిదో, మన ప్రభుత్వం నిమ్నజాతులనూ, హరిజనులనూ, ఉద్ధరించే కార్యక్రమం అచ్చు అలాటిదే.

కులాల హెచ్చుతగ్గులూ, అస్పృశ్యతా వాస్తవంగా ఉన్నవేగదా అనవచ్చు. ఉండదగనివి లేకుండా చేసుకోవటమే నిజమైన అభ్యుదయం. జలుబుచేస్తే ముక్కు చీదుకుంటూ ఉండటం చికిత్సకాదు. అలాంటి చికిత్సలు అభ్యుదయ మనిపించుకోవు.

ధనస్వామ్యం తొలగటానికి ఏమి చెయ్యాలో ఆలోచించలేక దాని దుష్ఫలితాలను గురించి అశ్రువులు రాల్చి పాఠకులచేత అశ్రువులు రాల్పించాలని ప్రయత్నిస్తూ చేసే రచనలు చాలా చిరాకు పుట్టిస్తున్నాయి. దరిద్రుల కష్టాలకు దేవుణ్ణి, పూర్వజన్మలో చేసిన పాపాలనూ కారణాలుగా పేర్కొనే రచయితలను ఏంచేసినా పాపంలేదు. సామాజిక విషయాలను గురించి వారికి నోరెత్తే అర్హతలేదు.

ఇలాటి తుచ్ఛమైన రచనలు చేసేకన్న, బీదవాళ్ళకు స్పష్టంగా చెప్పండి. "ఈ సమాజంతో మీరు సుఖపడరు; మీ గొంతెమ్మ కోరికలు ఫలించవు; మిమ్మల్ని ధనికులు అజ్ఞానంలోనూ, దారిద్ర్యంలోనూ ఉంచుతారు; మిమ్మల్ని కడుపునిండా తిననివ్వరు; మీ పిల్లలూ, మీ భార్యా మీ కళ్లెదుటే రోగాలతో కుమిలి చస్తారు; మీకు డబ్బులేదు సరికదా, అప్పు పుట్టదు; తీర్చలేని వాడికి డబ్బు అప్పెవడిస్తాడు? ధనికుల లాభాలకోసం పరిశ్రమలు నడుపుతున్నారుగాని, మీకు ఉద్యోగా లివ్వటంకోసం కాదు; వాళ్ళకు మీవల్ల లాభం లేనప్పుడు మిమ్మల్ని ఉద్యోగాలనుంచి తీసేస్తారు; అద్దె రాకపోతే అద్దె ఇంటివాడు మిమ్మల్ని బయటకి గెంటుతాడు; మీ ఏ ఒక సమస్యా ధనికుల సమస్యలు కావు; డాక్టర్లు మీ రోగాలను నయంచెయ్యటానికే వైద్యం చేస్తున్నారనీ, ప్లీడర్లు మీకు న్యాయం జరగడం కోసమే ప్రాక్టీసు చేస్తున్నారనీ ఒక్కనాటికి అనుకోవద్దు; వాళ్ళు డబ్బుకోసమే పని చేస్తున్నారు. ఇది ధనస్వామ్యం. చేతనైతే దీన్నిమార్చండి. లేకపోతే దీని కిందపడి నలిగి చావండి. ఎవడన్నా మీ పట్ల సానుభూతి ఉన్నట్లు మాట్లాడినమాత్రాన వాడు మీ కేదో తవ్వి తలకెత్తుతా డనుకోకండి! వాడు మిమ్మల్ని వంచిస్తున్నాడు. సానుభూతితో కడుపు నిండదు. రోగాలు నయంకావు. సమాజం మారదు. అది మిమ్మల్ని ఊబిలోకి తొయ్యటానికే పనికొస్తుంది".

ధనస్వామ్యం మారాలి. మారుతుంది. మీ కీనాడు ఈ గుండెలు కరిగించే రచనలు ఏ మాత్రమూ తోడ్పడవు.

నాలో జాలి లేదనుకోకండి. నేనూ జాలిపడుతున్నాను – కాలదోషం పట్టిన వర్గాలనుగురించి. పాపం వాళ్లు తమ రాజకీయపుటెత్తులూ, తమకు అండగా ఇంతకాలమూ ఉన్న శాసనాలూ, విచ్చలవిడిగా తాము సాగించే జులుమూ, సమిష్టి సమాజంపట్ల వాళ్ళకు గల అలుసూ – ఇవన్నీ శాశ్వత మనుకుంటున్నారు. ఇవి శాశ్వతం అనిపించడానికి కారణం ఏదన్నా ఉంటే అది అవసానదశే! ఆరిపోయే దీపం మహా వెలుగుతుంది. ఇంత విషం పుచ్చుకునేముందు హిట్లరు విజయగర్వంతో డాన్సు చేశాడు. ఈనాటి మన సాంఘిక వ్యవస్థలకు చావుతెలివి పుట్టుకొస్తున్నది!

*

"దేశభిమానం నాకు కద్దని
వొట్టి గొప్పలు చెప్పుకోకోయ్
పూనియేదై నాను వొకమేల్
కూర్చి జనులకు చూపవోయ్."

—గురజాడ.

# జీవితం : సాహిత్యం

శ్రీ కా కో జీ

మొట్టమొదట ఒక విషయాన్ని స్పష్టం చెయ్యదలచినాను. ఈ ''విమర్శ'' అనేది అటు పాఠకులకూ ఇటు రచయితకూ సంబంధించినది కాదు. అంటే సాహిత్య నిర్మాణంలో విమర్శ ఒక అంగం కాదు. రచయిత అయినవాడు పరిసరాలను పరిశీలిస్తాడు; అధ్యయనం చేస్తాడు. పరిసరాలే రచయితను ప్రభావితుణ్ణి చేస్తాయి. ఆ ప్రభావంతో రచన చేస్తాడు. అంతేగాని విమర్శకులు తన రచనను చదివి ఏవిధమైన అభిప్రాయాలను వెలిబుచ్చుతారు ? అన్నదాన్ని ఆధారంచేసుకుని ఏ రచయితా రచన చెయ్యడు. ఏ రచయితన్నా అట్లా చేస్తే అంత దిగువరకం రచయిత మరొకడు వుండడు. పరిసరాల నుండి పొందే స్పందనవల్ల రచన చేసేవాడే రచయితగాని విమర్శకుణ్ణి దృష్టిలో పెట్టుకుని రాసే రచయిత రచయితే కాడు.

మానవజీవిత విమర్శకుడు రచయిత. సమాజం విలువలు, సంప్రదాయాలు, ఆదర్శాలు, ఆచరణ, ప్రేమ, కరుణ, ద్వేషం, దుఃఖం, ఆనందం ఇట్లాటి అనేకానేక భావపుంజం అయిన మానవజీవితం విమర్శే రచన. మళ్లీ రచన మీద విమర్శ ఏమిటి ? అర్థంలేని మాట కాకపోతే !

ఇక పాఠకుని దృష్టితో చూద్దాం. పాఠకునికి విమర్శప్రయోజనం ఏమీ లేదు. రచనను నేరుగా చదివి అందులోని స్వారస్యాన్ని ప్రత్యక్షంగా ఆస్వాదించడానికి పాఠకుడికి స్వేచ్ఛకావాలె. ఈ స్వేచ్ఛకు విమర్శకుడు అడ్డు తగిలి తానేదో వ్యాఖ్యానం చేస్తానంటాడు. పాఠకుణ్ని ఎల్లాంటి తప్పుదారులు పట్టించినా పట్టించవచ్చు. రచన స్వయంగా చదివి ఆనందించగలవాడే పాఠకుడు. విమర్శకుని సలహాప్రకారం చదివేవాడు పాఠకుడు కాదు; విద్యార్థి కావచ్చునేమో. ''విమర్శ''ను పాఠకుడు ఏనాడూ ఆదరించలేదు. ఏ పుస్తక విక్రేతను అడిగినా ఈ విషయం రుజువవుతుంది. విమర్శకుణ్ని పాఠకుడు పట్టించుకొనేలేదన్నది అనేకసార్లు అనేక సందర్భాలలో రుజువైంది. ఉదాహరణకు గురుజాడను ''అకవి'' అని విమర్శకులు ప్రచారం చేసినంతమాత్రాన పాఠకులు ఆయన రచనలను ఆదరించడం మానినారా ? విమర్శయొక్క ఉపయోగం మళ్ళీ విమర్శకులు కాదలచుకున్న వారికి తప్ప పాఠకులకూ లేదు; రచయితలకూ లేదు.

విలువలు మారటం సహజం. తరతరాలుగా విలువలు మారుతూనే ఉన్నవి. ముందు కూడా మారుతూనే ఉండగలవు. అయితే ఇక్కడ మరొక భ్రమ విషయం ప్రస్తావిస్తాను. సమాజంలో విలువలను మార్చగలనన్న విశ్వాసం, మారుస్తున్నానన్న ధీమా, మార్చవలె

నన్న ఆతురత రచయితకు ఉంటుంది. అదంతా వట్టి భ్రమే. రచయితకు ఉండే ఆతురతనుబట్టి గాని, అతని కుండే ధీమాకు అనుగుణంగాగాని విలువలు మారవు.

సమాజంమీద సాహిత్యం వేసే ముద్ర అతిస్వల్పం; అత్యంత తాత్కాలికం. ఉదాహరణకు వాల్మీకి రామాయణం రాయకముందు మానవసమాజంలో ఏకపత్నీవ్రతులు లేరా? ఇతరుల భార్యలను ఎత్తుకొనిపోయే రావణుని వంటివారు లేరా? ఉండే ఉండాలె. ఎవడూ రామాయణం విన్నందువల్ల ఏకపత్నీవ్రతుడు కావటం లేదు. అదేవిధంగా ఇతరుల భార్యలను ఎత్తుకునిపోయే అలవాటు లేదా తత్వం ఉన్నవారు రామాయణం విని తమ అలవాటును లేదా తత్వాన్ని మార్చుకోవటం లేదు. ఆధునిక సాహిత్యంలోనుంచి ఉదాహరణలు తీసుకోండి. మునిమాణిక్యం వారి కాంతం కథలను చదివిన తర్వాతనే సంసారపక్షానికి మారిన స్త్రీలు ఎంతమంది ఉంటారు? చలం నవలలను చదివి కుటుంబజీవితాన్ని అరాచకంగా మార్చుకున్నవా రెందరు?... ఉండరనే నా విశ్వాసం. ఉంటే బహుస్వల్పం. వారి పుస్తకాలు అమ్ముడుపోయినదానితో, ఆ గ్రంథాల పాఠకుల సంఖ్యతో పోల్చినప్పుడు ఇటువంటివారి సంఖ్య నగణ్యం.

ఎవరైనా ఒకవ్యక్తి ఏకపత్నీవ్రతుడో, సంసారపక్షో, లేదా విప్లవవీరుడో అవుతున్నాడంటే అతడు రామాయణం, కాంతం కథలు లేదా మహాప్రస్థానం పాఠకుడైనందువల్లకాదు. అతని వ్యక్తిగత టెంపరెమెంటువల్ల. టెంపరెమెంటు వ్యక్తికి ఒక రకమైన సంస్కారాన్ని, అభిరుచులనూ అలవాట్లనూ కలుగజేస్తుంది. ఆ సంస్కారాన్నీ అభిరుచులనూబట్టి ఆ వ్యక్తి తన అభిమాన రచయితలనూ, సాహిత్యాన్నీ ఎంచుకుంటాడు. రచన పట్ల పాఠకునికి ఏర్పడే అభిమానం రచన యొక్క విశేషం కాదు.

'నా గొడవ' మొట్టమొదటిసారిగా అచ్చులో పుస్తకంగా వేసినప్పుడు నేను రాసిన నాలుగైదు వాక్యాలను ఇక్కడ మళ్ళీ పేర్కొంటాను.

''ఆనందమో, ఆవేదనో కలిగినప్పుడు వచ్చిన భావాన్ని వెలిబుచ్చడం జరిగింది. అది ఇతరులకు కాకున్నా వెలిబుచ్చినవానికి బాగా నచ్చింది. ఇతరులకుకూడా నచ్చితే విశేషం. ఈ విశేషధర్మం కైత కేమాత్రం ఆధారం కాదు. దానికి మూలం, ప్రాణం కవికి అప్పుడప్పుడు కలిగిన ఆవేదన, ఆనందం మాత్రమే.

ఎన్నో సంఘటనలు జరుగుతుంటవి మన చుట్టుపట్టు. ఒకే సంఘటన అందరినీ ప్రభావితులను చేయదు, ఒకేరీతిన అసలే చేయదు.

ప్రసారయంత్రం ఒకటే అయినా స్వీకరించే యంత్రాలు తమ తమ శక్తితో దానిని గ్రహిస్తవి. యంత్రాలలో అన్నివిధాల సమానశక్తిగల పరికరాలను నిర్మించవచ్చు. మానవుల నిర్మాణం అట్లా జరగలేదు. మనకు ఏదైనా 'శక్తినిబట్టి సాక్షాత్కారం-భావానుగుణ్యం రూపం''.

... ... ... ...

మానవ జీవితానికీ సాహిత్యానికీ అనేకపోలిక లున్నవి. జీవితం వంటిదే సాహిత్యం. జీవితప్రతిబింబమే కద! జీవితంలో ఉన్నంత వైవిధ్యం సాహిత్యంలోనూ

ఉంటుంది. మానవ జీవితానికి ఒక ఖచ్చితమైన నిర్వచనం ఒక ఖచ్చితమైన పద్ధతీ లేనట్లే సాహిత్యానికీ లేదు. ప్రతి సాహిత్య స్రష్టదీ ఒక ప్రత్యేకమైనదారి. ఎవరిదారి వారిదే.

మానవులందరూ ఈ దారుల్లోనే నడవాలి; ఫలానా సమయాన దుఃఖించాలి; ఫలానా సమయంలో నవ్వాలి అని ఖచ్చితమైన సూత్రాలు చేస్తే - వాటి ఆచరణకన్నా ఉల్లంఘనే ఎక్కువ జరుగుతుంది. రచయితల విషయంలోనూ అంతే. సాహిత్యం అంటే ఇల్లా ఉండాలని ఖచ్చితమైన సూత్రాలుచేస్తే ఉల్లంఘనలో జరిగినంతగా ఆచరణలో జరుగదు.

అయితే విమర్శకులూ, అలంకార శాస్త్రజ్ఞులూ కొన్ని సూత్రాలనూ పద్ధతులనూ రూపొందిస్తూనే వుంటారు. ఆ పద్ధతులన్నీ ట్రంకురోడ్లవంటివి. కార్లు, సున్నితమైన వాహనాలను ఉపయోగించే స్వల్ప సంఖ్యాకులకు మాత్రమే వాటి ఉపయోగం. బహు సంఖ్యాకులైన పేదవారికి వాటి ఉపయోగం ఉండదు. బహుసంఖ్యాకులైన పేదలు కాలి బాటనే వాడుతారు, ట్రంకురోడ్డుమీది నడకకు వేగం, దిశ మొదలైన కట్టుబాట్లు అనేకం వుంటాయి, వాటి ప్రకారం నడుచుకోవలసిందే. అంటే ట్రంకురోడ్డుమీది నడకలో నడిచే దానికి స్వేచ్ఛ ఉండదు. అడుగులు వేయటంలో తమ స్వీయధోరణిని చూపించడానికి ''స్వ'' ను ప్రదర్శించడానికి వీలులేదు. కాలిబాటలో అల్లా కాదు. ప్రతిబాటసారీ ఆ కాలి బాటమీద వేసే అడుగులు వేరువేరుగా వుంటవి. ప్రతి నడకలోనూ వైవిధ్యం ఉంటుంది. ఏ బాటసారైనా అంతకుముందునుంచి వేసివున్న కాలిబాట తనకు అసౌకర్యంగా ఉన్న దని భావిస్తే, అంతకన్నా సౌకర్యవంతమైన కొత్తకాలిబాటను నిర్మించుకుంటాడు. బహు జనుల బాట కాలిబాట. వైవిధ్యం ఉండగలబాట, బాటసారికి స్వేచ్ఛఉండేబాట.

ఒక పద్ధతిని - సిద్ధాంతాన్ని ఏరుకొని దానిప్రకారం నడకను సూత్రబద్ధం చేసు కోవటం - అట్లాంటి జీవితాన్ని ట్రంకురోడ్డుతోనూ, స్వేచ్ఛాజీవితాన్ని కాలిబాటతోనూ పోల్చవచ్చు. ట్రంకురోడ్డుమీద నడిచే బాటసారికి,కాలిబాటన నడిచే బాటసారికి ప్రయాణం సామాన్యగుణం అయినట్లు సూత్రబద్ధ జీవితానికీ, స్వేచ్ఛాజీవితానికి జీవితం సామాన్య గుణం.

ట్రంకురోడ్డు, వాహనాలమీద - కార్లమీద తదితర శకటాలమీద ప్రయాణం ప్రగతికి చిహ్నమని, లక్ష్యానికి వేగంగా త్వరగా చేరుస్తాయని ఒక భ్రమ వున్నది. అది వట్టిభ్రమే. వాస్తవం దానికి పూర్తిగా భిన్నం. కాలిబాట అనేది పయనించినే చోటినుండి చేరవలసిన లక్ష్యానికి సర్వదా దగ్గరి దారి అయివుంటుంది. అంతేకాక, సాంకేతిక యంత్ర సంబంధ వైఫల్యాలు, తదితర ప్రమాదాలూ, కాలిబాట బాటసారికి ఉండవు. అందుకని కాలిబాటే అనాగరిక, ఆటవిక సంప్రదాయమనీ, ట్రంకురోడ్డు ఆధునికమైనదీ నాగరికమైనదీ అన్న వాదంలో పసలేదు. పోతే జీవితలక్ష్యం ఆనందప్రాప్తి. ఆనంద ప్రాప్తి సులభంగా, సురక్షితంగా సాధ్యపడేది కాలిబాటవంటి స్వేచ్ఛాసాహిత్యంద్వారా. ఆనందప్రాప్తి దూరం చేసేది, దుస్సాధ్యంచేసేది నాగరికత అయితే - నాగరికత కోసమే నాగరికతను ఆరాధించవలసివస్తుంది. ఆనందప్రాప్తి అన్న లక్ష్యానికి తోడ్పడని నాగరి కత ఎందుకు ?

సామాన్య మానవునికీ, రచయితకూ తేడా ఎక్కడ వుంటుందో పరిశీలిద్దాం. కట్టు, బొట్టులో, ఆచార వ్యవహారాల్లో ఈ ఉభయులకూ తేడా ఉండదు. తేడా అంతా భావ వ్యక్తీకరణ ప్రతిభలో ఉంటుంది.

ఏ కాలంలోనైనాసరే, అప్పటికి అమలులోవున్న రాజకీయ, సాంఘిక నియమాలూ విలువలూ, కట్టుబాట్లూ అనేకమంది వ్యక్తులకు తమతమ వ్యక్తిగత జీవితంలో అసౌకర్యంగా ఉంటాయి. వాటిపట్ల సామాన్యునికి అసంతృప్తి ఉంటుంది. అయితే వాటిని ధిక్కరించడంవల్ల ఏర్పడే అసౌకర్యాలు మరింత దుర్భరంగా, భయంకరంగా ఉంటాయన్న భయంచేతనైతేనేమి, అసౌకర్యాలను చాటుమాటుగా దాటవేసుకునే సుళువులు ఉండటంవల్ల నైతేనేమి అమలులో ఉన్నసాంఘిక కట్టుబాట్లన్నింటినీ ఖచ్చితంగా పాటిస్తున్నట్లే కనపడి, వ్యక్తిగత జీవితంలో చాటుమాటుగా, వీలు చిక్కినప్పుడల్లా, తన సౌకర్యం కోసం ప్రతివ్యక్తి వాటిని ఉల్లంఘిస్తూ వుంటాడు. రచయితకూడా ఇందుకు అతీతుడు కాడు. నడక - లేదా ఆచరణ వరకు అతడు అందరివలెనే సాంఘిక కట్టుబాట్లను తన సౌకర్యంకోసం ఉల్లంఘిస్తూనే వుంటాడు. అయితే సామాన్యులమనస్సుల్లో ఉన్న అసంతృప్తిని, అమలులో ఉన్నవిలువలు, కట్టుబాట్లు మారాలన్న ఆవేదనను ఆతురతను రచయిత వ్యక్తపరుస్తాడు. సామాన్యులు వ్యక్తం చెయ్యలేరు. రచయిత వ్యక్తం చేసిన భావాలు సామాన్యులు వ్యక్తం చెయ్యాలని తపనపడుతున్న భావాలే. కానీ వ్యక్తీకరణ సామాన్యునికి సాధ్యపడదు. రచయితకు సాధ్యపడుతుంది. అంతే తేడా.

రచయిత ఏదో ఒక విశ్వాసానికి లేదా తత్వానికి కట్టుబడి ఉంటే - అనగా "కమిటెడ్" అయితే సదరు వ్యక్తీకరణముకూడా స్వేచ్ఛగా చెయ్యలేడు. "కమిటెడ్'' లేదా కట్టుపడ్డ మనిషి రచయిత కాలేడు.

రచయిత అయినవాడు ఏదో ఒక సిద్ధాంతానికి లేదా తత్వానికి కట్టుబడి ఉండాలన్నవాదం ఇటు రచయితనూ, అటు సిద్ధాంతాన్నీ గోతిలోకి తోసే వాదమే. రెండు వైపులా ప్రమాదాలే.

మనం ఒక్కసంగతి స్పష్టంగా గుర్తించాలి. మార్క్సిజం, గాంధిజం, సోషలిజం, కాపిటలిజంలాంటి సిద్ధాంతాలూ, తత్వాలు సామాజిక లేదా రాజకీయవ్యవస్థా విశేషాలు. కవితా విశేషాలో, కళావిశేషాలో లేదా కనీసం భావవ్యక్తీకరణ విశేషాలో కావు.

రచయిత ఏదైనా తత్వానికి లేదా సిద్ధాంతానికి కట్టుబడిపోయినట్లయితే ఉభయ భ్రష్టత్వానికి ఎలా గురవుతాడో పరిశీలించండి.

1. కట్టుపడిపోయి వున్నందువల్ల ఆ యా సిద్ధాంతాల ప్రచారకుల లేదా నాయకులకు ఉపకరించే రచనలు, వారి మార్గాన్ని సుగమం చెయ్యడానికి ప్రయోజనపడే రచనలనే చెయ్యవలసిరావడంవల్ల ''స్వ'' ను రచయిత వ్యక్తీకరించలేడు. ఈ విధంగా ఆత్మహత్యకు పూనుకొనవలసిన అగత్యం తప్పనిసరి అవుతుంది.
2. ఏ సిద్ధాంతానికి కట్టుబడతాడో దానికి కమాండరూ కాలేడు. సిద్ధాంతాన్ని నిర్వచించేవాడూ, నడిపించేవాడూ, సిద్ధాంతప్రకారం, లేదా సిద్ధాంతసాధనకోసం జరిగే

పోరాటాలకు నాయకత్వం వహించే వాడు వేరే మరొక సిద్ధాంతకర్త, మావో - లెనిన్ - గాంధీ - లోహియా - బుద్ధుడు వంటివారు వేరే ఉంటారు.

3. తాను ఏ సిద్ధాంతానికి కట్టుబడిపోతాడో అందులో తన్మయుడై పోయి, భావావేశంలో పడి దాన్ని వర్ణించే పద్ధతిలో, ఆ సిద్ధాంతాన్ని అనుసరించదలచుకున్న అనేకమంది సామాన్యులను, అజ్ఞానులను స్వయంగా "మానిఫెస్టో" చదివి అర్థం చేసుకోలేని వారిని ఈ రచయిత రచనలద్వారా స్ఫూర్తిని పొంది రంగంలో దుమికే వారిని సిద్ధాంతపరంగా తప్పుదారి పట్టించే ప్రమాదంకూడా వున్నది. భారతీయ వేదాంతాన్ని బోధించడానికి పురాణాల్లో కవులు వాడిన ప్రతీకలన్నీ ప్రధానపాత్రలుగా తిష్ఠవేసుకుని, పూజలూ, పునస్కారాలూ అందుకుంటూ అసలు భావాన్ని గాలికి విసిరేసిన సంఘటనలు ఎన్నిలేవు ?

కట్టుబడిన రచయిత తన రచనద్వారా మహాఅయితే ''కంపెనీ వస్తువులు''ను విరివిగా అమ్మటానికి ఉపయోగపడే మంచిపోస్టరును సృష్టించగలడు. మంచిపోస్టరుగా ఉపయోగపడగలడు. అంతే.

అయితే సాహిత్యానికి ఏ ప్రయోజనమూ లేదా ? అన్న ప్రశ్న రావచ్చు. ఉన్నది. సాహిత్యం సాధించవలసిన బృహత్తర ప్రయోజనం ఒకటి వున్నది. మరెవ్వరూ సాధించలేనిది. సాహిత్యకారులు, రచయితలు పూనుకుంటేతప్ప సాధ్యంకాని ప్రయోజనం.

మన విజ్ఞాన శాస్త్రాలన్నిటికీ, సిద్ధాంతాలకూ తత్వాలకూ లక్ష్యం "సర్వేజనా స్సుఖినోభవంతు." దాన్నే మొట్టమొదటిసారిగా ఫ్రెంచివిప్లవం సందర్భంగా ''స్వాతంత్ర్యం - సమానత్వం - సౌభ్రాతృత్వం'' అని మరింత స్పష్టంగా నిర్వచించారు. ఈ మూడూ ఉన్నప్పుడే సర్వేజనా స్సుఖనో భవంతు లక్ష్యం సిద్ధిస్తుంది. అయితే ఈ మూడింటిలో చివరన పేర్కొన్న సౌభ్రాతృత్వం అనే లక్ష్యం మిగతా అన్నిటికీ మూలాధారం. స్వాతంత్ర్యరక్షణకైనా, సమానత్వసాధనకైనా మొట్టమొదటగా కావలసిన ప్రీరిక్విజిట్ సౌభ్రాతృత్వం.

రాజకీయ విప్లవాలద్వారా స్వాతంత్ర్యాన్ని సాధించవచ్చు. విప్లవానంతరం ఏర్పడిన ప్రభుత్వాలు తమ కృషిద్వారా సమానత్వాన్ని స్థాపించవచ్చు. కాని సౌభ్రాతృత్వం లేనిదే ఈ రెండిటివల్ల కలిగే ఫలితం "సర్వేజనులకు'' చెందదు.

ఇంతవరకూ ప్రపంచ మానవాళికి, రాజకీయ విప్లవాల ద్వారా స్వాతంత్ర్యం అందినది. విప్లవానంతర ప్రభుత్వాలు కొన్ని చిత్తశుద్ధితోనూ, నిజాయితీతోనూ కృషిసల్పి మానవత్వాన్నికూడా సాధించినాయి. కాని సౌభ్రాతృత్వం మానజాతి అందుబాటులోనికి రాలేదు. ఎందుకని ?

రాజకీయ విప్లవాలద్వారా సౌభ్రాతృత్వం సాధ్యపడేదికాదు కనుక. సమానత్వ స్థాపనకోసం రూపొందించే ప్రణాళికలుగానీ, సోషలిస్టు చట్టాలుగానీ సౌభ్రాతృత్వాన్ని సాధించజాలవు కనుక. సౌభ్రాతృత్వానికి కృషి చేయవలసింది రాజకీయ నాయకులూ, విప్లవకోవిదులూ కారు; రచయితలు.

రచయిత ఇన్నాళ్లూ తన స్థానాన్ని తాను వేరుగా ఏర్పరుచుకోలేదు. స్వాతంత్ర్యానికి లేదా సమానత్వానికి జరిగే కృషికి, పోరాటానికి లేదా విప్లవానికి వత్తాసుగా నిలిచినాడు. అంటే మిగతావారి రంగాలలో పడిపోయి తన రంగాన్ని విస్మరించినాడు. అందువల్ల సాధించుకున్న స్వాతంత్ర్యమూ, సమానత్వ స్థాపనకు జరిగిన ప్రయత్నమూ ఫలించకుండా పోతున్నయి.

రచయిత తన విధిని, బాధ్యతను గుర్తెరిగి సౌభ్రాతృత్వసాధనకు కృషిచెయ్యడమే తన ధర్మంగా నిర్వచించుకుని అపరిమితరంగంలో కృషి జరిపినట్లయితే రాజకీయ నాయకులు విఫలమైనచోట రచయిత విజయం సాధించి మానవజాతికి మహోపకారం చెయ్యగలడు.

ఒక్కటే షరతు - మొదటి రెండింటిలో నిమగ్నమైపోయి, తన భాగాన్ని రచయిత విస్మరించరాదు.

రచయిత కృషివలన సౌభ్రాతృత్వం రాగలదా అను ప్రశ్న అటుంచి ఏ వర్గానికీ ఏ సిద్ధాంతానికీ కట్టుబడకుండా వర్గాలు, సిద్ధాంతాలలో ఉన్న లోపాలకు తలవంచకుండా వారి వర్గాల సిద్ధాంతాల తు. చ. తప్పని నడవడిని స్వీకరించే గొర్రెదాటు విధానం కాకుండా మానవసమాజంలోని సమానతకు అది నెలకొలిపే స్వాతంత్ర్యానికి మూలాధారమైన సౌభ్రాతృత్వాన్ని దానికి సంబంధించిన భావనను తన రచనలద్వారా కలిగించి తన కనీసబాధ్యతను నెరవేర్చిన చాలని నా అభిప్రాయము.

*

"ఆధునికుడు ఒక జరాఫీలా తయారవుతున్నాడు
రోజురోజుకు అతని మెదడుకీ హృదయానికీ
దూరమెక్కువై పోతుంది."

"ఎప్పటికయినా మానవ పథికుడు చేరుకునే
గొప్ప విశ్రాంతి మందిరం కవిత."

—ఆరుద్ర.




శీర్షిక నడక సూటిగా లేదు;- అక్షరాలు గెంతులు వేశాయి:- పోనీ, ముద్రణలో వాటిని సరిగా పేర్చక, గెంతులు వేయించారు.

ఎవరు ? బాధ్యతను ఏ ఒక్కరికో అంటకట్టడం సబబుకాదు - నలుగురూ చెయ్యి వేశారు.

భావప్రకటనకు అక్షరాలు వాహకాలు;- శీర్షికను బనాయించినది భవదీయుడు కాదు;- దాని భావం భవదీయుడికి అర్థమైంది;- అనగా అర్థంకాలేదని అర్థమైంది. సందేహాలు జనించాయి. "మారుతున్న విలువ"లకు రచయిత బాధ్యుడా ? చదువరులూ, వారిలోని ప్రథితపండితు లద్భుతప్రజ్ఞ కలవారూ, ఆగ్రహించినా, మారుతున్న విలువలకు రచయిత బాధ్యుడనే అర్థం, ధ్వనీ, రెండూ శీర్షికలో ఉన్నాయని అంగీకరించాలి. ఇదిగో ఉదాహరణ : "పెరుగుతున్న ధరలు;- ప్రభుత్వ బాధ్యత" అంటే అర్థం ఏమిటి ? "పెరుగుతున్న ధరలను అరికట్టి తన బాధ్యతను ప్రభుత్వం సక్రమంగా నిర్వహించడంలేదు". అంతేగదా ? ధరలు పెరగడం అవాంఛనీయం. అదేవిధంగా విలువలు మారడం అవాంఛనీయమా ?

ఉద్దేశించిన భావాన్ని గ్రహించాలిగాని, మాటలు సాగదీసి, లేనిపోని అర్థాలను కల్పించడం మంచి అభిరుచి కాదు; నిజమేకాని, భావశబలత సాధించాలంటే వాక్య నిర్మాణంపట్ల జాగరూకత వహించాలిగదా !

ఈ వ్యాసరచనకు అనుశాసకుడు శ్రీ విశ్వనాథంగారితో కొంత వాగ్వివాదానంతరం శీర్షికభావం భవదీయుడికి చాలావరకూ బోధపడింది.

> "సామాజిక విలువలు" మారుతున్నాయి. మార్పును గమనించే రచయిత, గమనించవలసిన రచయిత, ఎటువంటి సాహిత్యాన్ని సృష్టించాలి ? రచయితగా సంఘంపట్ల తన బాధ్యతను ఏవిధంగా నిర్వహించాలి ?"

చాలా సంక్లిష్ట ప్రశ్న; అనేకానేక వృత్తులు చేబట్టినవారున్నారుకదా, అందరికి అంతో యింతో బాధ్యతలు ఉంటాయికదా, వారందరికంటె రచయిత ఉన్నతుడా? అనే ఎదురు ప్రశ్న సహజంగా ఉదయిస్తుంది.

ఇంకొక ప్రశ్న :- సమాజంపట్ల రచయితకు బాధ్యత - అనగా అదనమూ, ఉన్నతమూ ఐనది — ఉందని ఒకవేళ మాటవరసకు అంగీకరించినా, ఏకపక్షబాధ్యత లుండ నేరవు; సంఘానికికూడా రచయితపట్ల బాధ్యత ఉండితీరాలి. హక్కులూ, బాధ్యతలూ "బొమ్మా - బొరుసూ" వంటివి.

"సాహిత్యాన్ని" లలితకళలలో చేర్చారు; అన్నిదేశాలవారూ యుగయుగాల నుండి సాహిత్యానికి మహోన్నత స్థానం యిచ్చారు; గానం, శిల్పం, చిత్రలేఖనం - అలాంటివన్నీ లలితకళలనీ, కొండగుహలలో నివసించే ఆదిమ మానవుడు నేడు ఇంత నాగరికతనూ, విజ్ఞానాన్ని సాధించి, ప్రకృతినే జయించగలిగాడంటే, అతడి సృజనాత్మకశక్తి కారణ, మని మేధావు లన్నారు.

స్వాతిశయాన్ని దూరంగా ఉంచి, కొంచెం నిశితపరిశీలన చేస్తే విచిత్రాంశాలు ఆవిర్భవించి, మనల్ని సవాల్ చేస్తాయి.

గానం మానవులను పరవశుల్ని చేస్తుంది; అలౌకిక ఆనందాన్నిస్తుంది; గానవాహినిలో తన్మయులై, తమజీవితాలను భగవంతుని ఆరాధనకోసమో, ప్రేయసి అనుగ్రహం కోసమో, అంకితమిచ్చి, కర్పూర నీరాజనం వలె వెలిగించి, హరించి తరించామనే ఆత్మ సంతృప్తితో కనుమూసినవారు ప్రతి శతాబ్దంలోనూ ఉన్నారు.

లలితకళలన్నింటిలోనూ, శాశ్వతత్వ భాగ్యరేఖకు నోచుకోనిది గానకళ; ఈశతాబ్దపు వైజ్ఞానిక ప్రగతి ప్రసాదించిన రకరకాల "రికార్డింగ్" యంత్రాలు గాయకులకు "అంక స్థితార్థపేటి" వంటివి; ముందు తరాలవారికి తమ గానసుధను భద్రపరిచే అవకాశం లభించింది; అంతకు పూర్వం? - శుభనామధేయం ఒక్కటే చరిత్రతో నిలిస్తే చాలునా?

మీరాబాయ్ కంఠమాధుర్యం, వేనవేల హృదయాలలో కృష్ణభక్తిని పాదుకొల్పిన మంజులగానం, ఇవాళ మనం వినలేము; అలాగే తాన్‌సేన్, కబీర్, చైతన్యమహాప్రభువు; వారి గానసుధారసంతో సుల్తానులూ, శుద్ధ శుంఠలూ, రారాజులూ, కరిగిపోయారు. ఐతే, ఆ యా గాయన గాయనీమణుల తుది శ్వాసతోపాటు వారి అమరగానం కూడా వాయువులో లీనమైపోయింది.

వాళ్ళు రచించిన గీతాలు నేటికీ నిలిచాయి కదా? - త్యాగరాజు కృతులు శ్రవణపేయంగా అనుదినమూ విని ఆనందిస్తున్నాము కదా? - అక్షరాలా నిజం; వాళ్ళు కేవలం గాయకులు కారు; వాగ్గేయకారులు; వాళ్ళ రచనల్ని ఎవరో పాడుతూంటే వింటున్నాము; త్యాగయ్య ఎలా పాడేవాడో మనకు తెలుసునా? "Gone with the wind" - అంతేగదా?

ఇక్కడ సంగీతశాస్త్ర ప్రసక్తి ఇమడదని మనవి; ప్రతి లలితకళకూ శాస్త్రీయ ప్రాతిపదిక విధిగా ఉంటుంది. శాస్త్రీయ పరిజ్ఞానం లేనిదే ఎవడూ కళాకారుడు కాలేడు; ఐతే, కళాసృష్టికి శాస్త్రపరిజ్ఞానం ఒక్కటే చాలునని భావించడం వెర్రితనం.

సంగీతకళ తరువాత శిల్పం, చిత్రలేఖనం, వాటిగురించి ముచ్చటించాలి; తన్మాత్రం చాలును; శిల్ప, చిత్రలేఖన సౌందర్యసృష్టి వందల సంవత్సరాలు నిలుస్తుంది.

ఇంతవరకూ - రేఖామాత్రంగా వివరించినది యవనిక వలె వినియోగపడుతుందని భవదీయుడి ఆశ. పోనీ - తాపత్రయం; యవనికలేని భావ వ్యక్తీకరణ బోసిగా ఉండదా ?

ప్రకృతాంశం - ''మారుతున్న విలువల'' నడుమ రచయిత బాధ్యత.

''విలువలు'' అనగా సాంఘిక, సామాజిక జీవనం, వైజ్ఞానికప్రగతి స్థితి, రాజకీయ వ్యవస్థ, ప్రభుత నడిచే తీరుతెన్నులు, మత విశ్వాసాలు, జాతీయ సంపద ఉత్పత్తి పెంచే అవకాశాల పెరుగుదల, వాటి ఆరోగ్యం, రుగ్మత — యివన్నీ ఇంకెన్నెన్నో కలిసి, మనిషిని అటూయిటూ ఊగిసలాడించే శక్తుల సంపుటి.

వీటిలో ప్రతిఒక్క అంశానికీ రచయిత అనేవాడు రకరకాలుగా అనుస్పందిస్తాడు. కొన్ని భావాలు అతనిలో గూడుకట్టుకుంటాయి; గూడు స్థిరంగా ఉన్నా, కొన్ని భావాలు, లేదా విశ్వాసాలు, పోనీ అభిప్రాయాలు, గూటినుండి పారిపోతుంటాయి. కొత్తభావాలు ప్రవేశిస్తాయి.

కోర్టుతో పనికలిగిన పార్టీలు లాయరుకు కావాలి; వైద్యుడికి రోగులు అవసరం; ఉపాధ్యాయుడికి తాను చెప్పే చదువు నేర్చుకోవడానికి విద్యార్థులు కావాలి; లాయర్లకూ, డాక్టర్లకూ, వాళ్ళ ''క్లయింటు''లే డబ్బిస్తారు - ఉపాధ్యాయుడికి ప్రభుత్వమో, ప్రయివేటు సంస్థలో; జీతం యిస్తాయి. చిత్రకారుడు, గాయకుడు, శిల్పి, నటుడు, అందరికీ డబ్బు యిచ్చేవాళ్ళుంటుంటారు. శ్రమ శక్తికీ మూల్యం దొరక్కపోతే, శ్రమించడం దేనికీ ? కళాకారుడికీ, లేదా, ఒక వృత్తిని చేబట్టినవానికి లభించే ప్రతిఫలంలో అనంత వ్యత్యాసాలుంటాయి. వాటికి కారణాలున్నాయిగాని సమంజసం అనదగినవి చాలా తక్కువ. ''అయ్యబాబోయ్ !'' అనుకునేటంత ఎక్కువగానూ, ''అయ్యో పాపం !'' అని బాధకలిగించేటంత స్వల్పంగానూ ఉంటాయి. వీధి గాయకుడికి వాడవాడలా తిరిగి రోజంతా పాటలు పాడితే, దొరికే బిచ్చం మహాఐతే రెండురూపాయలు. అతడు అద్భుతమైన గాయకుడు కావచ్చును; ''ఆహా ! ఎంత అమృతకంఠం !'' అంటారు విన్నవాళ్ళు; అంటూ పదిపైసలు పడేస్తారు. చలనచిత్ర నిర్మాణ పరిశ్రమలో ''ప్లేబ్యాక్'' గాయకుడికి ఒక పాటకు రెండు, మూడు, వేల రూపాయిల ప్రతిఫలం దొరుకుతుంది. వినాయకచవితి పండుగకోసం, మట్టితో గణపతి ప్రతిమను ఎంతో విన్నాణంగా మలచిన శిల్పికి ప్రతిమ ''సైజు'' ను బట్టి యాభైపైసలో, ఒక రూపాయో, ధర కిడుతుంది. దేవీ ప్రసాద్ రాయ్ చౌధురీ వంటి శిల్పి అదే ''సైజు'' విగ్రహాన్ని - ఏదైనాసరే; తయారుచేస్తే అధమపక్షం పదివేలరూపాయిలు రాలిపడతాయి.

''ఇత్యాది ఉదాహరణలను ఊహించవలెను''

ఇంక - ''రచయిత'' అనిపించుకున్న విచిత్ర జీవి సంగతి ?—సాహిత్య విపణి వీధిలో ధరలుకూడా గమ్మత్తుగా ఉంటాయి. ఇవాళ సాహిత్యానికి ''మహారాజ పోషకులు ;

(1) పత్రికలవాళ్ళు, (2) పుస్తకాల పబ్లిషర్లు; (3) రేడియో ప్రసారకేంద్రాల అధికారులు; (4) చెదురువాటుగా రాష్ట్ర, కేంద్ర, ప్రభుత్వాలకు చెందిన కొన్ని శాఖల అధిపతులు; (5) చలనచిత్ర నిర్మాతలు; (6) సాహిత్య "అకాడమీ" సారథులు.

పై వర్గీకరణలో క్రమాలంకార సూత్రాన్ని పాటించలేదు. క్రమాలంకారవృద్ధి (ప్రతిఫలం ప్రమాణంగా) ఇలా ఉంది :— అందరికంటే పిసినార్లు, లుబ్ధాగ్రేసర చక్రవర్తులు, - రేడియో వాళ్లు. ఆర్థికశాస్త్ర పరిభాషలో Buyer's market, Seller's market అని రెండు అవస్థావిభేదా లున్నాయి : రేడియో వాళ్ళది సర్వదా, సర్వథా,-BUYER'S MARKET. కృష్ణశాస్త్రి కవితకూ, చనుబాలకవి కిష్టయ్య కవితకూ, - ఒకటే రేటు. భేదం లేదు.

పత్రికలలో రకాలున్నాయి; వాటిలో కొన్ని ఐరావతాలు; చాలాభాగం "సన్నకారు రైతాంగం" కోవకు చెందుతాయి : భారీ పత్రికలు కొంచెం సంతృప్తికలిగించే ప్రతిఫలం రచయితకు యిస్తాయి : ఐతే, వాళ్ళది "CLOSED SHOP" వంటి విధానం : ప్రతి పత్రికకూ [యించు మించు] "ఆస్థాన రచయితలు" న్నారు. కొంతకాలంనుండి "స్టార్ వ్యాల్యూ" పద్ధతిని పత్రికలు కూడా అనుసరిస్తున్నాయి. "రాసిన దేమిటి?"— వస్తునాణ్యం ఆక్కరలేదు :- "రాసిన దెవరు?" సాహిత్య విపణివీధిలో కొంచెం పేరు తెచ్చుకొన్న వారికి ఎక్కువ ప్రతిఫలం : "ఫలానా రచయిత/రచయిత్రి మార్కు నవలల్నీ, కథలనూ వాడండి." అదీ నినాదం; ప్రస్తుతం రచయిత్రుల రచనలకు గిరాకీ ఎక్కువ; ధారావాహికంగా నేడు వెలువడే "నవలారాజాల" ను నారీరత్నాలు అవలీలగా వండేస్తున్నారు : సదరు వంటకాలకోసం పాఠకులు ఎగబడుతున్నారు. నవీన కాశీమజిలీ' కథలు పునర్జన్మ ఎత్తాయి : వాటినే నవలలు అంటున్నారు,

పబ్లిషరులుకూడా పుస్తక ప్రచురణను పకోడీల వ్యాపారంగా మార్చేశారు; పత్రికలకంటే ఎక్కువ ప్రతిఫలాన్ని కొందరు పబ్లిషరులు యిస్తారుగాని, శ్రమకూ, రచయిత మౌలిక ప్రతిభకూ తగిన ప్రతిఫలమా అది? ఎంత మాత్రం గాదు.

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల కృపారసం ఫించనీ తీసుకోవలసిన రచయితలపైనా, పైరవీ రచయితలపైనా, వర్షిస్తుంది; "అకాడమీ" పాలసీ డిటో.

రచయితలకు నేటి భోజ మహారాజులు సినిమా నిర్మాతలు : ఆరుపంక్తులు దాటని చెత్త పాటకు వెయ్యిరూపాయిలు కూడా యిస్తారు : ఐతే సినిమారంగం అక్షరాలా అభినవ భోజుని ఆస్థానం : అష్టదిగ్గజాలు భోజుడిని బంధించాయి ; అంతేగాక, నేటి భోజుడికున్న అంధ విశ్వాసాలు అనంతం, ఆజ్ఞలు అపారం. ఫ్యూడలిజాన్ని నిరసించే "కొమ్ములు మొలచిన" రచయితలు, వేదికలపైన సింహనాదాలు చేస్తారు; అభ్యుదయం గురించి, రచయిత బాధ్యత గురించి, అభినవ లెనిన్‌వలె మాటాడతారు. సినిమారంగంలోని ఫ్యూడలిజాన్ని మాత్రం కంటికి రెప్పవలె సంరక్షిస్తారు! నిర్మాత మహారాజులకు సుబేదారులవలె వ్యవహరించడానికి తహతహలాడే రచయిత, సాహిత్య సభల వేదికల మైన ఉపన్యసిస్తాడు.

రచయిత ఎవరికి బాధ్యుడు? పత్రికల అధిపతులకు, ఆకాశ వాణి వారికి, పబ్లిషర్లకు, సినిమా నిర్మాతలకు, "అకాడమీ" ల వారికి బాధ్యుడు. తృణమో పణమో డబ్బిచ్చి రచన కొనుక్కునే మహాశయుడు సాహిత్య విలువలను నిర్ణయిస్తున్నాడు. అతడికి కొంచెం నవీన భావాలుంటే నవ్యసాహిత్యాన్ని ఆదరిస్తాడు. ధనార్జన :- అదీ ముఖ్యం. తొంభై శాతం రచయితలు సాహిత్యాన్ని వ్యాపారంగా మార్చివేశారు; సాహిత్య సభల నిర్వహణ కూడా ఒక వ్యాపారం.

ఇంతమందిలోనూ సాంఘిక శ్రేయస్సు గురించి, క్షణక్షణం మారుతున్న జీవన విధానంగురించి, మథనపడే అమాయకుడు సకృత్తుగా ఉండవచ్చుగాని, అలాంటి విచిత్ర జీవికి ఆదరణలేదు. 'సాహిత్యరచనా' బేకారులు విచ్చలవిడిగా సంచరించి, "రంథోళ్ళు" వాయిస్తుంటారు. సాహిత్యరంగానికి తామే "ట్రస్టీల" మనుకుంటారు.

"రచయిత" అనేది యివాళ "హోల్డాల్" వంటి మాట: కవులూ - అనగా పద్యాలూ, గేయాలూ, పాటలూ వ్రాసేవాళ్ళూ కేవలం వచనాన్ని ఉపయోగించి కథలూ, కథానికలూ, అల్పికలూ, గల్పికలూ, నవలలూ, నాటకాలూ, వ్యాసాలూ, అల్లేవాళ్ళూ - అందరూ రచయితలే.

ఇది పరిశోధనా వ్యాసం కాదు. పరిశీలనా వ్యాసం. దీనినే ప్రాతిపదికగా చేసుకొని, ఇందులోని భావాలనూ, అభిప్రాయాలనూ, సవాల్ చేసేవారికి సమాధానంగా, వెయ్యిపేజీల పరిశోధనా గ్రంథాన్ని వ్రాయడానికి భవదీయుడు సిద్ధంగా ఉన్నాడు: శ్రమ శక్తికి సముచితధర చెల్లించేవాళ్ళు ముందుకు రావాలి.

ఇంతకూ - "మారుతున్న విలువలు" అంటే ఏమిటి? సాంఘిక జీవన విధానం, ఆర్థిక వ్యవస్థ, రాజకీయపరిణామాలు - మొదలైన వాటినన్నింటినీ సమీకృతం చేయగా, తయారయే కొత్త పదార్థం.

జీవన విధానాన్ని సాహిత్యం ఎన్నడూ మార్చలేదు; మన తెలుగు సాహిత్యాన్నీ, యీ శతాబ్దం ప్రారంభంనుండి తెలుగుప్రజల జీవన విధానంగా వచ్చిన, వస్తూన్న, మార్పులనూ, కొంచెం నిష్పాక్షిక దృష్టితో ఆలోచిస్తే, కొన్ని మూలసత్యాలకు కారణాలు తెలుసుకోవలసిన అగత్యం ఏర్పడుంది.

ఇక్కడ ఒక ముఖ్యాంశాన్ని విస్మరించరాదు: రెండు రకాల రచయితలుంటారు: సర్వదా ఉంటారు. కార్యక్షేత్రంలో దిగి, సంఘ సంస్కరణమో, రాజకీయ సంరంభమో చేబట్టి తమ కృషికిసాహిత్య రచనలను వినియోగించుకునేవారు ఒకరకం.

కందుకూరి వీరేశలింగంగారు ఆ కోవకు చెందినవారు: వితంతు వివాహాలు జరిపించడం, భోగం మేళాలను నిషేధించడం, పడుపువృత్తినీ, ప్రభుత్వోద్యోగుల లంచ

గొండితనాన్ని, మాన్పించడం, మొదలైనవి ఆయన కార్యక్రమాలు : కేవలం పద్యాలూ, పాటలూ, ప్రహసనాలూ వ్రాసి, అంతటితో తన బాధ్యత ముగిసిందని ఆయన భావించ లేదు. నడుం బిగించారు : సనాతనులతో యుద్ధంచేశారు. వితంతు వివాహాలు జరిపించారు.

తన కార్యక్రమానికి సిద్ధాంత ప్రాతిపదిక కావాలి : అందుకని పత్రికలు స్థాపించి, ప్రచారం చేశాడు. రచనా వ్యాసంగాన్ని, తన కార్యక్రమానికి ప్రచారాయుధంగా వాడు కున్నాడు. ఇవాళ రాజకీయ నాయకులు, పత్రికలు స్థాపించి ప్రచారం చెయడంలేదా ? రాజకీయపార్టీలు తమ సిద్ధాంత గ్రంథాలనూ, కరపత్రానూ, వెలువరించడం లేదా ? వ్యత్యాసం ఎక్కడుంది ? అందుకనే వీరేశలింగంగారు వ్రాసిన ''ప్రహసనాలు'' యివాళ చదివితే, పేలవంగా, రసవిహీనంగా ఉంటాయి. పంతులుగారికి ''చెక్కభజన'' చేసే వాళ్ళు ఆగ్రహిస్తారు. కాని, వ్యక్తి ఆరాధన, సత్యాన్వేషణకు అవరోధం గదా ?

పంతులుగారి తక్కిన రచనల ప్రస్తావన విధిగా వస్తుంది : నిజం, ఆయన కవుల చరిత్ర వ్రాశారు : కాళిదాసు "శాకుంతలమ్" తెలుగులో అనువదించారు : "రత్నావళి" తర్జుమా చేశారు. ఇనప గుగ్గిళ్ల భాషలో నీతిచంద్రిక భాగాలను అనువదించారు. వృత్తి రీత్యా ఆయన తెలుగు ఉపాధ్యాయుడు. ఆయనలో రెండు "వ్యక్తిత్వాలు" సహజీవనం చేసేవి, సంఘ సంస్కరణతో ఎటువంటి సంబంధమూలేని సాహిత్యాన్ని సృష్టించిన వీరేశలింగంగారు వేరు.

అదే సమయంలో వడ్డాది సుబ్బారాయుడుగారు ''వేణీ సంహారం'' నాటకం వ్రాశారు : ఎందుకు ? – నాటకాలాడే సమాజాలకోసం : ''భక్త చింతామణి'' పద్యాలు వ్రాశారు. దేనికి ? ఆయన దైవచింతనాపరుడు గనుక. భక్తుడిగా, తన ఆత్మసంతృప్తికోసం వ్రాశారు.

గురుజాడ అప్పారావుగారు ''కన్యాశుల్కం'' వ్రాశారు : విజయనగరం మహారాజు గారు రాయమంటే రాశారు : సంఘ సంస్కరణకు ఉద్దేశించిన నాటకం కన్యాశుల్కం ! అందరూ చదివి సంతోషించారు. నాటకాన్ని రంగస్థలంమీద ప్రదర్శిస్తే ఆనందించారు : నేటివరకూ కన్యాశుల్కం చదువరులనూ, ప్రేక్షకులనూ ఆకర్షిస్తున్నది. ఇవాళ ''కన్యా శుల్క'' సమస్య లేనేలేదు : ఐనా, నాటకం రక్తికడుతున్నది. కన్యాశుల్క దురాచారాన్ని గురజాడ వారి నాటకం అలనాడు కొంతవరకైనా మాన్పించిందని ఆయన "పరమభక్తులు'' కూడా అనలేరు : యంత్రయుగ నాగరికత వచ్చింది : సాంఘిక వ్యవస్థ మారింది.

తిరుపతి వేంకటకవుల పాండవోద్యోగవిజయాల నాటకద్వయం నాటక సమాజాలకు నేటికీ పెన్నిధివలె ఉపయోగిస్తున్నాయి : ఆనాడు సాంఘికజీవనంలో వచ్చిన కొత్త పరిణామాలకూ, "ఉద్యోగ విజయాల" కూ సంబంధం లవలేశమైనా ఉన్నదా ?– తిరుపతి వేంకటకవులు వ్యవధిలేని అవధానాలు చేశారు : కవి పండితులనూ, రసజ్ఞులనూ మెప్పిం చారు : సాధారణజనం అవధాన ప్రక్రియ తమాషా చూసి ఆనందించారు. "సాంఘిక విలువల" గొడవ ఎక్కడుంది ? రచయిత బాధ్యత ప్రసక్తికి ఆస్కారమే లేదుగదా !

క్రమంగా "భావకవిత్వ" ఉద్యమం వచ్చింది. అదేసమయంలో గాంధీజీ నాయకత్వాన, రాజకీయ రంగంలో బ్రహ్మాండమైన ఉద్యమం నడిచింది: దేని దారి దానిది: కవులు రమ్యమైన కవిత సృష్టించారు: ఆంధ్ర సాహిత్యంలో నవ శకానికి వైతాళికులైనారు. కలకాలం నిలిచే సాహిత్యసంపదను తెలుగుజాతికి అందించారు; విశ్వనాథ, కృష్ణశాస్త్రి, శివశంకశాస్త్రి, రాయప్రోలు, నాయని, నండూరి, అబ్బూరి, కాటూరి మొదలైన మహాకవులకు తెలుగుజాతి ఎంతో రుణపడి ఉంది.

అదేసమయంలో వేంకట పార్వతీశ్వరకవులు ఆంధ్రసాహిత్యారామాన్ని సునందనం చేశారు. "పార్వతీశుల జంట తెలుగుపంట" అన్నారు జాషువా కవి: పద్యచరణంలోని ప్రతి అక్షరమూ నిజం; ఐతే, సాంఘిక జీవన విధానాన్ని ఆ యా రచయితలు ప్రభావితం చేసి మార్చగలిగారా? లేక, నవసమాజాన్ని చూసి, కవులూ, రచయితలే కొత్తప్రక్రియలను చేబట్టారా?

రాయప్రోలు, గురజాడ, విశ్వనాథ, దేశభక్తిగీతాలు వ్రాశారు. నిజమే: కాని, నిష్పాక్షిక మేధావులకు చిన్న మనవి: వారు దేశభక్తి గేయాలూ, పాటలూ వ్రాయకపోతే ఏం జరిగేది? స్వాతంత్ర్యోద్యమం శవీమని చతికిలపడేదా? ఉద్యమాన్ని గాంధీజీ నడిపించారు: లక్షలాది జనం కారాగారాలకు వెళ్ళారు: పోలీసుల లాఠీప్రహరణాలను వేలాదిజనం సంతోషంగా, ధైర్యంగా భరించారు: కాళ్ళూ, కీళ్ళూ, ఎముకలూ విరిగినా ముందుకు సాగారు: పోలీసులు ఎన్ని బందూకులు కాల్చినా, ప్రాణాలర్పించారు: అంతటి త్యాగాన్ని చేయించినది గాంధీజీవాణి: అంతేగాని, లయతాళబద్ధమైన దేశభక్తి గేయాలు ఎంత మాత్రమూకావు! లక్షలాది జనావళికీ, స్వాతంత్ర్య సమరవీరులకు అలాంటి గీతాలను ఎవరో వ్రాశారని కూడా తెలియదు: కార్చిచ్చువంటి ఉద్యమం చెలరేగుతున్నది గనుక, కవులు తమ గీతాలు వ్రాశారు.

సాంఘిక, రాజకీయ పరిణామాలు ఉప్పెనవలె విజృంభించి, రచయితలను మార్చాయా? లేక రచయితలే సాంఘిక చైతన్యాన్ని జాగరితం చేశారా? అటునుండి ఇటు తిప్పడం చరిత్రకు అపచారం చేసినట్లవుతుంది.

కొడాలి ఆంజనేయులూ, శివశంకరశాస్త్రి, బహుశా మరి కొందరూ స్వాతంత్ర్యోద్యమంలో జైలుకు వెళ్ళారంటే, కవులు కాబట్టి, కవులుగా తమ బాధ్యతను నిర్వహించాలి గనుక వెళ్ళలేదు. దేశభక్తులుగా మాత్రమే వెళ్లారని గమనించాలి.

కావ్యరంగం (అనగా సాహితీరంగం), కార్యరంగం - ఒకదాని కొకటి చుక్కెదురు కావుగాని, కొన్ని అసాధారణ సమయాలలో ఒకరంగంలో కృషిచేసేవ్యక్తిని రెండవరంగం ప్రభావితంచేస్తుందిగాని,

**అది పూర్తిగా పైయక్తికం:** అనగా ఒకవ్యక్తికి ఉత్తేజం కలుగుతుంది: **సమాజానికి** కాదు: గాంధీజీ జీవితాన్ని తీసుకుందాము: అమెరికా రచయిత థోరో రాసిన ''వాల్డెన్'' అనే గ్రంథం, రష్యా రచయిత కౌంట్ లియో రచనలూ, గాంధీజీని ఆకర్షించాయి, ఆయన

భావనాసరళి క్రమంగా పరివర్తన చెందింది : కార్యక్షేత్రంలో కొత్త సంవిధానాలను చేబట్టి నవసమాజాన్ని నిర్మించడానికి ఆయన ప్రయత్నించారు.

భవదీయుడి వాదాన్ని పూర్వపక్షం చేయడానికి పై దృష్టాంతం చాలదా అని ''మేధావులు'' ధామ్మని ప్రశ్నిస్తారు. సహజమే : కాని, సత్యశోధనకు కుతర్కం, "వాలఖిల్య'' భంగిమ వంటి వాదన వినియోగించడం ఎంతవరకు సమంజసం ? ''థోరో" మహాశయుని జీవనవిధానం, అతని సిద్ధాంతాలు, అమెరికాలో ఎలాంటి ఉద్యమాన్నీ తీసుకు రాలేదు : కారణం ? నిఖిల ప్రపంచమూ నిన్నా, ఇవాళా, రేపూ, నివాళులర్పించే మహారచయిత టాల్‌స్టాయ్. మానవ నాగరికత ఊపిరి పీల్చినంతవరకూ, ప్రపంచసాహిత్యంలో ధృవతారవలె టాల్‌స్టాయ్ నిలుస్తాడు.

కాని, టాల్‌స్టాయ్ ఆశయాలూ, ఆదర్శాలూ, స్వప్నాలూ, అన్నింటినీ భగ్నం చేసిన కమ్యూనిస్టు ప్రభుత్వం రష్యాలో ఏర్పడింది ! పరిపూర్ణమానవత్వాన్ని, కారుణిక దృష్టిని, టాల్‌స్టాయ్ ప్రబోధించాడు : **''సమానత్వం, సోషలిజమ్''** మొదలైన ''కుహనా విలువల'' పేరిట, వ్యక్తి స్వతస్సిద్ధ స్వాతంత్ర్యాలన్నింటిని తుడిచివేసిన నియంతృత్వం రష్యాలో ఏర్పడింది : నియంతృత్వాన్ని పాదుకొల్పిన మహానాయకుడు లెనిన్. పటిష్టంచేసి, ప్రజలను కేవలం ''ముడిపదార్థం"వలె వాడుకొని ఈ రష్యన్‌జాతికి బేడీలు వేసిన చండశాసనుడు స్టాలిన్. బకూనిన్, బుఖారిన్, చెకోవ్, గోగోల్, రష్యన్ మహా రచయితల శ్రమఫలితం ఏమైంది ?

పైన వివరించిన అంశంలో కూడా కుతర్కానికి ఉపకరించే "కేశలేశం" ఉంది. కారల్ మార్క్స్ రచనలు, ఆయన (''దాస్‌క్యాపిటల్'') గ్రంథం ప్రపంచ ఆర్థిక, రాజకీయ వ్యవస్థను మార్చివేశాయని భీకరంగా వాదించవచ్చును : ఐతే, ''భేరీనినాదాలు'' నిష్పాక్షిక జిజ్ఞాసకు, సత్యశోధనకు అవరోధాలు. చరిత్రలో చాలా "యాక్సిడెంట్లు" జరుగుతాయి : మొదటి ప్రపంచయుద్ధం ముగిసేసమయంలో జర్మనీనుండి రష్యాకు ''అన్ని తలుపులూ'' బిగించిన ''గూడ్సు" రైలుబండిలో లెనిన్‌మహాశయుడిని తీసుకు వెళ్ళారు.

అక్కడ రష్యాలో అంతర్యుద్ధం భీషణంగా కొనసాగుతున్నది :

**''అంతట లెనిన్ ప్రవేశించును."**

మొదట కెరెన్‌స్కీ ప్రభుత్వం ఆపద్ధర్మంగా ఏర్పడింది : కుట్రలూ, కుహనాలతో కెరెన్‌స్కీ ప్రభుతత్వాన్ని లెనిన్ కూలదోశాడు.

కెరెనిస్కీ పతనం, లెనిన్ విజయం, కేవలం "యాక్సిడెంటు''. చిన్నచిన్న పోరపాట్లు జరిగాయి : లెనిన్ పట్టాభిషిక్తు డయాడు.

ఒకవేళ కెరెన్‌స్కీ నెగ్గితే ఏం జరిగేది ? - కారల్‌మార్క్స్ గ్రంథం లైబ్రరీలో నిదురించేది : రాజకీయ, ఆర్థిక శాస్త్రాలను బోధించే యూనివర్సిటీ ఉపాధ్యాయులు, అనేక సిద్ధాంతాలతోపాటు మార్క్స్ సిద్ధాంతాన్నికూడా కొంచెం వివరించి, విద్యార్థులకు పాఠాలు చెప్పేవారు.

లెనిన్ లేనిదే మార్క్సు లేడు ; ఇంతకూ లెనిన్ అనుసరించినది మార్క్సిజం కాదు : కార్యరంగంలో ఒక పంథా అనుసరించి, దానికి మార్క్సుసిద్ధాంతాలను నేర్పుగా అతికించాడు.

దేశ, కాల, పరిస్థితులు మారినా పై అంశాన్ని ప్రస్ఫుటం చేయడానికి చిన్న ఉదాహరణ : గాంధీజీకి భగవద్గీత స్ఫూర్తి నిచ్చింది. ధర్మసంస్థాపనకు దారిచూపే దీపకళికగా గీతాబోధన ఆయనకు తోడ్పడింది : 1948 జనవరి నెల 30 వ తేదీ సాయంత్రం గాంధీజీని హత్యచేసిన రాక్షస ప్రవృత్తి ఉన్మాది నాథురామ్ గాడ్సేకూడా భగవద్గీతను "దారిచూపే దీపకళిక"గా భావించినాడు. గీతోపదేశంప్రకారం గాంధీజీని హత్యచేయడమే "ధర్మ సంస్థాపన" అనుకున్నాడు. ఒకే గ్రంథం ఆరాధకుల ప్రవృత్తులు ఉత్తర, దక్షిణ, ధృవాలవంటివి.

దారుణ సంఘటనకూ, భగవద్గీతకూ, ఎటువంటి సంబంధమూ లేదు : మానవోత్తముడిని దానవాధముడు వధించాడు, గీతాప్రసక్తి అనవసరం.

కారల్‌మార్క్సు, లెనిన్, వ్యవహారంకూడా అంతే ; భాష్యకారులు ఎన్ని విచిత్ర వ్యాఖ్యాన గ్రంథాలు వ్రాసినా, అవన్నీ వారి స్వంత అభిప్రాయాలు.

మానవ సమాజం నిత్యపల్లవశీలమైనది ; జీవనవిధానం మారుతూంటుంది. : మార్పు తెచ్చిన ఘనుడు **రచయితమాత్రం** కాడు. వెయ్యి సంవత్సరాల క్రితం, రాజరాజ నరేంద్రుడు ఆజ్ఞాపిస్తే, నన్నయ్యగారు మహాభారతాన్ని ఆంధ్రీకరించారు : రెండున్నర పర్వాలను రచించిన తరువాత, నన్నయ్యగారి రచనా వ్యాసంగం ఆగిపోవడం విషయాంతరం ; కాని రాజరాజ నరేంద్రుని ఆశయం వైదిక మత పునరుద్ధరణ. అది నెరవేరలేదు, ఇస్లామ్ వచ్చింది ; సుమారు 600 సంవత్సరాలు అవిచ్ఛిన్నంగా భారత దేశాన్ని (అధిక ప్రాంతం పరిపాలించింది) ; జాతీయ జీవన విధానాన్నీ, సంస్కృతినీ, బలవంతంగా మార్చివేసింది : ఆ తరువాత బుడతకీచులు, ఫ్రెంచివారు, బ్రిటిష్‌వారు ప్రవేశించారు ; పాశ్చాత్య సంస్కృతిని అంటగట్టారు. భారతీయులు అన్నింటికీ తలవంచారు.

నేటి సాంకేతిక, వైజ్ఞానిక, ప్రగతి దౌడుతీస్తున్నది. కవులూ, రచయితలూ, క్షణక్షణం మారుతున్న సమాజాన్ని చూస్తున్నారు ; కొందరు ఆక్రోశిస్తున్నారు. కొందరు సంతోషిస్తున్నారు. సాహిత్యరంగంలోని భేద, మోదాలతో సంబంధం లేకుండా జాతీయ జీవనం మార్పుచెందుతున్నది.

విశ్వనాథ సత్యనారాయణగారు కవిసమ్రాట్టు : ఆయన రచనలు చదివి ఆనందిస్తున్నాము : శ్రీశ్రీ మహాకవి : విప్లవ కవి ; అతడినీ ఆరాధిస్తున్నాము : విశ్వనాథవారు సనాతన ధర్మాన్ని ప్రబోధిస్తున్నారు : శ్రీశ్రీ మహాకవి కమ్యూనిస్టు విప్లవం రావా

లంటున్నాడు. కృష్ణశాస్త్రిగారు కవితాశిల్పంలో అద్వితీయులు: అందరి రచనలనూ చదివి ఆనందిస్తున్నాము.

మారుతున్న సమాజాన్ని చూసి, రచయితలు వైయక్తికముగా తమతమ బాధ్యతలను నిర్ణయించుకుంటున్నారు. మంత్రులమీద పంచరత్నాలు రాసేవాళ్ళున్నారు, అగ్ని వర్షం కురిపించే కవులూ, రచయితలూ ఉన్నారు. శరపరంపరగా "కాలక్షేపం బటాణీల" వంటి నవలల్ని వ్రాసి ప్రచురిస్తున్న నవలామణు లున్నారు.

అందరూ సమకాలికులు: వారి అభిరుచులూ, స్పందనలూ ఇంత గందరగోళంగా ఎందుకున్నాయి? సమాజాన్నీ, జీవన విధానాన్నీ మార్చుతున్న "పాపాన్ని" వారికి అంటగట్టడం పరమ అన్యాయం: సహగమనాన్ని సమర్థించే వారినుండి నక్సలైటులను ప్రశంసిస్తూ "కృతులు" వ్రాసే రచయితలవరకూ అందరూ ఉన్నారు: హిప్పీలనూ, గొట్టం పంట్లాలనూ, "దేవతావస్త్రాలను" ధరించి తమ "సెక్సు" రేడియేషను కిరణాలను ప్రసరింపచేయాలనే యువతీమణుల ఉత్కంఠనూ, నీతిబాహ్య రాజకీయాలనూ, ఇంకా వగైరా వగైరాలనూ. సృష్టిస్తున్నది కవులూ, రచయితలూ ఎంతమాత్రం కాదు.

తనకు తోచినది, ఆత్మసంతృప్తి కలిగేది రాయడం రచయిత బాధ్యత. తన రచనద్వారా భూమి కంపించిపోయిందని రచయిత ఆనందిస్తే, అతడి ఆనందాన్ని విమర్శించి, "సామాజిక బాధ్యతను విస్మరిస్తున్నావు" అంటూ హెచ్చరించడం దేనికి? వాటిని చదివే పాఠకమహాశయుడు సమాజంపట్ల తన బాధ్యతను సక్రమంగా నిర్వర్తిస్తున్నాడా? పాఠకుల అభిరుచులు అనంతంగా ఉన్నాయిగదా!

రచయిత తయారుచేసిన "దినుసు" బాగుందని తీసుకున్న పబ్లిషరు, రచయిత శ్రమకు తగిన ధర చెల్లించాలి: అది పబ్లిషరు బాధ్యత. తన అభిరుచికి అనుగుణంగా ఉన్న రచనలను పాఠకుడు చదివి ఆనందిస్తాడు: అదొక బాధ్యత అని ప్రత్యేకంగా పేర్కొనటం అసందర్భం: అది బాధ్యత కానేకాదు: తనకు రుచించని రచనలను పాఠకు లెవరూ లంచమిచ్చినా సరే చదవరు: పాఠకునికి వినోదం, ఉల్లాసం, తన విజ్ఞానం పెరిగిందనే సంతృప్తి - కావాలి సాహిత్యప్రయోజనం అంతవరకే. "మారుతున్న విలువల" పట్ల రచయిత తన బాధ్యతను తనకు తోచిన విధంగా నిర్వహిస్తున్నాడు. ఒకరు రామాయణాన్ని ఇంకొకసారి రాస్తే, మరొకరు సామ్రాజ్యవాదాన్నీ "దోపిడీదారు" లనూ తిడుతూ సాహిత్యాన్ని వండుతున్నారు. తమకు పురుషులతో సమానంగా స్వేచ్ఛ కావాలని మహిళలు రాస్తున్నారు. నవనాగరికతా వ్యామోహంలో పడి, వింతపోకడలు పోయే మహిళల గురించి "పురుషరచయితలు" వాపోతున్నారు. పాఠకులకు హాయిగా ఉంది: బోలెడంత వైవిధ్యం. సమకాలీన జీవిత విధానానికి యీ రభసతో ప్రమేయం లేదు: అవసరాల ననుసరించి మారిపోతున్నది.

# మారుతున్న విలువలు - భాషా సమస్య

శ్రీ చేకూరి రామారావు

సమాజాభివృద్ధి పద్ధతిని పరిశీలించి మోర్గన్‌వంటి సాంఘిక శాస్త్రజ్ఞులు కొన్ని స్థితులు (Stages) గా విభజించారు. తరువాతవచ్చిన మార్క్స్, ఎంగెల్సువంటి మేధావులు ఈ సమాజస్థితుల్ని (Stages) గతుల్ని (processes of change) పరిశీలించి వీటి మూల తత్వాన్ని కనుక్కున్నారు. ప్రతి సమాజ స్థితికి ఒక మూలతత్వం ఉంటుందనీ, అది ఆర్థిక సంబంధమైనదని, దాన్ని ఆధారంచేసుకొని అప్పటి రాజకీయాలు, మతాలు, చట్టాలు, కళలు, సాహిత్యం వృద్ధి పొందుతయ్యని వారు ప్రతిపాదించారు. అంతేకాక అప్పటి రాజకీయాలు, చట్టాలు, కళలు మొదలైనవి ఆ స్థితిని కాపాడటానికి ప్రయత్నిస్తై. ఆ సమాజస్థితికి మూల కందాన్ని (Base) తొలగిస్తే, దానిమీద ఆధారపడ్డ ఉపరితల నిర్మాణానికి (super structure) సంబంధించినవన్నీ కూలిపోతై. కొత్త base ఏర్పడి నప్పుడు కొత్త కళలూ, రాజకీయాలు వంటివి మళ్ళీ ఏర్పడతై. సమాజం వర్గమూలమై నప్పుడు, వాటి రాజకీయాధికారులు తద్భిన్నంకావు. ఈ Base ఎట్లా మారుతుందనేది ప్రస్తుతం మనకనవసరం. చరిత్రతో వచ్చిన విప్లవాలు చాలా అందుకే వచ్చినయ్యని సాక్ష్యం ఉన్నది.

ఇట్లా సమాజస్థితి మారుతుందని, దాన్ని అనుసరించి సాంఘికమైన విలువలు మారుతయ్యని ప్రత్యేకంగా ఎవరికీచెప్పనక్కర్లేదు. ఈ మారుతున్న విలువల్లో భాషా పాత్ర ఏమిటి ? పైన పేర్కొన్న విలువలు ఆర్థిక సంబంధాల్నిబట్టి ఏర్పడ్డవి. ఇంకో రకంగా చెప్తే ఆర్థికసంబంధాలే ఆ విలువల్ని సృష్టించినై. కాని భాషను ఆర్థికసంబంధాలు సృష్టించినట్టు మనకాధారాలు లేవు. భాష పుట్టుకను గురించి ఎన్నో సిద్ధాంతాలున్నప్పటికి ఇప్పుడు ప్రధానంగా నిలబడ్డవి రెండేరెండు. భాష జంతుకోటిలో ఉన్న అభిప్రాయ ప్రకటన విధానాలనుంచి పరిణామం చెందిందా ? లేక మానవ పరిణామంలో హఠాత్తుగా ఒక దశలో భాష ఏర్పడిందా ? అన్నవే ఆ రెండు వాదాలు. ఆ రెండు వాదాలకి ఉప పత్తులున్నై. (ఆ వాదాల్నిగురించి విపులంగా చర్చించటానికిది అదునుకాదు). భాష లేకుండా మానవ సమాజమెప్పుడూ ఉండి ఉండలేదని ఈ రెండు వాదాల వాళ్ళూ అంగీకరిస్తారు.

మానవ సమాజంలో వర్గాలు ఏర్పడకముందునుంచీ భాష ఉందనేది అందరూ ఒప్పుకుంటారు. భాష వర్గ సంబంధాల (వైరుధ్యాల) వల్లకాని, ఆర్థిక సంబంధాలవల్లకానీ ఏర్పడలేదు. అంటే భాషకు ఉత్పత్తిశక్తులు, ఆర్థికశక్తులు మూలంకావన్నమాట. ఆర్థిక శక్తులు (Base) మారినప్పుడు దానిమీద నిర్మించబడ్డ (Superstructure) రాజకీయాదులు

మారతయ్యని పైన సూచించాం. అయినప్పుడు భాషకూడా Base మారినప్పుడల్లా మారుతుందా? భాష మారుతుందని మనకు తెలుసు. కాని ఈ మార్పుకు ఆర్థిక సంబంధాల ప్రమేయం ఎంతవరకు?

ఈ సందర్భంలో భాష మారడమంటే ఏమిటో మనం స్థూలంగానైనా తెలుసుకోవాలి. భాషకు వ్యాకరణం ఉంటుంది. వ్యాకరణం అంటే ఒకరో ఇద్దరో పండితులు శాసిస్తూ రాసిన సూత్రాల పుస్తకం అనే అర్థంలో ఇక్కడ వాడటం లేదు. వ్యవహర్తలు భాషావ్యవహారంలో పాటించే నియమావళి అనే అర్థంలోనే నేను వ్యవహరిస్తున్నాను. ఈ వ్యాకరణంలో మార్పులువస్తే, ఈ మార్పులకి ఆర్థికసంబంధాలను కారణాలుగా చూపించగలిగితే అపుడు మనం ఆర్థికమైన మార్పులకీ, భాషలోవచ్చే మార్పులకీ ముడి పెట్టవచ్చు. వ్యాకరణాన్ని కూడా ప్రధానంగా మూడు భాగాలుగా విభజించవచ్చు. వాక్య నిర్మాణం (Syntax), పద నిర్మాణం (Morphology), ధ్వని నిర్మాణం (Phonology) నన్నయ్య కాలంనుంచి వస్తున్న భాషను పరిశీలిస్తే పదనిర్మాణంలోనూ అంతకన్న ఎక్కువగా ధ్వని నిర్మాణంలో మార్పులు వచ్చినట్లుగా మనం గమనించవచ్చు. వాక్య నిర్మాణంలో చెప్పుకోదగిన మార్పులు లేవు. ఉదాహరణ, క్త్వార్థక క్రియాప్రయోగంలో కాని, నామక్రియా సంబంధాలను తెలియపరచే విభక్తిప్రత్యయాల స్థానంలో కాని, ఉప వాక్యాల (Clause structure) నిర్మాణంలో కాని, క్రియాజన్య విశేషణాలద్వారా (Relative Clause) నిర్మించుకోవటంలో గాని, నామ్నీకరణవిధానంలో కాని ఎక్కడా మారినట్టు కనపించదు. అంతేకాదు, ఈపద్ధతులు సజాతీయమైన ఇతరభాషల్లో కూడా అట్లానే ఉన్నై. వీటిల్లో కొన్ని టర్కిష్, జాపనీస్ వంటి విజాతీయ భాషల్లోనూ ఉన్నై. అంటే భాషకు అతిముఖ్యమైన వాక్యనిర్మాణంలో చెప్పుకోదగిన మార్పులు రాలేదనేది సుస్థాపితమైన విషయమన్నమాట.

ఇక శబ్దరూపాల్లోనూ ధ్వనుల్లోనూవచ్చే మార్పులు గురించి: నన్నయ కాలం నుంచి 19 వ శతాబ్దం వరకు ఉన్నది. భూస్వామ్య వ్యవస్థ అనుకుంటే ఆ కాలంలో తెలుగుభాషా ధ్వని నిర్మాణంలోనూ, శబ్దనిర్మాణంలోనూ కొన్నిమార్పులు వచ్చినై. కొద్ది విభక్తి ప్రత్యయాలు మారినై. 'నుండి' బదులు నుంచి వచ్చింది. 'వలెను' అనే శబ్దరూపం 'ఆలి' అనే ప్రత్యయంగామారింది. అన్నంత క్రియలమీదవచ్చే క్రియలు Fix అయిపోయినై. కాని ఈ మార్పులు ఏ సమాజన్యవస్థను పరిరక్షించటానికి ఏర్పడ్డవికావు. పైగా ఒకే ఆర్థికమైన పునాదిమీద ఏర్పడ్డ సమాజంలోనే వచ్చినమార్పులు.

భాషలో వచ్చే మార్పులకూ, ఆర్థికశక్తులవల్లవచ్చే మార్పులకూ సంబంధంలేదు. సమాజంలోవచ్చే మార్పులకు విలువలుఉంటై. ఒక రాజ్యాంగ వ్యవస్థలో మార్పులు వచ్చినయ్యంటే, అవికొత్త సమాజ వ్యవస్థకు అనుగుణంగా రావటమేకాక, దాన్నిరక్షించటానికికూడా పూనుకుంటై. భాషలో వచ్చేమార్పులకు "విలువలు" ఉండవు. అంటే వ్యాకరణ నిర్మాణంలోవచ్చిన మార్పులు పూర్వం ఉన్నవాటికన్నా ఉన్నతమైనవనీ,

ఉత్తమమైనవనీ చెప్పటానికి ప్రస్తుతం ఎటువంటి ఆధారాలులేవు. భాషలో వచ్చేమార్పులకు సాంఘిక ప్రయోజనందృష్ట్యా ఎటువంటి విలువా లేదు.

భాష ఏ సమాజవ్యవస్థలోనైనా అభిప్రాయ ప్రకటనకుపయోగ పడుతుంది. మారుతున్న సమాజంలో అభిప్రాయాలు (images, concepts, values, etc) కూడా మారుతై కాబట్టి అందుకనుగుణంగా భాష మారదా? మారాల్సిన అవసరంలేదా? అనే ప్రశ్న సహజంగావస్తుంది. మారుతున్న విలువల కనుగుణంగా భాష మారాలనేవాళ్లు మారుతున్న అభిప్రాయాలను వ్యక్తం చేయటానికి భాష సమర్థంగా ఉండక్కర్లేదా అని అడుగుతున్నారు. భాషలో మార్పంటే మనకవసరమైనవిధంగా భాష వ్యక్తీకరణ సాధనంగా ఉపయోగపడటం. భిన్నవిషయాలను, సరికొత్త విషయాలను వ్యక్తీకరించటానికి తగిన పదజాలాన్ని భాష సమకూర్చుకోవాలి. ఈ పనిని భాష ఎప్పుడూ చేస్తూనే వుంటుంది.

బూర్జువా సమాజంలో జరిగిన సాంకేతికాభివృద్ధి చరిత్రలో ఇంతకు ముందుజరిగిన అభివృద్ధికన్న మిన్నఅయింది. ఈ సాంకేతికాభివృద్ధి మానవ జీవితంలో విప్లవాత్మకమైన మార్పుల్ని తెచ్చింది. ఈ సాంకేతికాభివృద్ధి ఫలితాలు ఒక దేశానికి పరిమితమై ఉండలేవు. ఉత్పత్తి పెరిగినప్పుడు దానికి మార్కెటు కావాలి. వేగవంతమైన ప్రయాణ సాధనాలువచ్చినై. దేశాలమధ్య సరిహద్దులు చెరిగిపోతై. ఒకప్రాంతపు వస్తువులు (meterial & culture) భావాలు (abstract culture) ఇతర ప్రాంతాలకు వ్యాపిస్తై. ఇది బూర్జువా సమాజ స్వభావంలోనే ఉంది. ప్రపంచంలో అన్ని ప్రాంతాల మధ్య సాంస్కృతికమైన ఆదాన ప్రదానాలు స్వేచ్ఛగా జరుగుతై. భిన్న దేశాలమధ్య సంబంధాలు పెరిగినప్పుడు ఈ సాంకేతికాభివృద్ధి దాని మూలంగాజరిగిన ఆదాన ప్రదానాలు భాషలో ప్రతిఫలించక తప్పదు. అంతేకాక ఈ సాంకేతికాభివృద్ధిని ఇముడ్చుకోదలచిన ఏ భాషా "స్వచ్ఛం"గా ఉండటం సాధ్యంకాదు. పూర్వసమాజాల్లోవచ్చిన మార్పుల్ని ఇముడ్చుకోటానికి భాషకు చాలినంత వ్యవధిఉండేది. బూర్జువా సమాజంలోవచ్చిన విప్లవాత్మకమైన మార్పుల్ని ఇముడ్చుకోటానికి భాషలకు తగినంత వ్యవధిలేదు. అందువల్ల భాషలు అందుకవలంబించే పద్ధతి ఆ వస్తువులు, భావాలు ఏ భాష మూలంగా మన సంఘంలోకి ప్రవేశించాయో ఆ భాషాపదాలనే గ్రహించటం. దీనివల్ల భాషకు జరిగే హానిలేదు. భాషానిర్మాణంలో సమూలమైన మార్పులు ఇందువల్ల గలవు. పారిశ్రామిక విప్లవం, అమెరికాలో, ఆస్ట్రేలియాల వలస, ఆంగ్ల సామ్రాజ్యం— వీటివల్ల ప్రపంచంలో చాలాదేశాలకు బూర్జువా నాగరికత, ఇంగ్లీషు భాషద్వారా వ్యాపించి ఇంగ్లీషు అంతర్జాతీయ భాష కాగలిగింది.

ఈ పూర్వరంగంనుంచి చూస్తే తెలుగుభాష ఆధునిక వ్యవహారానికి (రచనకు కూడా) సమర్థమైన వాహకంగా ఉండాలంటే కొత్తశబ్దజాలం భాషలో ఏర్పడాలి. సాంకేతిక పదాలు ఏర్పడాలి. కొత్తపదాలు భాషలో కొన్ని పరిమితమైన పద్ధతుల్లోనే ఏర్పడతై.

1. అన్నిటికన్న సులభమైన పద్ధతి ఇతర భాషాపదాల్ని యథాతథంగా వాడుకోటం. ఇది యథేచ్ఛగా జరుగుతూనేఉంది. ముఖ్యంగా ఉన్నత విద్యావంతుల భాషలో (వ్యవహారంలోనూ, రచనలోనూ,) ఇది ఎక్కువ. సైన్సులోనూ, రాజకీయరంగంలోనూ ఇది జరుగుతూనే ఉంది.

2. రెండో పద్ధతి ఇతర భాషల్లోని పదాల్ని గ్రహించకుండా ఆ భావాల్ని మాత్రమే గ్రహించి మనభాషలో ఉన్న పదజాలంతోనే, కొత్త పదబంధాల్ని సృష్టించటం, ఇది గ్రామీణులు అతి సహజమైన పద్ధతుల్లో చేస్తారు. మరమేకు, మరనాగలివంటి పదాలు ఇట్లా సృష్టించబడినవే. ఇవి భాషలో త్వరగా స్థిరపడిపోతై. (సాహిత్య ఎకాడమీవాళ్ల ప్రచురించిన వృత్తి పదకోశాల్లో వీటికి చాలా ఉదాహరణాలు దొరుకుతై.) విద్యాధికులైన వాళ్లు సృజించే పదబంధాలు స్థిరపడటానికి ఎక్కువకాలం పడుతుంది. అయినా పద్ధతి కూడా అనుసరించదగిందే. కాని ఇట్లాంటి పదాలు అది దీర్ఘమైతే కృతకంగాఉండి భాషలో నిలవక ఇతర భాషాపదాలే ఆ స్థానాన్ని ఆక్రమిస్తై. సాధారణంగా ఇవి (Blending, Compounding, derivation) ద్వారా జరుగుతుంది.

3. ఇక మూడో పద్ధతి భాషలో యింతకుముందే స్థిరపడిన పదాలని కొత్త అర్థాల్తో వాడుకోటం. అర్థసంకోచ వ్యాకోచాదికాలవల్ల అర్థాన్ని మార్చుకొని నేటికాలానికి అనుగుణంగా వాడుకోటం. ఇది కూడా సామాన్య ప్రజలుచేస్తే భాషలో త్వరగా స్థిరపడిపోతై ఉదాహరణకు బండి అనే పదాన్ని ఇప్పుడు రైలుకు, సైకిలుకు, బస్సుకు కూడా వాడుతున్నారు. కరపత్రం, కార్యకర్త, అనేమాటలకు ఇప్పుడున్న అర్థాలు ఈనాటివాళ్ళు కల్పించుకున్నవే.

ఈ మూడు పద్ధతులూ ఈనాడు వాడుకోకతప్పదు. ఈ సాంకేతికాభివృద్ధి ప్రజలందరికీ అందుబాట్లోకి వచ్చేవరకూ వేచి ఉండటం సాధ్యంకాదు కనక పై మూడు పద్ధతుల్లో అవసరాన్నిబట్టి సంక్షిప్తత, అర్థబోధ లక్ష్యాలుగా ఉంచుకొని ఈనాటి తెలుగులో శబ్దజాలాన్ని వృద్ధిపొందించుకోవచ్చు. దానికి భాషాశాస్త్ర పరిచయం ఉన్న సమర్థులైన రచయితలు పూనుకొని రచనా వ్యాసంగాన్ని సాగిస్తే ఈనాటి సాంకేతిక పరిజ్ఞానాన్ని ప్రజలకు చేరువగా తీసుకుపోవచ్చు. విజ్ఞానాన్ని మాతృభాషలోనే అందించాలని ప్రభుత్వం తీసుకున్న నిర్ణయం సరిఅయిందే. దాని ఆచరణలో జరిగే లోటుపాట్లవిషయం వేరు.

ఈ సందర్భంలోనే గ్రాంధిక, వ్యావహారిక భాషావిభేదాలు సంగతి ప్రస్తావించక తప్పదు. ప్రాచీన రచనా భాషని గ్రాంథికమనీ, ఆధునిక రచనా భాషని వ్యావహారికమనీ వ్యవహరిస్తున్నాం. గ్రాంథిక భాషావాదులైనా ప్రాచీన రచనా భాషలో మాట్లడమనరు. రాయాలని మాత్రమే అంటారు. అంటే ఈ భాషా వివాదం రచనా భాషకు మాత్రమే సంబంధించింది. మనకు సాహిత్యం లభించినంతవరకు ప్రాచీనకాలంలో రచన అప్పటి వాడుక భాషలో జరుగలేదు. (ఇక్కడ రచన అంటే లిఖితమైన గ్రంథ రచన అనే అర్థంలోనే వాడుతున్నాను). అప్పుడు గ్రంథరచన ఎక్కువమంది ప్రజలకోసం జరగ

లేదు. ఫ్యూడల్ సమాజంలో విద్యా విజ్ఞానాలతో కొద్దిమందికే సంబంధముండేది. ఒకానొక కాలంలో రచనా భాష, వ్యవహారభాష ఒకటే అయిఉండాలి. క్రమంగా ఒక రచనా సంప్రదాయం ఏర్పడింతరవాత కవులు తమకు సాంప్రదాయకంగా సంక్రమించిన రచనా భాషనే అనుసరించి రచన చేశారు. నన్నయ రచనాపద్ధతి అంతకుముందే ఏర్పడినట్టు మనకు శాసనాలు సాక్ష్యం చెప్తున్నై. ఫ్యూడల్ సమాజంలో సాంప్రదాయికంగా ఏర్పడ్డ గ్రాంధికభాషను మార్చుకోవలసిన అవసరం వాళ్ళకి రాలేదు. ఆ సమాజం కవిత్వం, సాహిత్యం అవసరమైంది చాలా కొద్దిమందికే. అలిఖితమైన జానపద సాహిత్యం ఎప్పటి కప్పుడు ప్రజల భాషలోనే పుడుతూ వచ్చింది. వాటిని ఏ రామరాజుగారో, ఏ దోణప్ప గారో - అట్లాంటివారు మరి కొందరు వచ్చేవరకూ పుస్తకాల్లోకెక్కలేదు. ఫ్యూడల్ సమాజంలో ఉన్నతవర్గాలకు పనికొచ్చే సాహిత్య సృష్టికి, అప్పటి శాస్త్రవిజ్ఞానానికి ఆ భాష సరిపోయింది. ఫ్యూడల్ సమాజంలో సాంకేతికాభివృద్ధి అతిస్వల్పం. అదైనా ఎక్కువ మందికి అందాల్సిన అవసరం లేదు. ఆ కొద్దిపాటి శాస్త్రవిజ్ఞానమైనా సంస్కృతభాషలో వచ్చింది. దాన్ని తెలుగులో పెట్టుకునేటప్పుడు సంస్కృత శబ్దజాలాన్నే తెలుగులోకి తెచ్చుకున్నాం. అతి సంకీర్ణమైన ఆధునిక బూర్జువా సమాజపు సాంకేతికాభివృద్ధిని ఇముడ్చుకోవాలంటే ఇప్పుడు తెలుగులో వ్యాప్తిలో ఉన్న సంస్కృత శబ్దజాలమైనా చాలదు. పైగా ఫ్యూడల్ సమాజంలోలాగా కాకుండా ఈ సాంకేతిక పరిజ్ఞానం శాస్త్రపరిజ్ఞానం ఎక్కువమందికి అందాలంటే, అందులో ఎక్కువమంది రచన చెయ్యాలంటే ప్రాచీన రచనాభాష చాలదు. ఫ్యూడల్ వ్యవస్థలో భిన్న నాగరికతల సంబంధాలు పరిమితం, బూర్జువా సమాజంలో భిన్నదేశాలు స్వయంసంపూర్ణంగా బతకలేవు. బూర్జువా నాగరికత ప్రధానంగా వ్యాపారనాగరికత. దీనికి దేశాలమధ్య వ్యాపార సంబంధాలు అనివార్యం. ఇందుమూలంగా సాంకేతికాభివృద్ధి ఎక్కువ మందికి అందాల్సి ఉంటుంది. ఈ అవసరాలకి గ్రాంధిక భాషలో శబ్దజాలం సరిపోదు. ఆ భాషలో రచన కూడా ఎక్కువ మందికి సాధ్యం కాదు.

గ్రాంథికభాష ఒక closed system, వ్యవహారభాష, open system. గ్రాంథిక భాష ప్రాచీనభాష కావటంవల్ల దాని వ్యాకరణాన్ని ప్రయత్నపూర్వకంగా నేర్చుకోవాలి దానికి గ్రంథసహాయం అవసరం. సలక్షణమైన గ్రాంథిక భాషనునేర్పే గ్రంథాలులేవు. ఆధునిక రచనాభాష ఆధునిక వ్యవహారభాషలోనుంచి ఏర్పడింది గనుక దానిలో రచన చెయ్యటానికి వ్యాకరణం నేర్చుకోనక్కర్లేదు. మాట్లాడటం నేర్చుకున్నప్పుడే వ్యవహర్త అలిఖితమైన వ్యాకరణం నిర్మించుకున్నాడు. గనక ఆధునిక భాషలో రచన సుకరం.

ఆధునిక సమాజంలో కేవలం టెక్నాలజీయేకాక రాజ్యాంగవ్యవస్థకూడా అతి సంకీర్ణమైంది. ఈ రాజ్యాంగవ్యవస్థతో నేడు ఎక్కువమందికి ప్రమేయంఉంది. విద్యావంతులు, విద్యహీనులుకూడా ప్రభుత్వం వ్యవహారాల్లో జోక్యం కలిగించుకోవాల్సిన అవసరంఉంది. యీ రాజ్యాంగవ్యవస్థలో ఒకసారి అధికారంలోకివచ్చిన పార్టీ మళ్ళీ అధికారంలోకి రావాలంటే ఎక్కువమంది ప్రజలకు మేలుచేసినా చెయ్యకపోయినా చేసినట్టు

చూపించాలి. ప్రచారం చెయ్యాలి. ప్రభుత్వాలు తమ ఆధీనంలోఉన్న ప్రచారం సాధనాల ద్వారా యీ పనినిచేస్తుంటై. ఈ ప్రచారం గ్రాంథికభాషలోచేస్తే వాళ్ళప్రయోజనం సిద్ధించదు. పరిపాలనాభాషగా వ్యవహారభాషను వాడటం యీ ప్రభుత్వాల మనుగడకే అవసరం. ప్రజల్లో వ్యాప్తికోసం ప్రయత్నించే ఏ రాజకీయ పక్షమైనా తన సాహిత్యాన్ని ఎక్కువ మందికి తెలిసేభాషలోనే ప్రచురిస్తుంది.

దీన్నిబట్టి నేటి రచనాభాషగా నేటి రచన వ్యవహార భాషలోనే జరగటం బూర్జువా సమాజపు అవసరాలకోసం జరుగుతున్నదే. గిడుగు రామ్మూర్తి, గురజాడ అప్పారావులు యీ బూర్జువాసమాజంలో తప్పనిసరిగా రావలసిన యీ మార్పుని వేగవంతంచేశారు. యీ మార్పు అనివార్యమైంది.

ఈ మార్పుని అంగీకరించని ఫ్యూడల్ సమాజపు ప్రతినిధులు యీ దేశంలో ఇంకావున్నారు. వాళ్ళే ఇంకా గ్రాంథికభాషను నిలబెట్టాలని ప్రయత్నిస్తున్నారు. వాళ్లు పైకి ఏ కారణాలు చెప్తున్నా వాళ్ళ నిజమైన ఉద్దేశం పండితవర్గం privileged class ను ఇంకా కొనసాగించటమే. ఫ్యూడల్ వ్యవస్థలోని అన్ని అవశేషాలతోపాటు ఇదికూడా చరిత్రపుటల్లోకి వెళ్లిపోక తప్పదు.

*

నా అక్షరాలు కన్నీటిజడులలో తడిసే దయాపారావతాలు
నా అక్షరాలు ప్రజాశక్తులవహించే విజయ ఐరావతాలు
నా అక్షరాలు వెన్నెలలో ఆడుకునే అందమైన ఆడపిల్లలు.

— తిలక్.

నిన్నటి మహాకావ్యం పద్దెనిమిది పర్వాలైతే
నేటి మహాకావ్యం పద్దెనిమిది పేజీలే.

—శ్రీశ్రీ.

ఆకళ్ళ కళలు ఆకళ్ళు
ఆకళ్ళ కళల ఆకళ్ళు
ఆకళ్ళ కలలు ఆకళ్ళు
కలల ఆకళ్ళు ఆకళ్ళు.

—కాళోజీ.

# మారుతున్న విలువలు

## శ్రీ పాములపర్తి సదాశివరావు

మధ్యయుగంలో పురాణాలు, ప్రబంధాలు, శతకాలు, యక్షగానాలు మూసపోత ఫక్కీలో కొనసాగాయి. జాతీయ పునరుజ్జీవనకాలంలో వీటి అనువాదాలతోబాటు భావకవిత, స్టేజి నాటకాలు, నవలలు, కథలు, వ్యాసాలు మున్నగు క్రొత్తరూపాలు వెలువడ్డాయ్. ఇవి ఆంగ్లసాహిత్య ప్రభావానికి లోనై ఉదయించి క్రమంగా జాతీయ స్వభావ స్వరూపాలను సంతరించుకొని ఆకర్షణ గోల్పాయి.

జాతీయ పునరుజ్జీవన కాలపు సాహిత్యంలో దృక్పథం, స్వాతంత్ర్య దృక్పథం, అభ్యుదయ దృక్పథం, సమతా దృక్పథం, దేశభక్తి భావన, భవిష్యత్తుపైన ఆశావాద ఉద్వేగం, ఆశయాలపై అచంచలవిశ్వాసం, నిష్కపట నిజాయితీపై అభిమానం, సేవా త్యాగభావనలపై గౌరవాదరాలు అపార ప్రేరణ నిచ్చాయి. వీరేశలింగం, గురజాడ, పానుగంటి, చిలకమర్తి, ధర్మవరం కృష్ణమాచార్య, కాళ్ళకూరి నారాయణరావు, బలిజేపల్లి లక్ష్మీకాంతం, కట్టమంచి రామలింగారెడ్డి, దువ్వూరి రామిరెడ్డి, రాయప్రోలు సుబ్బారావు, బసవరాజు అప్పారావు, నండూరి సుబ్బారావు, కృష్ణశాస్త్రి, బాపిరాజు, జాషువా, చలం, ఆదిభట్ల నారాయణదాసు, ద్వారం వెంకటస్వామి నాయుడు, బళ్ళారి రాఘవ, జీ. వి. సుబ్బారావు, కాసా సుబ్బారావు మున్నగు అసంఖ్యాక అతిరథ మహారథులు ఆ రోజులలో పలు రంగాలలో ప్రతిభావంతంగా తమ తమ సృజనాత్మక పాత్రలు నిర్వహించి సాంఘికోత్తేజన చేకూర్చారు. పూర్ణ వికసిత వ్యక్తిత్వంతో భాసించారు.

వీరి ప్రభావం నేటికీ యువలోకంలో ప్రసరణ జెందుతూనే వుంది. పైన ఉదహరించిన పెద్దల శ్రేణిని పూర్తిగా ఈనాటి అని చెప్పడంకూడా పొసగదని తోస్తుంది. స్వాతంత్ర్యానంతరం, గత యిరవై యేండ్లలో క్రమక్రమంగా సాంఘిక పరిస్థితులు, రచయితల మనస్తత్వం రెండూ తీవ్రమైన మార్పుకు గురియయ్యాయి. స్వాతంత్ర్యం రాకముందు జాతీయాభివృద్ధికి చెందే స్వాప్నికభావనలు స్వాతంత్ర్యానంతరం వాస్తవానుభవాల రూపం దాల్చాయి. సాహితీ సాంస్కృతిక రంగాల్లో క్రమక్రమంగా నిరాశా నిస్పృహలు, అవిశ్వాస ఆందోళనలు పైచేయి యౌతున్న దృశ్యం కనబడ్తుంది.

రేడియో, సినిమా, పత్రికారంగం, అకాడమీలు, విశ్వవిద్యాలయాలు, ప్రచురణ సంస్థలు మున్నగు ప్రజావిజ్ఞాన సాధనాల్లో ఎంతో విస్తృతి జరిగినా అవి యువకశక్తుల ఆదర విశ్వాసాలను చూరగొని వారికి క్రియాత్మక ఉత్తేజన నివ్వడంలో విఫలమౌతున్న పరిస్థితులను చూస్తున్నాము. అధికారుల అదుపు మనస్తత్వం, స్వేచ్ఛావ్యాపారుల స్వలాభపరత్వం ఆయా రంగాల్లో బాహాటంగా ప్రభావం వేస్తున్నట్లుగా వేరే చెప్పాల్సిన పనిలేదు.

అందువల్ల యువకులలో వాటిపట్ల ఉపేక్షాభావం ప్రబలుతున్న సూచన లున్నాయి. ప్రజా స్వామ్యపరిణామంలో నానా అవకాశవాదులు నిజాయతీపరశక్తులను ప్రక్కకు త్రోసివేసి అధికార స్థానాలను ఆక్రమించడంతో రాజకీయంగా విలువలు దిగజారిపోయి ఆ ప్రభావం సాహితీ సాంస్కృతిక రంగాలకు ప్రసరించిన దృశ్యం కనపడ్తుంది...

* మన నాటకరంగం సరదాగా మాత్రమే మిగిలియుంది. నిర్జీవమైన సినిమా అనుకరణ నాటక కళగా సాగిపోతూవుంది. ఉత్తేజకరమయిన నాటకసంస్థలు, నాటక రచనలు పెద్దగా వెలువడటంలేదు.
* కవిత తీసుకుంటే వచనకవిత, దిగంబరకవిత, విప్లవకవితలాంటి తిరుగుబాటు ధోరణులు పైచేయి యౌతున్నట్లు చూడగలం...
* నవలలు, కథల్లో క్రియాత్మకమైన భావస్ఫూర్తి లోపించి మనుగడ మనస్తత్వం, ఉబుసుపోక ధోరణులు అధికంగా చలామణియౌతున్నాయి. సెక్స్, డిటెక్టివ్ రచనలు వెర్రితలలు వేస్తూ ఉన్నదికూడ చూడగలం. విలువలదృష్ట్యా చూచినప్పుడు వీటిని పెద్దగా శ్లాఘించగల వీలుండదనిపిస్తుంది.

ఇతర సాంస్కృతిక రంగాలుకూడ, చిత్రకళ, భరతనాట్యం, జానపద కళా రూపాలు పెద్దగా ప్రజలను ఆకర్షించి ఉత్తేజన గొల్పుతున్న సూచనలులేవు.

నగరాల్లో వుండేవారి అనుభవాలేమోకాని జిల్లాల్లో తాలూకాల్లో నివసించేవారికి, సాహితీసాంస్కృతిక రంగాలలో గల సాహచర్యాన్ని బట్టిచూస్తే—ఒక రకంగా స్తబ్ధత యేర్పడుతున్నట్లుగా తోస్తుంది. సినిమారంగంలోను, పత్రికారంగంలోను వ్యాపార దృక్పథం, సెన్సేషనలిజం లాంటి కృతక అభిరులులు సాగిపోతున్నాయి...

* లలితకళా అకాడమీవారు మోడర్న్ ఆర్ట్‌ను ప్రోత్సహిస్తుండగా, సాహిత్య అకాడమీ వారు పాత ప్రబంధాలను పునర్ముద్రిస్తున్నారు. సంగీతనాటక అకాడమీ కార్యక్రమాలు ప్రజలను ఆకర్షిస్తున్న సూచనలు అగుపడటం లేదు.

ఇదంతా సాహితీ సాంస్కృతిక రంగాల్లో ప్రజా సాహచర్య శీలమైన ఉత్తేజన కొరవడుతూ ఉందని చెప్పటానికే నిదర్శనం. అందువల్ల సృజనాత్మక విలువలు అల్ప స్థాయిలో ఉంటున్నట్లు తోస్తుంది.

అధికార వర్గాలలో కార్యవాదశీలత (ప్రాగ్మటిజం) ఉద్యోగివర్గాల్లో మనుగడశీలత (ఎగ్జిస్టన్షలిజం) స్వలాభపర వ్యాపారవర్గాల్లో యాంత్రికత - లేదా శోషణ పరతలాంటి ధోరణులు సాగిపోతున్నాయి. ఈ మధ్య పాప్ ఆర్ట్ రూపాలు, హిప్పీ, బీట్నిక్, యాహూ తత్త్వాలు, జేమ్స్‌బాండ్‌ఫాషన్లు మున్నగు ధోరణులవైపు యువకుల దృష్టిని ప్రసరిస్తున్న దృశ్యాలుకూడా ప్రారంభమయ్యాయి. ఇలాంటి ధోరణులన్నిటినీ ఒక విధంగా ప్రచలిత వ్యవస్థతో అనంగీకార (నాన్ కాన్ఫరమిస్ట్) పోకడలుగా తీసుకోవచ్చునను కుంటాను.

సాంతత్ర్యం అనే పదం ఈ నాడు 'విశృంఖలతత్వం'గా భావింపబడ్తూ వున్న ట్లుగా తోస్తుంది. అదుపు మరియు హేతువాద బద్ధమైన బాధ్యత (రెన్‌పాన్సిబిలిటీ) లను నేటి మేధావి రచయితలు నిరాకరించి - యథేచ్ఛగా తిరుగబడుతున్నారు. ప్రజాస్వామ్యం

సామ్యవాదం లాంటి సాంఘిక తత్వభూమికలను త్రోసిపుచ్చ గోరుతున్నారు. వారు మరీ అంధప్రవృత్తుల అదుపులేని రాజ్యం, రక్తమాంస ఆవశ్యకతల నివారణ లక్ష్యం వైపుకు ఆకర్షితులౌతున్నారేమో అనిపిస్తుంది. కనుక నిరాకరణ భావం చలామణి యౌతూ ఉందనిపిస్తుంది.

ఈ స్థితి ఒక్క తెలుగు సాహిత్యం వరకేకాదు. అమెరికా, యూరప్‌ఖండాల్లో మరింత ప్రస్ఫుటంగా కనపిస్తుంది. విధి నియమరహితమయిన సెక్సు, క్రైము వ్యామోహం అందులేని ధనదాహం నేటి పాశ్చాత్య సాహిత్యంలో సర్వోపరిగా చలామణి చేయబడుతున్నాయి. ఆ ప్రభావం తెలుగు సాహిత్యం పైకి ప్రసరించడంలో అబ్బురమేమీలేదు. ఫ్రాయిడు సూత్రాలు స్ట్రీమ్ ఆఫ్ కాన్షస్‌నెస్ రచనలు ఇటీవల ప్రచారం పొందుతున్న ఉదాహరణలు చూడగలం.

ఐతే ఈ మార్గం ఎటు? అన్నదే సమస్య. విధ్వంసం లేనిదే నిర్మాణం అన్నది సాధ్యపడదా అని సందేహం వేస్తుంది. నిర్మాణాత్మక విలువలకంటే విధ్వంసనాత్మక "విలువలే" అధిక ప్రచారానికి వస్తున్నట్లు నా మటుకు నాకు తోస్తుంది.

*

"స్వాతంత్ర్యం, సమభావం,
సౌభ్రాత్రం, సౌహార్దం,
పునాదులై ఇళ్ళులేచి
జనావళికి శుభం పూచి—
శాంతి, శాంతి, శాంతి, శాంతి
జగమంతా జయిస్తుంది,
ఈ స్వప్నం నిజమవుతుంది."

—శ్రీశ్రీ.

# నేటి సాహిత్యంలో ప్రతిబింబించే మారుతున్న విలువలు

శ్రీ పోతుకూచి సాంబశివరావు

నేటి సాహిత్యంలో ప్రతిబింబించే మారుతున్న విలువలు రెండు దృక్పథాలతో మనం పరిశీలించవచ్చు. సాహితీ క్షేత్రంలో ప్రయోగాత్మకంగా రచయిత ద్వారా మారుతున్న విలువలు, సాహితీరంగంలో ప్రతిబింబిస్తున్న సామాజిక జీవితంలోని క్రమక్రమంగా పరిణామం చెందుతున్న విలువలు. ఈ పరిశీలన ద్వారా సాహిత్యంసాంఘిక ప్రయోజనం కోసమే అన్న సిద్ధాంతం మూల స్వరూపాన్ని నిర్దుష్టంగా వ్యాఖ్యానించవచ్చు

ఆధునిక సాహితీరంగం, వచన యుగ ప్రభావంలోపడి రచనా రీతుల్లో నూత్న ప్రయోగాలు విలసిల్లడానికి దోహదంచేసింది. పద్య కవిత స్థానే వచనకవిత స్థిరనివాసం చేసుకున్నది. శ్రీ శ్రీ అడుగుజాడల్లో వెలువడిన అనేక కవులు వచనకవితా పట్టాభిషేక మహోత్సవాలలో ప్రముఖంగా పాల్గొన్నారు. ప్రాచీన ప్రబంధ రచనా ధోరణిని దాసిగా చేసుకుని శ్రీ శ్రీ తన కవితా నూత్న ప్రయోగాలు అందిస్తే, కాలం మార్చిన నేటి రీతుల్లో పద్య కవితా వాసన ఎరుగని ఉత్సాహవంతులందరూ వచన రచనా కవితారీతిని ఆరాధిస్తున్నారు. గ్రామ్య భాష. వ్యావహారిక రీతి - నేటి యుగంలో ప్రతి సాహితీ పిపాస కల్గిన వానికి సునాయాస లబ్ధసింహాసనాలు. విచ్చలవిడిగా కవిత ప్రవహిస్తోంది. వచన రచనలో-అదేవిధంగా ఇతర సాహితీ ప్రక్రియలు. కథ, నవల, నాటిక ధారాళంగా సాగుతున్నాయి. కవితా చమత్కృతి, పాత్ర చిత్రణ, కల్పనాశక్తి, ఇతివృత్త వైవిధ్యం మొదలగు వాటిలో పాండిత్యం శూన్యమయినా, ఆధునిక రచనా రీతులలో భావంలోను, భాషలోను, ఆశావాదం నెపంతో యువ రచయితలు పుష్కల సమాజం వాడుకుంటోంది. చింతామణి, కన్యాశుల్కం, మొదలైన నాటకాలు ప్రజల్లో సృష్టించిన సమాజచైతన్యం, చంద్రగుప్త, ప్రతాపరుద్రీయం, అందిచ్చిన చారిత్రక కల్పనాప్రతిభ, నేటి నాటకరంగంలో కనిపించటంలేదు. నాటక బృందాల సంతుష్టికి, సంస్థల నిర్వహణాకార్యక్రమాలకు మాత్రమే మొక్కుబడులుగా నాటకాలు ప్రదర్శించబడుతున్నాయి. రాజకీయ సంశ్లిష్ట దుర్గంధ వాతావరణం నేటి సమాజంలో చొచ్చుకుపోయి, నిజమైన సాహితీ విలువలను గుర్తించి, మారుతున్న సాహితీ విలువలకు పట్టముకట్టే ప్రభుత్వం యింకా రానందున, విషయం విషాదకరంగా వుంది.

ఇక ఈ సాహితీరంగంలో సమాజంలోని మారుతున్న విలువలు ఏ విధంగా ప్రతిబింబిస్తున్నాయి : చూద్దాం - ప్రబంధకాలంనాటి వ్యక్తి విలువలకు నేటి వ్యక్తి విలువలకు చిత్రణలో వ్యత్యాసం చాలావుంది. ఒక పాత్ర ఎన్నుకున్నప్పుడు రాజువంటి పాత్రకు

నిత్య విశేషణ సముదాయం వెన్నంటిందే కాని, ఆ పాత్రలోని నిమ్నత వెలికిదీయడానికి రచయితల కలం సాహసించలేదు. ప్రజాస్వామ్యం జీవితంలో రాజులు, రారాజులు తొలగిపోయి, సామాన్యులకు సన్నిహితులైన అసామాన్యులవడంవల్ల, మానవునిలో నిబిడీకృతమైన మంచిచెడుల కలయికగా పాత్రలు సృష్టింపబడుతున్నాయి. సమాజం వర్ణవ్యవస్థ ద్వారా సృష్టించిన వైశ్యుల కులం నేటి న్యాయచట్టరీత్యా హరించిపోవడంతో సమాజంలో అంతరాంతల్లో యీ జాడ్యం బీజాలువేసుకుని బ్రతుకున్నందువల్ల గర్హనీయమైన ఆ వృత్తి పదివేల శిరస్సులు కలిగిన పాత్రలను సృష్టిస్తోంది - మునుల ఆశ్రమాల్లో ప్రాచీన సాహిత్యం ద్వారా అలంకార ప్రాయంగా ప్రవేశపెట్టబడిన జింకలు, లేళ్ళు, గుర్రాలు, కుక్కలు, పిల్లులు, నేటి సమాజ వాతావరణంలో మానవ. లక్షణాలు పొదుగుకుని, కథా చిత్రణలో పరిపుష్టమైన భాగాలుగా వర్థిల్లుతున్నాయి. పాశ్చాత్య నాగరికత క్రమక్రమాభివృద్ధి చెందుతున్న శాస్త్రవిజ్ఞానం, సాహితీక్షేత్రంలోని సమాజ విలువలనే మార్చేసింది. కాలం విలువ, మనిషి మానవత, మనస్సు సంశ్లిష్టత - అంతర్భూతమైన రచనలు నేడు విస్తృతంగా సృష్టింపబడుతున్నాయి. అయితే సమాజం నాటికీ నేటికీ ఎంత మారిందన్న ప్రశ్న వేసుకుంటే బహుశా యీ విశాల ప్రపంచగమనం పోలికతో, సహస్రాంశ కూడా కాదేమోనన్న సందేహం మనకు కల్గుతుంది. సమాజంలో స్త్రీ స్వరూపం ఇప్పుడు అన్నివిధాలా బలవత్తరమైన రచనలు సృష్టిస్తున్నారు. వచన కవిత తెలుగు రచనలో క్రొత్తకాదు. చలం వ్రాసినందంతా చాలావరకు వచన కవితయే. ఆడంబర సమాసభూయిష్ట వచన రచనల్లో ప్రాచీన కవులు కవిత చూపలేదూ. అల్లాగే కవిత అని పేరులేకపోయినా వచనంలో కవితపొదిగించిన ఉత్తమ రచయిత చలం ఈ రెండింటికీ మధ్యగా, వచన కవితా స్రష్టలు తమ ప్రయోగాలు పొదుగించి కవిలో నవలికలో, నాటికలో కూడా వచన కవితలు పొదిగారు. కుందుర్తి వ్రాసిన "ఆశ" అనే నాటిక వచన కవితా ధోరణిలో జరిగిన ప్రయోగం. అలాగే అస్మదాదులు కథల్లో వచన కవిత చొప్పించారు. "దిగంబర కవుల" ప్రసక్తి ప్రయోగాత్మక సిద్ధాంతాలకు సన్నిహితం. భావోద్వేగం భాషోధృతం, విరగబడి నడిచే విప్లవ రీతులు ఉన్నాయనుకుని నూత్న ప్రయోగాలుగా అందిచ్చిన వారి కవితలో సమాజంలోని కుళ్ళుగా వాసనాభరితంగా పాఠకుల నాసికలు బ్రద్దలయ్యే రీతి కలం చిందడం కొంత ఎబ్బెట్టుగానే వుంది. పాఠకుల ఆదరణ వచన కవిత మీద మోజు చూపిన మాట వాస్తవమే. కాని, రూపాయిలలో కొలిచిననాడు, పాఠకుడికి కవితమీద మనస్సు తగ్గినదని నిస్సందేహంగా చెప్పవచ్చు. కథ, నవల రూపాలు సమాజంలో, నేడు వేళ్ళు పాతుకు పోయాయి.

పాఠకుల ఆదరణ, ప్రోత్సాహం వీటికి అనుకున్నంత కాకపోయినా, చెప్పుకోదగ్గంతగా వృద్ధిలోకి వస్తోంది. సమాజంలోని విలువలకు నూత్ననిర్వచనాలు జోడించి, కథ రీతుల్లో నవ్యత, మామూల సామాన్యునికి అందుబాటులో లేని సన్నివేశాల చిత్రణ ద్వారా వైచిత్రి - నేటి కథా రచయితలు కొంత వెలికితెచ్చినమాట వాస్తవమే. పాలగుమ్మి పద్మరాజుగారి "గాలివాన" కథలోని పాశ్చాత్య పోకడల ప్రతిబింబంపై గాలివాన

రేగినా, బుచ్చిబాబుగారి నవ్యత నాణాలు కొత్తవిలువలు సంపాదించినా, వాస్తవికత, భారతీయత ఈ యితివృత్తాలలో కృత్రిమ స్వరూపం పొందాయనే, విమర్శలేక పోలేదు. రాచకొండ విశ్వనాథశాస్త్రి, హితశ్రీ, మధురాంతకం రాజారాం, మొదలైన రచయితలు నూత్న ప్రయోగాలు చేస్తున్నా ఆ ప్రయోగాలలో పాత్రవైచిత్రికంటె, వాతావరణ వైచిత్రి తొంగిచూస్తూంటుంది. నాటకాలు, నాటికలు నేటి సమాజ విప్లవానికి దారి తీసే సాహితీ ప్రయోగాలే. కాని వాటిని వినోద ప్రక్రియలుగా నేటిరంగాలలో రూపొందుతోంది. ఒక ప్పుడు స్త్రీ సృష్టికి ముఖ్యం. గృహంలో పునాది అనుకోబడినా, నేడు స్త్రీ రాజకీయంలోకి చొరబడి, మానవ విలువలు పూర్తిగా మార్చేసింది. రాజకీయంగా సమాజరంగానికి మూల కందం. అది నేడు అందని విభాగంలేదు. సమాజంలోని అన్ని విభాగాలలో స్త్రీ రాజ కీయం ద్వారా బలవత్తరమైన ముద్రవేసుకుని పురోగమిస్తున్న ధ్వని కలిగిస్తోంది. సమా జంలోని స్త్రీ పాత్రలోని ఉద్వేగానికి ప్రతిబింబంగా, నేటిసాహితీరంగంలో స్త్రీ రచయి త్రిగా కూడా ప్రత్యేక స్థానం సంపాదించు కుంటోంది.

సమాజం, నాగరికత, శాస్త్ర విజ్ఞానం, మానవత - యివి చాలా పెద్ద పదాలు. అర్థంచేసుకోవాలంటే అనంత రూపాలు. ఈ చతురస్రంలో నేటి సాహిత్యం పొదగబడు తోంది. ఇందులోంచి వచ్చే వివిధ కెరటాలకు సిద్ధాంతాల రూపాల నిర్వచనాలు విమర్శ కులు అందిస్తున్నారు.

మారుతున్న సమాజ విలువలతో, సాహితీ ప్రక్రియలతో నేటి సాహిత్యంగణ నీయమైన పురోభివృద్ధి సాధించిందా అంటే సందేహాస్పదం. కాలం మార్పులో సాహితీ ప్రతిభకంటే సాహితీప్రతిభ ద్వారా లభించే భౌతిక ఫలితాలు ముఖ్యమై పోయాయి రచ యితలకు. విశ్వజనీన దృష్టితో వ్రాశామనే రచనలకు, వెనుకవున్న ఆర్థిక విధానాలు మానవుని రచనా వ్యుత్పత్తికి సంకుచిత మాపాదిస్తోంది. కలకాలంనిలిచే రచనలు నేటి యుగంలో బహు కొద్దికాలం మాత్రమే చదివి ఆనందించే రచనా వ్యాసంగానికి ఆదరణ అందిస్తోంది. ఉద్గ్రంథాలు. విమర్శాగ్రంథాలు, నిఘంటువులు, వ్యాఖ్యానాలు, గ్రంథ సముదాయంగా, పెరుగు తున్న జనాభా లెక్కలకు పారితోషకంగా వస్తున్నాయే కాని, మానససంతృప్తికి, మనో పరిణామదశకు ఉపకరించటంలేదు. బ్రతుకు భారమై ఆర్థిక ప్రవృత్తి సాహితీ ప్రతిభలో చీడపురుగులా చొచ్చుకుని దొలుస్తోంది. విప్లవంలేనిచో చీడ పురుగులు దొలిచిన రక్తనాళాలలో తిరిగి రక్తస్రావం నదీవరదల్లా పారదు - అయితే ఆ కాలంకోసం వేచి చూడాలి !!

# మారుతున్న విలువలు - రచయిత

**శ్రీ శీలావీర్రాజు**

సమకాలీన జీవితాన్ని అద్దంపట్టి చూపలేని ఏ సాహిత్యానికైనా ఆధునికకాలంలో నిలిచే అర్హతలేదు. పాతకాలపు నాణెం ఎలా చెలామణీకి పనికిరాదో యిదీ అంతే. ఒక్క చారిత్రక ప్రాధాన్యత తప్ప మరో ప్రయోజనం లేదు. పాతకాలపునాణెం ప్రభుత్వ ఖజానాల్లోనే గాని ప్రజలమధ్య చెల్లుబడి కానట్టే సమకాలీన జీవితాన్ని చూపలేని సాహిత్యం కూడా ఏ కొద్దిమందో ఉలివికట్టెదార్ల మధ్యతప్ప ప్రజలమధ్య చలామణీకి పనికిరాదు.

ఆధునిక కాలంలో ప్రపంచంఅంతటా సామాజిక విలువలు మారినతర్వాత సమాజానికీ, సాహిత్యానికీ సన్నిహిత సంబంధం ఏర్పడింది. వ్యక్తి విలువలకన్న సామాజిక విలువలు ముఖ్యమైనవన్న కొత్త సిద్ధాంతంతో సరికొత్తశకం ఆవిర్భవించడంతో కళ కళకొరకే నన్న రంగెలిసిపోయిన పాతకాలపు మడిబట్ట వాదనపోయి కళ సమాజం కొరకనే కొత్తవాదం బయలుదేరింది. సాహిత్యం యీ కళల్లో ఒకటి గనుకా, అన్ని కళల్లోకీ సాహిత్యమే ఎక్కువగా సమాజాన్ని ప్రభావితం చేయగల ముఖ్యమైన కళ గనుకా, సాహిత్యం తప్పనిసరిగా సమకాలీన దృక్పథాన్ని కలిగివుండాల్సినదైంది. ఇది ఆధునికయుగ లక్షణం. అందువల్ల సామాజిక జీవితంలో మార్పు వచ్చినప్పుడల్లా ఆ మార్పులు సాహిత్యంలోనూ విధిగా ప్రతిబింబించక తప్పదు.

అయితే యిప్పటికీ యీ మారిన విలువల్ని గుర్తించక రచనల పేరుతో వందల కొద్దీ పేజీలతో అబద్ధపుచరిత్రల్నీ, కుళ్ళగబ్బుకంపుకొట్టే కులవ్యవస్థనీ, ఫ్యూడలిజం మనస్తత్వాన్నీ చొప్పించి కాలానికి ఎదురీదాలనుకునేవారు లేకపోలేదు. ఇంకా మనం సంధికాలంలోనే వున్నాం. అందువల్ల యిటువంటి తిరోగమన నినాదాలు అక్కడక్కడా వినిపించక తప్పదు.

నిజానికి మనకు రాజకీయ చైతన్యంగానీ, సాంఘికచైతన్యంగానీ అంతగా రాలేదు. "గతకాలము మేలువచ్చు కాలముకంటెన్" అనేపిచ్చి నమ్మకాన్ని వదులుకోలేని మూఢత్వంలో వున్నాం. అందుకే మనలో నరనరానికి జీర్ణించుకుపోయిన మూఢాచారాల్ని, మారిన కాలంతోపాటు వదులుకోలేక, అవి మన ఉత్కృష్టసంప్రదాయాలుగా, మన సాంస్కృతిక విలువలుగా నచ్చచెప్పుకోడానికి ప్రయత్నిస్తున్నాం. రాచరికాలు నశించి ప్రజాస్వామ్యాలు ప్రపంచమంతా తలెత్తినా, జమీందారీ విధానాన్ని రద్దుపరచి సోషలిజం స్థాపించుకోడానికి ప్రయత్నిస్తున్నా యింకా మనం ఆ పాత వ్యవస్థలంటేనే మోజు చూపిస్తున్నామనడానికి యీనాడు కుప్పతిప్పలుగా వస్తోన్న, మనం గొర్రెల మందల్లా ఎగబడి చూస్తోన్న జానపదసినిమాలే తార్కాణం. సాంఘికచిత్రాల్లో సైతం గ్రామీణ యితివృత్తం

గల చిత్రాల్లో విధిగా జమిందారు వుండి తీరతాడు: జమీందారీ వ్యవస్థని కూలదోసినా యింకా ఆ వ్యవస్థమీద మోజు పోలేదు మనకు.

మనలో కనీసం రాజకీయ చైతన్యం వచ్చినంతగానన్నా సాంఘిక చైతన్యం రాలేదు. ఈనాడు జమీందారీ వ్యవస్థనుగానీ, రాచరిక వ్యవస్థనుగానీ తిరిగి ప్రతిష్ఠించడానికి ఏ రాజకీయవేత్తయినా ప్రయత్నిస్తే ఎంతమాత్రం అతన్ని క్షమించడంలేదు. అలాటి వారిని కారాగారానికి పంపించడానికీ, లేదా దేశంనించి బహిష్కరించడానికి ఏ మాత్రం వెనుకంజ వెయ్యడంలేదు. కాని, సంఘాన్ని మళ్ళీ పాతకాలపు వ్యవస్థలోకి తీసుకుపోవటానికి ఉద్యమంలాగ రచనలుచేసే రచయితల్నీ, కవుల్నీ ఏమీ చేయలేకపోతున్నాం. పైపెచ్చు వారికి జనకూటాల్ని ఏర్పాటు చేసి బిరుదుల్నీ బహుమతుల్నీ ప్రసాదిస్తున్నాం.

మన ఆలోచనల్లో మార్పురాక, మన అభిరుచుల్లో మార్పులేక మేడిపళ్ళలా బ్రతుకుతున్నంత కాలం మన సాహిత్యంలో మాత్రం మార్పెలా వస్తుంది?

అందుకే ఈ నాటి మన రచనల్లో ఎక్కువ వాటిలో మారుతున్న విలువలు ప్రతిబింబించడం లేదు. తెలుగు రచనలు సమకాలీన జీవితాన్ని చూస్తున్నాయనుకోవడం పొరపాటు. మనవి కేవలం సాంసారిక రచనలు. వంటింటి పోపు వాసనలతోనూ, పడకటింటి ముక్కవాసనలతోనూ నిండిన రచనలు. పైగా మన వంటిళ్ళూ మన పడకటిళ్ళూ ఎలా యిరుగ్గా వున్నాయో మన ఆలోచనలూ, మన సాహిత్యమూ అంతే యిరుగ్గావున్నాయి. కొత్తగాలులు వీస్తే మైలపడిపోతామనే వారసత్వపు ఛాందస భావాలనుంచి పూర్తిగా మనం విముక్తులం కాలేకపోయాం. సరైన గాలీ వెలుతురూ లేనప్పుడు మొక్కలు పాలిపోక తప్పదు. మన ఆలోచనలూ అంతే. ఈ పాలిపోయిన ఆలోచనలవల్ల ఆరోగ్యవంతమైన సాహితీ కుసుమాలు పుష్పించడానికి ఆస్కారంలేదు.

రచనల్లో సమకాలీన సమాజం ప్రతిబింబించడంతోనే సరిపోదు అది సమాజాన్ని ముందుకు తీసుకుపోయేదిగా వుండాలి. సామాజికమైన స్పృహ, ప్రగతి దృక్పథం వుండాలి. సమకాలీన సమాజంలో తిరుపతి దేవుడికీ, రకరకాల బాబాలకి ప్రజల్లో పలుకుబడి వున్నంత మాత్రంచేత వాళ్ళ చరిత్రల్నీ, వాళ్ళ భక్తుల చరిత్రల్నీ అశాస్త్రీయమైన అసంగతమైన మహత్వ గాథల్నీ చొప్పిస్తూ రాసే రచనలు నిజానికి సామాజిక దృక్పథంగల రచనలు కాలేవు. శాస్త్రవిజ్ఞానం అభివృద్ధి చెందింది. మానవశక్తిమీద విశ్వాసం పెరిగింది. సమాజం మారి, విలువలు మారాయి. ఈ మారిన విలువలను సాహిత్యంలో చూపక తప్పదు. వాటిని ప్రచారం చేసినా చెయ్యకపోయినా కనీసం యీ విలువల్ని గుర్తిస్తేచాలు. మన రచనలు సమాజాన్ని ముందుకు నడిపించడం అవసరం, నడిపించకపోయినా కనీసం దాన్ని వెనక్కు తిప్పేవిగా మాత్రం వుండకూడదు.

నిజానికి సాహిత్యం ఎప్పుడూ ఏకముఖంగా అభివృద్ధి చెందదు. రెండు శాఖలుగా విస్తరిస్తుంది. ఒకటి - ప్రగతి శీలము. రెండు - ప్రయోగశీలము. ప్రగతివాదంతో పాటు ప్రయోగవాదంకూడా వున్నప్పుడే సాహిత్యం సుసంపన్న మౌతుంది. ప్రయోగాలు

జరక్కుండా ఏ భాషా సాహిత్యమూ అభివృద్ధి చెందలేదు. ఒక్క ప్రగతి వాద రచనలే సమాజానికి కావాలనుకుంటే పద్యాల్లో నవలల్ని కావ్యాలుగా రాసుకోవచ్చు. గ్రాంధిక భాషలో అభ్యుదయ సామాజిక విలువల్ని ప్రకటించుకోవచ్చు. గురజాడ వంటివారూ, గిడుగులాటివారూ వ్యావహారిక భాషకై ఉద్యమాలను నడిపించవలసిన అవసరం లేదు. ప్రజలు మాట్లాడేభాషలో, ప్రజలకు సన్నిహితమైన భాషలో సాహిత్యాన్ని రూపొందించ డానికి జీవితాల్ని ధారపోయనవసరం లేదు. భాషకూడా ఎప్పుడూ ఒక్కలాగే వుండి పోదు. కాలంతోపాటు అదీ మారుతూవుంటుంది. ప్రయోగాలు అందుకు తోడ్పడుతాయి.

అందుకే సాహిత్యంలో ప్రగతి దృక్పథంతోపాటు ప్రయోగ దృక్పథమూ వుండాలి. అయితే ప్రయోగాల పేరుతో సమాజానికి దూరంగా ఎగిరిపోవడంగానీ, అభ్యు దయ నిరోధక ధోరణులను ప్రకటించడంగానీ ఎంతమాత్రం కూడదు. ఒక రచన - అది ప్రగతిశీలమైనా, ప్రయోగశీలమైనా - అది తప్పని సరిగా అభ్యుదయ దృక్పథం కలిగివుండాలి.

అయితే అభ్యుదయదృక్పథం పేరుతో కేవలం కొన్ని సిద్ధాంతాల మేనిఫెస్టోగానో, ప్రచారసాహిత్యంగానో వుండిపోగూడదు. సామాజిక విలువలతోపాటు సాహిత్యపు విలు వల్ని కూడా చూపించగలగాలి. ఎంత అభ్యుదయదృక్పథం కలిగివున్నా సాహిత్యపు విలువలు లేకపోతే అది సాహిత్య ప్రక్రియగా చలామణి కాలేదు. కుటుంబనియంత్రణ మీదా, పొదుపుమీదా రేడియోలో పుంఖాను పుంఖంగా వచ్చే రచనలు ఉత్తమసాహిత్యంగా మనం ఎలా గుర్తించడంలేదో వీటి విషయంలోనూ అంతే. రచయిత ప్రవక్తకాడు, రాజ కీయవేత్తాకాడు. అతను ప్రధానంగా సాహితీవేత్త. ఆ విషయాన్ని మర్చిపోకుండా అతను ప్రవక్తలాగా, రాజకీయవేత్తలాగా ప్రవర్తించినా ఫరవాలేదు.

ప్రయోగదృక్పథం, ప్రగతిదృక్పథంగల రచనల్ని సృష్టించే విషయంలో రచ యితలకన్న కవులు చాలా ముందుకుపోగలిగారు. కవిత్వంలో వచ్చినంత వికాసం వచనంలో రాలేదు. వస్తువులో, శిల్పంలో కవిత్వం చాలా ముందుకు పోగలిగింది. తన బాధను లోకంమీద రుద్దే భావకవిత నాటి స్వంత గోడువల్ల సమాజాన్ని ముందుకు నడిపించలేమని తెలుసుకున్న కవులు అభ్యుదయ కవిత్వాన్ని సృష్టించి లోకం బాధని తమ బాధగా చేసుకున్నారు. ఫ్యూడలిజం మనస్తత్వపు భావ కవిత్వంనించి సోషలిజం దృష్టిగల అభ్యుదయ కవిత్వం తెలుగులో ఆవిర్భవించి సమకాలీన సమాజాన్ని చూపించ డమే గాక భవిష్యత్ సమాజ స్వరూపాన్ని కవులు నిర్దేసిస్తూవున్న రోజుల్లో, రచయితలు వంటగదులచుట్టూ, దేవుళ్ళచుట్టూ ప్రదక్షిణాలు చేస్తున్నారు. భావకవిత్వం నుంచి అభ్యు దయకవిత్వంలోకి కవిత్వం మారినప్పటి భావవిప్లవంగాని, శిల్ప విప్లవంగాని వచన రచనలో రాలేదు. ప్రయోగవాదంతోనూ, ప్రగతి వాదంతోనూ కవిత్వం శాఖోపశాఖలుగా విస్తరిల్లినది. ప్రయోగపరంగా, అభ్యుదయకవిత్వం తర్వాత వచనకవిత ఆవిర్భవించి బహుముఖాలుగా విస్తరించింది. ప్రగతిపరంగా, వర్గరహిత సమ సమాజ స్థాపనకు ప్రపంచ మేధావుల ఆలోచనల్లో వచ్చిన అత్యాధునిక ఆలోచనా ధోరణులు ఎప్పటి

కప్పుడు కవిత్వంలో ప్రవేశిస్తున్నాయి. ఇంతవిప్లవం కవిత్వంలో వస్తూవుంటే వచనంలో ప్రగతి దృక్పథంకాదుగదా, ప్రయోగదృక్పథంకూడా అంతగా కనిపించడంలేదు.

తెలుగువచనంలో యిరవయ్యేళ్ళకిందటే కొద్దోగొప్పో ప్రయోగాలు జరిగాయి. చలం, బుచ్చిబాబు, విశ్వనాథశాస్త్రి, గోపీచంద్‌లు ఒక్కొక్కరూ ఒక్కొక్క ధోరణిలో ప్రయోగాలు చేశారు. వర్ణనలో, మనస్తత్వచిత్రణలో తాత్విక చింతనలో మేలైన రచనలు సృష్టించారు. సామాజిక దృక్పథం గల రచనలుకూడా ఆనాడే ఎక్కువగా వచ్చాయి. చలం, విశ్వనాథశాస్త్రి, కుటుంబరావులు సంఘంలోని అన్యాయాలమీద తిరుగుబాటును ప్రకటించారు ఆనాడు కనిపించిన ప్రయోగం, సామాజిక దృష్టి యీనాడు మనకథల్లో, నవలల్లో కనపించడంలేదు. రెండు దశాబ్దాల కాలంలో తెలుగు కవిత ఎంతో అభివృద్ధి చెందగా తెలుగు నవల, తెలుగు కథ ఎందుకు అభివృద్ధి చెందలేకపోయాయి? ఈనాడు తెలుగు నవల, తెలుగుకథ పూర్వంకన్న ఎక్కువ ప్రాచుర్యం పొందాయి. చదివేవాళ్ళు పెరిగారు. రాసేవాళ్ళు పెరిగారు. కథలసంఖ్య, నవలల సంఖ్య పెరిగాయి. ఈ పెరుగుదలలు కనీ వినీ ఎరుగనంత ఎక్కువగా వున్నాయి. కాని మారుతున్న విలువలను ప్రతిబింబించే రచనలు వీటిలో వేళ్ళమీద లెక్కపెట్టే సంఖ్యలోమాత్రమే వున్నాయి. బహు కొద్దిమంది రచయితలే మారుతున్న ఈనాటి విలువల్ని సాహిత్యంతో చూపించే ప్రయత్నం చేస్తున్నారు. వీరైనా రాజకీయ విషయాలకు యిస్తున్నంత ప్రాధాన్యతను సాంఘిక విషయాలకు యివ్వడంలేదు. నిజానికి రాజకీయ వ్యవస్థలో మార్పులు తెచ్చి తద్వారా సమాజంలో మార్పులు తేవడానికి ప్రయత్నించేవాడు—రాజకీయవేత్త. సామాజికమైన మార్పుల్నితెచ్చి వాటి ఆధారంతో రాజకీయవ్యవస్థలో మార్పులు రప్పించేవాడు-రచయిత, ఈ ఇద్దరికీ ఎంతో తేడా వుంది మరి. ఆ విషయాన్ని మర్చిపోతే ఎలా?

సామాజికమైనమార్పుల్నితీసుకురావడం అనేది చాలా బాధ్యతో కూడుకున్నపని ఎంతోశ్రమతో కూడినదికూడా. రచనావ్యాసంగాన్ని సీరియస్‌గా తీసుకుంటేనేగాని యిది సాధ్యంకాదు. దీనికి ఎంతో అనుభవమూ, విజ్ఞానము, అవగాహన నైపుణ్యం వుండాలి. ఈనాటి చాలామంది రచయితలకు విస్తృతమైన అనుభవాలులేవు పుస్తకాలద్వారానన్నా తెలుసుకొనే ప్రయత్నంలేదు, సమస్యలను గురించిన పరిజ్ఞానంలేదు. నైపుణ్యం అయితే వుంది. అయితే యిదొక్కటివుంటే చాలదు. అప్పర్‌క్లాస్ సొసైటీని చూపించాల్సివచ్చినప్పుడు ఇంపాలాకారూ, పోర్టికోలూ, పచ్చని లాన్‌లూ, ఏరోడ్రోములూ పెట్టేసినంత మాత్రంచేత ఆ వాతావరణం ఏర్పడిపోతుందని భావించేరచయిత ఎంత చక్కగా రచన చేయగలిగినా సరైన అవగాహనతో చేసిన రచనగా అది పరిగణించబడదు. ఆ వర్గం ప్రజల మనస్తత్వ, అలవాట్లు కనిపించాలి అలాటి అవగాహన, పరిశీలన లేకుండా రచనలు చేస్తే అవి అట్టే కాలం నిలవ్వు. కేవలం కాలక్షేపానికి మాత్రమే వుపయోగిస్తాయి.

తెలుగునవల, కథ చేతులుమారి రచయిత్రులహస్తగతమయ్యాక కాలక్షేపం ధోరణి మరీ ఎక్కువయిపోయింది. సాధారణంగా స్త్రీలలో సాహసం తక్కువ. సర్దుకుపోయే మనస్తత్వమేగాని ఎదురు తిరిగే తత్వంకాదు. అందువల్ల సంఘంలోని అన్యాయంమీద

తిరుగుబాటు చేయడానికి వాళ్ళు అంతగా ముందుకురాలేదు. దీనికితోడు ఈనాటి పఠితల్లో అధికసంఖ్యాకులు స్త్రీలే కావడంవల్ల వారిని ఆకర్షించే రచనలకే రచయితలు సయితం మోజు చూపిస్తున్నారు. అందువల్ల కాలక్షేపం రచనలకు గిరాకీ పెరిగింది. సమకాలీన సమస్యలను చిత్రించే రచనలు కొరవడ్డాయి. సామాజికదృష్టి గల రచయిత్రులు ఒకరో, యిద్దరో వున్నా వారి దృష్టి కేవలం స్త్రీస్వేచ్ఛకు, స్త్రీల సమస్యలకు మాత్రమే పరిమితమై పాక్షికదృష్టి అయిపోయింది. వందలకొద్ది సంవత్సరాలుగా స్త్రీని అజ్ఞానంలోనూ, బానిసత్వంలోనూ, తొక్కిపట్టిన పురుషుడి స్వార్థాన్నుంచి స్త్రీలు యిప్పుడిప్పుడే బైటపడుతున్నందువల్ల యీ కాలంలో వచ్చే రచయిత్రుల రచనల్లో యీ మాదిరి పాక్షికదృష్టి వుండడం అసంగత మేమీ కాదు. అయితే యీ దృష్టినుంచి తప్పుకుని ఎంతత్వరగా సమగ్రమైన దృష్టిని ఏర్పరచుకుంటే అంత మంచిది. అప్పుడే వాళ్ళనుంచి సమకాలీన సామాజిక దృక్పథం గల రచనలు వెలువడతాయి

రచయితలు — వారు మగవారైనా, మహిళలైనా - సమకాలీన సమాజాన్నిగూర్చి, సమాజంలో మారిన విలువలనుగూర్చి, మారుతున్న విలువలనుగూర్చి తెలుసుకోవడం చాలా అవసరం. చారిత్రిక, భౌతిక సమస్యల అవగాహనకూడా వారి రచనల్ని శక్తివంతం చేయడానికి తోడ్పడుతుంది. ముందుచూపు అనేది రచయితకు వుండవలసిన ప్రాథమిక లక్షణం. ప్రపంచంతోపాటు ముందుకి నడిచే సత్తా రచయితలకు విధిగా వుండాలి.

శాస్త్ర విజ్ఞానం, సాంకేతిక పరిజ్ఞానం పెరిగి వార్తాపత్రికలు రేడియో, టెలివిజను వంటివి రావడంతో ప్రపంచంలో ఎక్కడ ఏ మార్పు వచ్చినా క్షణాలమీద తెలిసిపోతున్న యీ రోజుల్లో, రచయితల అవసరం లేకుండానే ప్రజలు ఆయా మార్పుల్ని తెలుసుకోగలుగుతున్నారు. తదనుగుణంగా తమని తాము సంస్కరించుకోడానికి ప్రయత్నిస్తున్నారు. అలాంటప్పుడు ఆ మార్పుల్ని రచయితలు గుర్తించక రచనలు చేస్తుంటే వాళ్ళ అజ్ఞానాన్ని చూసి ప్రజలు నవ్వుకుంటారు. వాళ్ళ తెలివితక్కువతనానికి జాలిపడతారు.

ఇలాంటిపరిస్థితి ఏర్పడకుండా వుండడానికే రచయిత ప్రయత్నించాలి. మారుతున్న ప్రపంచంతోపాటు తామూ మారాలి. మారిన విలువలకు అనుగుణంగా తమని తాము సంస్కరించుకోవాలి. వాటిని సాహిత్యంలో చూపించాలి. లేకపోతే తెలుగు రచయిత వెనకబడిపోతాడు. ప్రజలు ముందుకి వెళ్ళిపోతారు. అప్పుడు, యీనాడు వున్న గౌరవంకూడా తెలుగు రచయితకు లభించదు.

# మారుతున్న సాహిత్యం - విమర్శ

శ్రీ సంపత్కుమార

ఈనాడు సాహిత్యంయొక్క పరిధి ఎంతో విస్తృతమైపోయినట్లుగా కనిపిస్తుంది. రకరకాలయిన ప్రక్రియలూ, అంతఃప్రక్రియలూ ఆవిర్భవిస్తున్నవి. ఆ యా ప్రక్రియల్లోనూ, వాటి వాటి కలగలుపుతోనూ నిర్విరామంగా, నిరాక్షేపంగా వెలువడుతున్న రచనలు కోకొల్లలు. ఊహల్లోనూ, అనుభవంలోనూ, ఆలోచనలోనూ, విచారణలోనూ, అభివ్యక్తికి ప్రధాన సాధనమయిన భాషలోనూ, ఇంకా అనేకాంశాల్లోనూ పరిమితస్థాయికి చాలాదూరంగా ఉన్న అనేకమయిన రచనలు ఈనాటి సాహిత్య పరిధిని మరింత విస్తృతంగా భాసింపజేస్తున్నాయి. పలుసందర్భాల్లో, పలురచనలు విషయికంగా 'సాహిత్యం' అన్నపదం నేతిబీరకాయస్థాయికి దిగజారిపోవటం స్పష్టంగా కనిపిస్తూనే ఉన్నది. ఈ స్థితిలో 'సాహిత్యం' గూర్చి తదాసక్తులు గాఢంగా విమర్శించుకోవలసిన అవసరం ఎంతైనా ఉన్నది.

సాహిత్యం సమాజాన్ని ప్రతిబింబిస్తుం దన్నది సహజమైన అంశం. సమాజాన్ని ప్రతిబింబించటమంటే, సామాజికంగా నెలకొన్న ఆశయాలనూ, ఆదర్శాలనూ జీవిత విధానంలో సహజంగా నిష్పన్నమయిన, ప్రధానమయిన విలువలనూ ప్రతిబింబించటమన్నమాట. జీవితం - అది వైయక్తికజీవితం కావచ్చు, సామాజిక జీవితం కావచ్చు - ఎప్పుడూ ఒకే గాడిలో, ఒకే ఒరవడిలో సాగిపోతూ వుంటుం దని చెప్పటానికి వీలులేదు. ఈ వీలులేనితనాన్ని చరిత్ర స్పష్టంగా నిరూపిస్తూనే ఉన్నది. కొన్నేండ్లమీద సామాజిక జీవితవిధానంలోనూ, అది రూపొందించుకున్న విలువల్లోనూ మార్పులు వస్తూఉండటం సహజం. అవి రాజకీయంగా కావచ్చు, ఆర్థికంగా కావచ్చు, నైతికంగా కావచ్చు. లేదా వీటన్నిటి సమాహారంగా కూడా కావచ్చు. ఇంకా అనేక కారణాలవల్ల కావచ్చు వస్తూనే ఉంటాయి. ఒకప్పుడు తెలిసి కొన్ని, తెలియకనే కొన్ని సమాజంలో వ్యాపించి, జీవిత విధానాన్ని ప్రభావితం చేస్తుంటాయి. సామాన్యంగా సమాజంలో ఒక రకంగా పైస్థాయికి చెందిన ఆలోచనాశీలం గల వ్యక్తుల ఆలోచనా విచారణ ధోరణిలో వచ్చే మార్పులు ప్రధానంగా సామాజిక జీవితవిధానంలోనూ, విలువల్లోనూ మార్పిడి జరగటానికి కారణమనవచ్చు. అయితే ఆ యావ్యక్తుల ఆలోచనాధోరణిలోని పరిణతి, అపరిణతి మొదలయిన వాటినిబట్టి వాటిమంచిచెడ్డలు కాలంమీద నిర్ణీతమవుతూ ఉంటాయి.

కాని, ఒకప్పుడు ఒక విచిత్రమయిన పరిస్థితి సమాజంలో ఏర్పడుతూ ఉంటుంది. అప్పటివరకున్న జీవిత విధానమూ, వ్యవస్థా, దాని విలువలూ విచ్ఛిన్నమయిపోతుండగా,

కొత్తజీవిత విధానమూ, వ్యవస్థా, విలువలూ నిర్దిష్టంగా ఏర్పడవు. కొత్తదనం స్ఫురిస్తుంటుంది తప్ప ఇంకా నిలదొక్కుకోదు. రకరకాలయిన విధానాలూ, విలువలూ ప్రవేశిస్తూ ఉంటాయి. ఏవి నిలదొక్కుకొనేవో, ఏవి వాటంతట అవి మాసిపోయేవో స్పష్టంగా నిర్ణయించు కోవటానికి వీలులేని పరిస్థితి సాగుతుంటుంది. ఈనాడు సమాజం సరిగ్గా ఆస్థితిలో కొట్టుమిట్టాడుతున్నది.

సామాజికజీవితం ఈనాడు, తన నిర్ణీతమయిన ఒకానొక పరిధినుంచి హఠాత్తుగా అంచులందనంతటి విశాలమయిన పరిధిలోకి విసిరివేయబడ్డట్టుగా ఉన్నది. కొనమొదళ్లు ఎక్కడా అంతుపట్టటంలేదు. జీవితంలో అనుకోకుండగా, ఒక్కసారిగా తట్టుకోలేనంత వేగం పెరిగింది. ప్రపంచం నాల్గుచెరగులదాకా విస్తరించిన పరస్పర సంబంధాలూ, పరస్పరం ఒకదాన్ని ఒకటి కాదనుకొనే ఏకకాలావిర్భూతమయిన అనేక సిద్ధాంతాలూ, విజ్ఞానశాస్త్రం తెరచిన అనేకమయిన దారులూ, మొదలయిన అనేకకారణాలవల్ల ఆర్థికంగానూ, రాజకీయంగానూ, నైతికంగానూ, కలిగిన ఎన్నో సంక్షోభాలు సామాజిక జీవితాన్ని అస్తవ్యస్తంచేసి వ్యక్తిని ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాయి. ప్రతిదాన్ని సమాజ క్షేమానికీ, భద్రతకూ ఉపయుక్తంగా మలుచుకోవటానికీ, మలుగనిదాన్ని త్రోసి ముందుకు పోవటానికి వీలులేని విధంగా సమాజంలోనే ఏకపక్షంగా ఎదిగిన దుష్టశక్తులు వైయక్తిక స్వార్థానికీ, స్వేతరులను అణగ ద్రొక్కటానికీ ఉపయోగించుకుంటున్నాయి. ఎంతటి పటిష్టవ్యవస్థ అనుకున్నాకూడా దీర్ఘకాలంమీద అది శిథిలంకావటం సహజం. అసలు ఆ వ్యవస్థ ఏ సామాజికసుస్థితికోసంగా నిర్మించుకోబడిందో, ఏ విలువలు జీవిత భద్రతకూ, క్షేమానికీ పాటింపబడినాయో, వాటిల్లోకూడా శైథిల్యం రావచ్చు. అయినా ఆ శైథిల్యానికి మూలకారణాలను తొలగించుకొని మళ్ళీ సుస్థితికి ప్రయత్నించటానికి బదులుగా, మొత్తం సమాజజీవితాన్నే విచ్ఛిన్నం చేయాలనేధోరణి ప్రబలింది. స్వార్థమూ, అహంకారం మొదలయినవి పెచ్చుపెరిగి సమాజాన్ని ఛిన్నాభిన్నంచేసి వెంచినయి. డబ్బుచుట్టూ, అధికారంచుట్టూ అందరిదృష్టి కేంద్రీకృతమవుతున్నది. ప్రతివ్యవస్థలోనూ ఈ రెండింటికి ప్రాధాన్యం ఉండనేఉన్నది. కాని ఈనా డున్నంతగా ఏనాడూ ఉన్నట్లు కనిపించదు. వీటికోసం వ్యక్తిసహజంగా సామాజికవ్యవస్థకు అతిప్రాథమికమూ ప్రధానమూ అయిన నిజాయితీని కోల్పోవటం, పైగా పశుబలాన్ని పయిరెండింటికి ఆసరాగా అందించటమూ జరుగుతున్నది. అవకాశవాదం మితిమీరిపోయింది. ఈస్థితిలో కృత్రిమ మయిన ఆడంబరాలూ, ధనవత్వమూ, నటనా, కాపట్యమూ మొదలయినవే జీవితంలో అనుసరింపదగిన విలువలుగా భ్రాంతికల్గిస్తున్నాయి. ఏదో అలవాటుగా, అలవోకగా. ''సమాజం, సమాజం'' అని గొంతు చించుకోవటమే తప్ప ఏవిధమయిన క్షేమంకర భద్రంకర సువ్యవస్థితికోసంగా, "సమాజం ఆవిర్భవించిందో, పెంపొందిందో, ఆ విధమయిన సమాజంయొక్క రూపురేఖలు ఎక్కడా కనిపించవు. కేవలం అవకాశవాదంతో కొందరిని తమ చెప్పుచేతల్లో ఉంచుకోవడానికి ఒక బూచిని చూపెట్టి భయపెట్టటానికి మాత్రమే సమాజమన్నది ఈనాడు అధికంగా ఉపయుక్తమవుతున్నది.

ఒకవిధంగా చూస్తే, ఈనాడు 'సమాజం' అన్న పేరు కేవలం మనుష్య సమూహస్థితికి మాత్రమే పర్యాయపదం అవుతున్నది.

ఈవిధంగా అతిసంక్లిష్టమూ, సంకీర్ణమూ, అయోమయమూ అయిన జీవితంయొక్క వేగంలో నలిగి, రావిడికీ, దోవిడికీ గురిఅవుతున్నవాళ్ళు చాలామంది. వాళ్లల్లో ఆలోచించ లేనివాళ్లూ, నోరులేనివాళ్లూ పలుమంది. ఎంతో కొంత ఏదో ఒక స్థాయిగానైనా ఆలోచించ గలిగినవాళ్లు మానసికంగా చెప్పరానంత సంక్షోభపడుతున్నారు. ఈ సంక్షోభం నిగ్రహ రహితమైన విచ్ఛేదమూలకమయిన అరాచకానికి దారితీస్తున్నది. ఆవేశంలో, బాధలో అవసరమయ్యీ, కాకుండాకూడా సమస్తాన్నీ సమూలచ్ఛేదం చేయాలన్నంత కసీ, ప్రతీ పతా మితిమీరుతున్నాయి. బాధానుభవంలో ఒరివిడి అధికమై, ఆలోచనలు పరిణతం కానీ యని ఈస్థితి ఉడుకురక్తాన్ని మరింత ఉడుకెత్తించి అయోమయం, గజిబిజీ అయిన దారిలో పరుగెత్తిస్తున్నది.

ఇట్లాంటి ఆధునిక జీవితాన్ని సాహిత్యం ప్రతిబింబిస్తున్నది.

అయితే, కేవలం సమాజపు యథాస్థితిని ప్రతిబింబించటంతో మాత్రమే సాహిత్యం యొక్క ప్రయోజనం తీరిపోయినట్లుకాదు. ఈ ప్రతిఫలనంతో బాటుగా వర్తమాన జీవిత సంక్లిష్టతలోంచి బయటపడి, అతిత్వరితంగా మారుతున్న కృత్రిమమైన విలువలను తొలగించుకొని సువ్యవస్థిత జీవిత విధానానికి క్రొత్తవిలువలను సూచిస్తూ మార్గదర్శనం, భవిష్యద్దర్శనం చేయిస్తూ సమాజక్షేమానికి ప్రయత్నాన్ని వ్యక్తిలో పెంపొందించటం సాహిత్యాని కున్న పరమప్రయోజనం. సాహిత్యాని కున్న ఈ సామాజిక ప్రయోజనం విస్మరింపబడితే, అది సాహిత్యంగా ఏదో గౌరవాదరణీయస్థాయిని పొందదు. పొందవలసిన అవసరంకూడా లేదు. మరి ఈనాటి సాహిత్యంలో ఎంతభాగం ఎంతవరకు ఈ అంశాన్ని సాధించటంలో ముందంజవేస్తున్న దీవి మర్శించి చూచుకోవలసిన అవసరం ఎంతైనా ఉన్నది.

ఈనాడు జీవితంలో ప్రవేశించి, దాన్ని అతిక్లిష్టమూ, సంకీర్ణమూ చేసిన కుత్సిత రాజకీయాలూ, కృత్రిమ మయిన ఆర్థికవిధానమూ, సాహిత్యాన్నికూడా వదిలిపెట్టలేదు. గిరిగీసుకున్న 'వర్గ' మనస్తత్వమూ, ముఠాతత్వమూ, సంకుచితత్వమూ ఇందులోనూ విస్తరించినయి. సైద్ధాంతిక వ్యామోహమూ, అసహనమూ విరివిగా కనిపిస్తున్నాయి. ఏదో వినూత్నమయిన మార్గానికి ప్రవక్తృత్వం వహించాలన్న తొందరపాటూ ఏదో ఉద్యమ ప్రారంభకత్వం సాధించాలన్న ఆత్రమూ, ఈ రెండింటి వ్యామోహమూ ఈనాడు సాహిత్యంలో ప్రవేశించిన 'యువతరం' లో మితిమీరి కనిపిస్తున్నది. ఈ కారణంగా ఏక పక్షతా, ఎదుటి దాన్ని అర్థంచేసుకోలేని బలహీనతా, ఏమాత్రమూ స్వీయేతరాన్ని సహించలేని తీవ్రతా అతిగా కనిపిస్తున్నయి. దీనితో అవగాహనకు ఆస్కారం లేకుండా పోయింది. మరొకవైపు తన స్వాంత్వంతోనూ, నిజాయితీతోనూ సంబంధంలేకుండా కేవలం డబ్బుకోసంగానూ, తాత్కాలిక మయిన కృత్రిమప్రతిష్ఠకోసంగానూ సాహిత్యం రచింపబడటం కూడా సాగుతున్నది. అల్పమయిన స్వార్థాలను సాధించుకోవటంకోసం

సాహిత్యాన్ని ఒక సాధనంగా ఉపయోగించుకోవటం కనిపిస్తున్నది. స్వార్థాలు రకరకాలు.

సంయమనంతో, సహనంతో ప్రస్తుతసంక్లిష్టతను అధిగమించి సామాజిక ప్రయోజనలక్ష్యంగా వెలువడవలసిన సాహిత్యం ఈప్రవృత్తితో సన్నగిల్లిపోతున్నది. ప్రతిదాన్ని కాదని త్రోసివేయటంలోనూ, స్వప్రయోజనాని కుపయోగించుకోవడంలోనూ ఉన్న ఆస్థ, ఏది అవసరమో, ఏది సమాజప్రయోజనకరమో, దాన్ని స్పష్టంగా సూచించటంలో విఫలమవుతున్నది. అపరిణత భావధోరణిలో ఏది తోస్తే దాన్ని 'సాహిత్యం' తొడుగుతో వెలువరించి రచయితగా రూపొందాలన్న మనస్తత్వం పెరిగిపోతున్నది. అందుకని ఏస్థితిలోనూ అవసరమయిన 'విమర్శ' ఈ స్థితిలో మరింతగా అవసరమవుతున్నది.

'విమర్శ' అనగానే కేవలం దోషనిరూపణచేయటం, రచనలను తెగడటం అని మాత్రమే అనుకుంటే, (అనుకోవటానికి ఈనాడు ఆస్కారం లేకపోలేదు) అది విమర్శ పట్ల అన్యాయమే అవుతుంది. సాహిత్యవిమర్శ సాహిత్యం యొక్క ఉద్దీప్తికి ఏనాడూ అత్యవసరంగానే భావించబడింది ఆ భావన ఫలప్రదమయిం దన్న అంశాన్ని 'విమర్శ' చరిత్ర నిరూపిస్తూనే ఉన్నది. కేవలం ఉన్న సుస్థితికి ఉద్దీప్తి కలిగించటం మాత్రమే కాకుండా, సాహిత్యం దారితప్పుతున్నప్పుడు సాహిత్యానికి మార్గదర్శకం కావలసికూడా ఉంటుంది. ఈబాధ్యతను వెనుకటినాళ్ళల్లో విమర్శ నిర్వర్తించిందికూడా. సాహిత్యంలోని గుణదోష వివేచన చేసి, దాని బలుపూ, వాపూ, ఏదెంతో తేల్చి, సామాజికంగా అది ఎంత వరకు ప్రయోజనకరమయిందీ కానిదీ, విమర్శ స్పష్టం చేస్తుంది. అట్లాచేయటం విమర్శ ధర్మం. ఈ విధమయిన ధర్మాన్ని పాటించిన విమర్శ అటు సాహిత్యానికీ ఇటు సాహిత్యంవల్ల ఏదో పొందదగిన ప్రయోజనం గలదనుకొన్న సమాజానికీ చాలా అవసరమూ, ప్రయోజనకరమూ.

మరి ఈనాటి విమర్శ తన ధర్మాన్ని ఎంతవరకు నిర్వహిస్తున్నది అనేదికూడా, సాహిత్యం విషయంలో మాదిరిగానే ఒకప్రశ్న.

విమర్శ విషయంలో ప్రధానమయింది రచన. వైయక్తికమయిన స్నేహసౌహార్దాలకూ, కోపతాపాలకూ అక్కడ ఏమాత్రమూ స్థానంలేదు. అతిప్రాథమికమూ, ప్రధానమూ అయిన ఈ అంశం ఈనాటి విమర్శలో అధికభాగంలో విస్మృతమవుతున్నది. వైయక్తికమయిన ఇష్టానిష్టాలనుబట్టి రచన యొక్క విలువలను పరిశీలించటం ప్రారంభించితే, దానికో దారీ తెన్నూ ఏర్పడటం దుస్సాధ్యమయిన విషయం. ఇష్టమైనరచనను మిన్నెత్తటం, అనిష్టమైనదాన్ని అణగద్రొక్కటం సాహిత్యంలో నల్లబజారు మనస్తత్వాన్ని ప్రదర్శిస్తుంది. జీవితంతో మనిషి నల్లబజారుతో ఎంత సతమత మయిపోతున్నాడో, సాహిత్యంలో ఈస్థితివల్ల రచనకూడా అదే స్థితికి పాల్పడిపోతుంది. విమర్శ అనేది రచనవైపు నుంచి పాఠకునిదృష్టితో ప్రారంభమయి విస్తరించవలసి ఉంటుంది తప్ప, కేవలం 'విమర్శకు'ని వైయక్తికమయిన ఇష్టానిష్టాలనుంచి కాదు ఈ ఇష్టానిష్టాలకు నిర్దిష్టమూ,

నిర్దుష్టమూ అయిన ప్రమాణాలు పలుసందర్భాల్లో ఏర్పడకపోవటం సహజంకాగా, విమర్శ ప్రమాణ రహిత మయిపోతుంది.

విమర్శ విషయంలో ప్రధానంగా గమనించవలసిన అంశాలు రెండు. ఒక రచన సాహిత్యకంగా తన స్థాయిని కలిగి ఉండటానికి ప్రధానమయిన కొన్ని విలువలు – ఇది మొదటిది. రెండవది ఆలోచనలో ప్రతిపాదింపబడిన విషయం. రచన సాహిత్యంగా నిలవటానికి ఎంత వీలున్నది, ఎంతవరకు తగియున్నది అన్న అంశాన్ని నిర్ధారించుకున్న తరువాతకాని రెండవదాన్ని గూర్చి చెప్పటానికి వీలులేదు. ఎందుకంటే, ఆ రచన 'సాహిత్య' పరిధిలో చేరకపోతే అది సాహిత్య విమర్శకు విషయంకాదు. సాహిత్యేతరంలో సాహిత్యవిమర్శ సాగదు. అందువల్ల రచనను సాహిత్యకంగా విలువకట్టిన తరువాత ప్రతిపాదిత విషయంలోని సామంజస్యా-అసామాజస్యాలను గూర్చి ఆలోచించవలసి ఉంటుంది. ఒకప్పుడు ఒక రచన సాహిత్యపు విలువలు కలిగిఉన్నాకూడా, వైషయికంగా అంత ప్రయోజనకరం కాకపోవటమూ, అట్లాగే దీనికి వ్యతిరేకదిశలోనూ ఉండవచ్చు. ఈ రెండింటిలో దేనిప్రతిపత్తి ఎంతో నిరూపించి, విమర్శ రచనను ఒక మొత్తంగా విలువ కట్టవలసి ఉంటుంది. ఈ రెండింటి సమ్యక్సమ్మేళనంలోనే రచన ఉత్తమస్థాయినీ, ప్రయోజనకర స్థాయినీ చేరుకుంటుంది. ఈ దృష్టివదిలి ఏఒక్క అంశాన్నో ఆధారంచేసుకుని మిగతాదాన్ని కాదని రచనను తెగడటమో, పొగడటమో సరైన విమర్శ కాదు.

ఒక రచన సాహిత్యపరిధిలోకి రావటానికి ఆ రచనలో ఉండవలసిన విలువలు రెండు. ఒకటి పరిష్కృతమూ; విషయానుకూలమూ అయిన భాష. రెండవది అభివ్యంజన శిల్పమూ. ఈరెంటి విషయంలో ఏనాడూ ప్రతిపత్తి లేదు. అయితే భాషయొక్క పరిష్కృతినిగూర్చిన భావనలోనూ, శిల్పస్వరూపవిషయంలోనూ విలువలు మారుతూ ఉండవచ్చు. వీటి విషయంలో వైయక్తికమయిన ఇష్టానిష్టాలకు ప్రసక్తిలేదు. అయితే ప్రతిపాదింపబడిన విషయాన్నిగూర్చి కొంత ప్రసక్తి ఉండటానికి అవకాశం ఉన్నది. పలుసిద్ధాంతాల ఆవిర్భావమూ, వాటి సంఘర్షణా కారణంగా అభిప్రాయభేదా లుండటం సహజం. కాని సైద్ధాంతిక వ్యామోహంతో ఏకపక్షంగా విమర్శ సాగితే, రచనకు అన్యాయం జరిగినట్టే. ఈ సైద్ధాంతిక వ్యామోహం ఒకప్పుడు ఏ స్థాయికి పోతుందంటే, రచనలోని మిగిలిన అంశాలను గూర్చి ఏమాత్రమూ ఆలోచన చేయని స్థితికి పోతుంది. అప్పుడు విమర్శ తన ధర్మాన్ని నిర్వహించినట్టు కాదు. పాక్షికమవుతుంది. దీనివల్ల ప్రయోజనం లేకపోవటమే కాక, అవాంఛనీయమైన చెడుకూడా కలుగుతుంది.

మారుతున్న జీవితవిధానంలోని విలువలు, వాటిని బట్టి సాహిత్యపు విలువలు, తద్వారా విమర్శ ప్రమాణాలూ మారుతూనే ఉంటాయి కాని, సహజమయిన సాహిత్య ధర్మంగానీ విమర్శధర్మంగానీ మారదు. అయితే ఈనాటి విమర్శ పలుచోట్ల ధర్మచ్యుత మయిపోతున్నది. ఆశ్రయింపులూ, దాక్షిణ్యాలు అధికమయిపోతున్నయి. ప్రధానమయిన రచనను వదిలిపెట్టి, వ్యక్తిని లక్ష్యంచేసుకోవటం జరుగుతున్నది. ఈ కారణంగా సాహిత్యానికి 'విమర్శ' ఏకపక్షంగానే మారుతున్నది. మరొక విచిత్రమూ, అవాంఛనీయమూ

అయిన విషయం ఏమిటంటే, వ్యక్తిని లక్ష్యంగా చేస్తున్న విమర్శ, వర్గాలమార్పిడితో, లేదా దాని ఆపోహతో తన స్వరూపాన్నికూడా మార్చుకుని జీవితంలోని దుష్ప్రవృత్తుల మాదిరి గానే విశృంఖలంగా ప్రవర్తిస్తున్నది. హుందాతనాన్నీ, నిష్పాక్షికతనూ, నిజాయితీనీ, ఋజుత్వాన్నీ పాటించవలసిన విమర్శ వాటినుంచి దూరమై బజార్న పడిపోతున్నది. నిర్భయత్వం పేరిట నింద తాండవిస్తున్నది. ఈ రకమయిన 'విమర్శ' యొక్క అస్తిత్వాన్నే శంకించగల ప్రమాదానికి దారితీస్తున్నది.

ఈ విధమయిన కాలుష్యం ఇట్లా ఉండగా, సరయిన విమర్శ తనస్వశక్తితో అక్కడక్కడా ముందుకు సాగుతూనే ఉన్నది. అయితే విమర్శను సహించే ఓర్పు తగ్గి పోతున్నది. ఈ అసహనం విమర్శను ఒకప్పుడు బందీని చేసివేసే ప్రమాదమూ కలిగిస్తున్నది.

మరి ఈ స్థితిలో సాహిత్యానికి, దాని విమర్శకూ భవిష్యత్తు శంకాస్పదంగా ఉండగా, సరయినరీతిని నెలకొల్పుకొని సాగించవలసిన బాధ్యత సాహిత్యకుల, విమర్శకులమీద ఈనాడు అధికంగా ఉన్నది. ఈనాటి సంక్లిష్ట సంకీర్ణ జీవితంలోని కుళ్ళును సాహిత్యం లోకీ, విమర్శలోకీ తెచ్చుకొని పరీక్షించుకోవటం ఈ రెంటికీ మంచి నేమాత్రమూ కలిగించదు. మార్గదర్శకం కావలసినవే దారితప్పి గజిబిజిని సృష్టిస్తే నిజానికి సమాజానికి ఈ రెండింటివల్ల ప్రయోజనంలేదు. సామాజికప్రయోజనం లేనప్పుడు ఈ రెంటికీ భవిష్యత్తు లేదు. భవిష్యత్తును ఉజ్జ్వలం చేసుకోవటానికి ప్రయత్నించటం వాటి అస్తిత్వానికి ఈనాడు చాలా అవసరం.

*

"కవిత్వం అంతరాంతర జ్యోతిస్సీమల్ని బహిర్గతం చెయ్యాలి
విస్తరించాలి చైతన్య పరిధి
అగ్ని జల్లినా అమృతం కురిసినా
అందం ఆనందం దాని పరమావధి."

—తిలక్.

# మారుతున్న విలువలు - విమర్శ

డా. జి. వి. సుబ్రహ్మణ్యం

నేటి ప్రపంచసమాజం వడివడిగా మారిపోతున్నది. దానితోపాటు దాని దృక్పథాలూ, అభిరుచులు కూడ శరవేగంతో మారిపోతున్నవి. సమాజాన్ని అనుసరించి ప్రపంచ సాహిత్యాల్లోకూడ ఎన్నో నూతనప్రయోగాలూ నవ్యప్రక్రియలూ, తలయెత్తుతూ నిత్య నూతనత్వాన్ని భజిస్తున్నవి.

నేటి రచయిత తా నేదేశంలో ఉన్నా, ఏ వ్యవస్థలో ఉన్నా ప్రపంచమానవకోటిలో ఒక సభ్యుడుగా, ప్రపంచ పరిణామాలకు హేతుభూతుడైన వ్యక్తిగా, నవ్యసమాజంలో ఒక భాగస్వామిగా భావిస్తున్నాడు. కాబట్టి అతని సాహిత్య సృజన వ్యాపారంలో ప్రపంచ పరిణామచ్ఛాయలు ప్రతిబింబింపక తప్పదు. అతడు తనభావంలోను, భావనలోను, ప్రక్రియలోను ప్రయోగంలోను నిత్యనూతనత్వాన్ని లోకానికి అందించటానికి యత్నిస్తున్నాడు. దానితో ప్రాత పద్ధతుల విలువలు మారటం, మారురూపు తాల్చటం, కొంగ్రొత్త పద్ధతులకు విలువలు హెచ్చటం జరుగుతున్నది.

ప్రపంచపరిణామానికి ముఖ్యహేతువు విజ్ఞానశాస్త్రం. విజ్ఞానశాస్త్రం ఆచుంబితమైన మహోన్నతాలను అందుకోవాలనీ, అగాధమైన లోతులను కొలిచిచూడాలనీ, అజ్ఞాతమైన రహస్యాలను వెలికితీయాలనీ కృషిచేస్తున్నది. ప్రకృతి శక్తులను విశ్లేషించి అద్భుతమైన శక్తులను ఉత్పాదిస్తున్నది, ప్రయోగిస్తున్నది. అందువల్ల ప్రపంచసమాజం విజ్ఞానశాస్త్ర సహాయంతో అద్భుతావహములైన అనుభూతులనూ, అపూర్వమైన శక్తులనూ నిత్యజీవితంలో పొందగలుగుతూ ఉన్నది. అందువల్ల నేటి రచయితకూడా అబ్బురపాటు కల్గించే నూతన ప్రక్రియా ప్రయోగాన్ని కాంక్షిస్తున్నాడు; శక్తివంతమైన పలుకుపడిని చేపట్టుతున్నాడు.

నేటి విజ్ఞానశాస్త్రం ప్రపంచానికి భౌతికమైన ప్రగతితోపాటు, శాంతి పరిరక్షణను గూర్చిన భయాందోళనలను కూడా ప్రసాదిస్తున్నది. విజ్ఞానశాస్త్రం రాజనీతిచే శాసింపబడటంతో ప్రపంచంలో సంఘర్షణ ఉత్పన్నమౌతున్నది. దీని ప్రభావం రచయితభావం మీద బలంగా ముద్రించుకొంటున్నది. శాంతికి దూరమౌతున్న సమాజం ప్రశాంత చిత్తవృత్తితో బ్రతుకలేకపోతున్నది. అందువల్ల రచయిత కూడా సాహిత్యసృజన వ్యాపారంలో సమాధిని పొందలేకపోతున్నాడు. సాహిత్య పరమ ప్రయోజనాన్ని దర్శించే సావకాశం అతనికి దొరకకుండా పోతున్నది. ప్రపంచపరిణామవేగాన్నిచూచి అబ్బురపాటు చెంది, ఆవేశంతో దాన్ని సమీక్షిస్తున్నాడు. పరుగెత్తుతున్న కాలం కన్నా ముందు

పరుగెత్తుదా మని అంగలుపంగలు వేస్తున్నాడు. ఇరుకైనదుస్తులు వేసుకొని, సాగిపోతున్న రైలుబండిని అందుకొనటానికి పరుగెత్తే ప్రయాణికుడికి పెట్టే బేడా బరువైనట్లే ప్రగతి శీలుడైన రచయితకు గతం, సంప్రదాయం భారంగా తోస్తున్నది. నేటి రచయితకు తానెక్కదలచుకున్న రైలుబండి అందకపోతే ఒక జీవితకాలం వృథా అయిపోయిన ట్లను కుంటాడు. రేపు వచ్చే క్రొత్త బండిలోని ప్రయాణికు లతణ్ణి ప్రాత మనిషిగా వెక్కిరిస్తారు. కాబట్టి రైలుబండిలో చోటు లేకపోయినా చువ్వలు పట్టుకొని వ్రేలాడుతూనైనా తన ప్రయాణం సాగిస్తున్నాడు. రైలుబండి పుట్‌బోర్డు మీద నిలుచున్నవారికి కుదుపు ఎక్కువైనా కాలంతోపాటు తామూ నడుస్తున్న ట్లనిపిస్తుంది. లోపల కూర్చున్న వారికి రైలు కదులుతున్న దని తెలుసుగాని, తాము కదులుతున్నట్లని పించదు. లోపల ఉక్కిరి బిక్కిరౌతున్నా బైటికివచ్చే అవకాశంకూడా లేకుండా పోతున్నది. ఇంక పక్కలు పరిచి గుర్రుపెట్టి నిద్రపోతున్న ప్రయాణికులకు రైలు ఆగింది తెలియదు; పోతున్నదీ అంతు పట్టదు. అసలు రైలుబండిలోనే మూడు తరగతులు. వాటిని కాదని జనతా రైళ్ళను ఎక్కినా అందులోని మూడవతరగతిలోనే మూడుతరగతులు ఉన్నవి.

నేటి ప్రపంచసమాజాన్ని తీర్చిదిద్దుతున్న మరొకశక్తి రాజకీయవ్యవస్థ. మానవాళికి ప్రజాస్వామ్యం ఉత్తమమైన వ్యవస్థగా పరిగణింపబడుతున్నా, కాపిటలిజం, కమ్యూనిజం, నియంతృత్వం - ఈ వ్యవస్థలలో ప్రజాస్వామ్యం వివిధరూపాలతో సాక్షాత్కరిస్తున్నది. రాజకీయవ్యవస్థలు ప్రజల జీవనవిధానాన్నే గాక సాహిత్య జీవితాన్ని కూడా శాసించి తన చెప్పుచేతుల్లో ఉంచుకొంటున్నది. దానితో సాహిత్యం వికసించవలసినంత స్వతంత్రంగా, స్వచ్ఛంగా విప్పారలేక పోతున్నది. అభివృద్ధి చెందుతున్న స్వతంత్రదేశాలలో కూడా ఆ ప్రభావం ప్రత్యక్షంగానో, పరోక్షంగానో పడుతూనే ఉన్నది. అది కొన్నిచోట్ల సాహిత్యక్షేత్రాల్లోకూడ సంఘర్షణకు దారితీస్తున్నది. ఇట్టి పరిస్థితులు భారతదేశంలో స్పష్టంగా కనపడుతూనే ఉన్నవి.

ఇక్కడ మరో విషయం గుర్తుంచుకోవాలి. నేటి మానవుడు భౌతికమైన ప్రగతినే అభ్యుదయం అంటున్నాడు. ఆ అభ్యుదయాన్ని అధర్మంగా సంపాదించటానికి కూడ వెనుకంజ వేయటంలేదు. ఆత్మవికాసంకన్నా ఆర్థికసంపద్వికాసమే ధ్యేయంగా నడచుకొంటున్నాడు. వ్యక్తి తన వ్యక్తిగతజీవితాన్ని సమాజజీవితాన్నీ రెండుగా భావిస్తున్నాడు. తన అనుభూతిని గోప్యం చేసి సామాజికాభిరుచులను ప్రకటిస్తున్నాడు. సమాజంలో కనపడే అసమగ్రత, అసమానత, వైవిధ్యము, సంఘర్షణ, కుళ్లు, కొంటెతనం, వీటిని తన రచనల్లో ప్రతిబింబింపచేస్తున్నాడు; అధిక్షేపిస్తున్నాడు. వీటన్నిటినీ చూచి సంక్షుభితమైన మానవ హృద్వేగాన్ని రచనల్లో ప్రజ్వలింపజేస్తున్నాడు. కాని జీవిత చైతన్యానికి మూలకందమైన ఆత్మను, అజరామరమైన దానిశక్తి కున్న ప్రాధాన్యాన్ని రచనల్లో ప్రతిబింబింప జేయటం విస్మరిస్తున్నాడు. రచయిత సమాధిని పొంది రచన సాగింపగలిగితే ఆ పరమార్గాన్ని ఆవిష్కరింపగలుగుతాడు. సమాధికి దూరమైన నేటి రచయిత కన్నులు మూసికొని ఆత్మను దర్శించే అవకాశం లేక కంటికి కనపడే విభిన్న

ప్రకృతిని విభిన్నప్రక్రియలలో వ్యక్తీకరిస్తున్నాడు. కాబట్టి నేటి సాహిత్యంలో వస్తువుకు, ఆకృతిశిల్పానికి కలిగినంత ప్రాధాన్యం సాహిత్యపరమార్థానికి కలగటంలేదు.

నేటి సాహిత్య ప్రక్రియలలో విమర్శ ఒక శక్తివంత మైన ఆయుధం. దానికి రెండువైపులా పదు నున్నది. అది కళ, శాస్త్రం. కళాస్రష్టయైన రచయిత హృదయాన్ని, కళావిపాసియైన సామాజికుని అనుభవాన్ని విలువకట్టి సప్రమాణంగా వెలువరింపగలిగిన సాహిత్యప్రక్రియ విమర్శ. విమర్శ అనే ఆయుధం లేనిది కళ ప్రగతిని సాధించలేదు; కలలు కంటున్న మరో ప్రపంచాన్ని స్వాయత్తం చేసుకోలేదు.

తెలుగుదేశంలో మరోప్రపంచం పిలుపు విన్ననాటినుండీ కవులూ, రచయితలూ దాన్ని అందుకొందామనీ, ఆక్రమిద్దామనీ,దాని రూపురేఖలు సుస్పష్టంగా తీర్చిదిద్దుదా మనీ ప్రయత్నిస్తున్నారు. కాని ఆవేశంతో ముందుకు దూకుతున్న రచయితలసైన్యానికి బల మైన విమర్శాయుధాలు ఉత్పత్తి కావటంలేదు. కొంతకాలం విదేశాలనుండి వచ్చే దిగు మతులమీదనే ఆధారపడవలసి వచ్చింది; తరువాత సొంతగా తయారు చేసుకుందా మని ప్రయత్నిస్తే ముడిసరుకు, విడిభాగాలూ అదనుకు దొరక్కపోవటం సంభవించింది. అట్లని కర్మాగారాలు మూతపడలేదు. దొరికిన స్వదేశీ పదార్థాలతో దొడ్డపనిముట్లను కొన్ని వారు రూపకల్పనం చేసుకున్నారు; ఇంకా క్రొత్తమోడల్సుకొరకు బ్లూప్రింట్లు తయారుచేస్తున్నారు.

నాకు తెలిసినంతవరకు – నవ్యసాహిత్యయుగంలో తెలుగు విమర్శ ప్రస్తుతం నాలుగవ దశలో నడుస్తున్నది. కందుకూరి వీరేశలింగంపంతులుగారికి పూర్వమున్న సాహిత్య విమర్శ పూర్వయుగానికి చెందింది. ఆతర్వాత నవ్యయుగం ప్రారంభమైంది. అందులో ప్రథమదశ పరంపరాగతమైన శాస్త్రవిమర్శ. రెండవదశ పాశ్చాత్య సంప్రదాయైక విమర్శ. మూడవదశ సంప్రదాయబద్ధమైన సిద్ధాంతాలనూ, పాశ్చాత్య సంప్రదాయాలనూ యథావకాశంగా సమన్వయించుకొన్న "ప్రాత క్రొత్తల మేలుకలయిక" గల విమర్శ. ఈ మూడవదశ విశ్వవిద్యాలయాల్లో పరిశోధనాత్మకమైన విమర్శయందు పరిణతిచెందింది. ఆ తరువాత వచ్చింది అధునాతన విమర్శ. ప్రస్తుతం ఈ వ్యాసంలో ప్రస్తావింపబడుతున్నది విమర్శయొక్క ఈ చివరిదశ.

అధునాతన విమర్శలకు ఆలంబనమైనది సమకాలీనాత్యంతాధునిక సాహిత్యం. అందులో కవిత్వవిమర్శదే అగ్రతాంబూలం. నవల, నాటకం, కథానిక, ఏకాంకిక – ఇత్యాదులు కోకొల్లలుగా వస్తున్నా వాటిమీద విమర్శ మాత్రం చాలతక్కువగా వెలువడు తున్నది.

ఈ యుగంలో అభ్యుదయకవిత్వం, అధివాస్తవికత్వం మొదలైన అవధుల్ని దాటి నేటిసాహిత్యం పరుగెత్తుతోంది. ఇజమ్సు ఎన్నో ఇప్పటికే కొంత ప్రాతపడ్డట్లు కనిపిస్తు న్నవి. సంఘంలోని అవినీతిమీద విప్లవం తెద్దామన్న తీవ్రవాదం ఉషఃకిరణాలను ప్రసా రిస్తున్నది. రచయితకు సంఘంలో మందగిస్తున్న విలువ అతణ్ణి అగ్నిపర్వతంలా రగు ల్కొనజేస్తున్నది. కాని, దానికి కావలసినశక్తి – విమర్శాయుధం లేకపోవటంచేత అగ్ని పర్వతం బ్రద్దలుకావటంలేదు.

తెలుగు సాహిత్యంలో క్రొత్తక్రొత్త ప్రక్రియలు వచ్చినంత వేగంగా వాటికి రూప కల్పనం చేసి, ప్రామాణికత్వాన్ని కల్పించే విమర్శ సాగటంలేదు. ఈలోపం రచయితల కలాలబలాలను పట్టి చూస్తున్నది. కొందరు ఆధునిక కవులు తమ కవిత్వ ప్రక్రియా స్వరూప స్వభావాలను తామే విమర్శరూపంగా వెలయిస్తున్నారు. ఇది అభిలషితమైన ఉత్తమ సంప్రదాయం. ఇట్టి పద్ధతిలో రచయితలే వ్రాసిన వ్యాసాలకు ఆధునిక సాహిత్యంలో మంచి గౌరవం కనబడుతున్నది. రచయితలు తమ వ్యవసాయాన్ని గూర్చి తామెంత చెప్పుకున్నా సహృదయవిమర్శకుని ద్వారా విమర్శ రావాలనీ, అప్పుడే అది సమగ్ర మౌతుందనీ భావిస్తారు. అది నిజంకూడా. అందువల్ల అధునాతన కవిత్వశాఖలకు చేవకలగలేదు ; ఊడలు దిగలేదు.

ఈ విపరీతపరిస్థితి యువరచయితల్లో ఒక అసంతృప్తిని, ఒక ఉద్వేగ చైతన్యాన్ని కలిగిస్తున్నది. అందువల్ల చాలమంది రచయితలు కవిత్వంలో విమర్శను వ్రాస్తున్నారు. వర్ణనీయాంశాన్ని డిసెక్షన్ చేసి చూపిస్తున్నారు. తమకు నచ్చిందాన్ని ఆవేశంతో పొగుడుతున్నారు ; కష్టమైనదానిని పడతిడుతున్నారు. కనపడని ఏదో లక్ష్యంకోసం డిటెక్షన్ చేస్తున్నారు. కాకువులూ, అన్యాపదేశాలూ, అధిక్షేపాలూ, సింబల్సూ, వ్యాజనిందలూ తమకవితాఖండాలలో గుప్పిస్తున్నారు. మాటలలో వాడిదనం ఉన్నా అతిగూఢత్వాన్ని ఆలంబనం చేసుకొని భావాన్ని ఆవిష్కరిస్తున్నారు. అందువల్ల సామాజికునికి సాహిత్యం సాధించే ప్రయోజనం తెలిసీతెలియకుండా పోతున్నది.

ఇట్టి విషమ పరిస్థితుల్లో విమర్శకుని అవసరం ఎంతైనా ఉంది. అయితే నేటి విమర్శకుడు తన గురుతరమైన బాధ్యతను సగర్వంగా నిర్వహించటానికి ముందుకు వస్తున్నాడా ? అన్నది సమస్య. నేడూ విమర్శ చేస్తున్నాడు ఆధునిక కవిత్వ విమర్శకుడు. కాని, అది పరిచయాత్మకమైన సమీక్ష మాత్రమే. కొన్నిచోట్ల కవితాఖండాల వ్యాఖ్యానం మాత్రమే. వీనిలోనే విచిత్రంగా రాజకీయవాదాలూ, కులవర్గసమస్యలూ, వ్యక్తిగతాభిమానాలూ, అభిరుచులు చోటుచేసుకుంటున్నవి. ఇవి విమర్శవృక్షానికి చీడపురుగుల వంటివి. వీటిని అధిగమించి శాశ్వతప్రమాణాలనుగాని, సాపేక్ష ప్రమాణాలనుగాని అనుసరిస్తూ సాగించే సమర్థమైన విమర్శ పెరగటంలేదు. అందువల్ల అధునాతన విమర్శకుడు తాను మెచ్చుకొంటున్న నేటికవిత్వంలోని విలువను సమర్థించడానికి బదులు గతాన్ని తిడుతూ తన మాటకు గతి కల్పించుకోటానికి యత్నిస్తున్నాడు. ఇట్టిది మన విమర్శ చరిత్రలో దయనీయమైన అవస్థ.

నేటి విమర్శకులలో కొందరు కవిత్వంలో ప్రతిబింబించిన రాజకీయ సిద్ధాంతాలకు గానీ, సామాజిక సూత్రాలకుగానీ, విజ్ఞానశాస్త్ర విషయాలకుగాని ప్రాధాన్యాన్ని కల్పించి రచనలు సాగిస్తున్నారు. ఇవి ప్రాచీన సాహిత్యంలోని మతసిద్ధాంతాలనూ, శాస్త్రాంశాలనూ, సాంఘిక పరిస్థితులనూ, వివరించే విమర్శల కోవకు చెందుతవి. సాహిత్య పరమార్థాన్ని నిరూపించే దృష్టి వీటిల్లో తక్కువ. విమర్శ రచయిత వ్యుత్పత్తిని, బుద్ధి పాటవాన్ని వివరించినంత మాత్రాన చాలదు. సాహిత్యం సామాజికుని కందించే రసానుభూతిని

నిరూపించి చెప్పే విమర్శ పద్ధతి అవసరం నేడు. అప్పుడే విమర్శ సాహిత్య పరమార్థాన్ని నిరూపించే శాస్త్రంగా, కళగా సంపూర్ణావిష్కారం పొందగలుగుతుంది.

నేటి రచయిత అంతర్ముఖుడై అనుభవించి వ్రాసిందానికన్నా బహిర్ముఖుడై భావించి అధికంగా వ్రాస్తున్నాడు. అందువల్ల కవితల్లో రచయితయొక్క ఆత్మీయత కన్నా ఆలోచన, తన్మయత్వంకన్నా తర్కం, ఆర్ద్రమైన వాక్కుకన్నా వక్రోక్తి, అనుభూతికన్నా ఆవేశచమత్కారాలూ హెచ్చుగా భావిస్తున్నవి. దీనికి కొంతవఱకు సామాజికుల అభిరుచులుకూడా కారణాలౌతున్నవి. నేడు చదువుకున్నవారు సమాజంలో ఎక్కువైనా గాఢమైన సాహిత్యాభిరుచి కలవారు తక్కువగానే కనపడుతున్నారు. వారికి జీవితంలో ఆర్థికంగా లాభంగడించే లౌకిక విషయాలూ, వాటి వివరాలూ, ఆసక్తిని కలిగించినంతగా అలౌకికానందం అందించే సాహిత్యం అభిరుచిని కల్గించటంలేదు. వారికి బరువైన భావాలు బరువనిపిస్తున్నవి; గాఢమైన బంధం ఉక్కిరిబిక్కిరి చేస్తున్నది; నియమ నిబంధనాలు శృంఖలాలుగా కనిపిస్తున్నవి; చిత్రద్రవీకరణంకన్నా చిత్తోత్పత్తి సమాదర ణీయమౌతున్నది; అత్యంత మధురరచనంకన్నా అంత్యప్రాసలమీద ఆదరం పెరుగు తున్నది; క్షీణయుగమని చెప్పబడ్డ దక్షిణాంధ్ర యుగంలోని శృంగారంకన్నా పలచ బారిన పచ్చిశృంగారంమీద ప్రజలమనస్సు పరవళ్ళు త్రొక్కుతున్నది. కాబట్టి నేటి రచయిత సామాజికులకు చిత్తరంజనంచేస్తూ సాహిత్యప్రగతికి సోపానాలు కడుతున్నాడు. ఓట్ల బలంమీద గద్దెకెక్కే ప్రజాప్రతినిధివలెనే ప్రజాబలంమీద రచయిత మనుగడ సాగిస్తున్నాడు.

నేటి విమర్శకునకూ ఈ అవస్థ తప్పటంలేదు. సామాజికులు మెచ్చని విమర్శ ప్రాచుర్యాన్ని పొందలేకపోతున్నది. అందువల్ల ఉక్తి చమత్కారంతోనూ, ఉపరితల పరామర్శలతోనూ సాహిత్యసమీక్ష సాగుతున్నది. పరిశోధనలు పండితలోకానికి సంబంధించినవనీ, పత్రికా సాహిత్యమే ప్రజలకు సంబంధించినదనీ, ప్రతీతి వ్యాపిస్తున్నది. పండితులకూ చదువుకున్న సామాజికులకూ మధ్య అగాధం పెద్దదౌతున్నది. అందువల్ల పరిశోధకుడైన విమర్శకునకు నేడు ప్రజాదరణం లేదు. సామాజికులకు కావలసిన విమర్శను వెలయించేవాడికి శాస్త్రప్రమాణాలవసరం లేదు. అందువల్ల పత్రికా సాహిత్యం ప్రబలంగా వ్యాపించిన ఈ రోజుల్లో సామాజికుల దృష్టిని నిజమైన సాహిత్య విమర్శవైపు మళ్ళించి, దాని ప్రమాణాలను పునరుద్ధరింపవలసిన బాధ్యత మన అందరిమీదా ఉన్నది.

క్రాంతిదర్శియైన కవి హృదయంతో, నిర్దుష్టమైన శాస్త్రదృష్టితో, కళాత్మకంగా విమర్శను తీర్చిదిద్ది, రేపటి సాహిత్యానికి రూపురేఖలు దిద్దవలసినవాడు విమర్శకుడు. మారుతున్న విలువలో మరువరాని సత్యం ఇది.

# మారుతున్న విలువలు - నవల

## శ్రీ అక్కిరాజు రమాపతిరావు

సాహిత్యప్రభావం సంఘంపైనా, సామాజిక పరిణామాలు సాహిత్యంలోనూ, ప్రతిఫలించడం సార్వకాలికమైన సత్యమే. సామాజిక ప్రయోజనాన్ని, ఏదోవొక స్థాయిలో సాహిత్యం దృష్టిలో పెట్టుకొనక తప్పదు. సాంఘికావసరాలను, సాంఘికవ్యవస్థను, సాహిత్యం, ప్రతిదేశంలోను, ప్రతికాలంలోనుకూడా, ప్రతిబింబిస్తూనే వుంటుంది సాంఘిక పరిణామాలనుబట్టే సాహిత్యపరిణామాలుకూడా ఏర్పడుతూవుంటాయి.

సంఘం ఎప్పుడూ, తా నున్న వ్యవస్థకన్నా మంచివ్యవస్థను రూపొందించుకోవాలని, సంఘర్షిస్తూనేవుంటుంది. అందుకనే "మంచి గతమున కొంచెమేనోయ్'' అన్న కవివాక్కు విలువైందిగా అనిపించడం.

యుద్ధాలు, శాస్త్రీయపరిజ్ఞానంలో పురోభివృద్ధి, ఖండఖండాంతరాల మధ్య ఎల్లలు కరిగిపోవడం, పారిశ్రామిక పురోగమనం మొదలైనవన్నీ, వివిధదేశాలలోని, సాంఘిక మార్పులకు కారణాలు.

శతాబ్దంకింద, సాంఘిక అవసరాలకు, వ్యక్తిగతమైన సమస్యలకు, లక్ష్యాలకు, ఆశయాలకు, నేటికాలానికి, మారిపోయిన వ్యవస్థ తాలూకు విలువలతో పోలికే వుండదని చెప్పాలి. ఇప్పుడు కొత్త సమస్యలు, కొత్త ఘర్షణలు, కొత్త పరిష్కారాలు ఎప్పటికప్పుడు వుత్పన్నం అవుతూ వుండవచ్చును గాక. అయినా మార్పు అనేది నిత్యనూతనంగా, నిర్విరామంగా కొనసాగుతూనే వుంటుంది.

వ్యావసాయికమైనవ్యవస్థ, క్రమంగా పారిశ్రామికవ్యవస్థగా పరిణామం చెందడంతో, ప్రపంచంలోని వివిధ దేశాలలోని, సామాజిక, మత, రాజకీయవిప్లవాలు, తమ ప్రభావాన్ని చూపడంతో, మనదేశంలో, సాంఘిక దృక్పథంలోనూ, సామాజిక విలువల్లోనూ కొన్ని మార్పులు వచ్చాయి. పరిణతి చెందని ప్రజాస్వామిక వ్యవస్థ తాలూకు కొన్ని సమస్యలు, సంఘర్షణలు, సమకాలీనసంఘం ఎదుర్కొంటున్నది. పరిపూర్ణంగా ఆర్థికాభివృద్ధిని సాధించకపోవడమూ, నైతికవిలువల పతనము, ధనవంతుల దోపిడి, విద్యావంతుల అవినీతి, యీ సమస్యలను మరింత క్లిష్టతరంచేస్తున్నాయి. ఎక్కడ చూచినా పోటీ, సుఖలాలసత్వము, స్వార్థపరత్వము, పెచ్చు పెరిగిపోయినాయి. అందువలన ఒక అశాంతి, అసంతృప్తి, హింసాత్మకప్రవృత్తి, సామాజిక విలువలను కలుషితం చేస్తున్నాయి.

నీతిగా, న్యాయంగా, ముక్కుసూటిగా, బ్రతకడానికి అవకాశాలు లోపించిపోతున్నాయి రోజు రోజుకు. అందువలన, మేధావులుకూడా, యీ అస్తవ్యస్తమైన పరిస్థితులకన్నిటికీ కారణాలేవి ? అన్న జిజ్ఞాసలో పడ్డారు. మళ్ళీ అనేకాభిప్రాయాలు తలలెత్తాయి.

పూర్వపు విలువలే యీ దుస్థితికంతా కారణమని, ఆ విలువలను సమూలంగా నాశనం చెయ్యాలని, వొకవర్గంవారు తీవ్రంగా పూనుకొన్నారు. వాళ్ళు సువ్యవస్థను రూపొందించడంలో హింసాత్మకమైన మార్గాన్నికూడా అవలంబించడం తప్పుకాదంటారు. వీళ్ళది అతిధోరణి.

ఏది ఏమైనా, ఎవరైనాసరే, సామాజిక పరిణామాలకు తలవొగ్గక తప్పదు. వెనుకటి విలువలన్నీ నశించిపోతున్నాయనీ, భీభత్సమైన పరిస్థితులవైపు మనం పయనిస్తున్నామనీ, అనుకోవాల్సిన పనిలేదు. చీకటి తరువాత వెలుగు తప్పకుండా వస్తుంది. వెనకటిరోజుల కన్నా విద్యావంతుల సంఖ్య ఇప్పుడు పెరుగుతున్నది. మనిషి మనిషికీమధ్య ఉండే వ్యత్యాసాలుకూడా చాలావరకు తగ్గిపోయినాయి. అయితే మనిషిలో నైజంగా వుండే స్వార్థపరత్వము, అత్యాశ, మొదలయిన దుర్గుణాలవల్ల సంఘంలో కొత్తవర్గాలు, కొత్తవిలువలు, పరిణమించి సాధించిన ఏ కొంచెమందో పరిగణనలోకి రాకుండా పోవడమూ మనం చూస్తూనేవున్నాము.

ప్రజాస్వామ్యవ్యవస్థలో పరిపాలనా యంత్రాంగం సమర్ధవంతంగా బాధ్యతలను నిర్వర్తించలేకపోతే అనేకమైన చెడుఫలితాలను అనుభవించాల్సివస్తుంది ప్రజలు. నీతి, న్యాయము, సామర్థ్యమూ వున్న ప్రభుత్వవ్యవస్థ తప్ప ప్రజాస్వామ్యప్రభుత్వాన్ని విజయవంతంగా నిర్వహించలేదు. సామాన్యప్రజల జీవనస్థాయికన్నా, సంఘంలో అదృష్టవంతులైన ఏ కొద్ది వర్గపు జీవనస్థాయో పెరిగినందువల్ల అది సంఘర్షణలకు దారితీస్తుంది కాని సువ్యవస్థను నిరూపించలేదు.

సాంఘికమైన అభిరుచులు, సంఘంలోని శాంతి భద్రతలు, మేధావుల ధోరణి సాహిత్యాభిరుచులను దిద్దితీరుస్తాయి. కేవలం సామాజిక ప్రయోజనం అంటే సత్సందేశాన్ని ప్రబోధించడమే సాహిత్యపు ముఖ్య కర్తవ్యం కాకపోయినా తక్కిన లలితకళలకన్నా సమాజాన్ని దిద్దితీర్చడంలో సాహిత్యానికి ఎక్కువబాధ్యతా, ప్రాముఖ్యమూ వున్నాయి. సంగీతము, చిత్రలేఖనము, శిల్పము మొదలైన కళలన్నిటికన్నాకూడా సాహిత్యం ప్రజల అభిరుచులను ఎక్కువగా ప్రభావితం చేస్తుంది. అందువల్ల ఉత్తమ సాహిత్యానికి సాంఘికప్రయోజనంకూడా ప్రధానాశయంగా వుండటం అభిలషణీయం.

కందుకూరి వీరేశలింగంగారి కాలంలో, చాలా ఎక్కువగా; తెలుగుదేశంలోనూ తద్వారా తెలుగు సాహిత్యంలోనూ, సామాజిక దృక్పథం, బాగా వేళ్ళు తన్నుకున్నది. ప్రజలను విజ్ఞానవంతులనుగా చేయాలని, దానికి వారిలో విద్యావివేకాలను పెంపొందించడమే మార్గమని, తద్వారా సామాజికమైన సుగతి సాధించవచ్చునని ఆయన సాహిత్య దృక్పథాన్ని పెంపొందించారు. రాజకీయమైన పరిణామాలకు ముందుమెట్టుగా సాంఘికమైన చైతన్యం ప్రజల్లో పెంపొందింపజేయటం సులభమవుతుందని పంతులుగా రాశించినట్లుగా కనబడుతుంది. అందువల్ల కిందటి శతాబ్దంలో సాంఘిక పరిణామాలు ఎక్కువ సాహిత్యాన్ని ప్రభావితం చేస్తే ఈ శతాబ్దంలో రాజకీయ పరిణామాలు సాహిత్య ధోరణులను ప్రభావితం చేస్తూవుండటం మనం చూడవచ్చు.

వార్తాపత్రికలు, సినిమా, రేడియో. టెలివిజన్ మొదలైన యంత్రయుగపు సాధనాలద్వారా ప్రజల్లో సాంఘిక చైతన్యం ఎక్కువైంది. ఇదివరకటికన్నా ప్రయాణ సౌకర్యాలు పెరిగి, ప్రజలమధ్య రాకపోకలు ఎక్కువ కావడంతో పాత దృక్పథాలు చెదరిపోయి విధిగా ప్రజలు కొత్త దృక్పథాలను అలవాటు చేసుకోవడం జరిగింది. ఆశ్రిత పక్షపాతానికి, అవినీతికి వశమైపోయిన ప్రభుత్వ వ్యవస్థవల్ల ఒక వర్గంవారి దోపిడీ బాగా వెచ్చుపెరిగి కలిమిలేములమధ్య కార్పణ్యాలు వృద్ధిపొందాయి. దానితో మత, నైతిక విలువలు విశ్వాసాలపట్ల నిరాదరణ ఎక్కువైపోయింది. ఈ అవ్యవస్థకంతటికీ కారణం ప్రభుత్వవ్యవస్థలోని లోపాలే అని చెప్పాలి.

మనదేశం స్వాతంత్ర్యం పొందినతరువాత దురదృష్టవశాత్తూ సామాజికోన్నతి సాధించాలనే లక్ష్యం దృష్టిపథంనుండి తప్పుకొన్నది. దేశహితం కన్నా, దేశ ప్రయోజనాలకన్నా తన సౌఖ్యం ముఖ్యం అన్నధోరణి విద్యావంతుల్లోనూ, అధికారవర్గంలోనూ పెరిగిపోయింది. చెడుగా వున్న వ్యవస్థను పునర్నిర్మాణం చేయాలంటే చాలా శ్రమపడవలసి వుంటుందనికాని, ఉన్న వ్యవస్థను పాడుచేయటం సులభంగానే సాధ్యపడుతుంది. ప్రధానోపాధ్యాయుడు నీతి, నిజాయితీ, కలవాడై సమర్థుడై తన కర్తవ్యాన్ని తు. చ. తప్పకుండా నిర్వర్తించగలవాడైతే ఆయనకింద పనిచేసే ఉపాధ్యాయులుగాని, ఆ స్కూల్లో చదువుకొనే విద్యార్థులుగాని కర్తవ్యపాలనంలో, బాధ్యతా నిర్వహణంలో స్వశక్త్యానుసారంగా శ్రమించవలసి వుంటుంది. అట్లాకాక, ప్రధానోపాధ్యాయుడే అలసుడైతే, అవినీతిపరుడైతే అతడి సహాయకులుగాని, విద్యార్థులుగాని తమ కర్తవ్యాన్ని సక్రమంగా నిర్వహింపరు. సరిగ్గా స్వాతంత్ర్యానంతరం దేశపరిస్థితులు ఈ విధంగానే పరిణమించాయి. అందువల్ల సంఘంలో అవాంఛనీయమైన పరిణామా లెన్నో వచ్చాయి.

నవ్యకవిత్వము, అభ్యుదయకవిత్వము, దిగంబరకవిత్వము మొదలైన ధోరణులన్నీ సమాజంలో వచ్చిన పరిణామాల ప్రతిధ్వనులే. కవిత్వంలోలాగానే ఇతర సాహిత్య ప్రక్రియలలోకూడా. ఇతర కళారూపాలలోకూడా ఇలాంటి మార్పులు ప్రతిబింబించాయి. సంగీతంలోను చిత్రలేఖనంలోకూడా ఇటువంటి నవ్యధోరణులు పుట్టాయి. సాంఘిక జీవితంలోని అవిశ్రాంతి, సంఘర్షణ, వేగము, పోటీ మొదలైనవాటి సామూహిక ప్రభావం సాహిత్యం, రూపురేఖలను మారుస్తూ వచ్చింది. సాంఘిక అసమానతలను చాటిచెప్పే కవిత్వము సంఘంలోని వ్యవస్థను, దారిదోపిడిని, అక్రమాన్ని తెలియజేప్పే కథలూ, నవలలూ, విద్యావంతులై, పరిణత మనస్కులైన పాఠకులను ఇప్పుడు ఆకర్షిస్తున్నాయి.

వేయిపడగలు, నారాయణరావు, మాలపల్లివంటి పెద్ద (అంటే గ్రంథం పరిమాణంలోనే కాక, వస్తుదృష్టినిబట్టికూడా) నవలలను ఇప్పుడు పాఠకులు చదవటానికి ఆసక్తి చూపించరు. అట్లానే లఘుకావ్యాలను ఆదరించినంతగా పెద్ద పెద్ద కావ్యాలను ఆదరించడం కష్టం. ఈ విధంగా అభిరుచులు మారిపోవటానికి పారిశ్రామిక యుగప్రభావమే కారణమని చెప్పవలసివుంటుంది. లభించిన కొద్దిపాటి విశ్రాంతిని సద్వినియోగం చేసుకోవడానికి పుస్తకాలను మాత్రమే ఆశ్రయించవలసిన అగత్యంలేదు ఈ యుగ ప్రతి

నిధికి, అనేకమైన ఆకర్షణ లున్నాయి. పుస్తకపఠనంలో అత్యంతమూ ఆసక్తివున్నా టాల్‌స్టాయ్, వార్ అండ్ పీస్‌లాంటి పెద్దపెద్ద గ్రంథాలను పఠించే అభిలాష తగ్గిపోతున్నది. వస్తుగౌరవం దృష్ట్యా ఇలాంటి అభిరుచుల్లో మార్పులు వచ్చాయి.

తెలుగులో ఇవాళ ''నవల'' చాలా ప్రాచుర్యాన్ని పొందిన సాహిత్యశాఖ. చారిత్రాత్మకమైన వీరగాథలు. సాహసాలు, ప్రణయాలు, రాచరిక కుటుంబగాథలు, తొలినాళ్ళలో నవలకు ఇతివృత్తాలుగా స్వీకరిండబడ్డా, ఇప్పుడు సాంఘికేతివృత్తాలే ప్రధానంగా నవలలుగా రూపొందుతున్నాయి. ఇప్పుడు కాల్పనికేతివృత్తాలు పాతబడిపోయినాయి. సమకాలీన సాంఘిక సమస్యలను ఇతివృత్తాలుగా స్వీకరించిన రచనలకే ప్రాచుర్యం లభిస్తున్నది. సంఘంలో ప్రబలంగా కనబడుతున్న హెచ్చుతగ్గులు, అందోళనలు, వర్గవైరుధ్యాలు, కులదురభిమానాలు, ప్రభావితంచేస్తున్న నగరజీవనపు ఆకర్షణలు, రాజకీయాలు, సామాజిక సమస్యలు, వైయక్తిక సమస్యలు, ఇతివృత్తాలుగా రచయితలు నవలలు వ్రాస్తున్నారు. కొందరు రచయితలు స్త్రీ పురుష కామప్రవృత్తికి సంబంధించిన వైయక్తిక సమస్యలను చిత్రిస్తున్నారు. సాంఘికమైన వ్యవస్థలో వచ్చిన మార్పుతో వ్యక్తిగతమైన సమస్యల స్వరూపాల చిత్రీకరణ వీళ్ళఅభిమానవిషయంగా కనపడుతుంది. అంతేకాని సందేశము, సాహిత్యపువిలువలు ఈ రచయితలకు పట్టినట్లుగా లేదు. అయితే వ్యక్తిగతమైన సమస్యలు, సామాజిక సమస్యలు కావా అన్న ప్రశ్న వస్తుంది. కావని ఎవరు చెప్పగలరు? బహుజనహితము, బహుజన సుఖము ఆశించినప్పుడు వ్యక్తిగతమైన అభిరుచులను, ప్రయోజనాలను సామాజికమైన ఉన్నతికొఱకు వదలుకొనవలసివుంటుంది.

ఈ సందర్భంలో ఇంకొక సమస్యకూడా ఎదురవుతున్నది. సంఘంలోని దురన్యాయాలను వ్యక్తిగతమైనవైనా, సంఘపరమైనవైనా యథాతథం చిత్రించవచ్చునా లేదా అని. చిత్రించవచ్చునుకాని హితము, ప్రియము, పథ్యము అయ్యేవిధంగా వుండాలి. చలం సాంఘికంగా స్త్రీలకు జరుగుతున్న అన్యాయాలనుగూర్చి ఘోషించా డని ఆయన సాహిత్యంలో విప్లవపంథాను లేవదీశా డని కొందరంటారు. ఆయన సాహిత్యం సాధించిన ప్రయోజనం శూన్యం. నల్లమందు బాగా తిని అతీంద్రియమైన అనుభవాన్ని సాధించడం లాంటిది చలం సాధించిన సాహిత్య ప్రయోజనం. ఇటీవల ఒక మహాకవి ఇట్లా ఉవాచించారు. "విప్లవం చిరకాలం వర్ధిల్లాలి" అని. అది ఎంత అర్థరహితమైన నినాదమో చూడండి. అంటే ఈ దోపిడీ విధానం, కన్నీళ్ళు, బలవంతులు బలహీనులను అణగద్రొక్కడం, ఇలా కలకాలం కొనసాగవలసిందేనా ? లేకపోతే కొందరు మహాకవులయ్యే అవకాశం లేదు. ప్రజలను విద్యావంతులను చెయ్యడంకాని, మానవత్వపు విలువలను పెంచడంకాని, అసమానతలను తొలగించడంకాని, పట్టకుండా నినాదాలతోను, సిద్ధాంతపరమైన ఉద్ఘోషణలతోను సంఘం మారదు. సాహిత్యప్రయోజనం సిద్ధించనూ సిద్ధించదు. మనిషి మనిషిగా తన బాధ్యతలను, కర్తవ్యాలను గుర్తించనంతవరకు లేదా తన హద్దుల్లో తాను బ్రతికేట్లుగా అతణ్ణి శాసించే అధికారం లేనంతవరకు సంఘమూ, సాహిత్యమూ ప్రభావితం కాలేవు.

రాజకీయవాదులను గురించి ఎంత తక్కువగా అనుకుంటే అంత మంచిది. యూనివర్శిటీ ప్రొఫెసర్లు, డాక్టర్లు, ఇంజనీర్లు, వ్యాపారస్థులు, మేధావులు, సంఘసేవకులు, మతాచార్యులు, అవినీతిపరులై వున్నారీవేళ. అంటే సంఘమంతా అన్నమాట! ఇలాంటి సంఘంలో కళాత్మకమైన విలువలతో, సామాజిక ప్రయోజనాన్ని ప్రధానంగా చేసుకొని, సాహిత్యం వెలువడే అవకాశం లేదు.

ఈ దృష్టితో చూసినప్పుడు నేటి తెలుగు నవల ఆశాజనకంగా లేదు. సినిమా కథలలాగా అసహజమైన సంఘటనలు, అవాస్తవికమైన సన్నివేశాలు, అనుచితమైన నాటకీయధోరణి, అర్థంలేని కల్పనలు, అధికసంఖ్యాకంగా వెలువడుతోన్న నవలల్లో కనపడుతున్నాయి.

పోలాప్రగడ సత్యనారాయణమూర్తి రచించిన "సంఘంచేసిన మనిషి" మంచి నవలే అని చెప్పాలి. ఎందుకంటే నేటి సాంఘికస్వరూపాన్ని బాగా అవగతం చేసుకొన్నాడాయన అని ఆ నవల చెప్పుతున్నది. ప్రతివ్యక్తికూడా సంఘం చెక్కిన శిల్పమే అంటే తాను జీవిస్తున్న సంఘానికి వ్యక్తి ఎప్పుడూ ప్రతినిధిగా వుంటాడని శిల్పివేసే ప్రతిఉలిదెబ్బ శిల్పాన్ని తీర్చేటట్టుగా తాను ఎదుర్కొనే ప్రతిసన్నివేశమూ తన వ్యక్తిత్వాన్ని దిద్ది తీరుస్తుందనీ రచయిత నిరూపించదలచుకొన్నాడీ నవలలో. ఆయన రచించిన దీపశిఖ కూడా మంచినవలే అని చెప్పాలి. సాంఘికమైన వ్యవస్థ గతంనుంచి వర్తమానంలోకి ఏవిధంగా మారుతూ వున్నదో నిరూపించే ప్రయత్నం ఆయన యీ నవలలో చేశారు.

ఎమ్. పార్థసారథి రచించిన ''రంగులవల" అన్న నవలలోకూడా సామాజికమైన సమస్యల ప్రస్తావన వున్నది. ఆధునికమైన సామాజిక పరిణామాలను గూర్చిన విశ్లేషణ కొంత చేశారీయన యీ నవలలో.

ఇటీవల వెలువడ్డ ప్రయోగాత్మక నవల అంపశయ్య. తన చుట్టూ పరచుకొనివున్న సామాజిక స్వరూపాన్ని వ్యక్తిపైన అడుగడుగునా అది ప్రసరించే ప్రభావాన్ని సమాలోచనం చేశాడీ నవలారచయిత. ఒట్టి సందేశమే వుంటే ధర్మమో, నీతిశాస్త్రమో అవుతుంది సాహిత్యం. కళాత్మకమైన విలువలుకూడా వుండాలి. అయితే ఈ కళాత్మకమైన విలువలు వైయక్తికమైన అనుభవాలనో, అనుభూతులనో మాత్రం పరిమితం చేసుకొన్నవిగా వుండగూడదు. చైతన్యస్రవంతి అనబడే సాహిత్యధోరణి సామాజిక సమస్యల పరిష్కారానికి ఎంతవరకు తోడుపడగలదో విచార్యం.

సాహిత్యంలో సమకాలీనమైన సామాజికస్వరూపం ఎప్పుడూ ప్రతిబింబిస్తూనే వుంటుంది కాని, సాహిత్యపు విలువలు ఏవి? అవి కానీ, పోనీ నేటి మారుతున్న సమాజపు విలువల దృష్ట్యా సాహిత్యం ఏవిధమయినదిగా వుండాలి? మారుతున్న విలువలు, నేడు వెలువడుతున్న సాహిత్యంలో ప్రతిబింబిస్తున్నాయా, అని విశ్లేషించి చూపడం కష్టం.

# మారుతున్న విలువలు - నవల

## శ్రీమతి సి. ఆనందారామం

కొన్ని కొన్ని పదాలు నిర్వచించలేం. మంచిదనం - అందం - ఇలాంటివి. మంచితనం గ్రహించేవాడి మనసునిబట్టి నిర్ణయింపబడేది.

అందం చూసేవాడి కళ్ళనుబట్టి సాక్షాత్కరించేది. అలాగే "విలువ" కూడా కాలాన్నిబట్టి ఎప్పటికప్పుడు మారేది.

ఏ విలువలనైనా నిర్ణయించుకునేది సమాజం కనుక - సజీవ సమాజానికి ప్రధానమైన లక్షణం నిరంతరమయిన మార్పే గనుక - ఈ విలువలు ఎప్పటికప్పుడు మారటంలో ఆశ్చర్యంలేదు.

ఒక్కొక్క యుగంలో ఆనాటి సామాజిక పరిస్థితుల ననుసరించి ఒక్కొక్క విలువ అతిశయించి ప్రాధాన్యం వహిస్తుంది.

దేశం సస్యశ్యామలమయి కులవృత్తులు ప్రధానంగా పాటింపబడే దశలో ధర్మం పరిపాలించింది. క్షాత్రం అండగా నిలిచింది.

దేశం శత్రువుల దండయాత్రలతో భీభత్సమవుతోన్న తరుణంలో క్షాత్రం అతిశయించింది. ధర్మం దానికి దారిచూపింది.

ఈ రెండు దశలలోనూ అర్థం కేవలం క్షాత్రధర్మాలను పోషించడానికి మాత్రమే వినియోగపడింది.

ఈనాడు పరిపాలిస్తున్నది - అర్థం!

అందుకనే అనంతకోటి విలువలూ ఆ అర్థంలో చిక్కుపడిపోయి అర్థంకాకుండా పోతున్నాయి.

పరీక్షిన్మహారాజుకు భయపడి కలి తన వ్యసనాలన్నింటికీ నిలయమైన బంగారు నాణెంలో ఆశ్రయం ఏర్పరచుకున్న కథ సత్యమో, అసత్యమో కాని ఈ నాడు పైకంతో పెత్తనాన్ని కొనవచ్చునన్న సంగతి మాత్రం ప్రత్యక్షర సత్యం...

అందుకే పైకానికి ఎక్కడలేని ప్రాధాన్యమూ వచ్చేసింది.

ఎవరికి చూసినా ఒక్కటే అభిలాష—

డబ్బు సంపాదించాలని!

ఎవరి నోట విన్నా ఒక్కటే ఆక్రోశం!—

"డబ్బు చాలటంలేదు!"

ఎవరి ప్రణాళికలు చూసినా ఒక్కటే లోపం—

రాబడికి మించిన వ్యయం!

సమాజం మొత్తం అహమహమికతో అస్థిమితతతో—తీరని దాహంతో పరుగులు పెడుతోంది పైసల కోసం...

స్త్రీల సమస్యలుగా - సామాజిక సమస్యలుగా స్థూలదృష్టికి తోచే అనేక సమస్యలు మరికొంత సూక్ష్మంగా పరిశీలిస్తే ఏదో ఒక విధంగా డబ్బుతో ముడిపడినవే!

ఈ అస్థిమితత్వం - ఈ తీరని దాహం - ఈ పరుగులు - ఈనాటి రచనల్లో మనకు కనిపిస్తున్నాయా?

ఒక రచనను సృష్టించటంలో రచయిత ఆనందం పొందుతాడు.

ఆ సృష్టిలోని అందాలు కనిపెట్టటంలో పాఠకుడు ఆనందిస్తాడు.

రసజగత్తులో రచయిత ఎంతటి ప్రధానుడో పాఠకుడూ అంతే ప్రధానుడు—

ప్రాచీన ఆలంకారికులు సహితం రసము సామాజికనిష్ఠ మని సిద్ధాంతీకరించారు.

అంచేత ఒక యుగంలో ప్రాధ్యాన్యం వహించే రచనల స్థాయి ఆ యుగంలోని అధిక సంఖ్యాకులైన పాఠకుల స్థాయిపై ఆధారపడి ఉండటంలో ఆశ్చర్యంలేదు.

అలనాటిలా ఈనాడు పురాణాలు చదివే తీరికా, వినే ఓపికా ఎవరికీ లేవు.

గుంపులుగా గూడి పనులు చేసుకొనే ఆడవాళ్లూ లేరు.

ఆ పనిపాటల సమయాలలో పాడుకునే కీర్తనలూ లేవు.

ఉరుకులతో, పరుగులతో, ఆఫీసులకు, కాలేజీలకు, కంపెనీలకు చేరుకుని యంత్రాలలా పనిచేసే ప్రాణులకు విరామసమయంలో ఉల్లాసం కలిగించే రచనలు కావాలి

కొద్దిపాటి పాండిత్యంతోనే అర్థం చేసుకొనగలిగేలా ఉండాలి.

ఇంటి ఇల్లాలికి పొరుగింటిపుల్లమ్మ లోకాభిరామాయణంకంటె ఇంకాస్త మజాగా ఉండే "అద్భుతమైన" రచన కావాలి.

అంచేత అలాంటి "అద్భుతమైన" "ఉల్లాసకరమైన" రచనలకే ఈనాడు ప్రాధాన్యం వస్తోంది.

అక్కడక్కడ సునిశితమైన మానవమనస్తత్వ పరిశీలనతో—

విపుల సామాజిక వాతావరణ పరికల్పనతో—

ద్వంద్వాల నిరంతర సంఘర్షణ చిత్రణతో—

శాస్త్రాంశాలను విపులీకరించగల మేధాసంపన్నతతో—

కొన్ని కొన్ని ఉదాత్తమైన రచనలు వస్తూనే ఉన్నాయి.

అవి చదివి "తలయూచి" మెచ్చేవారూ లేకపోలేదు.

అయినా యుగధర్మాన్నిబట్టి వాటికి ప్రాచుర్యం లభించటంలేదు. ఒక్కమాట:

ఈనాడు మారుతున్న విలువల్ని ప్రత్యక్షంగా తమ రచనలో చిత్రించక పోయినా పరోక్షంగా పలువురు దానినే ప్రదర్శిస్తున్నారు.

సామాజిక జీవనాన్ని ఐశ్వర్యం పరిపాలించటంవల్ల కలిగే ఒడిదుడుకులు చిత్రించ లేకపోయినా—

ఏ రకంగా వ్రాస్తే డబ్బు మరింత ఎక్కువ సంపాదించుకోవచ్చునో గ్రహించి ఆ రకంగానే వ్రాస్తున్నారు!

సమకాలీన ప్రభావాన్ని తప్పించుకోవటం ఎవరి తరం!

# మారుతున్న సమాజంలో - నవల

శ్రీమతి కె. రామలక్ష్మి

నిత్యచైతన్యం కలిగినది సమాజం. అది ప్రవాహంగాని సరస్సు కాదు. కదలిక దానికి చిహ్నం. మార్పు దాని లక్షణం. సమాజంలో ఈ చైతన్యలక్షణం కొంచెం కుంటుపడినా సరే సర్వేసర్వత్రా దాని ప్రతిధ్వనులు వినిపిస్తాయి. అందుకే ఏమాత్రం స్తబ్దత తోచినా మార్పు, వేగం కోరుతూ చైతన్యవంతులు హాహాకారాలు చేస్తారు. సంస్కర్తలు తమ శ్రమ, శక్తులను ధారవోసి కుంటుపడిన సమాజాన్ని మళ్ళీ దారినపట్టించాలని తాపత్రయం ప్రారంభించుతారు. ఈ నిత్య చైతన్యస్రవంతిలో భాగం పంచుకుంటారు.

సంఘజీవియైన ప్రతిమానవుడు తనతోపాటు సమాజాన్ని (అత్యధిక) అత్యున్నత ఆశల శిఖరాలవైపో, అధఃపాతాళంవైపో మానవుడు తీసుకుపోగలడు. అదీ-సమాజానికీ మనిషికీ కల అవినాభావసంబంధం. మనిషి లేనిదే సమాజం ఏది ? సంఘం ఏది ?-ఉండవు.

మానవ జీవిత కార్యకలాపాలన్నీ సంఘంలో భాగాలే. సంఘానికి దూరంగా వెళ్లి ఏ Creative కళా రాణించలేదు. అసలు రాణించదుకూడా. సంఘం కట్టుబాట్లకు కదలికలకు తొట్రుపడుతూ సృష్టికర్త అయిన కళాకారుడు తన కళలు రూపొందించాలని పెంపొందించాలని తాపత్రయపడుతూ ఉంటాడు. సంఘచైతన్యాన్నిపట్టి ఆ కళాసృష్టి, కృషి రాణిస్తూ ఉంటుంది. స్తబ్ధము, నిర్జీవము, నిరుత్సాహపూరితము, నిస్తేజము అయిన సమాజంలో కూర్చుని ఏ మేధావి, చైతన్యవంతము, సజీవము, ఉత్సాహపూరితము, తేజోవంతము అయిన రచనలనుగాని, ఇతర కళలనుగాని సృష్టించలేడు. సమాజపు ఒడుదుడుకులు స్పష్టంగానో, అస్పష్టంగానో కళలలో ప్రతిబింబించక తప్పదు. అది చూసేవారి దృష్టినిపట్టికూడా దృగ్గోచరం అవుతుంది. చూపినవాడికి ఇంద్రధనస్సు సొబగులు అవగహన అయినట్లు గ్రుడ్డివానికి మనం ఎంత వర్ణించి చెప్పినా అర్థంకావు. అలాగే కళాస్వాదనలో అవగాహనశక్తి లోపించిన రసికునికి మనం ఎంత వివరించినా అర్థంకాదు.

నేటి సమాజపు ధోరణులను తిలకించండి. అవి ఎలా ఉన్నాయి ? చూడగానే అర్థం అయేలా ఉన్నాయా ? ''ఇవి మంచిలక్షణాలు - పెంపొందించండి. ఇవి చెడ్డ లక్షణాలు అవరోధించండి" అని చెప్పడానికి ఆస్కారం ఇస్తున్నాయా ? ఒక పక్క ఝరీవేగం - ఒకపక్క పూర్తిస్తబ్దత; ఒకపక్క విపరీతపు పోకడలు - మరోపక్క మార్పుకోరని పద్ధతులు; ఒకవైపు వెఱ్ఱిఆవేశం, వేరొకవైపు నిశ్చలమౌనం. ఇంతటి విభిన్నతలని

తనలో యిముడ్చుకొని సమాజప్రవాహం యథావిధిగా సాగిపోయింది. మానవజీవితం సాఫీగానో, ఆందోళనగానో సాగిపోయింది. ఆగిపోలేదు. ఆగదు.

ఇటువంటి వింతపరిస్థితులలో రచనావ్యాసంగం పరిశీలిస్తే వింతవింత ధోరణులు, విపరీతపు పోకడలు కనపడ్డంలో వింతలేదు. అబ్బురపడవలసిన అవసరంలేదు. మనం పూనుకుని చేయవలసినదికూడా ఎక్కువలేదు. నేటి రచనాపోకడలని చూస్తుంటే ఇదే అనిపిస్తుంది. ఫాషన్ అనుకున్నది ముమ్మరంగా పెంపొందుతుంది. అది ఫాషన్ కాదని తెలిసినప్పుడు అంతత్వరగానూ సమసిపోయింది. నేటి నవలాసాహిత్యంలో స్పీడు, ఉత్పత్తి చూస్తుంటే అదే అనిపిస్తుంది. ఎంతలేదన్నా నెలకు 50 కి పయిగా కొత్త నవలలు వస్తున్నాయి. రాసినవారే వ్రాస్తున్నవీ, కొత్తకొత్తవారు వ్రాస్తున్నవి, పునర్ముద్రితాలు, అనువాదాలు అనేకరకాలవి వస్తున్నవి. వీటిలో నెల్లాపొల్లా ఏరడం అన్నది సామాన్యమైన పని కాదు. ఉత్సాహవంతులైన వేలాది పాఠకులకోసం ఈ రచనాస్రవంతి వేగం పుంజుకుంది. తన వేగంలో రాయిరప్పలనీ, పనికివచ్చి పరిపుష్టిని కల్గించే మినరల్స్‌నీ, పాటిమట్టిని కొట్టిపారవేస్తుంది.

గోదావరికి వరదలువస్తే వ్యాపారి ఏంచేస్తాడు ? కలప ఏరుకున్నాడు. ఏమైనా దొరుకుతాయి అని ప్రాణానికి తెగించి ప్రవాహానికి ఎదురీది వెళ్తారు కొందరు. ఈ నవలా ప్రవాహంలోను నిజమైన ఉత్సాహంగల పాఠకుడు. కుతూహలం గల పాఠకుడు. శాశ్వత విలువలకోసం, సాహిత్యపు విలువలకోసం వెతుకుతాడు. తప్పదు. ఆ పరీక్షలో నిగ్గుతేరి నిలచిన రచనలు అన్నలు లేవు. రావు అనడం పూర్తిగా అర్థంలేనిమాట. పాక్షికదృక్పథం అనిపించుకుంటుంది. నేడు ఉత్పన్నమవుతున్న వేలాది నవలల్లో ఏ కొద్దిగానో మంచివి పదికాలాలపాటు నిలిచేవి లేవనడం సాహసమే అవుతుంది.

నేటి నవలారంగాన్ని నవలామణులే కిరీటంలేని మహారాణుల్లా ఏలుతున్నారన్నది-చెప్పగానే నమ్మదగ్గ మాటగా తోచినా వాస్తవం కాదని చెప్పవచ్చు. ఎక్కువమంది స్త్రీలు రచనలు చేస్తున్నారు. నిజమే ! కాని, వారికంటె ఎన్నోరెట్లు ఎక్కువగా పురుషులు నవలలు రాస్తున్నారు. ఆడది చేసిన పాపంకొద్దీ - విమర్శకులు, సాహితీపరులు, కుళ్ళుబోతులు, అసూయాపరులు, నిజం చూడనివారు - అంతా ఒకటేమాట అంటున్నారు - ఆడవాళ్ల రాసేస్తున్నారని. ఈ గోలతోనే అనవసర ప్రాముఖ్యం స్త్రీరచయితలకి వచ్చింది గాని వారి సంఖ్యాబలం అత్యధికం అయి కానేకాదు.

నవలా వ్యాసంగం వ్యాపారరీత్యా లాభసాటి కావడం. పత్రిక లనే బకాసురులకి తగినంత రొట్టి ఈ నవలలే అందించకల్గటం ప్రముఖకారణంగా పెద్ద, చిన్న నవలలు కోకొల్లలుగా వస్తున్నాయి. వీటిలో నాలుగోవంతు మాత్రమే స్త్రీలు రాస్తున్నారు.

స్త్రీలు రచించినవాటిలో ఏ కొద్దిమందిలోనో మినహాయించి వాస్తవిక దృక్పథం లేదన్న వాదన ఒకటి ఉంది. నిజానికి ఏది వాస్తవిక దృక్పథం ? ఈ నాడు సమాజం వింతపోకడలు పోయింది. ఓ పక్క స్త్రీలకు సమాన హక్కు లంటూనే యింకొకపక్క

వారికి అర్హత లేకుండా చేస్తారు. ఒకపక్క సంఘసంస్కరణ అంటూనే రెండోపక్క దాన్ని ఈసడిస్తారు. ఒకపక్క వితంతువివాహాలను ప్రోత్సహించా లంటూనే రెండోపక్క దాన్ని త్రోసిరాజంటారు. సమాజపు నీతిని కొలచే కొలతబద్ద వేరు, వ్యక్తినీతిని కొలచే కొలతబద్ద వేరుగా చేస్తారు. సమాజపరంగా మంచిది - వ్యక్తిపరంగా ద్రోహంగా చూస్తారు. ఇక వ్యక్తి తెగించి తనకు మంచి దనుకున్నదాన్ని సమాజం ఎంతమాత్రంగా గౌరవిస్తుందో తెలిసినసంగతేకదా! అటువంటి అయోమయంలో పడి సమాజ వాస్తవికతను అయో మయంగానే చిత్రించడం జరుగుతుంది. తాను నమ్మిన విపరీతభావాలని జుగుప్సాకరంగా రచించేవా రున్నట్టే, తాము నమ్మిన వాటిని సాఫీగా చెప్పిన రచయితలూ ఉన్నారు. ఒక రచయిత తాగుబోతులన్యాయం చర్చించవచ్చు. ఇంకొకరు సంప్రదాయాన్ని చర్చించ వచ్చు. రెండూ బలవత్తరంగానే ఉన్నాయి సమాజంలో. అటువంటప్పుడు కొందరు వాస్తవికతకు పూసుకుపోవడం లేదని బాధపడటంలో అర్థంలేదు. కూడదనుకున్న చెడులన్నీ కొనసాగుతున్న సమాజంలో వాస్తవికత పేరిట వాటికి ప్రాధాన్యం యిస్తూ - "మేం సమాజాన్ని ప్రతిబింబించుతున్నాం" అని బోర విరుచుకుంటే లాభంలేదు. వాస్తవికత పేరిట కుళ్లని జనబాహుళ్యపు కంట పడేయటమే అవుతుం దది.

స్త్రీలు సహజంగా అలజడి వాంఛించరు. అరాచకం అసలే వాంఛించరు. సభ్య సంఘంలో ప్రశాంతంగా జీవనం గడిస్తే బాగుంటుం దని తలపోస్తారు. అటువంటి స్త్రీలు కూడా సంఘంలో జరుగుతున్న కృత్రిమ న్యాయాన్ని, అన్యాయాన్ని, అసహాయతను ఆడిపోసుకుంటున్నారు. అవి రూపుమాపాలని, అవి సంఘంలోంచి దూరం కావాలని కోరు కుంటూ రచనలు సాగించకపోలేదు. సాంఘికన్యాయం, వ్యక్తిన్యాయం అవసని తండ్రి కొడుకులమధ్య అత్యద్భుతం అయిన కథ రచించింది రంగనాయకమ్మ "ఇదేనా న్యాయం?"లో. సంఘపు కట్టుబాట్లకు తల ఒగ్గితే నిజానికి కొడుకు తండ్రిని పెట్టి పోషింపక తప్పదు. కాని తండ్రి అన్నమాటకే అర్హులుగాని తండ్రులు యీ సంఘపు సదుపాయాలని ఆకట్టుకొని కొడుకుపంచ చేరటం సహించలేని రచయిత్రి అతివాస్తవి కంగా ఏమాత్రం ఎబ్బెట్టు అనిపించకుండా ఇదేనా న్యాయం ముగించింది. మారుతున్న సమాజానికీ, విలువలకీ ప్రతీక ఈ నవల. అలాగే డి. కామేశ్వరి రచించిన కొత్తనీరు. కొత్తనీరు పాతనీటిని కొట్టివేయడం సహజం. తల్లిదండ్రుల నమ్మకాలని, ఆశయాలని కాదని స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు చూపిన రెండవతరం కథ ఇది. మారుతున్న విలువలు ప్రస్ఫుటంగా వాస్తవికంగా చిత్రించడం జరిగింది.

డి. విశాలాక్షిగారి "మారినవిలువలు" వాసిరెడ్డి సీతాదేవి 'సమత' ఇవన్నీ మారు తున్న సమాజాన్ని యథాశక్తి ప్రతిబింబించినవే.

మార్పు కోరుతూ, రాదగ్గ మార్పు ఎలా ఉండాలని రచయిత ఊహిస్తున్నాదో అదే సృష్టిస్తూ రచనలు చేస్తున్నవారుకూడ లేకపోలేదు. ఇది బొత్తిగా ఉటోపియా అని విమర్శకులు త్రోసిరాజన్నా పాఠకులలో అటువంటివి ఉత్సుకతలు రేకెత్తిస్తూనే ఉంటాయి.

రచయిత సజీవసమాజంలోనే రాణిస్తాడు. అది లేనప్పుడు రచనలుకూడ కాల్పనికాలు, ఊహాజనితములు, కాలక్షేప లక్ష్యాలు అయి సర్వసామాన్యంగా ఉండకతప్పదు. అటువంటి స్తబ్ధ వాతావరణంలోకూడా చైతన్యం నిండుకొని ఉత్తేజపరచగల రచనలు కూడ రావడం ఆనందించదగ్గ విషయం. మార్పు సహజమైన ఈ సమాజంలో అంతంత త్వరగానూ రచనలు, రచయితలు, వారి ధోరణులు, పోకడలూ మారుతూనే ఉంటాయి. ధీశక్తిగల పాఠకుడు వీటి ఆటుపోటులకి నిలబడి - వస్తున్న వాటిలోనే ప్రయోజనకారియైనవి. పలుకాలాలు నిలిచేవి ఏవని ఆణిముత్యాల్లాగా ఏరాలని ప్రయత్నిస్తాడు.

*

"ఏదేశ చరిత్ర చూచినా
ఏమున్నది గర్వకారణం?
నరజాతి చరిత్ర సమస్తం
పరపీడనపరాయణత్వం,
వైషమ్యం, స్వార్థపరత్వం
కౌటిల్యం, ఈర్ష్యలు, స్పర్థలు
మాయలతో మారుపేర్లతో
చరిత్రగతి నిరూపించినవి."

—శ్రీశ్రీ

* *

"భగవంతుని అచ్చాఫీసు
ప్రచురించిన మానవ ప్రకృతికావ్యంలో
లెక్కలేని అచ్చుతప్పుల్ని
ఇక్కడ మానవుడే దిద్దుకోవాలి."

—ఆరుద్ర.

# మారుతున్న విలువలు 'కథానిక'

## శ్రీ పురాణం సుబ్రహ్మణ్యశర్మ

ఒక కథను మొదటిసారి చదివినపుడు మనకు కలిగే ఆనందం తాత్కాలికమేనా ? ఆ కథను మళ్ళీమళ్ళీ చదివితే మనకు మొదటిసారి కలిగినంత ఆనందం కలుగుతుందా- అలా కలగకపోతే ఆ తప్పు రచయితదా ? మనదా ?

నా చిన్నప్పుడు అప్పుడు ప్రసిద్ధులైన వారి కథలెన్నో చదివాను. మళ్లీ ఆకథల్నే పదేళ్ళు, ఇరవైయ్యేళ్ళ తరువాత చదివేను. అలా చదివిన కొంతమంది ప్రఖ్యాతుల కథలు ఎంతో చప్పగా వున్నా యనిపించింది. నాకు వారిమీద జాలికూడా వేసింది. తప్పో - రైటో ఇప్పటి కుర్రాళ్ళకు తెలిసినంత 'టెక్నిక్' కూడా వీరికి తెలియదేమో అనిపించింది. దానాదీనా మనం కళాఖండా లనుకునే వాటికి గొప్పకథ లనుకునే వాటికి ముందుముందు ఇదే గతి పట్టవచ్చు నని నా కనిపించింది. అన్ని కథలకు యీ ట్రాజిడీ వర్తిస్తుందో లేదో నాకు తెలియదుగాని కొన్నివేల కథలు మఖలో పుట్టి పుబ్బలో మాడి పోతూవుంటాయి.

కథానిక కుర్రవాళ్ళసొత్తు. కథ వ్రాయటానికి మంచి ఉత్సాహం కావాలి. నలుగురు చదువుకుని ఆనందించే కథలు వ్రాయటం బ్రహ్మవిద్యేంకాదు. ఎవరు పడితే వారు వ్రాయవచ్చు. జీవితంలో బోల్డు వైవిధ్యం వుంది. అది తరగని గని. ఎంతమంది రాసినా వచ్చిన నష్టం ఏమీలేదు. తీయగా తీయగా రాగం అన్నట్టు రాయగా రాయగా కథ!

తెలుగు కథానిక మనం ఎరువు తెచ్చుకున్న ప్రక్రియే అయినా దాన్ని దాదాపు మనం స్వంతం చేసుకున్నట్లే! కథలు చదివి మెచ్చుకొనడానికి సాహిత్యంతో ఏం పరిచయం వుండనక్కర్లేదు. పోయిట్రీ కున్న భగజం టక్కులూ దీనికి లేవు. ఇది సూటిగా జనంలోకి పోతుంది. ఏటా కొన్ని వేలకథలు కొన్ని లక్షలమంది చదువుతున్నారు. భాషతో సాహిత్యంతో పరిచయం అట్టే లేనివాళ్ళు కొన్నివందలమంది కథలు రాస్తున్నారు. కథల popularity కి, కథల యోగ్యతకు అట్టే సంబంధం లేదు. చాలా బాగా రాయని కథలు జనాన్ని ఆకర్షించవచ్చు. Perfect గా రాసిన కథలు ఎవరూ చదవకపోవచ్చు. కథానిక హైబ్రోస్ కోసంకాదు. ఇంటలెక్చువల్ జిమ్నాస్టిక్స్ చేయటంకోసం కాని సిద్ధాంత రాద్ధాంతాల కోసమసలుకాదు. తాత్కాలిక మానసిక ఆనందంకోసం తన్మయత్వం కోసం కథ చదువుతారు కాని కథలు చదివి ఎవరూ జీవితసమస్యలను పరిష్కరించు కోరు. పాఠకుడికి ఎటువంటి తన్మయత్వం కలిగించాలి, అతడికి ఎటువంటి ఆనందాన్ని కలుగచేయాలి అనే విషయాన్ని రచయితలు ఎవరికి వారే నిర్ణయించుకోవాలి. రచయితకు ముఖ్యమైన బాధ్యత ఏమిటంటే తనకు తెలిసిన విషయం రాస్తున్నాడా, తెలియకుండా

రాస్తున్నాడా అనేది. కౌరవుల్ని సమర్థించినా పాండవులను సమర్థించినా రచయితకు బేసిక్ నిజాయితీ చాలా అవసరం. కథలకు కావలసిన ముడిసరుకును జీవితంనుంచి పిండుతాము కాబట్టి జీవితాన్నిగూర్చి సరైన అవగాహన వుండితీరాలి. భాషమీద అధికారం సంపాదించుకోకుండా రచనచేసి మెప్పించటం సాధ్యంకాదు. శక్తివంతమైన రచనకు శక్తివంతమైన expression అవసరం కదా! దీనికి పాత కొత్త అన్న భేదం లేకుండా ఏ మారుమూల సాహిత్యమైనా అధ్యయనం చేయవలసిందే - సంప్రదాయం తెలుసుకోకుండా సంప్రదాయాన్ని ఖండించటం ఎలాగ? బాగా చదవకపోతే, సరైన అవగాహన లేకపోతే, నిజాయితీ లోపిస్తే ఆ రచనకు విలువ వుండదు. "చిత్తశుద్ధి లేని శివపూజ లేలరా" అన్నారు.

'నేటి సాహిత్యంలో మారుతున్న విలువలు - కథానిక' గూర్చి నన్ను వ్రాయమన్నారు. ఏం చెయ్యాలి? కొందరి కథలు ప్రపంచానికి బాధ - కొంతమంది తమ కథలలో ప్రపంచపు బాధనంతా పరికిస్తారు. మన జీవితంలో వచ్చే మార్పులే మన సాహిత్యం కళల్లో కూడా వస్తాయి. ఏ తరం ఆ తరానికి కావలసిన సాహిత్యాన్ని సృష్టించు కుంటుంది. రేపటి రచయితలు రేపటికి కావలసిన కథలు రాస్తారు. మనకు ఎలాంటి కథలు యిష్టమో చెప్పటం వేరు - యిలా రాయండి, యిలా రాయకండి అని చెప్పటం వేరు. రచయితలను శాసిస్తే వారు శాసనోల్లంఘనం చేస్తారు. మనం "యువతరం" అని ఎవరిని గురించయితే చెప్పకుంటున్నామో వారంతా వయసుచేత యువకులేమో కానీ భావాల్లో అభిప్రాయాల్లో ఆచరణలో అంతా యువకులు కాజాలరు. అలాగే వృద్ధుల్లోకూడా - బూజుపట్టిన భావాలు కుళ్లు సంస్కారం కలవాళ్ళు యువకుల్లో ఎంతమంది లేరు? నాకు తెలిసిన ఒకయమ్మే కుర్రాడు కట్నం లేకుండా పెళ్ళిచేసుకుని, తరువాత మరదలు పెళ్ళికి హెచ్చుగా కట్నమిచ్చారనే సాకుమీద పెళ్లాన్ని రాచిరంపానపెడితే ఇద్దరు బిడ్డలతల్లి ఆత్మాభిమానంచేత తల్లిదండ్రులను కట్నం ఇమ్మని అడగలేక ఆత్మహత్య చేసుకుని మరణించింది. వీళ్ళంతా యువకులేనా? కాలేజి అమ్మాయిలు, ఉద్యోగినులు వ్రాసిన కొన్ని వేలు, వందల కథలూ, వ్యాసాలూ నేను చదివాను. అన్నింట్లో నాకు ఆడదాని కన్నీరు, నిస్సహాయత, సాంఘిక దురన్యాయాలపట్ల వ్యగ్రత కనువించింది. మన దేశంలో చదువుకుని పెళ్ళికాకుండా వుండిపోయిన కన్యలను చూస్తే మన యువకుల సంస్కారహీనత, రసజ్ఞతా, దారిద్ర్యం వెల్లడవుతుంది. బస్సులమీద రాళ్ళు వేయటం, బీచిలో మానభంగాలు చేయటం, ఆఫీసులలో పనిచేసే ఆడపిల్లలను అవమానించటం, నేటి యువకులకు సంబంధించిన ఏ విషయం విన్నా ఏ వార్త విన్నా జుగుప్స కలుగుతోంది. వారిని తల్చుకుని గర్వపడదగిన అంశాలే కానరాకుండా వున్నాయి. దేనినైనా ప్రశ్నించే అర్హత వారికి వున్నదా? పాత దైనంతమాత్రాన ప్రతిదీ మంచిదికాదు. కొత్త దైనంత మాత్రాన ప్రతిదీ శిరోధార్యమూ కాదు. వీ రొక్కరే కాదు యీనాడు ఆలోచిస్తున్నదీ ప్రశ్నిస్తున్నదీ. ఆదినుంచీ మానవుడు ఆలోచిస్తూనే వున్నాడు. ప్రశ్నిస్తూనే వున్నాడు. దాని చరిత్ర మానవ నాగరికతా చరిత్ర. నీ తండ్రికూడా యువకుడే. అతని కాలంలో

అప్పటి విలువలను అతను ప్రశ్నించాడు. నువ్వొక్కడివే వీరుడివీ, శూరుడివీ కాదు. నీ వెనకతరంలోనూ, నీ ముందరతరంలోనూ, వీరులూ, శూరులూ, ధీరులూ వున్నారు. ఎంతవారికైనా అహంకారం పనికిరాదు, లోతైన అవగాహనకు మన యిష్టాయిష్టాలు ఎన్నడూ అడ్డురాకూడదు.

సాహిత్యసృష్టి వ్యక్తిపరమైన కృషి. దానిపై సాంఘిక అజమాయిషీ పనికిరాదు. work shop పెట్టి మనం కథలు రాయించగలమా? కథ్రలాయటం individual geniusకి సంబంధించిన విషయం. కథలు ఎలా రాయాలో ఎవరూ చెప్పలేరుగాని - ఎలా రాయకూడదో మనం చదివి తెలుసుకొనటానికి బోలెడు అవకాశం ఉంది.

త్రాగుడు, సెక్సుమీద Social taboo వుంది. ఈ రెండిటిపై టాబూ లేనట్లు వూహించి కథలు వ్రాసినమాత్రాన కాని విలువలు మారిపోతాయా? మనకు లేని ఆరు బయట వీధి శృంగారాన్ని నవలల్లోనూ కథల్లోనూ చిత్రిస్తూ వుంటారు. అంతమాత్రంచేత అవన్నీ జీవితంలో ప్రవేశిస్తున్నాయా అంటే లేదు. అనుకరణ వేషభాషాదికాలవరకే! నాకూ చాలా అనుమానాలు వున్నాయి. జీవితంలో వచ్చే మార్పులన్నీ సాహిత్యంలో రావటాని కవకాశంవుందా? జీవితం మారినంత వేగంగా సాహిత్యం, దాని విలువలూ మారుతాయా? అంత యీజీగా మారవు. అయితే కొన్ని సర్దుబాట్లుమాత్రం జరుగుతాయి. మనం తీసుకెళ్ళి కథానికను ఒక సూత్రానికో, ఒక సిద్ధాంతానికో, ఒక నమ్మకానికో ముడిపెట్టి దాన్ని గుంజకు కట్టివెయ్యకుండా వుంటే అది చెంగు చెంగు మని దుముకుతూ, స్వేచ్ఛగా విహరిస్తుంది. ఒక కొత్త రచయిత ఒక మంచి కొత్త కథ వ్రాసినపుడల్లా తెలుగు కథానిక యింతింతై వటుడింతయై అన్నట్లు అంతంతెత్తు ఎదిగిపోతుంది. దాని భవిష్యత్తు కొత్తవారి చేతుల్లో వుంది.

*

"అదృష్టవంతులు మీరు,
వెలుగును ప్రేమిస్తారు
ఇతరుల ద్వేషిస్తారు
మంచికీ చెడ్డకీ నడుమ
కంచుగోడలున్నాయిమీకు,
మాకు గోడలు లేవు.
గోడలను పగులగొట్టడమే మాపని.

—శ్రీశ్రీ.

# మారుతున్న విలువలు - నాటకం

**శ్రీ గొల్లపూడి మారుతీరావు**

కాలం మారిపోతుంది. విలువలు మారిపోతున్నాయి. మనుషులు మారుతున్నారు. స్వభావాలూ, దృక్పథాలూ, అలవాట్లూ, ఆచారాలూ - అన్నీ మారిపోతున్నాయి. కాని యీ తెలుగుదేశంలో మారనిది ఒక్కటివుంది. తెలుగు నాటకరచయిత దృక్పథం.

బ్రిటిష్‌పాలనకు-దేశీయపాలనకు మలుపులో నిలిచిన కొద్దిమంది రచయితలు-తమది కాని (బ్రిటిష్ సంఘాన్ని) Popular appeal కోసం సాధిస్తే-ఆరోజు చెల్లింది. నలుగురూ చప్పట్లుకొట్టారు. మెచ్చుకున్నారు. మరి యీరోజు సంఘం ఎవరిది ?- నీదీ, నాదీ అందరిదీనూ. "సంఘానికి హృదయం లేదు. సమాజం మనల్ని బ్రతకనివ్వదు-" లాంటి మాటలు ఎందుకో - ఇంకా వింటూంటే యివాళ జుగుప్స పుట్టిస్తాయి. సంఘం - మనపై - మన నైమిత్తిక జీవితానికి మనమే ఏర్పరచుకొన్న discipline అనుకుంటే - అది చెడినప్పుడు విమర్శించుకోవలసింది మనలనే అని గుర్తించినప్పుడు-ఈ "సంఘం" బారినుంచి నాటకం బ్రతుకుతుంది.

20 సంవత్సరాలక్రితం అవసరమైన-యిప్పుడు వెకిలిగా కనిపించే-చాలా విషయాలు యీ విధంగా యింకా మన నాటకాల్లో కనిపిస్తున్నాయి. నాటకరంగంలో monotony కి యిది ఒక కారణం. యివాళ్టి రోగాలకి యింకా బలమైనవి, కొత్తవి ఏవో మందులు కావాలి. అవి ఏమిటి ? వాటిని ఎంత బలంగా, ఎంత కొత్తగా, ఎంత జాగ్రత్తగా ఎదుర్కోవాలి ?-అని రచయిత ఆలోచించాలి.

20 ఏళ్ళ క్రిందట మనదయిన యీదేశంలో మొదటిసారిగా సమాజాన్ని గురించీ, మన సమాజ జీవితాన్ని గురించీ ఆలోచించాడు రచయిత. ఇక్కడ కనిపించే అవినీతిని ఎత్తిచూపాడు-(ఎన్‌జీవో, మావూరువంటి నాటకాలు) కాని, క్రమంగా ఆ అవినీతి వ్యక్తిని నాశనంచేసి, మనకు కంటికి కనిపించనిచోట గుర్తుపట్టలేనంతగా రక్తంలో జీర్ణమయిపోయింది. క్రమంగా దాన్ని మరిచిపోయి-నేలవిడిచి సాము ప్రారంభించాడు రచయిత. సమాజపరమయిన అవ్యవస్థ క్రమంగా వ్యక్తినీ నాశనం చేసింది-నైతికంగా మనిషి జారిపోయాడు. ఇలా moral vacancy-ఏర్పడిన ఈ రోజుల్లో మనిషిని దక్కించుకోవలసిన సునిశితమయిన, సహజమయిన, బలమయిన రచనలు రావాలని నా ఉద్దేశం.

ఇవాళ జీవితంలో "వేగం" పెరిగింది. శాస్త్రీయ పరిణామాల ద్వారా, ప్రయోగాల ద్వారా-ప్రపంచం Shrink అవుతోంది. ఇవాళ అమెరికా వెళ్ళడం కష్టంకాదు... పదిమంది చేసేపని ఒక్కడు చెయ్యడం కష్టంకాదు. చంద్రుడిదగ్గరకు వెళ్ళడం కష్టంకాదు. అంతే

జీవితం తాపీగా తాబేలు నడక మాని లేడిలాగా పరుగుపుచ్చుకొంది. మనిషి Restless అవుతున్నాడు. ఇది కారణంగానే "నాటిక" పుట్టిందనుకుంటాను. సమాజంలో విస్తృతంగా చెప్పనవసరంలేని సమస్యల్ని క్లుప్తంగా, సూటిగా, ధాటీగా చెప్పడానికి ఒక బలమైన సాధనంగా "నాటిక" పుట్టింది. సమాజంలో విలువల మార్పుకి యిదొక ముఖ్య నిదర్శనం. మరి దీన్ని ఎందరు సద్వినియోగం చేసుకుంటున్నారు ? మూడు నాటకాలకు సరిపోయే సమస్యల్ని నాటికల్లో యిరికించి ఒక క్లైమాక్స్, ఒక యాంటిక్లైమాక్సుకూడా యిరికించి సమస్యల్ని పులిమి, వాటిని పరిష్కరించటానికి యాతనపడి చివరికి అస్తవ్యస్తంగా ముగుస్తోంది నేటి తెలుగు నాటిక.

ఒకే ఒక చిన్న విషయాన్ని బలంగా మనస్సుకి తాకేటట్టు సూటిగా సంధించే సాధనం నాటిక. దానిలో క్లయిమాక్సులు లేకపోయినా ఫరవాలేదు. వేగం, వాడి వుంటే చాలు. ఒకేపాత్ర, ఒకే అంశం ఉన్నా చాలు. నాటిక చూశాక ఒక సమస్యవేపుకు మన దృష్టి మళ్ళితే అది కృతార్థత చెందినట్లే.

అసలు "నాటకం", "నాటికల" ప్రయోజన మేమిటి ? నాటకం చేసే పనిఏమిటి ? అని ప్రశ్నించుకొందాం. ఇక్కడ నేను Ibsen ని సాక్ష్యం చెప్పుకుంటాను — ఒక anthology కి ముందుమాట వ్రాస్తూ "నాటకం సమస్యల్ని పరిష్కరించదు - ఎత్తి చూపుతుంది. వీళ్ళు మీ నిత్యజీవితంలో తటస్థ పడుతున్న పాత్రలు, వీళ్ళ మంచిచెడ్డలివి, మీరు వీళ్ళద్వారా ఎదుర్కొంటున్న సమస్య లివి. వీటిని పరిష్కరించుకోవటానికి మీ రేంచేసారు ? అని ప్రశ్నించడమే నా పని." అని అన్నాడు అంతవరకే నాటకం చేసే, చెయ్యగలపని అని నా ఉద్దేశం.

"Sweet bird of youth" అనే నాటకంలో ప్రఖ్యాత అమెరికన్ నాటకరచయిత టెన్నిసీ విలియమ్స్ - తన ముఖ్యపాత్రచేత చివరగా చెప్పించే Curtain line యిది. "I don't ask for your pity, but just for your understanding - not even that- no- Just for your recognition of me in you, and the enemy, time, in us all" అని. అతను కథను ముగించలేదు. చివరికి ఎత్తుకున్న సమస్యలన్నీ అలాగే ఆగిపోతాయి. అయితే ఆ ముఖ్యపాత్ర మనల్ని ఎందుకో చివరంటా జిజ్ఞాస కలిగిస్తూనే వుంటుంది. చివరికి పైవిధంగా ఆపాత్ర చెప్పాక ఒక్కసారి తుళ్ళిపడతాం ఏం జరిగిందని ఆలోచించేలోగా నాటకం ముగుస్తుంది. తర్వాత ఆ పాత్రను గురించి, ఆసమాజం గురించి మనం ఆలోచించకుండా వుండలేం.

కాని మన నాటకాల్లో, సినీమాల్లో పాత్రలన్నీ, ఎత్తుకున్న సమస్యలన్నీ పరిష్కారం కావాలి. (ఎవరు ఈ పరిష్కారం చేసేది :— రచయితా !!) చివర అంతా సుఖపడాలి. గ్రూపు ఫోటోకి రావాలి. కాని కేవలం పాత్రల్ని లేదా ఎత్తుకున్న సమస్యనీ మాత్రమే ఎందుకు ముగించి వదిలిపెట్టగూడదు ! ఆ సమస్యమీద రచయిత ఒక్క సమీక్ష (టెన్నిసీ విలియమ్స్ లాగ) చేసి ఎందుకు వదలకూడదు ? (ఇక్కడ అలాచేసిన ఒక యిటీవలి సినిమా ఉటంకిస్తాను. "మనుషులు మారాలి" లో మన అలవాట్లప్రకారం దుర్మార్గులు

శిక్షించబడలేదు. కాని రచయిత చెప్పదలుచుకున్న సమస్యని సమీక్షించి దానిని ఒక ముగింపుకి తెచ్చి వదిలేశారు !)

"ఒక చెట్టూ రెండే పువ్వులూ'' నాటకంలో కేవలం సమస్యని ముగించి లేదా సమస్యపై ఒకమాటు సమీక్షచేసి ఒక poser గా నాటకాన్ని ముగిస్తే చాలామందికి అర్థం కాలేదు. ఒకచోట ప్రదర్శించినప్పుడు నాటకం అయిపోయిం దని చెప్పాల్సివచ్చింది. అంటే - చివర గ్రూపు ఫొటో లేదన్న బాధ చాలామందిలో కనిపించింది !

ఎందుకు ? మనం యింకా పాతరోగాలకి పాతమందుల్నే వాడుతున్నాం కనుక. కొత్తమందుల్ని స్థిరపడిపోయిన ఆ పాతరోగాలకే వాడాలని ఎవ్వరినీ సిద్ధపరచలేదన్న మాట. ప్రేక్షకుల దృక్పథాన్ని మనం మార్చుకోలేదన్నమాట. మన ప్రేక్షకుల్ని మనం పోగొట్టుకుంటున్నామన్నమాట. యివాళ యిదీ పెద్దసమస్య. మనం పాతధోరణిలో, ఒక analysis లేని పాతఫక్కీరచనలలో మనం మన ప్రేక్షకుల్ని నష్టపోయాం. అదే ఆంధ్ర దేశంలో నాటకానికి పురస్కారం లేకపోవడం అంటే అర్థం.

ఇంకొక ముఖ్య విషయం :

నేటి యువతరం కొత్తపోకడలు పోతోంది. వింతపోకడలుకూడా పోతోంది. తిరగ బడుతోంది. అన్నిచోట్లా అలజడి, అరాచకం కనిపిస్తున్నాయి. ఈ పరిస్థితిలో నాటక పాత్ర ఏమిటి ? ఈ వ్యవస్థ ఏనాటికలో ప్రతిబింబిస్తోంది ? ఎటు ప్రయాణం చెయ్యాలో తెలీక, ముందు తనకి సంక్రమించబోతున్న ఈ దేశాన్ని నమ్మలేక, చీకటిలో నిలబడ్డ యువతరం వెర్రికేకపెట్టి - పిచ్చివాడిలాగ వీథిని పడడాన్ని ఏ రచయిత నాటకంలో బిగించాడు ? ఈ మధ్య ''ప్రజల్ని నరికెయ్యాలి, చంపెయ్యాలి" అంటూ భీషణనినాదాలతో ఒకటి రెండు రచనలు కనిపించాయి. ఇక్కడ నాటకపరంగా ఒకటి చెప్పాలనిపిస్తోంది. సాహిత్యప్రక్రియద్వారా - అంటే నాటకంద్వారా యిలాంటి అవ్యవస్థను గర్హించే రచయిత ఆ వ్యవస్థను ప్రేమించగలగాలి. లేకపోతే ఆ వ్యవస్థను గర్హించే అర్హత లేదు. సాహిత్యం సంస్కరణకు, వికాసానికి ఉపయోగపడవలసిన "సాధు'' ప్రక్రియ అని నా మతం. అంతేకాని సమూల వినాశానికి సాహిత్యం ఎందుకు ? కత్తిపట్టుకుంటే చాలదా ?

చెడిపోతున్న, నాశనమయిపోతున్న వ్యవస్థని సానుభూతితో, సహనంతో ఔదార్యంతో పరిశీలించగలిగిన రచయితే దానికి కావలసిన మార్పుని సూచించగలడు. లేకపోతే యిలాంటి Volcanic Subjects కోతిచేతిలో దివిటీలాగ చాలా ప్రమాదకరమైన పరిమాణాలు సాధ్యం కావచ్చు. You must be able to love the Society, which you want to reform. It is only then, the reformation is possible.

అందువల్ల నానాటికీ శిథిలమయిపోతున్న మనిషి నైతిక జీవితాన్ని పునరుజ్జీవింపచేసే రచనలు నానాటికీ వేగంతో పురోగమిస్తున్న యీ 'Restless' స్వభావాల్ని కాస్త ఆపి, ప్రశ్నించే రచనలు - ఔదార్యంతో, దయతో, ఓర్మితో తప్పుత్రోవపట్టిన వ్యక్తిని సంస్కరించే రచనలు కేవలం సమస్యను సామాజిక జీవితాన్ని ఆవిష్కరించి పరిష్కారాన్ని వ్యక్తికే వదిలేసే గడుసయిన రచనలు రావాలనుకొంటాను.

నానాటికీ సామాజిక విలువలు మారిపోతున్న యీకాలంలో ''నాటకం" పాత్ర యిది.

# సాహిత్యంలో మారిన విలువలు - కవిత

శ్రీ కుందుర్తి

సాహిత్యంలో విలువలు మారుతున్నా యని అందరూ అంగీకరించిన విషయమే. మారు తున్నాయి అనవలసిన అవసరం యింకలేదు; మారాయి అనవచ్చు. ఎందుకంటే, యీమార్పు ఎల్లప్పుడూ జరుగుతుండేదే అయినప్పటికీ, ఒకానొకకాలంలో స్పష్టంగా బైటపడినప్పుడు యీ మార్పు జరిగింది అంటాము. ఆధునికయుగంలో విలువలు మారడం అనేది కందుకూరి, గురజాడ, గిడుగు ప్రభృతుల కాలంనుండి ప్రారంభమై నేటికి దాదాపు ఒక స్థిరత్వాన్ని పొందింది. ముఖ్యంగా గమనించవలసిన విషయ మేమంటే. యీ విలువల మార్పు అనేది మిగతా జీవితరంగాలను అన్నింటినీ వదలిపెట్టి ఒక్క సాహిత్యంలోనే రాదు. వచ్చిన మార్పుయొక్క ప్రభావం అన్ని జీవితరంగాలను ఏకకాలంలో తాకుతుంది; కొంచెంముందు వెనుకా. అంతే. అంటే యీనాడు మనం మారిన విలువలు అనుకుంటున్నవి ఆధునికయుగం ప్రారంభమైన తర్వాత వచ్చిన భావ విప్లవానికి సంబంధించినవి. ఇష్టం వున్నా, లేకున్నా యీ మార్పుకు ప్రధానమైన కార ణాలుగా, ఆంగ్లభాషా నాగరికతల ప్రభావమూ, ప్రపంచవ్యాప్తమైన వైజ్ఞానిక ప్రగతి, ఆధునిక శాస్త్రీయ దృక్పథము, అక్టోబరుమహావిప్లవము మొదలైనవాటిని అంగీకరించక తప్పదు. విలువలు మారడమంటే, విశ్వాసాలు మారడం. పేర్కొన్న కారణాలవల్ల మతము, సంఘము, మనిషి, ప్రగతి మొదలగువాటిపట్ల మన పూర్వ విశ్వాసాలు సడలి పోయి కొత్త విశ్వాసాలు ఏర్పడినవి. సంఘంలో మతంయొక్క ప్రాధాన్యం పూర్తిగా సన్నగిల్లిపోయి, అది మానవుడి ఆంతరంగిక విషయంగా సంకుచితమైపోయింది. సమాజ వ్యవస్థ, దాని బాగోగులను గురించిన మన ఆలోచనలలో తీవ్రమైన మార్పువచ్చి, మార్క్సిజం ప్రభావం బాగా ఎక్కువై, శాస్త్రీయదృక్పథం అలవడింది. దేనినిగాని మూఢంగా విశ్వసించే రోజులు పోయి, ప్రతిదానినీ ప్రశ్నించే తిరుగుబాటుతత్వం వృద్ధి పొందింది. జరుగుతున్న వైజ్ఞానిక ప్రగతివల్ల, మానవుడు సాధించగలుగుతున్న అనేక విజయాలవల్ల, దైవంలో విశ్వాసం సడలిపోయి. మనిషి ఆత్మవిశ్వాసాన్ని పొందగలి గాడు. ప్రగతి అనేది నిరంతరమైనదనీ, దానికి వెనుకచూపు లేదనీ, ఎన్ని తంటాలు పడినా గతం పునరావృతం కాదనీ, యీనాటి సాంఘిక వ్యవస్థ సోషలిజం మొదలగు నూతన మార్గాలవైపు పురోగమించాలేగాని, ఫ్యూడలిజంవంటి పూర్వవిధానాల పునరుద్ధరణ అసంభవం అనే అంశాలు మనఆలోచనా రీతులలో బాగా బలపడిపోయినవి. ఇటువంటి సమూలమైన మార్పు జరిగినప్పుడే విలువలు మారడం, అవి మారినట్లు స్పష్టంగా మనకు కనిపించడం జరుగుతుంది.

మారిన విలువల ప్రసక్తి వచ్చినప్పుడు, అసలు మారకుండా ఉండే శాశ్వతమైన విలువలు వున్నాయా అనే ప్రశ్న రాకతప్పదు. ప్రతిదీ మారడం, సృష్టిలక్షణమైనప్పుడు మారని విలువలు అనేవి వుండడం సాధ్యమా అనేది ఆలోచనీయము. సత్యం, శివం, సుందరంవంటి లక్ష్యాలు శాశ్వతమైన విలువలని అనాదిగా విశ్వసించబడుతున్నవి. కాని, "అంటే ఏమిటి?" అనే ప్రశ్న రానంతకాలమే యివి శాశ్వతమైనవిగా నిలిచివుంటాయి. ధర్మంచర, సత్యంవద అంటే అందరూ అంగీకరిస్తారు. కాని ఏది ధర్మం? అని ప్రశ్నించుకుని సమాధానం చెప్పుకోవలసివచ్చినప్పుడు విలువలు మారినయో లేదో తెలుస్తుంది అవి శాశ్వతంగా పనికివచ్చే సాధారణీకరణ సూత్రాలే గాని విలువలు కావు. "కవిత్వం మంచిగా వుండాలి. హృదయంగమంగా వుండాలి. రసవంతంతంగా వుండాలి" యివన్నీ విలువలని చెప్పడానికి వీల్లేదు. మనుషుల ఆలోచనారీతిలో, అవగాహనలో మార్పు వచ్చిన కొలది వారి కవితాస్వాదనశక్తిలో కూడా మార్పు వస్తుంది. అభిరుచులలో మార్పువస్తుంది. అయితే మరి, కావ్యం పదికాలాల పాటు నిలవాలి. శాశ్వతమైన విలువలు కలిగివుండాలి. అంటే అర్థంఏమిటి? ఆనాటి కాళిదాసు, షేక్స్పియర్ వంటి మహాకవులరచనలు ఎందుకు నిలిచివున్నాయి? ఇప్పుడు విలువలు మారినాయిగదా, సాహిత్యంలో వాటి స్థానానికి భంగంకలుగలే దెందుకు? అనే ప్రశ్నలు ఉదయిస్తాయి. ఏదైనా రచన పాఠకులచేత ఒకటికి పదిసార్లు చదువబడడానికి వుండవలసిన ప్రధాన లక్షణం ఏమంటే అందులో నిక్షిప్తమై వున్న సందేశము, దాని శైలి మొదలగునవి. సాధారణ పాఠకుల హృదయాలకు దగ్గరలో వుండాలి. అంటే, అవి Human emotions ను తాకి, హృదయాన్ని రెచ్చగొట్టి, ఆవేశం కల్పించి పాఠకుణ్ణి ఆనందపరచాలి. శకుంతలను అత్తవారింటికి పంపుతూ కణ్వమహర్షి పడిన వేదన, పుత్రులు కలుగలేదని దశరథుడు పడిన విచారము మొదలగునవి లోకంలో సర్వసాధారణంగా ఉండే మానవ హృదయ లక్షణాలు. ఒకదానిని ప్రేమించడం, తమ దనుకొన్న ఒకవస్తువు నశించినపుడు దుఃఖించడం మొదలగునవన్నీ హృదయానికి సంబంధించినవి. ఇటువంటి పట్టులలో పాఠకుని అనుభూతులను కూడా స్పృశించగలిగేటట్టు రాయడం రసవంతంగా రాయడం. ఇందువల్ల కొన్ని కావ్యాలు ఒకటికి పదిసార్లు చదివినా విసుగు ఉండదు. ఒక పెద్ద కావ్యంలో కొన్ని ఘట్టాలు మాత్రమే ఈ విధంగా వుంటాయి. ఇవి మాత్రమే చదివి మిగిలినవి వదిలివేస్తాము. ఈ విధంగా మానవజీవిత యదార్థ పరిస్థితికి అనుగుణంగా అందరి హృదయాలకు తగిలే విధంగా, అంటే రసవంతముగా వ్రాయడమే ఒకవిలువ అనుకుంటే యీ విలువకు మార్పులేదు. కాని సాధారణంగా మనం శాశ్వత విలువలు అనుకుంటున్న వాటిలో, ఇది చేరదు. ఇది రచయితయొక్క ప్రతిభావిశేషమును బట్టి వుంటుంది. పూర్వకవులపట్ల, పురాణపాత్రలపట్ల, మనకు ఉండే భక్తిగౌరవాలవలన కూడా కొన్నికావ్యాలు నిలిచివున్నట్లు కనిపిస్తాయి. కాని అవి చారిత్రకంగా మాత్రమే నిలిచివుంటాయి. ఉదాహరణకు ఇటీవల సాహిత్య ఎకాడమీవారు ప్రచురించిన 'ఒక రూపాయి' కావ్యాలు చాలా మంది కొన్నారు. కాని వాటిని చదివినవారు, చదివి ఆనందించినవారు నూటికి పదిమంది

కంటే యెక్కువ వుండరు. అటువంటివారిలోకూడ అధికసంఖ్యాకులు యీనాటి మారిన విలువల స్పృహ లేకుండా "గతకాలము మేలు వచ్చుకాలము కంటెన్" అనే విశ్వాసం కలవారు. అంతేకాక ఒక కావ్యము, ఒక శైలీవిన్యాసం వలననో, శ్లేషాద్యలంకార నిర్వహణ సామర్థ్యంచేతనో, సమాన కాఠిన్యబలంచేతనో, లేక ఎక్కువమందికి అందు బాటులో వున్న సారళ్యంచేతనో, నిరోష్ఠ్య నిర్గద్యాది కష్టతర నిబంధనచేతనో - ఏదో ఒక కారణంచేత చారిత్రకంగా నిలిచియుంటుంది. కాని యీ కారణాలు ఏవీ శాశ్వత విలువలని చెప్పటానికి వీలులేదు.

విలువలు మారడం అనేది ఆధునిక కాలంలో జరిగినంత మౌలికంగా ఇంతకు పూర్వమెప్పుడూ జరగలేదేమో అనిపిస్తుంది. సాంఘిక వ్యవస్థ మారినప్పుడల్లా విలువలు మారుతూ వుండడం, అవి సాహిత్యంలో ప్రతిఫలిస్తూ వుండడం జరుగుతూ ఉండేమాట నిజమే. కాని ఒక్క తెలుగుసాహిత్యాన్ని మాత్రమే దృష్టిలో పెట్టుకుని యీ విలువల మార్పును అంచనా వేయడానికి వీలుండదు. వేదకాలం నుండి జరిగిన రచనలన్నింటినీ సమగ్రంగా చూస్తేనేగాని మార్పులను పసికట్టటానికి వీలుండదు. దానితోపాటు ఇతర దేశాలలోని చరిత్ర, సంస్కృతి, సాహిత్యాలనుకూడా ఒకకంట కనిపెట్టి చూడాలి.

ప్రస్తుతాంశము మారిన విలువలు నేటి కవిత్వంలో ఏ విధంగా ప్రతిఫలిస్తున్నాయి అని. కవిత్వంలో మారిన విలువలు ప్రతిబింబించడం ప్రారంభమైనది అభ్యుదయ కవితా యుగంలో అని చెప్పాలి. అభ్యుదయ కవిత్వానికి, భారతాదియైన తత్పూర్వ కవిత్వానికి గల తేడా చాలా మౌలికమైనది. ఛందస్సులో, రచనారీతిలో, కావ్యపరమార్థంలో యీ రెండింటికి యే విధమైన పోలికలేదు. మారిన విలువల ప్రభావం ఇతరరంగాలవలె సాహిత్యంలోకూడా అనంతకోటిరూపాలలో దర్శనమిస్తుంది. సాంప్రదాయికఛందస్సును తృణీకరించి కొత్త ఛందస్సులను సృష్టించడానికి ప్రయత్నించడం, అసలు ఛందస్సే పూర్తిగా పనికిరాదని ఎదురుతిరగడం, ఛందస్సువలన కలిగే ప్రయోజనాలను యితర విధాలలో సృష్టించుకోవడం, ప్రకటనరీతిలో కొత్తదనంకోసం ప్రయత్నించడం, వ్యాకర ణాన్ని ఉల్లంఘించడం. అలంకారాల భారాన్ని విసర్జించడం, అతిసామాన్యుడికి కావ్య నాయక గౌరవం కల్పించడం, సామాన్యప్రజల జీవిత విశేషాలను చిత్రించడం ద్వారా కల్పనాత్మకమైన కవిత్వానికి వాస్తవికత అనే కొత్త లక్షణాన్ని కల్పించడం - ఇవి అన్నీ, ఇంకా యిలాంటివి ఎన్నో మారిన విలువలు సాహిత్యంలో ప్రతిఫలించినప్పటి ఫలితాలే. అభ్యుదయ కవితాయుగం తరువాత వచ్చిన వచన కవితాయుగం ఇంకా ఇటీవలి కాలంలోని కొత్తపోకడలు మొదలగు వాటిలో కొత్తకోసం నిరంతరం ప్రయత్నం జరుగుతున్నప్పటికీ విలువలు మారడం అనేది మళ్ళీ ఇప్పుడప్పుడే జరిగే పనికాదు. అభ్యుదయ కవితాయుగంలో కావ్యపరమార్థం సోషలిస్టు సమాజస్థాపనము. అప్పటికి అది కొత్త. ఇప్పుడు అది సర్వసాధారణమైపోయింది. అలాగే ఛందస్సును నిరాదరించడం ఆనాడొక విప్లవం. అది నేడు అంగీకారయోగ్యమై వచనకవిత రూపంలో ప్రజాభి మానాన్ని చూరగొన్నది. అంటే దీని అర్థము ఆధునిక యుగంలో మారిన విలువలు

నేటికి ప్రజలందరి ఆమోదాన్ని పొందినవని. ఈనాడు కవిత్వంలో అధికసంఖ్యాకులైన కవులు చేపట్టిన వచన కవితారూపము ఆధునికయుగంలో జీవితపు విలువలలో వచ్చిన అన్ని మార్పులకు సాహిత్యంలో ఏకైక ప్రతినిధిగా వృద్ధిపొందింది. కవికి కావ్యవస్తువు ఎన్నికలో సామాజిక స్పృహ వుండడంఅంటే "ఆద్య నత్క్ ఫల్ వావిరిపుట్టు రత్నములు" అనే ధోరణితో వెనుకకుపోకుండా, సమకాలీన సమాజంలోని వాస్తవిక పరిస్థితుల చిత్రణ ద్వారానూ, వాటి కారణాల పరిశీలనద్వారానూ ప్రజలలో చైతన్యం కలిగించి, సంఘం మార్పుచెందటానికి దోహదకరమైన కావ్యవస్తువులను మాత్రమే ఎన్నుకోవడం వచన కవితయొక్క ప్రధాన లక్షణం. వచనకవిత బాగా విస్తరించిన తరువాత ఈ ప్రధాన లక్షణానికి కొద్దిమంది కవుల విషయంలో విఘాతం కలుగకపోలేదు. కాని, దానిని అంతగా పట్టించుకోనవసరంలేదు. ఈనాడు కవిత్వం రాస్తున్న వేలాది యువకుల కవితాభ్యాసం వచనకవితతో ప్రారంభమవుతున్నది. వ్రాయడం తలపెట్టిన మొదటి కవితలోనే మానవుడు, అతని కష్టసుఖాలు, అతన్ని దుర్భరపరిస్థితిలోకి యీడ్చిన సమాజం, కవిచుట్టూ తాండవిస్తున్న అవినీతి, అక్రమ మార్గాలు, సమాజంలోని కుళ్ళు, పెద్దమనుషులనబడుతున్నవారి బండారం మొదలగు విషయాలు అప్రయత్నంగానే చోటుచేసుకుంటున్నవి. ఇటువంటి అభ్యుదయ భావాలకు వచనకవిత ఒక్కటే సరియైన వాహనం అన దానికి యింతకు మించిన ఋజువు ఏంకావాలి ? అలాగే, కవిత్వంద్వారా జరిగే ప్రబోధం సామాన్యపాఠకులకు అందుబాటులో ఉండాలి అనే ఆశయంతో పూర్వకావ్యభాషనూ దాని అంగాలైన అలంకార, వర్ణన, సమాసాధిక్యతలను విసర్జించి, వాడుకభాషలో కవిత్వం చెప్పే అలవాటు ఏర్పడింది. అంటే చెప్పేవిషయమూ, రీతీ పూర్తిగా మారిన కొత్త కవితారూపముగా వచనకవిత స్థిరపడిపోయింది.

అభ్యుదయ కవితాయుగంలో గానీ, ఇటీవలి కాలంలోగానీ, కవిత్వంలో వచ్చిన కొన్ని వికృత లక్షణాలను గురించి చెప్పకుండా వదలిపెట్టటానికి వీలులేదు. క్రొత్తను సృష్టించాలనే ఉబలాటంతో అయోమయత్వము, అర్థ రాహిత్యమూ, అన్వయక్లిష్టత మొదలగునవి కొందరి రచనలలో చోటు చేసుకున్నవి. నూతన ప్రయోగాల పట్ల, పాశ్చాత్యకవులు పోయిన పోకడలపట్ల కొందరు ఆధునిక కవులకు గల మోజు ఈ పరిస్థితికి దోహదం చేసింది, నిజమైన ప్రగతివాదకవులకు ప్రయోగవాద లక్షణాలు కలిగిన కవులకు లక్ష్యము ఒకటే అయినా ఉభయులు వుద్దేశించిన కావ్యపరమార్థం ఒకటే అయినా ప్రజల దగ్గరికి చేరడంలో ప్రయోగవాద కవిత్వము విఫలమైనదనే చెప్పాలి. దీనికి కారణం, సంఘంలో మారిన విలువలయొక్క స్వరూప మేమిటో వాటిని కవిత్వానికి వర్తింపజేసినప్పుడు సాధింపవలసిన ఫలితాల స్వరూపమేమిటో సరియైన అవగాహన లేకపోవడమే. అభ్యుదయయుగంలోని కవులలోనూ, ఇప్పటి యువకవుల్లోనూ, ఈ తెగకు చెందినవారు కొందరున్నారు. వచన కవితలో సమాస బాహుళ్యము, కావ్యభాష, శ్లేషలు, యమకాలు ఎందుకుండకూడ దని ప్రశ్నించేవారూ, సమాజం యెంత కుళ్లుగా వుందో అంత కుళ్లు మాటలతో అంత తీవ్రతతోనే దానిని ఎందుకు నిరసించరాదు.

అని ప్రశ్నించేవారూ రకరకాల వాదనలు చేసే కవు లున్నారు. ఏది ఏమైనా సమతా సమాజవాద కవితా లక్షణాలను గుణించిన అవగాహన కలిగివుండడం కవులైనవారికి నేడు చాలా అవసరం.

సామాజికవ్యవస్థ మారినపుడు విలువలు మారుతాయి అనుకున్నాంగదా ! మరి మనదేశంలో సామాజికవ్యవస్థలో మౌలికమైనమార్పు ఏమి వచ్చింది అని ప్రశ్నించవచ్చు. ఆధునికయుగంలో మనరాష్ట్రము, మనదేశము, అనే సరిహద్దురేఖలు ఏనాడో చెరగిపోయినవి. ఆధునిక వైజ్ఞానికప్రగతి విజయాల ఫలితంగా నేడు ప్రపంచమంతా ఒకే మానవజాతి నివాసస్థలంగా రూపొందింది. ప్రపంచంలో చాలాభాగంలో పెట్టుబడిదారీ సమాజవ్యవస్థ మారిపోయి నూతనసోషలిస్టువ్యవస్థ యేర్పడింది. దీనిప్రభావఫలితంగా అన్నిదేశాలలో భావవిప్లవం వచ్చింది. ఆలోచనారీతి మారింది విలువలు మరాయి అవి సాహిత్యంలోనూ ప్రతిబింబించాయి.

మారిన విలువలు సాహిత్యంలో ప్రతిఫలించిన సందర్భంగా, వచనంలోనూ, కవితలోనూ కలిగిన ఫలితాలను సూక్ష్మంగా పరిశీలించడం అవసరం. వచనానికి సంబంధించినంతవరకు పూర్వ తెలుగు సాహిత్యంలో చెప్పుకోదగినది ఏమీలేదు. కథ, నవల మొదలగు వచనప్రక్రియలు మనం పాశ్చాత్య సాహిత్యంనుండి నేర్చుకున్నవే. అంటే ఆధునిక యుగంలోని లక్షణాలతో కొత్తగా వచనప్రక్రియ ఆవిర్భవించింది. అందుకే వచ్చి రావడంతో అది వ్యవహారిక భాషాస్వరూపాన్ని నిస్సందేహంగా ధరించింది. కవితలో పరిస్థితి వేరు. పూర్వకావ్యభాషా బంధాలను తెంచుకొని వ్యావహారిక భాషను కవిత్వములో ప్రవేశపెట్టడానికి చాలా ఆలశ్యమూ అయింది, చాలా శ్రమపడవలసి వచ్చిందికూడా. స్వరూపంలో వచనం ముందడుగువేస్తే భావాలలో కవిత్వం ముందడుగు వేసిందని చెప్పవచ్చు. ఎందుకంటే అభ్యుదయ భావవిప్లవం కవితలో ప్రవేశించినంతగా నాటికీ, నేటికీ, కథల్లో, నవలల్లో ప్రవేశించలేదేమో అనిపిస్తుంది. కార్మికులు, కర్షకులు, యితర సామాన్య ప్రజలు, వారి కష్టసుఖాలు మొదలగునవి అభ్యుదయ కవిత్వంలో వచ్చినంతగా వచనంలో రాలేదు. అసలు రాలేదని కాదుగాని, వచనగ్రంథాలు వచ్చినంత ఎక్కువ నిష్పత్తిలో ఆ భావాల ప్రవేశం జరుగలేదు. కాని మధ్యతరగతి ప్రజల జీవన పరిస్థితులు, గ్రామీణ జీవితం, మన సత్త్వ పరిశీలన మొదలైనవన్నీ ఆధునిక శాస్త్రీయభావచేతనయొక్క లక్షణాలుగా చెప్పుకోవచ్చు. కవిత్వంలో మాత్రం, అభ్యుదయ భావాలు అరమరిక లేకుండా, సూటిగా ప్రవేశించాయి. ఎంత ఎక్కువగా ప్రవేశించా యంటే, రాజకీయ ప్రబోధకుడికీ, కవికీ భేదం లేనంతగా ప్రవేశించాయి. ఇది కవిత్వమా, నినాదాల సమూహమా అని విమర్శకులు అడిగేటంత ఎక్కువగా ప్రవేశించాయి. అందుకే అభ్యుదయకవిత్వంలో కవిత్వపు విలువలు చాలా తక్కువగా వున్నాయనే అపవాదు పుట్టింది. అయినా ఆ విధంగా జరిగినందువల్ల సోషలిస్టు భావవిప్లవానికి మేలే జరిగింది కాని కీడేమి జరగలేదు. ఈ విమర్శను పురస్కరించుకునే అనంతరకాలంలో, వచనకవితాదశలో కవిత్వపు విలువలకు లోటులేనివిధంగా అభ్యుదయకవిత్వం ప్రవర్తిల్లింది. ఏనాడైనా కవిత్వంలో వచ

సంలోకంటే ఎక్కువగా ఆవేశమూ, తీవ్రత వుండితీరుతాయి. ఇది ఎంత అవసరమైనా సంయమనం మాత్రం వుండాలనే విషయాన్ని కవులు విస్మరించకూడదు.

ఏ విలువలైనా దేశకాలపరిస్థితులను అనుసరించుకునే వుంటాయి. కాని వాటికి అతీతంగా వుండలేవు. ప్రపంచపరిస్థితులలో నేడు సోషలిస్టుయుగం నడుస్తున్నది. కనుక ఆ ఆర్థిక, సామాజిక వ్యవస్థకు అనుగుణంగా మన ఆలోచనారీతిలో విశ్వాసాలలో మార్పులు వచ్చాయి. మరి మానవుడు యింతకంటే మేలైన ఆర్థిక, సామాజిక వ్యవస్థను ఏర్పాటు చేసుకుంటే ఏమవుతుంది? ఇప్పటి విలువలూ, విశ్వాసాలూ పాతబడిపోయి కొత్తవి ఏర్పడతాయి.



విలువ లున్నాయి. కాని అవి కనపడవు స్వార్థంగా, క్రూరంగా బ్రతికే మనుషులకి జీవితంలోంచి ఏ మొస్తుంది? ఇతరుల కన్నీళ్ళలో బాధపడేవాడికి ఒక్క చిరునవ్వులోంచి వచ్చే మాధుర్యం ఎవ రెరుగుదురు? బయట ఏం జరుగుతోందని కాదు. వాటినుంచి నీలోపల ఏం జరుగుతోం దనే దృష్టి నీకు కలిగిన రోజున సమన్వయం ఎక్కువగా కలుగుతుంది.''

—చలం.

# మారుతున్న విలువలు : నేటికవిత

డాక్టర్ అరిపిరాల విశ్వం

జీవితాన్నే చూడాలంటే విలువల అద్దంలో చూడు. మనిషినిగూర్చి మనిషి తెలుసుకో దగింది — తెలుసుకోలేనిది కేవలం విలువలు మాత్రమే.

విలువలు క్రియా ప్రక్రియారూపంలో బయల్పడే ప్రవర్తనాజన్యాలు. భౌతిక విలువలు దేహజాలు. నైతిక విలువలు హృదయజాలు. లౌకిక విలువలు ఊహాజన్య ఆలోచనాగతాలు. తాత్త్విక విలువలు ఆత్మజన్యమైన జ్ఞానంనించి వస్తాయి.

భౌతిక విలువకు వస్తుస్థితితో ఎక్కువ సంబంధం. నైతిక విలువకు వస్తువుయొక్క కాలానుగతితో సంబంధం. లౌకిక విలువలకు దేశముకన్న, కాలమునకే ఎక్కువ ప్రాధాన్యం. తాత్త్విక విలువలకు దిక్కాలావధుల కతీతమైన శాశ్వతానంద సంవిద్భావము ఉపాధి.

అన్నమయములు, ప్రాణమయము లని భౌతిక విలువలు రెండు రకాలు.

భౌతిక విలువలు, వస్తువుయొక్క ప్రాప్తికి, అప్రాప్తికీ సంబంధించియుండును.

"దారిపక్క చెట్టుకింద
ఆరిన కుంపటి విధాన
కూర్చున్నది ముసల్దొకతె
మూలుగుతూ ముసురుతున్న ఈగలతో వేగలేక".

"రానున్నది చలికాలం, దిక్కులేని దీనురాలు
ఏళ్ళు ముదిరి కీళ్ళు కదలి బతుక్కంటె కోర్కె సడలి
పక్క నున్న బండరాతి పగిదిగనే పడిఉన్నది" - "భిక్షువర్షీయసి"

—శ్రీశ్రీ

అన్నమయమైన విలువలనుండి పుట్టిన వాస్తవికతకు పైకవిత ప్రతిబింబము. బిచ్చగత్తె దినదినగండంగా బ్రతుకును వెళ్ళిస్తోంది, పోరాడి పొట్ట నింపుకొన్నంతకాలమే బ్రతుకు నడుస్తుంది. ఈ భౌతిక విలువలే, ప్రాణమయమైన విలువలకు పునాది. స్వోదర పోషణార్థం, మనిషి స్వార్థత్వం ధరించక తప్పదు. అప్పుడు పరార్థంతో పోరాడకా తప్పదు.

"ఎక్కి తొక్కి. ఎంత రాసినా ఇంతే
దక్కవలసింది, కూడు, గూడు, గుడ్డ." —శ్రీ వాచార్ ఘర్.

కూడు, గూడు, గుడ్డ, ప్రాణమయ విలువలు.

అన్నమయవిలువలు తత్కాల తృష్ణాతృప్తికి పరిమితములు. ప్రాణమయ విలువలు ఆ తృప్తికి ఒక సాగుదలను యిచ్చే ప్రయత్నంలోంచే పుడతాయి.

"బ్రతుకు మిథ్యాశృంఖలితము
చదువు బాధాసంకలితము
జయిలులోపల స్వేచ్ఛ కలదు
బయటక్షణ మ్మయినా వలదు."  —వరద రాజేశ్వరరావు.

మేధావివర్గపు మనస్సంకట స్థితి: విలువ లొకప్పుడు విముక్తిని యివ్వలేవు సరిగదా, సంకెళ్ళ నిచ్చే స్థితి ఉంది. అయితే అవి కేవల ఆత్మపరము, మిథ్యాదర్శన సముత్పన్నాలు.

ఒక్కొక్కప్పుడు విలువలు వ్యక్తి పతనానికి దారితీస్తాయి. భ్రాంతిమూలక మనస్తత్వానికి - అలాంటి నిదర్శనం.

"రా తమ్ముడూ, పోదాం, మనకు చోటు లే దిక్కడ
అప్పులే అరణ్యంలో హాయిగా కాలంగడుపుదాం
కడుపుకొరకు క్రూరజంతువు నని గర్జించే సింహం
మనిషికంటె నయంకదూ! అమ్మో భయ మేస్తుం దిక్కడ."
—కుందుర్తి.

వాస్తవికతతో రాజీ పూర్తిగా పడలేక, నాగరికత నుంచీ, దూరంగా ఏకాంతంగా జీవించాలనే ఊహలోని అభాన విలువలుకూడా ఉన్నాయి. కృష్ణశాస్త్రిగా రన్నట్లు "ఆశ ఆకాశమంత. శక్తి క్షుద్రవిహంగమంత." మధ్యతరగతి మేధావివర్గంలో - గెలుపును చివరికైనా సాధించగల మన్న నమ్మకంకన్నా, ఓడిపోతా మేమో అన్న భయాందోళనలే ఎక్కువగా ఉన్నాయి. విలువలు చీకటిదారిని వెలిగించే చిరుదీపాలు అవి మరికొందరికి కొరివిదయ్యాల్లా అవుతాయి.

"నాకు - నాకు కావాలి
ఆ రోజు మట్టుకే"  —ఆరుద్ర.

అన్నమయ విలువలకే చోటిచ్చిన పరిస్థితికూడా ఉంది.

"ముప్పొద్దులందునా మురికిమేనీతోడ
పొలము లోపలబడి నలిగిపోతున్నాము
ఇంటి కొచ్చామంటె - యింత గంజి లేక
కడుపుమంటాతోటి - కాలిపోతున్నాము.
మన భూమికెలనుగొట్టి - మన రక్తమును పిండి
ఎన్నాళ్ళు ఏలుతా రీధనికు లీధొరలు"  —తుమ్మల వెంకట్రామయ్య

దళిత, పీడితజాతి - స్వేచ్ఛకై, సమానత్వానికై పరిశ్రమించే వర్గచైతన్యం - మార్క్సు యిచ్చిన క్రొత్తవిలువ, అదే అభ్యుదయకవిత.

భౌతికావసరాలకే శక్తిసర్వం ఖర్చైపోతే, పై విలువల్నిగూర్చి ఆలోచించగలగటం అంత సులభం కాదు. చివరికి తనపైన, సంఘంపైన, దేవుడిపైనా నమ్మకం సడలవచ్చు.

"కీలుగుఱ్ఱము మీద
బాలీసు నానుకొని
ప్రాణాలు లేనట్టి
భగవంతు డొచ్చాడు -
కూలిమా టడగండిరా - అన్నాలు
చాలవని చెప్పండిరా ?" —తెన్నేటి సూరి.

ఉన్నవాళ్ళు, లేనివాళ్ళ అన్నాన్నీ, అదృష్టాన్ని తినేశారు. అన్నం యిచ్చేది దేవుడు, అన్నాన్ని తెచ్చేది శ్రామికుడు. అనుభవం ఉన్నవాడి దయపైన ఆధారపడ్డది. అందుకే - దేవుడనే - తాత్త్విక భావనకూడా, ఇక్కడ లేనివానిదృష్టిలో భౌతికమైన, అన్నమయ విలువకు ఉపాంగమే అయిపోయిన దయనీయస్థితి కల్గింది. ఇదే యీనాటి సమాజచిత్రం.

"నేడు మనం గగనకుసుమా లనుకొంటున్నవి
మనపిల్లల రేపటి రంగస్థలాలు
శబ్దాన్ని మించిన శరగమనులు
రేపటి పౌరులు." —ఏల్చూరి.

ఆధునిక సమాజం ఆశా, నిరాశల సంగమస్థలం. నేటి వెతల బ్రతుకుకన్న, రేపటివెలుగు ఆనందాన్నిస్తోంది. నీ దుఃఖాన్ని, నీ ముందుతరం ఆనందంకోసం త్యాగం చేయగలిగితే నీవు నిజమైన మనిషివి.

"ఒక్కొక్కడికీ యెవడికి వాడికి
నాలుగ్గోడల నడింప్రపంచం ! కల్చర్ !- కంచం-మంచం.
—కల్చర్, పూషా,

గుడిలో కుంచం ఆడుకునే-తత్త్వం కూడా ఉంది. విలువలు చిక్కిపోయాయి.

"చావుపుట్టుకలమధ్య, సందేహంవంటి జీవితంలో
నలువైపులా అంధకారం,
మంచిగంధంలా పరిమళించే మానవత్వం
మాకున్న ఒకే ఒక్క అలంకారం". —తిలక్.

సందేహాలు, అన్వేషణ, సంఘర్షణ—సాఫీగా సాగకపోవడం - యివి ఓరీతిగా జీవితానికి నిర్వచనాలు.

## నైతిక విలువలు

"నిప్పును కన్నెత్తి చూళ్లేదు సంఘం
జనాన్ని సూటిగా వినలేదు సంఘం,
నిజాన్ని చంపి, నిజాన్ని పూజిస్తుంది సంఘం
న్యాయాన్ని హత్యచేసి న్యాయాన్ని గౌరవిస్తుంది సంఘం
దేవుణ్ణి హింసించి, దేవుణ్ణి తలుస్తుంది సంఘం"

—సర్పయాగం, రెంటాల.

సంఘంలో విలుప్తమౌతున్న నైతికవిలువకీ కవిత చిహ్నం.

"విపణివీధి, తపోవనం
చాకిరేవు, శాసనసభ
సానికొంప, సాధుమఠం
మూత్రశాల, యాత్రాస్థలి
పోటీ పడి కాటులాడ
ఎచటైతేనేం"

—కాళోజి.

అనుకరణము, ధిక్కరణం, అవకాశవాదం ఇవి కొత్తగా వచ్చిన సూడోవాల్యూస్.

## లౌకిక విలువలు

"యెల్లలోకము వొక్కయిల్లై
వర్ణభేదము లెల్ల కల్లై
వెల నెరుగని ప్రేమబంధము
వేడుకలు కురియు
మతములన్నియు మాసిపోవును
జ్ఞాన మొక్కటె నిలిచి వెలుగును
అంతస్వర్గ సుఖంబు లన్నవి
యవని విలసిల్లున్."

—గురజాడ.

"యుద్ధంమీద యుద్ధం వచ్చినా
మనిషిగుండె పగులలేదు,
మనిషిమీద మనిషి చచ్చినా
కన్నుతుదల జాలి లేదు.
నాగరికత మైలపడిన దుప్పటిలా
నాకందని ఏదో రహస్యం నన్ను
వశం చేసుకుంది."

—తిలక్.

తాత్త్వికవిలువలు కూడా సోదాహరణంగా వివరించేందుకు స్థలాభావం అడ్డు వస్తోంది.

# మారుతున్న విలువలు - రేడియో రచన

శ్రీ పన్యాల రంగనాథరావు

అక్షర సృష్టి జరిగిన నాటినుంచీ ఒకవ్యక్తి మరొకవ్యక్తికి తన భావాలు తెలియపరుచుకో టానికి లేఖనం, పఠనం, సాధనాలుగా ఉపకరిస్తున్నాయి. పరస్పరం మాట్లాడుకోవడం ద్వారా ఒకరిభావా లొకరు తెలియచేసుకొంటూ ఉండడం అంతకు ముందునుంచీ జరుగు తున్నదే. వ్యక్తిలో సంస్కారము పెరిగినకొద్దీ అక్షరాని కొక అందం ఏర్పడి దానితోపాటే భావానికీ ఒక స్వరూపం వచ్చి, సాహిత్యసృష్టికి లిఖితంగా అంకురార్పణ జరిగిందనుకో వచ్చు. స్వతహాగా మానవుడు సౌందర్యాన్వేషి కావడంవల్ల అక్షరంలోని అందాన్ని, భావంలో గల స్వరూపాన్ని వెంటనే గుర్తించి వాటికి మెరుగులు దిద్దుకోవడం ప్రారం భించాడు. ఒక భావాన్ని మాటలలో పెట్టగలిగినప్పుడు ఆ మాటలకు అక్షరాలు తీర్చి దిద్దినప్పుడు అదే మాటను అంతకన్నా ఎక్కువ అందంగానూ, రసవత్తరంగానూ స్ఫురింపచేయవచ్చుననే తపనతో అంతకంతకు తనభావాలకు అత్యుత్తమ స్వరూపా లిస్తూ వచ్చాడు. ఈ పరిణామంలోనే లేఖనాసాహిత్యసృష్టి జరిగింది. ఆ సాహిత్యంలోనే రకరకాల రూపాలు అవతరించినై. మానవుడు తన భావాన్ని మాటలలో పెట్టి అక్షర స్వరూపం ఇవ్వడంతో తృప్తిపడిపోక ఆ భావాలనే వాక్యంలోనూ, పద్యరూపంలోనూ వాగ్గేయరూపంగానూ. కథారూపంలోనూ, నాటకరూపంలోనూ ఇమడ్చగలిగాడు.

సాహిత్యసృష్టి ఆ విధంగా జరిగి ఉండొచ్చు నని భావుకు లనేకుల అభిప్రాయం. ఇది చాలావరకు నిజమే అనిపిస్తుందికూడాను.

ఈ విధంగా సృష్టించుకున్న లేఖనాసాహిత్యంలో మానవుడు తన్ను తాను తీర్చి దిద్దుకోవడమే కాక తనచుట్టూ ఉన్న వాతావరణాన్నీ, పరిసరాల్నీ, వ్యక్తుల్నీ ప్రకృతినీ కూడా ఎప్పటికప్పుడు కొత్త కొత్త సొంపులతో ఇముడ్చుతూ వచ్చాడు

విలువ అనేది దేనిపరంగా ఆలోచించినా - వ్యక్తివిలువే కానీండి, సమాజపు విలువే కానీండి. ఏదైనాసరే ఆదినుంచీ చూసినట్టయితే రోజురోజుకీ మార్పు చెందుతూనే ఉన్నాయి. ఇట్లా మార్పు చెందుతూ ఉండటమే ప్రగతి లక్షణంకూడా. ఒక్కొక్కప్పుడు ఇటువంటిమార్పు చెడుగా పరిణమించవచ్చు. ఆ చెడుపరిణామమే శాశ్వతమేమో అని పించనూవచ్చు. అయితే అది కేవలం భ్రమ. మార్పులో ఉండే బలాన్నిబట్టి దాని ఆయు ర్దాయం నిర్ణయమవుతుంది. అదేవిధంగా మంచి మార్పు అయినాసరే ఆ మంచి మాన వుడికి ఎంతవరకూ ప్రయోజనకరంగా ఉంటుందో అంతవరకే ఉంటుంది.

మార్పు దానంతట అది ఎక్కడనుంచో వొచ్చిపడదు. మానవుడి పరివర్తనా ప్రవర్తనలబట్టే మంచికైనా చెడుకైనా మార్పువస్తుంది, రావాలికూడా. అటువంటి

మార్పుయొక్క ప్రయోజనం తీసినవెంటనే దానిస్థానంలో ఇంకోమార్పు వచ్చి తిష్ట వేస్తుంది. పరిణామదశలో ఈ మార్పులు మనం కళ్ళారా చూస్తున్నవే.

మార్పు లనేవి ఎక్కడ వొచ్చినా, ఎప్పుడు వచ్చినా మొట్టమొదట, సాహిత్యంలో కని విస్తా యని నే ననుకుంటాను. మార్పు తీసుకు రాదలిచినవారు, మొదట సాహిత్యాన్నే ఆధారంచేసుకుని "ఫీలర్సు", వొదులుతూ ఉండడం పరిపాటే, అంటే లేఖనంద్వారా కనబడే ప్రతీదీ సాహిత్యమనికాదు తాత్పర్యం. భావప్రకటనకు సాహిత్యమే ప్రధానం కనుక, ఎటు వంటి భావానికైనా సాహిత్యమే తప్ప, నలుగురికి తెలిసేటందుకు మరో గత్యంతరంలేదు. ఈ ప్రకారంగా ఆలోచిస్తే, ఒక వార్త 'బేసిక్' కావచ్చు.

భూకంపాల గురించీ, జలప్రళయంగురించీ, యుద్ధాల భీభత్సాలగురించీ వార్త లొస్తాయి. ఆవార్తలబట్టి, వాటి విషయం సాధారణంగా తెలుసుకుంటాం. తరువాత వాటిపైన వొచ్చే సాహిత్యమంతా ఆ వార్తల ఆధారంగానే సృష్టించడం జరుగుతుంది.

అలాగే సమాజంలో, సాంఘిక జీవనంలో ఉన్న పరిస్థితుల గురించి, రాగల తీసుకు రాగల మార్పులగురించి బోలెడంత సాహిత్యం వెలువడుతూ ఉంటుంది. ఇందులో నిజమైన సాహిత్యపు విలువ లున్నవి ఎన్నిఅనేది వేరేసంగతి, ఇప్పుడు ఆలోచిస్తున్నది - "బేసిక్ లెవెల్" లో కేవలం సాహిత్యం గురించే అని గుర్తుంచుకోవాలి.

వ్యక్తిలోనూ, సమాజంలోనూ, రాజకీయాలలోనూ వస్తున్న మార్పులు, స్వభావ సిద్ధంగానే సాహిత్యంలో అవతరించడం చూస్తూనే ఉన్నాం. ఇది ఈ శతాబ్దంలోనే జరుగుతున్నది ఎంత మటుకు కాదు. శతాబ్దాల తరబడి, సాహిత్యంలో ఆ మార్పులు వస్తూనే ఉన్నాయి.

అంతేకాక సాహిత్యంలోకూడా రచయిత ఈ మార్పులప అనుగుణంగానే, తనకు చేతనైనదీ, వీలైనదీ, తనకలం సాగగలిగేది ఒకపద్ధతి ఎంచుకుని అందులోనే మార్పులు ప్రతిబింబింపజేస్తాడు. రచన చేయగలిగే స్తోమత వున్నవ్యక్తి "ఏది రాసినా", ఏపద్ధతిలో రాసినా ఆ రచన వ్యక్తిలోగాని, సమాజంలోగానీ, ఎక్కడైనాగాని, ఉన్న పరిస్థితినే ప్రతిఫలింపచేస్తుంది. ఇది ప్రచార సాహిత్యంలో మరీ ప్రస్ఫుటంగా కనిపిస్తుంది.

ఈ దృష్టితో చూచినట్టయితే, సాహిత్యంలో ఏమార్పు వచ్చినా, ఏ పద్ధతిలో వచ్చినా, ఎటువంటిభావాలు, వ్యక్తీకరించబడుతున్నా, వాటిని చదివేవారిలో అరుచి పొందేవారు తప్పు పట్టవలసిన పని లేదని స్పష్టమవుతూనేఉంది. ఒకప్పుడు ఎంతోమందికి నచ్చని సాహిత్యం ఈనాడు అధికచలామణీ పొందడమేకాక, కొన్ని విశిష్టమైన రచనలుగా కూడా పేరు తెచ్చుకున్నాయి. ఈనాడు వేలసంఖ్యలో వస్తున్న నవలలూ, పద్యరచనలూ, గేయాలూ, వచన గేయాలూ, నాటక నాటికలూ, ఇవన్నీకూడా, వాటిలో ఉండే "థీమ్స్" తో సహా, నేటి మార్పు చెందుతున్న వ్యక్తి - సమాజం పరిణామమే అనక తప్పదు. ఈ ఘడియలో కొందరికి, వీటిలో కనిపిస్తున్నవి, అనగా ఈ రచనలలో వ్యక్తమవుతున్నవి,

హేయంగా పొడగట్టవచ్చు. కాని సమాజం హేయంగా ఉన్నప్పుడే సాహిత్యంలో అహేయం ప్రస్ఫుట మవుతుందని తెలిసినవారు, వీటిని దూషించవలసిన అవసరం లేదు.

అయితే సాహిత్యం ప్రచారం పొందితే తప్ప దానికి విలువకూడా ఉండదు. నలుగురికీ, ఫలానా అని తెలిసినప్పుడే దానిసార్థకత. ఈ విధంగా సాహిత్యం ప్రచారంలో రావటానికి ఈనాడు పత్రికలు చేస్తున్నంత సహాయం ఇంకేపద్ధతివల్లా జరగటంలేదు. వెయ్యి కాపీలు అమ్మే ఒకనవలను పదివేలమంది చదివితే చదివిఉండొచ్చు. అదేనవల యాభై వేల ప్రతులు అమ్ముడుపోయే ఏవారపత్రికలోనో సీరియల్‌గా వస్తే దాన్ని కనీసం లక్షమందైనా చదివే అవకాశం బొత్తిగా లేకపోలేదు. అయిదు రూపాయ లిచ్చి నవల కొనే కన్న, ఆర్థికసూత్రాల ప్రకారం, పావలా యిచ్చి వారపత్రికను యిరవై వారాలపాటు కొనుక్కోవడం గిట్టుబాటుగా ఉంటుంది. ఎందుకంటే సీరియల్‌తోబాటు చదివేటందుకు మరికొంత "వెరైటీ" దొరకడమే కాదు, ఆ యిరవై పత్రికలూ అఖరికి తూకంవేస్తే కొంతైనా గిట్టేస్తుంది. ఈ కారణం చేతనే, ఈ నాడు పత్రికలలో సీరియల్స్‌కి, యింత ప్రచారం వస్తున్నది.

సాహిత్యప్రచారానికి కొంతలో కొంతవరకూ దోహదం చేస్తున్నది రేడియో సాధనం. అయితే రేడియోలో ప్రసారానికి ఏరకం సాహిత్యం తగింది? ఏది తగదు అనేది వేరే విషయం, అందులో చాలావరకు 'రాజకీయాలు' ఇమిడి ఉంటాయి. కాబట్టి మనం స్థూలంగా తెలుసుకోవాల్సింది, ఏరకం సాహిత్యం అనేదానికన్న, రేడియో ప్రసారానికి అనుగుణమైన రచనాపద్ధతి ఎలా ఉండాలి అనేది గమనించాలి.

రేడియో ప్రసారంలో - ముఖ్యంగా తెలుసుకోవలసింది ఒకటుంది. ఎటువంటి రచన అయినాసరే, రేడియోదగ్గర కొచ్చేటప్పుడు సామాన్యంగా "చదువుతున్న" భ్రమ కలిగించరాదు. శ్రోతకి, "చెప్పుతున్నభ్రమ" కలగాలి. నిజానికి రేడియోలో "మైక్" ముందు జరిగేది చదవటమే! కాని చదువుతున్నట్టుండరాదు. ఏ రచన అయితే, చదువుతున్న భ్రమ కలిగించకుండా ఉంటుందో అది విజయవంతమైన రేడియో రచనగా భావించవలసి ఉంటుంది. ఈ దృష్టితో పరిశీలించినట్టయితే, సాహిత్యంలోని రకరకాల రచనాపద్ధతులలో రేడియో రచన అంటూ ఒకటిప్రత్యేకంగా ఉండాలని స్ఫురిస్తుంది. దీనిక, నాకు తెలిసినంతవరకూ కవిత్వం ఒక్కటే భిన్నం. రేడియోకోసం, వేరే కవిత్వం రాయటమంటూ ఉండదు గనుక.

కాని ఒక వ్యాసం, ఒక కథ, లేక నవల, ముఖ్యంగా నాటిక, నాటకం మటుకు రేడియోలో ప్రసారానికి ఒక ప్రత్యేకత కలిగిఉండాలి. ఈప్రత్యేకతనే 'రేడియో టెక్నిక్'— 'రేడియో' శిల్పం అనికూడా కొంద రంటారు. పత్రికలో ప్రచురించటానికి యోగ్యమైన ఒక వ్యాసం, ఒక రచన, రేడియోలో యథాతథంగా ప్రసారానికి యోగ్యం కాదు. పదిమందిని కూర్చోపెట్టుకుని, వారికి చెప్పుతున్నట్టుగా ఉండాలి. కథైనా అంతే. అందుకే, పిల్లలకోసం ప్రత్యేకంగా రాసిన రచనలు - [పిల్లలకోస మనే పేరుతో పెద్ద

వాళ్ళు చదువుకోదగ్గ వాటి మాటకాదు!] ఏ మార్పూ చేయనవసరం లేకుండా సరాసరి రేడియో ప్రసారానికి వీలుగా ఉంటాయి.

నాటకాల విషయంలో ముఖ్యంగా ఈ తేడా బాగా ఉంటుంది. రేడియో నాటకాలు, ముఖ్యంగా శ్రవ్యనాటకాలు: నాటకంలోని పాత్రలూ, వాటి స్వభావాలూ అన్నీకూడా చెవులద్వారా అర్థం కావలసిందేగాని, మరోమార్గం లేదు. కనక, రంగస్థల ప్రదర్శన కోసం ఉన్న నాటకం ప్రసారం చేయవలసివస్తే కొన్ని సంభాషణలతోసహా, కొన్ని సన్ని వేశాలతోసహా, సవాలక్షమార్పులు చేయవలసి ఉంటుంది. కంటితో చూసే దృశ్యంలో రవంతలోపం ఏదైనా ఉంటే, వెంటనే దాన్ని మరచిపోగలిగేటంతటి సులభంగా, చెవితో వినవలసిన శబ్దంలో ఏదైనా అపస్వరం అపశబ్దం ఉన్నట్టయితే దాన్ని మరిచిపోవడం ఓపట్టున సాధ్యంకాదు. ''ఇంకా కళ్ళకు కట్టనట్టే ఉంది" అనటంతోపాటు "ఇంకా చెవిలో గింగురుమంటూనే ఉంది" అంటాం. అయితే కళ్ళు మూసుకుంటే కాస్త ఊహలోపడి కళ్ళకు కట్టినట్టు ఏ దృశ్యమైనా తోచవచ్చునేమో గాని, చెవిలో మటకు ఏ 'తిరీ' పెట్టుకోనక్కర్లేకుండానే అపశబ్దం వినిపిస్తుంది. రంగస్థలానికి చెవీ, కన్నూ రెండూ ముఖ్యం. రేడియోకి ఒక్క చెవే ముఖ్యం. రెండింటిపనీ చెవే చేయవలసి ఉంటుంది.

రేడియో రచనకి ఇన్ని 'లిమిటేషన్సు' ఉన్నాయి. ఇప్పుడిప్పుడు చాలామంది రచయితలకు రేడియో రచనాస్వరూపం ఎలా ఉండాలో తెలుస్తున్నది. ఇట్లా తెలుసుకుని చేస్తున్న రచనలు సాహిత్యంలో ఒక ముఖ్యమైన మార్పుగా, పరిణామంగా - లేదా ఒక భాగంగా పరిగణించవలసి ఉంటుంది. 'రేడియో ప్రసంగం' 'రేడియో రచన', 'రేడియో కథ', రేడియోనాటిక,' ఈ ప్రయోగాలవల్ల స్పష్టమవుతుంది వీటికున్న ప్రత్యేకత. [క్షమించండి-రేడియో కవిత్వం మటుకు ఇంకా లేదు; వచ్చే అవకాశం కూడా ఉన్నట్టు లేదు. !!]

రేడియో రచనకు ఒక విధంగా చూస్తే విశిష్టమైన స్థానం ఉందనే చెప్పాలి. ప్రచురణా, ప్రదర్శనాయోగ్యమయ్యే రచనలు రేడియోలో ప్రసారానికి ఉన్నపాళంగా నప్పవు. అయితే రేడియోలో ప్రసారానికి అనుగుణంగా సాగించే రచనలు - ప్రచురణా, ప్రచారయోగ్యాలుగానే ఉండటం కద్దు. రేడియోనాటికలు కొందరివి పుస్తకాలుగా రావడం, పత్రికలలో ప్రచురణ పొందడం దీనికి తార్కాణం.

నేటి సాహిత్యంలో రేడియోరచన ఒక గొప్ప పరిణామం. మన దేశంలో రేడియో వ్యవస్థ విదేశాలతో పోలిస్తే ఇంకా శైశవదశలోనే ఉందని చెప్పక తప్పదు. అందువల్ల రేడియో వ్యవస్థ వృద్ధిపొందడంతోపాటు రేడియో రచనలకు కూడా ఉత్తరోత్తరా గొప్ప భవిష్యత్తు ఉందనడంలో సందేహం లేదు.

# మారుతున్న విలువలు - రేడియో రచన

శ్రీ జనమంచి రామకృష్ణ

"నిరుపహతి స్థలంబు...

ఊరక కృతుల్ రచియింపు మటన్న శక్యమే!" అని కవితోపాసనకు కావలసిన లలితమైన హంగు లమర్చారు పెద్దన్నగారు.

ఈనాడు ఆయనే పునర్జన్మ యెత్తి సారస్వతసేవ చేయ పూనుకుంటే కవిత్వం చెప్పడానికి ఆయన పెట్టిన షరతులు, గొంతెమ్మకోర్కె లవుతాయి. కోర్కెల గుర్రా లవుతాయి - మృగతృష్ణ లవుతాయి. పూర్వజన్మ సువాసనతో ఆయన ప్రస్తుత ప్రపంచ రీతులూ, సాంఘిక విలువలూ, అభిరుచులూ, సాహితీస్థాయీచూసి "మనం ఈ శతాబ్దానికి నప్పనివాళ్ళం ఎందుకూ పనికిరాని వాళ్ళం" ఎంత త్వరగా నిష్క్రమిస్తే అంత మంచిది. అని వెయ్యిదేవుళ్ళకు మొక్కుకుంటారు.

ఈనాడు సారస్వత పోషకు లెక్కడున్నారు? పెద్దన్నగారు చెప్పిన షరతుల ప్రకారం మనస్సును అటువంటి ఉల్లాసమైన ఊయల్లో ఊపి సత్యాత్మికమైన కవనం చెప్పడానికి సాధ్యమూకాదు, వ్యవధీ లేదు. విత్తం లేదు. ఆ దినాల్లో కవు లంత హుందా తనంతో జీవితాలను వన్నెల విసనకర్రగా చేసుకున్నారంటే - తమ ప్రతిభకి అడుగు మడుగు లొత్తే రాజాధిరాజులు కృతిభర్త లయారు. దేశంలోని పాండిత్య ప్రకర్ష నాదరించి వారుకూడా సారస్వతంతో మనస్సును క్షాలితం చేసుకుని కలం చేబూనారు. ఆ కాలాల రాజులు సారస్వతప్రియులు. వారి రాజ్యాల్లో సరస్వతి పదకింకిణీస్వనం - ఎల్లవేళలా వినిపించేది. సరస్వతి తాండవంలో కవితా కోరకాలు ఎన్నో సారస్వతకన్య గళంలో మాలలయాయి.

ఒక జాతి నాగరికత, విశిష్టత, ఆత్మ, తెలుసుకోడానికి ఆ జాతి సారస్వత సంపదే గీటురాయి. సారస్వతాభివృద్ధికి కొంత ఆదరణవంటి దోహదం అవసరం. అది లేనివాడు కవితాసుమాలు ఎడారిపూలై పూరుకుంటాయి. రాజాదరణ, కళాపోషణ ఉన్ననాడు సుస్థిరంగా తరతరాలు నిలబడే బంగారు ఇటుకలతో జాతిప్రతిభా భవనం నిర్మించబడినదన్నమాటే. ఏ జాతి సారస్వతం చూసినా, రాజాదరణ ఉన్నదశలోనే ఉద్రిక్తంగా అభివృద్ధి చెందినట్లు కనబడుతూంది.

కాని, యావత్ ప్రపంచంలోని విలువలు మారినట్లే, సారస్వత విలువకూడా మారింది పూర్వం. కాలం, కిన్నెరసాని వాగులూ మానవునిచుట్టూ తిరిగ్గాపారేవి. ఈనాడు మానవుడు కాలం వెనకాతలగుండె లదరిపోయేలా పరుగులు తీస్తున్నాడు. తత్ఫలితంగా అందరం వ్యవధిలేదని ఓరిమి పోగొట్టుకుని జిజ్ఞాసతో సతమతమై పోతున్నాము.

నేటి మానవునికి ఏపని చేయటానికీ తీరిక లేదు. జీవితావసరాలకై ఉదయం లేచింది మొదలూ తాపత్రయ పడవలసిందే. తీరిక ఉన్ననాడు ఓరిమి మొదలయిన సద్గుణాలకు తావుంటుంది.

ప్రపంచం విలువలు మారినట్లే, నేటి మానవుని అభిరుచులుకూడా మారాయి. ప్రజాస్వామికంలో సారస్వత ప్రియులు, సారస్వత పోషకులు ప్రజలే. ప్రజల అభిరుచుల మీద సారస్వత రచన ఆధారపడి వుంటుంది. చలనచిత్ర పరిశ్రమ చూడండి. ఒక మూడు దశాబ్దాల వెనుక చలనచిత్రాలు స్థాయి ఎలా వుండేది? నేడు ఎలా వుంది? ప్రజల అభిరుచులకు తగినట్లుగానే నేడు చలనచిత్రాలు తయారవుతున్నాయి. నేటి విద్యా విధానం ఫలితంగా కూడా సారస్వత విలువలు మారుతున్నాయి. విద్యాబోధన సారస్వతాభిరుచిని పెంపొందింప చేయడంలేదు. సారస్వత పరంగా చూస్తే, నేటి విద్యార్థి త్రిశంకుస్వర్గం అనుభవిస్తున్నాడు. ఎందుకంటే చదువులో పునాదులు లేకపోవటంచేత అటు పాతసాహిత్యంవైపూ పోడు. ఇటు ఆధునిక సాహిత్యంవైపూ పోడు. అభిరుచి అలవరచుకోవడ మలావుంచి చదివే అలవాటు అబ్బడం లేదు. మిగతా వ్యాపకాలలో ఉండిపోయి తీరిక అనేది ఏమిటో తెలియక చవకబారు - జీవితానికి పనికిరానివి - తన భవితవ్యానికి ఉపకరించని ఎండమావులవెంట పరుగులుతీస్తున్నాడు. నేటి యువతరం మనస్సు పులుముడుగా, అయోమయంగా తయారైన ఆధునిక తైల వర్ణచిత్రంలా వుంది. తనకి ఊహ లున్నాయి. ఉత్సాహ ముంది. శక్తి వుంది. కాని, ఆ శక్తినీ ఉత్సాహాన్ని, ఊహలనీ, సరియైన మార్గంలో మలచుకునేందుకు, అటు తల్లిదండ్రులుగాని ఇటు అధ్యాపకులుగాని క్రమశిక్షణ నివ్వడంలేదు.

నేటివిద్యార్థికి చవకబారు జీవితాన్ని అనుకరించేందుకు చూపేశ్రద్ధ చదువుమీద గాని సారస్వతం మీదగాని లేకుండా పోతూంది. వారితప్పు కాదది. పెద్దలదీ, సంస్థల దీని.

వ్యవధి లేని విద్యార్థికి - ఒక్క విద్యార్థి కేవిఁటి! మనందరికీ బరువైన పుస్తక మంటే చీదరింపు.

"ఇది మంచి నవల. తప్పక చదువు" అని ఎవరికైనా నవల నివ్వండి.

"అయ్యా బాబో! ఇన్ని పేజీలే! ఓపిక లేదు. వ్యవధి లేదు." అని తిరిగి పుస్తకం మనచేతిలోనే పెట్టేస్తారు. తన ఓపికకి, వ్యవధికి, అభిరుచికి తగినంత పుస్తకమైతే చదవడానికి ప్రయత్నిస్తారు. కొంతమంది అటువంటి సన్నకారు పుస్తకాన్నికూడా సాంతంగా చదవరు. కథాసంవిధానం మధ్య వర్ణనలూ మొదలయినవి వదిలేసి, కథకు సంబంధించినంత మేర నవల చదువుతా రంతే!

నేడు చలామణిలో వున్న సాహిత్యం మెదడుకి మేతగా పనిచేయదు పనిచేయతగ్గదైతే ప్రచారంలోకి రాదు. చిత్రమేమిటంటే గ్రంథాలయాలుకూడా అటువంటిపుస్తకాలు కొనడం మానుకున్నాయి. నేటిగ్రంథాలయాల్లో కొట్టొచ్చినట్లుగా మనకంటికి నదరుగా కనిపించేవి రైల్వేసాహిత్యం!

తెలుగునాడులో పుట్టినకవి, రచయిత చాలాబీదవారు. తాను రచించిన సారస్వతాన్ని అంతో ఇంతో తెలుగువారు చదవగలరుకాని, ఆ రచయిత బీదరికాన్ని మాత్రం స్మరించరు. అంతేకాదు తెలుగు వారిలో ప్రతి రెండవవాడూ రచయితే! సారస్వత కృషికి ఏమీ లోటు లేదు. ఎటొచ్చీ రచయిత మాత్రం భుక్తికోసం అనుక్షణం తాపత్రయ పడవలసిందే.

ఈనాడు రచయిత తన ప్రతిభను చూపించి బ్రహ్మాండంగా రాస్తాను అని రాస్తే- ఆ రచన ప్రజాదరణలో నున్న అభిరుచికి వ్యతిరేకమైనదైతే- కుక్కమూతిపిందై కూర్చుంటుంది. అందుచేతనే అంతో ఇంతో రచన సాగించే ప్రతి రచయితా - ప్రజాదరణకోసం, ప్రశంసలకోసం నేలవిడిచి సాముచేస్తున్నాడు.

ఈ నాడు కవితకు స్థానం లేకుండా పోయిందనే చెప్పాలి, కవులుకూడా గద్య రచనకు పూనుకుంటున్నారు. ఛందోబద్ధం కాని గద్యకవిత కొంచెంగా ప్రజాదరణ పొందుతూంది. ఈ తరంవారికి భారత భాగవతాలు, అల్లసాని వారి మనుచరిత్ర ముక్కుతిమ్మన గారి పారిజాతాపహరణం మొదలైనవి మనసాహిత్యానికి, మనభాషకు, జాతికీ శిరోభూషణా లని తెలియదు. ఒకవేళ ఒకానొక వెర్రిసాహితీప్రియుడు తన సంతానాన్ని కూర్చోబెట్టి, మనుచరిత్రలోని వరూథిని వర్ణనో, పారిజాతాపహరణంలోని సత్యభామ అలకో, భారతంలోని తిక్కనగారి కీచకవధా ఘట్టమో, భాగవతంలోని కృష్ణలీలలో తన్మయతతో చదివి వినిపించబోతే :-

''ఏమిటే! ఈ వెర్రిమొర్రికవిత్వం ఎవరికి అర్థమవుతుంది? పగసాధిస్తా డొక్కచీలుస్తా, గండరగండడు, అణాకి ఐదు హత్యలు, శవంలో శవం, డిటెక్టివ్ నవలలు చదివారా? వాటిల్లో వున్న మజా మీరు చదువుతున్న పుస్తకాల్లో ఏముంద, నాదగ్గరున్నాయి చదవండి నాన్నారూ'' అంటే ఆతండ్రి నోరు తెరచి "మన సాహిత్యం గతి ఏమికాను?'' అని నెత్తీ నోరూ బాదుకుంటూ, ఆ పవిత్రగ్రంథాలను కౌగిలించుకుని బావురుమని ఏడవాలి.

ఈ నాడు షేక్స్పియర్ అక్కరలేదు. టెనిసన్, కీట్స్. షెల్లీ, బైరన్, వర్డ్స్వర్త్, టాగూర్, గురజాడ, వీరేశలింగంపంతులు మొదలైన వారిని ఎవ్వరూ ఎరగరు. నా సహాధ్యాయుడే.- తాను కూర్చున్న వెనుక గోడకు రవీంద్రుని పటం తగిలించివుంది. ''ఈయనేకాదండి షేక్స్పియర్'' అని అడిగాడు ప్రబుద్ధుడైన నా స్నేహితుడు. పట్టభద్రుడు సుమండీ! అతగాడికి గడ్డాలు గుర్తు. అందుకని గడ్డ మున్న రవీంద్రుణ్ణి షేక్స్పియర్ అనుకున్నాడు! అటువంటి సాహితీపరులను ఎరిగి వుండడానికి వ్యవధి లేదు. ఎరిగి వుండడం ఆరోగ్యానికి అంత మంచిదికూడా కాదు.

చదువుకునే సాహిత్యంలో, విలువల్లో, అలా మార్పు లొచ్చి పడుతూంటే మరొక రకమైన - సాహిత్యం అనడానికి వీలులేదేమో - రచనా ప్రక్రియతో రచయితలు కిందామీదా పడుతున్నారు. అది రేడియో రచన. ధ్వనిద్వారా రూపకల్పన కల్గించడానికి ప్రయత్నించే రచన. నిజానికి విశృంఖలంగా, స్వేచ్ఛగా ఈ రకమైన రచన సాగించడా

నికి వీలుపడదు. ఇది చదువుకునే రచనకాదు. వినే రచన. ఈరకమైన రచనకు సవాలక్ష నిబంధన లున్నాయి, ఒకటి వ్యవధి. నిర్ణయమైన వ్యవధిలో ఆ రచనను - ప్రసంగం కానీయండి, పద్యాలు కానీయండి, నాటకం కానీయండి-కుదించాలి. అనగా వ్యవధి నిబంధన వల్ల రచయిత స్వేచ్ఛకు ఇబ్బంది కల్గుతుంది.

రెండవది - పదజాలాన్ని విచ్చలవిడిగా వాడ్డానికి వీలుపడదు. కుదించిన సంభాషణలద్వారా కొండంత భావాన్ని విశదం చెయ్యాలి. రేడియో రచనకు వాడేభాష వేరుగా వుంటుంది అటువంటిరచనకు నిజంగా మంచి నేర్పరితన మవసరము. అప్పుడే ధ్వని ద్వారా రూప మివ్వగల చాకచక్యం అబ్బుతుంది.

చలామణిలో వుంటూన్న రచనంతా ఎలా సాహిత్య ప్రమాణం పొందలేదో అలానే రేడియో ప్రసారరచనా సాహిత్య మవజాలదు. నిజానికి రేడియో రచనకు సాహిత్య సౌష్టవం చాలా తక్కువనే చెప్పాలి. సినీమాస్క్రిప్టుకి సాహిత్య గౌరవ మున్ననాడు రేడియోరచనకు తప్పక సాహిత్య గౌరవ ముంటుంది.

నేటి సాహిత్యానికి భవితవ్యం ఉందా ? అని ప్రశ్నించుకుంటే వుందనే చెప్పాలి. కాలప్రవాహంలో కొట్టుకపోక నిలదొక్కుకుని నిలిచింది సాహిత్యవిలువ సంపాదించుకుంటుంది. మన సాహిత్య చరిత్రలో ప్రబంధయుగ మొకటుంది. ఆ కాలంలో, రాజపోషకులు, కవులను పిలిపించి తమపరంగా ప్రబంధాలు రాయించుకున్నారు. కవులు, తమ పోషకులను సంతోషింపజేసేందుకు కోకొల్లలుగా ప్రబంధాలు రాశారు. ఐతే, ఈనాడు సాహిత్యంగా నిలిచినవి, చెప్పుకోతగ్గవి వేళ్ళమీద లెక్క పెట్టవచ్చును.

నిన్నటి అభిరుచులు, విలువలు నేడు మారుతున్నాయి. నేటి అభిరుచులు, విలువలు రేపటికే మార్పుచెందుతాయో తెలియదు. ఒకటిమాత్రం గ్రహించాలి. అభిరుచులు బొత్తిగా వ్యక్తిగతాలు కావు; పైగా పరిసరాలు ప్రభావం అభిరుచులపై అమితంగా ఉంటుంది. పరిసరాలను అదుపులో పెట్టుకోగల శక్తి మనకుంది. గతాన్ని విస్మరించి మానవుడు మనజాలడు. గతాన్ని అడుగడుగునా జ్ఞాపకం చేయవలసిన బాధ్యత ప్రభుత్వానిది, విద్యాసంస్థలది, తల్లిదండ్రులది, అధ్యాపకులది.

పాతకొత్తల కలయికలో ఏది మంచిదో, ఏది చెడ్డదో తెలియని ఊబిలో గిలగిల కొట్టుకుంటూంది, నేటి మన సాంఘికవ్యవస్థ. ఇది పరీక్షాసమయం. ఉద్ధరించే నాథుడు అవతరించాలి.

# మారుతున్న విలువలు - సినిమా రచన

## శ్రీ కపిల కాశీపతి

విలువలు, విలువలు అంటారు. అసలు విలువ లంటే ఏమిటి ? విలువ అనగా కిమ్మతా ? వెలా ?. రూపాయి పైసలలో కట్టే ధరవంటిదా ? కాదు అని జవాబు.

మానవ జీవితానికి శాశ్వతమైన విలువలు కొన్ని వున్నాయి. అవే చతుర్విధ పురుషార్థాలు; ధర్మ, అర్థ, కామ, మోక్షాలు. ధర్మానికి బద్ధులై అర్థకామాలు సాధించాలి. ధర్మబద్ధులైనవారికి మోక్షకామం క్రమేణా కలుగుతుంది.

ఈ శాశ్వత విలువలు మారుతున్నాయా ? విలువలు మారవు. అవి సూర్యచంద్రులు లాగ శాశ్వతం, ప్రకృతి సిద్ధం. కాని వాటి ఆదరణలో మార్పు రావొచ్చు. ఆధునిక కాలంలో ధర్మం, మోక్షం అనే ఆదిఅంత్యాలమీద విలువ తగ్గుతున్నది. మధ్యవైన అర్థకామాలమీద ముక్తాయింపు.

తెలుగుసినీమాలు ఈ విలువలు తిరస్కరిస్తున్నాయా ? మారుస్తున్నాయా ?. లేదనే చెప్పాలి. పాపానికి ప్రాయశ్చిత్తం, పుణ్యానికి మంచీ కలుగుతా యని ఘోషిస్తూనే వున్నాయి. అవినీతి చూపించినా అది మంచి దని చెప్పటంలేదు. చెబితే సెన్సార్లు వొప్పు కోరు. తత్కారణంగా శాశ్వత విలువలలో మార్పులు లేవనే చెప్పాలి.

ఇవిగాక రచనకి కొన్ని విలువ లుంటాయి. కావ్యరచనకి మన సంప్రదాయాను సారం విశ్వశ్రేయస్సే ముఖ్యమైన విలువ. శ్రేయస్సు సాహిత్య లక్ష్యమే కాక ప్రయోజనం కూడాను. "గా డ్పేల విసరు, నలిల మేల పారు" అందుకనే నేను వ్రాస్తున్నాను అన్నాడో కవికుమారుడు. ఈ విసురూ, ప్రవాహం ప్రయోజనం అనుభవించేది మానవుడు. మానవుణ్ణి ఉద్దేశించి చెయ్యని రచన అడవినిగాచిన వెన్నెల. అది కళ కాదు.

కళలవల్ల అవసరం కలుగుతుంది. ఆనందం అమలినంగా వుండా లన్నారు పెద్దలు. ఈ అమలినానందం మన చలనచిత్రకళ పోషిస్తోందా అంటే కొంతవరకు లేదనే చెప్పాలి. అంతవరకు విలువ ఇప్పుడే కాదు, చాలా చిత్రాలలో, ఎప్పుడో మారి పోయింది.

ప్రతిరచనకీ ముఖ్యమైన విలువలు:— సభ్యత, ఔచిత్యము, రసపుష్టి. సినీమా రచన ఒక వ్యక్తి చేసేదికాదు. కథకుడు, మాటలు, పాటలు వ్రాసేవారు, ఛాయాచిత్రకారుడు, సన్నివేశాలు నిర్మించేవారు, దుస్తులు తయారు చేసేవాడు, నృత్య, సంగీతదర్శకులు, అందర్నీ మించి, ఈవిషయాలన్నీ కవ్వించి చిత్రంతీస్తే తుదిరూపు ఎల్లావుంటుదో దర్శించే దర్శకుడు. వీరంతా కలిసి ఒక భావరాగతాళసమ్మేళనాసంపద గలిగిన నాదరూపం సృష్టిస్తారు. కాని, ఈ సమ్మేళనంగాని, లయగాని చివరికి మృగ్యం అవుతున్నాయి.

కారణం సినిమా వ్యాపారం, లాటరీ, జూదం. ఇది ఆడేది నిర్మాత. ఆయన దర్శించేది శ్రీ మహాలక్ష్మి. అత్తని అరాధించేవాళ్ళ కళ్ళకి కోడలు గిట్టదు. తత్కారణంగా ధన విలువముందు, దానికోసం పనిచేసే కళాకారులందరూ ఎంత బాధపడుతున్నా పొట్టకోసం తక్కిన విలువలకి తిలోదకా లిస్తున్నారు. పర్యవసానం అసభ్యత, అనౌచిత్యం, రసాభాసం.

మూటికీ కలిపి ఒకే ఒక దృష్టాంతం చెబుతాను ఒక దిక్కుమాలిన తల్లి వున్నది. ఆమెకో చిన్నబిడ్డ, ఎవరి వంచలోనో చాకిరీచేస్తూ, వారి మోచేతి నీళ్లు తాగుతూ, శిశువుని పెంచుకుంటోంది. బళ్ళోకి పంపిస్తోంది ఒక సన్నివేశంలో ఆవిడ గుమ్మంలో నుంచుంది. పిల్లవారు పలక పుచ్చుకొని గేటుదాకా వెళ్ళాడు తల్లి "టా,టా" చెబుతోంది. ఆ దృశ్యంలో తల్లీ, బిడ్డా కనబడాలి గదా! వెనక్కి చూస్తే ఏడవలేక నవ్వుతూ, వెర్రి మొహంతో బడి కెళ్ళే కుర్రవాడు, అటువంటివే బాధలతో తల్లీ వున్నారు. అప్పుడు కెమేరా ఆ తల్లి పూర్తిగా పమిటెలో ఇమడని, స్తనమధ్యంలోంచి పిల్లవాణ్ణి చూపించింది. చంటి పిల్లవాడైతే, ఎవరో ఎత్తుకు పోతుంటే, కనబడక కనబడితే, పాపం, తల్లికి చేపొచ్చింది. అనుకోవచ్చు. ఇక్కడ ఎదిగిన పిల్లవాడు. తరివిగేదెదూడలాగ పాలు తాగడం లేదు. ఎదురుగా మూర్తీభవించవలసినది మాతృదేవత, ప్రేక్షకుల్ని వేరే సన్నివేశంలో రంజు చెయ్యగలిగిన ఆవిడ ఉన్నతవక్షస్థలంకాదు, బాహుమూలరుచి కాదు. చూసేవారికి తెలియకుండానే వెగటు కలుగుతుంది. వికారం పుడుతుంది; అదే రసాభాసం. రససిద్ధాంతం తెలిస్తే నిర్వచనం తెలుస్తుంది. కాని వికారం పుట్టడానికి శాస్త్రం చదవనక్కర్లేదు.

ఒక మహాశివభక్తుడున్నాడు. ఆయనకి లోకంలో ప్రతివస్తువూ శివలింగాకారంలో కనువిస్తాయి. చివరికి ప్రియురాలి స్థనంకూడా లింగాకారమే అవుతుంది. ఒక లిప్తమాత్రం దర్శకుడు ఆ స్తనం చూపించాడు. ఆ సన్నివేశంలో అది అసభ్యతగాని, అనౌచిత్యంగాని కాదు.

నలభై య్యేళ్లకింద శబ్దచిత్రాలు రాకముందు మా మామ్మని "నక్కుబాయి" సినిమాకి తీసికెళ్లాం. "ప్రతి ఇంట్లోనూ వున్నగొడవే - అత్తా, కోడళ్ల గొడవ. వెధవసినిమా" అంది.

వెళ్ళక వెళ్ళక చాకలి మడేలు పక్కవూ రెళ్లి సినిమా చూసొచ్చాడు. "చాకలి దాన్నికూడా తీసుకెళ్ళావుట్రా?" అంటే, అయ్యబాబోయ్, ఇంకేమన్నా వుందాండి, ఇంటికాడకూడా అలా సెయ్యకుంటే నా తరమా అండి" అన్నాడు.

పిల్లలతో భార్యాభర్తలు సినిమా కెళ్ళారు. పిల్ల అడిగింది, "ఎందుకమ్మా ఆ అబ్బాయీ, అమ్మాయి అలా కుస్తీపడుతున్నారు, దొల్లుతున్నారు. గంతు లేస్తున్నారు" అని. తల్లి ఏమి అనలేక "వాళ్ళకి పిచ్చెక్కిందిలే" అని జవాబు చెప్పింది.

మూడుతరాల విలువలు తెలుస్తున్నాయి. సినిమా రచనలలో రచయితల ధరలు పెరిగినకొద్దీ వారి కల్పనకి విలువలు తగ్గుతున్నాయి; ఒకే ఒక పేరు చెప్పాలంటే, ఏ - బి. ఎన్. రెడ్డి వంటివాడో తప్పితే- ఆయనక్కూడా కొంత పెద్దమడి విప్పిన తర్వాత

గాని అవార్డు రాలేదు. లక్ష్మీకటాక్షం కలుగలేదు. బి. యస్. కనక ఇన్నాళ్లు నిలవ గలిగాడు.

కృష్ణ శాస్త్రిని మొదట సినీగేయాలు వ్రాయడానికి పిలిస్తే అయన ఎంతో బాధ పడ్డాడు, కవితాలక్ష్మిని ప్రార్థించాడు.

నగలన్ని దిగవిడచి
నడిచిరావమ్మా
నవ్యకవితకు నాకు
దారిచూపమ్మా!

మల్లేశ్వరికి మహంకాళమ్మకీ మధ్య ఎన్ని విలువలు మారిపోయాయో, అవన్నీ మారు తున్న విలువలే.

*

పండు వెన్నెల'దాల్చి ప్రసవవేదనతోడ
నెలవంక కనబోవు నిండుపొద్దులరేయి
ఒకవంక తెగతెంపు ఒకవంక బిగియింపు
హాహాల చెలిమిలో హాయి తొణికిసలాడు
తిమిరాల కడుపులో తేజాలు జనియించు
అమావాస్య నిశికింత హడలేల బెగడేల

*   *

తలచి తరచి తలుపులన్ని
పలుకుల్లో ఒలికిస్తే
ప్రాణాలే ఝల్లుమనును
గుండె మువ్వ ఘల్లుమనును

*   *   *

ఉదయం కానే కాదనుకోడం నిరాశ
ఉదయించి అట్లానే వుంటుందనుకోడం దురాశ
చీకటిలో కనువిప్పిన వారికి వెలుతురంటే బూచి
వెలుతురులో కనుతెరచినవారికి చీకటంటే పిశాచి

—[illegible]

# మారుతున్న విలువలు - పత్రికలు

శ్రీ నార్ల చిరంజీవి

"ఈ వేకువ వికసించిన మల్లెమొగ్గ
ఎవరి కెరుక నిన్న పడిన మూగబాధ?"
విలువలు మారుతున్నై.

మనుషులు మారుతున్నారు, మనసులూ మారుతున్నై!

మానవ శ్రేయోదాయకమైన ప్రతి మార్పూ, మంగళదాయకమైన రేపటి భవిష్యత్ కోసమే అని ఆశిస్తాం! కాని, ఈనాటి ఈ మార్పులు చూస్తుంటే హెచ్. జి. వెల్స్ ఏనాడో అడిగినట్లు "పురోగమనానికా? తిరోగమనానికా?' అన్న సదసత్సంశయంలో పడతాం!

సమాజం - మహా సాగరం లాంటిది. అలల తాకిళ్ళు, తుఫాన్ ఘోషలు, కల్లోలాలు అన్నీ పైపైనే జరిగి పోతుంటాయి. సముద్రం అట్టడుగు నీరు నిశ్చలంగానే ఉండిపోతుంది. అది కూడా కదిలి కలబడ్డప్పుడే 'జలప్రళయం' వొస్తుంది. అలాగే సమాజంలో కూడా సమూలంగా సంస్కరింపబడక, పైపై మార్పులవల్ల సత్ప్రయోజనం లభించదు. ఇవాళ మనకు కనిపించే, వినిపించేవన్నీ కొందరి దృష్టిలో పైపై మెరుగులు; మరికొందరి దృష్టిలో మార్పులు చేర్పులు. నిజానికి ఇవి పాక్షిక సత్యాలే! సమాజం మొత్తం సమూలంగా మారి, నూత్నరూపం ధరించి వినూత్నదశకు చేరుకోడమే 'విప్లవ పరిణామం'. అలా కాక, పైపై మెరుగులకీ, మార్పులకీ నడుమ సమాజం రెంటికి చెడిన రేవడి అవుతుందేమో కాని, పనికొచ్చే పసిడి మాత్రం తయారు కాబోదు.

జీవితంపట్ల గాఢానురక్తి, సమాజంపట్ల నిశితదృక్పథం, బాధ బాధ్యత రెండూ కలిగి ముందుకు సాగినంతకాలం - వ్యష్టిగా కాని సమష్టిగా కాని తీవ్రపరిణామాలు సాధింపబడవు. తీవ్ర సంచలనం ముంచుకొస్తే తప్ప - తమ రంగాల్లో 'విప్రవినోదులు' తయారు కాగలరేమోకాని, 'విప్లవయోధులు' తయారు కాబోరు. తమ తమ జీవితాల్ని తాము నమ్మిన మహాపథాలకు అంకితంచేయగల 'స్థితప్రజ్ఞుల' కోసం సమాజం ఎదురు చూస్తోంది. మరో గురజాడ, గిడుగు, వీరేశలింగం ప్రభృతుల వారసుల నిమిత్తం వారి రాకకోసం వేయి కళ్ళతో ఎదురు చూస్తోంది నేటి తరం.

నేటి సమాజంలో కిందినించి పైకీ, పైనించి కిందికి అంటుజాడ్యంలా అంతులేని దొంగభక్తి, కుహనా సంస్కృతీ, దారుణమైన అవినీతి, అన్యాయార్జితం, పక్కదీపం ఆర్పేసి సొంతదీపం వెలిగించుకునే రాక్షస మనస్తత్వం - ఇలా ఎన్నో పేరుపెట్టబడని రోగాలు ఉన్నాయి. కంచుకోటలు కట్టి ఉన్నాయి. చీకటి గోడలు నింగి నంటుతున్నాయి. వీటి పుట్టకీట్లు కదిలించి నేలకూల్చగల మహాప్రభంజనం రావాలి. కావాలి!

ఈ సమస్తానికి మూలం 'డబ్బు' అనేదని నిశ్చయంగా తేలిపోయింది. 'డబ్బు'కున్న స్థానాన్ని తెరవెనక్కి నెట్టి మిథ్యాతత్వాల్ని బోధించే వాళ్ళు 'పుండొక చోట ఉంటే మరో చోట వాత పెట్టే' మృషాభిషక్కులే అవుతున్నారు. ఈ సమాజంలో 'దేవుడి' కన్నా 'డబ్బు' బలపడి పోయింది. దానికోసం రకరకాల మారణహోమాలు పెచ్చుపెరిగాయి. నాగరికంగా నాజూకుగా కొన్ని హోమాలు సాగుతూంటే మరికొన్ని అమానుషంగా, అతి రాక్షసీయంగా జరుగుతున్నాయి. రూపాలు వేరయినా లక్ష్యం వొకటే. ఈ హోమ ధూమ ధూపాల్లో శలభాలై కొందరు, సమిధలై కొందరు సామాన్యులు సజ్జనులు కథావశేషులవుతున్నారు.

'యావద్విత్తోపార్జనాసక్తి' దీనికి మూలం. వ్యక్తిగత ఆస్తి, దానివెంట ఆసలు కొసలుగా సాగే ఆలోచనలే, ఆర్జనలే, అనర్థకాలే ఈ నాటి సమాజం 'అస్తవ్యస్తాని'కి మూలకారణం.

నేటి నాగరిక సమాజంలో పత్రికలు చాలా బలీయమైన సాధనాలు, ఆయుధాలు కూడా. రణరంగంలో మోహరించిన సైనికుల్లాంటివారు పత్రికా "రచయితలు" కాకుంటే తేడా వొకటే అక్కడ ఆయుధాలు, ఇక్కడ కలాలు పదునెక్కుతుంటాయి,

దురదృష్టవశాత్తు సమాజంలోని అవలక్షణాలకు అతీతులు కాలేక, మార్గదర్శకత్వ బాధ్యతనించి తప్పుకుని మన్నుదిన్న పెంజేరుల దుస్థితికి దిగజారి, సుఖజీవితానికి సులభ సంపాదనకీ తరణోపాయాల్ని వెతుక్కుంటూ బలి అయిపోతున్నాయి, చాలవరకు పత్రికలూ, రచనలూ కూడా.

అంచేతనే కాకమ్మ కబుర్లకీ, కట్టు కథలకీ పుట్టినిళ్ళై, పెట్టుబడికి ముద్దు పుత్రికలై లక్ష్యహీనమూ అగమ్యగమ్యమూ ఐన పీతనడకల్లో పడ్డాయి చాల పత్రికలూ, రచనలు. మతిచెడిన శస్త్ర వైద్యుని చేతిలో కత్తి - మరణోన్ముఖుడైన రుజాగ్రస్తుణ్ణి రక్షిస్తుందా? భక్షిస్తుందా? అన్న భయంకరప్రశ్న మన ఎదుట నిలబడి ఉంది.

స్వాతంత్ర్యం రాకముందుస్థితి ఇంత అధ్వాన్నంగా లేదు. ఎక్కడో ఆంగ్లేయుల ఔరసపుత్రికలనతగిన కొన్ని పత్రికలు తప్ప - తతిమ్మా దేశీయ పత్రికలన్నిటికీ ఒక గమ్యమూ లక్ష్యమూ ఉంది! త్యాగధనులు, సాహసచక్రవర్తులూ ఐన రచయితలు ఉన్నారు. జైళ్లు తుపాకుల బెదరింపులు ముందు వారి శిరస్సులను వొంచలేదు. తుఫానులు ఎన్ని వీచినా హిమోత్తుంగశృంగాల్లా వారి శిరస్సులు గంభీరంగా నిలబడిఉండేవి. నిజాయితీగల ప్రతి పత్రికా రచయితా - ఒక డాక్టరులాగా - సమాజాన్ని పట్టి పీడించే అన్ని అసాధ్యరోగాల్ని నిర్మూలించి, ఆరోగ్య పరిరక్షణకు పాటుబడేవాడు ప్రజల నాడీ స్పందన పత్రికారచనతో ప్రతిధ్వనించింది; రచనా చికిత్సకుల ప్రధాన ప్రథమ కర్తవ్యం- ప్రజలపక్షాన నిలబడి పోరాడ్డమే!

ఐశ్వర్యాల్ని కరిగించి పత్రికల్ని నెలకొల్పి, నడుపుతూ బికారులైన "ప్రజా యోధులు" ఉండేవారు. పరప్రభుత్వాన్ని ఢీకొని ఆహూతి అయిన ''ఆత్మధనులు'' ఉండేవారు. వారి జీవితాలు, రచనలు, వ్యాసంగాలు నవభారత సృష్టికి దోహదమిచ్చాయి.

లక్షలాది యువతీ యువకులు ముక్తగీతిక లాలపిస్తూ స్వాతంత్ర్య సంగ్రామపథంలో నిర్భీతిగా పయనించారు.

ఆ రోజుల్లో అనేక పర్యాయాలు "రహస్యపత్రికలు" వెలువడేవి. భారతాత్మకు ప్రతీకలుగా అవి మూలమూలలకు వెళ్ళేవి. బ్రిటిష్ సింహాలు చెరలాడినా పొరలాడినా, అందక ముప్పతిప్పలు పెట్టి మూడుచెరువుల నీళ్ళు తాగించిన ఘనత ఈ "ఈ రహస్య పత్రికలకు - చిట్టెలుకలుకే" దక్కింది. వాటి నిర్వహణలో ఆదర్శపురుషులు అష్ట కష్టాలకు లోనై ఆహుతి అయిపోయిన సంఘటనలు అనేకం ఉన్నాయి.

ఆ సంప్రదాయాలు, ఆ దీక్షాకర్తవ్యాలు, ఆ ఆరాటాలు పోరాటాలు కేవలం స్మృతి చిహ్నాలుగా నేడు మిగిలిపోవడంకంటే వేరే దుర్దశ ఏముంటుంది ? రెండు దశాబ్దాలుగా సాగుతూన్న నవీన భారత చరిత్రలో "పత్రికల" సంగతి పర్యాలోకించినవారికి శూన్యదృక్కులు తప్ప ఆశాదృక్కులు కనిపించవు. కనిపించినట్లు తోచినా అవి గగన కుసుమ సదృశాలే !

ఉద్యమాలు ఉత్సాహోద్రేకాలు పట్టు సడలగానే క్రైమ్, వెక్కిలిపత్రికలు "ప్రజా రాజ్యం" చేశాయి. విజ్ఞాన ప్రబోధం పరిమితంగా అయితే ఆ పత్రికలవల్ల అపకారం ఉందనలేము. కాని, "డబ్బు" చేసుకొనే కాంక్షతో అవి చేసిన మేలుకంటే అపకారం చాల దొడ్డది అనడంలో ఎలాంటి సందేహం లేదు. సమాజంలో డబ్బుసంపాదించే వాని కున్న గౌరవం పలుకుబడికి పరిమితం లేదుకనుక - ఎలా సంపాదిస్తేనేం - సంపాదన ముఖ్యమైపోయింది. పత్రికలు, చలనచిత్రాలు ఈ తోవలోనే పడ్డాయి.

స్వతంత్రభారతం ఒక విచిత్ర పరిణామాన్ని సృష్టించింది. అధికారంలో విపణి వీధిలో "గుత్తాధిపత్యం" ఏర్పడ్డమే ఈ పరిణామం. లక్షాధికార్లు కోటీశ్వర్లు కావడం, సాధారణులు మరింత నిరుపేదలు కావడం, "నదీనాం సాగరో గతిః" అన్నట్లు సమస్త సంపద కొందరి చేతుల్లోనే పోగుపడడం మొదలయింది. చూస్తూ చూస్తూ ఉండగానే గుత్తాధిపత్యం ప్రతిరంగంలోను బలపడిపోయింది. వీరి చేతుల్లోనే బలమైన పత్రికలు, గొలుసుపత్రికలు ఉన్నాయి. పరోక్షంగా, ప్రత్యక్షంగా ఈ శక్తులు రాజకీయరంగంలో గుత్తాధిపత్యాన్ని నేర్పుగా ప్రవేశపెడుతున్నారు. 'ప్రజాస్వామ్యాన్ని' కొనేస్తున్నారు. అమ్మేస్తున్నారు. "ఎన్నికలు" వాస్తే ప్రత్యక్ష భోక్యం చేసుకొంటున్నారు. పంచాయతీ మొదలు పార్లమెంట్ దాకా తమ అభిప్రాయాలకి ఆదాయాలకి అనువైనస్థానాన్ని సంపాదించుకొంటున్నారు. వాణిజ్యరంగమూ, పత్రికా యాజమాన్యమును గుప్పిట్లో బిగించుకొన్న వీరి పలుకుబడి ప్రాపకమూ "కేన్సర్" కన్నా భయంకరంగా దేశంలో వ్యాపించిఉంది. బలిష్టమైన వీరి చేతుల్లో "ప్రజాభిప్రాయం" మూగవోయింది

దేశంలో తలయెత్తే అశాంతి, నిరాశ, నిరుద్యోగం వల్ల ఏర్పడ్డ ఉద్యమాలు, ఉత్సాహోద్రేక పోరాటాలు, సంఘటిత శక్తులు, స్వేచ్ఛాభావ ధోరణులు వీటిని అణిచి వేయడంలో, వెన్నుపోటు పొడవడంలో వీరి పత్రికలు చాలా మెలకువగా ఉన్నాయి. స్వీయ సామ్రాజ్యాన్ని అన్నిరంగాల్లోను స్థాపించుకుంటున్నారు.

రాజకీయంగా అల్పాయుష్కులు, పాలనలో అసమర్థులు, పదవీ సుఖలాలసులు వీరికి దాసోహమ్మని చేతులెత్తడంతో గుత్తాధిపతులు మరింత పెచ్చు పెరిగిపోయారు. నిజానికి దేశం ఇవాళ పరోక్షంగా వీరి కౌగిట్లో వొదిగిలివడి ఉంది.

రాజకీయపక్షాలు నిర్వహిస్తున్న పత్రికలు నిమ్మకు నీరెత్తినట్లో, నమ్మకాన్ని అమ్ముకోవడంలోనో మునిగితేలుతున్నాయి. దేశంలో ఏర్పడిన ''అనిశ్చిత పరిస్థితి'' బలపడుతూన్న కొద్దీ ఈ పత్రికలు మరింత గందరగోళంలో పడుతున్నట్లు తోస్తుంది.

స్వతంత్రంగా వెలిసిన పత్రికలు ప్రకటనదారుల పోషణకు గురికావడం వల్ల ఏ ఎండ కాగొడుగు పట్టి ఏ రోటివద్ద ఆ పాటపాడి బతుకుతున్నాయి.

కడచిన నాలుగైదేళ్ళల్లోను యువతరం సాహిత్యపరంగానో ఆవేశపరంగానో పత్రికలు ప్రారంభిస్తున్నారు. పరిమాణంలో పాటవంలో ఇవి చిన్నవే; వీని శక్తి ఎలాంటిదో వేచి చూడాలి.

ఇలాగని అంతా 'చెడే' తప్ప మంచి లేదని నా వుద్దేశ్యం కాదు. ఈనాటికీ ఏదో మంచి జరగాలనీ, కలలు పండాలని తాపత్రయపడే పత్రికా రచయితలు గాలిలో దీపాల్లాగా కొట్టు మిట్టాడుతూనే ఉన్నారు. యువతరంలో కొందరు ఉత్తమ ఆశయాల కోసం పత్రికలను పెటాలని ముందుకొస్తున్నారు. మేధావులు, ఆలోచనాపరులు తమ వాణిని ప్రతిబింబించడానికి ముందుకు వస్తూనే ఉన్నారు.

ఏదో ఒక మార్పు, కూర్పు వొస్తుంది. వొచ్చితీరాలి. అప్పుడు కాని ఈ ఇరులు ఇరుకులు ఎల్లలు దాటి పత్రికలు పత్రికా రచయితలు 'విశ్వశ్రేయస్సు,' 'వసుధైక కుటుంబం' అన్న ఉత్తమాశయాలతో ముందుకు సాగుతారు. పూర్వులు సముపార్జించి పెట్టిన త్యాగధనం, నిస్వార్థసేవ మళ్ళా పెట్టుబడిగా కొత్త జీవన లతలు పూని పుష్పించి లోకకళ్యాణం సాధించబడుతుం దని విశ్వసిద్దాం.

*

చుక్కలలో ఆదర్శాలను లెక్కిస్తూ
ఎక్కడికో పోతున్న మనల్ని
రెక్కపట్టి నిలబెట్టి లోకం
ఎన్నెన్ని దుస్సహ దృశ్యాలు చూపించి
ఎన్నెన్ని దుస్తర విఘ్నాలు కల్పించి
కలలకు పొగలనూ, కాటుకలనూ కప్పి,
శపించినదో, శరించిందో మనల్ని.

—శ్రీశ్రీ.

# పత్రికలూ, మారుతున్న విలువలూ

## శ్రీ సంఘమిత్ర

పత్రికా రచన అసిధారావ్రతంవంటిది. నిత్యసత్యాన్వేషణమే పత్రికల ప్రథమోద్దేశం, చరమోద్దేశం కూడా. మనసా వాచా కర్మణా తనకు ఏది సత్యమని ధృఢంగా అనిపిస్తున్నదో దానిని సంపాదకుడు నిర్భీతిగా లోకానికి ఎలుగెత్తి తెలియపర్చాలి. అందుకే పత్రికారచన అసిధారావ్రత మన్నది. నూరునయాపైసల నిజంకూడా ఒక్కొక్కప్పుడు కొందరికి రుచించక పోవచ్చు. అయితేనేం? సంఘసంస్కర్త అయిన సంపాదకుడు వెలుగు బాటను కేలెత్తి చూపిస్తూ ముందుచూపుతో సాగిపోతాడు.

### కందుకూరి వేసిన బాట

ఆంధ్ర పత్రికా రంగంలో అటువంటి తొలి సంపాదకుడు శ్రీ కందుకూరి వీరేశలింగంగారు. వీరేశలింగంగారు స్థాపించిన "వివేకవర్ధని" అనే వారపత్రిక ఆశయం సంఘసంస్కరణ. తరువాత పంతులుగారు 'వ్యాసవర్ధని' అనే పత్రికనుకూడా ప్రారంభించారు.

శ్రీ ఎ. పార్థసారథినాయుడుగారు 'ఆంధ్ర పత్రిక' అనే వారపత్రిక ప్రారంభించారు. ఈ పత్రిక సుమారు పాతిక సంవత్సరాలు నడచింది. ఆనాటి పాలకులయిన బ్రిటిష్‌వారిని విమర్శిస్తూ ఈ పత్రికలో వ్యాఖ్యలు వెలువడేవి. ఈ కాలంలోనే శ్రీయుతులు కొక్కొండ వెంకటరత్నంగారూ, చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారూ కూడా కొన్ని పత్రికలను స్థాపించడం జరిగింది. ఇవికూడా ఆనాటి జాతీయవాంఛలకు దర్పణాలుగా, సంఘసంస్కరణలకు పట్టుకొమ్మలుగా పనిచేశాయి.

ఇరవయ్యోశతాబ్ది ప్రారంభంనుండీ పత్రికావ్యాసంగం విస్తృతమయింది. గిడుగు రామమూర్తిగారు నడిపిన తెలుగు వారపత్రిక 'తెలుగు' వ్యావహారిక భాషావాదానికి తోడ్పడింది. ఆధునిక సాహిత్యప్రచారం నిమిత్తం కీర్తిశేషులు కొంపెల్ల జనార్దనరావుగారు 'ఉదయిని' అనే మాసపత్రికను నడిపారు. అయితే దురదృష్టవశాత్తూ వీరు ముప్పయ్యేళ్ళు కూడా నిండకుండానే పరమపదించారు. శ్రీ ముట్నూరి కృష్ణారావుగారు 'కృష్ణాపత్రిక' ప్రారంభించారు. దీని కార్యస్థానం జాతీయకళాశాలకు పీఠమైన మచిలీపట్నం. పత్రికా రచనలో శ్రీకృష్ణారావుగారు కొత్త ఒరవడి పెట్టారు. అతిగంభీరమైన తాత్త్వికవిషయాలుగాని లేకపోతే సున్నితంగా మనస్సుకు తాకే సారస్వతవిషయాలుగాని వారు చక్కని పదజాలంలో పాఠకులముందు పెట్టేవారు. అరవిందుల తత్త్వదర్శనమూ, ఠాగూరు విశ్వ

జనీనతా వీరి రచనల్లో గుబాళించేవి. ఒకతరంపాఠకులపై చెరగని ముద్రవేసిన శిల్పి 'మౌన ముద్రాలంకారులు' శ్రీ కృష్ణారావుగారు.

'ఆంధ్ర పత్రిక' వారపత్రికగా ప్రారంభింపబడింది. తరువాత శ్రీకాశీనాథుని నాగేశ్వరరావుగారు దీనిని దినపత్రికగా మార్చి మద్రాసునుండి వెలువరించ నారంభించారు. పిమ్మట ఆంధ్రసచిత్ర వారపత్రికా, భారతీ ప్రారంభించారు వీరే. ఆంధ్రజాతీయోద్యమాలకు తెలుగు సారస్వతానికీ ఈ పత్రికలు ఆ రోజుల్లో ఎంతో ఊతం ఇచ్చినవి.

## ఖాసా వెలిగించిన దీపాలు

'ఆంధ్రప్రభ' తొలిసంపాదకులు శ్రీ ఖాసా సుబ్బారావుగారు తర్వాత శ్రీ న్యాపతి నారాయణమూర్తిగారు ఈ పత్రిక సంపాదకత్వం వహించారు. తరువాత చాలాకాలం శ్రీ నార్ల సంపాదకత్వాన ఈ పత్రిక వెలువడింది. ఖాసా సుబ్బారావుగారే ఇంగ్లీషు స్వతంత్రనూ తెలుగు స్వతంత్రనూ ప్రారంభించారు.

తెలంగాణాలో శ్రీ మాడపాటి హనుమంతరావుగారు స్థాపించిన 'ఆంధ్రజనసంఘం' అనేపత్రికా, కీ॥ శే॥ సురవరం ప్రతాపరెడ్డిగారు వెలువరించిన 'గోలకొండ' వారపత్రికా ఆంధ్రోద్యమానికి ఎంతో తోడ్పడ్డాయి.

చూచాయగా కొన్ని పత్రికలను ఇక్కడ పేర్కొన్నాను; అయితే గతంలో వొచ్చిన అనేకానేక పత్రికలవల్లకాని, నేడు నడుస్తున్న పత్రికలవల్లకాని సంఘంలో తీవ్రమైన మార్పులు వచ్చాయా? వస్తున్నాయా? అంటే సమాధానం అవునూ, కాదూ. "నేను నా నాటకాలద్వారా మానవజాతి సమస్యలన్నీ పరిష్కరించేశాను. కాని, నేను ఒక్క నాటకంకూడా రాయనట్టే మానవజాతి ప్రవర్తిస్తోంది. నే రాసినదంతా వృధా"అని బెర్నార్డుషా వాపోయాట్ట. అలాగే నిజంగా సంఘసంస్కరణకోసం సమాజంలో మార్పులకోసం పాటుపడుతున్న పత్రికల ప్రభావం ఎంతవరకు ప్రసరిస్తున్నది? అని ప్రశ్న వేస్తే చప్పున సమాధానం చెప్పటం కష్టం.

## వ్యాపారదృష్టి

కొన్ని ప్రశ్నలకు ప్రశ్నలే సమాధానం. అసలు మనకు మంచి పత్రికలు వున్నాయా? అని ప్రశ్నించవచ్చు. మన కున్న మంచి పత్రికలను వేళ్ళమీద లెక్కించవచ్చు. స్వాతంత్ర్యానంతరం పత్రికా పరిశ్రమకు వ్యాపారదృష్టి పెరిగింది. ధనికవర్గం యొక్క రాజకీయాల నీలినీడలు మన పత్రికలపై గాఢంగా ప్రసరిస్తున్నవి. పెత్తందార్ల రాజకీయవైఖరికి ఆత్మగౌరవాన్ని విడనాడి తాళం వేయడం నేడు మన పత్రికా ప్రపంచంలో సర్వసామాన్యమైన విషయంగా ఉంది.

కేవలం చందాలమీద ఆధారపడి పత్రికలు బ్రతకడం కష్టం. ప్రకటనలు కావాలి. ఈ ప్రకటనలు కొందరి గుప్పిళ్ళలో వున్నయ్. ఆగర్భదరిద్రుడి సమస్య ఆగర్భశ్రీమంతుడి ప్రయోజనం - ఈ రెంటిమధ్య పేచీ వొచ్చినపుడు దరిద్రుడు వెనక్కి వెళ్తున్నాడు. మంత్రులూ పారిశ్రామిక పెత్తనదార్లూ, భూస్వాములూ, కోటీశ్వరులూ వీళ్ళు పచ్చగా ఉంటేనే తామూ పచ్చగా ఉంటామని వాళ్ళ కొమ్ముకాసే పత్రికాధిపతులు ఎక్కువయ్యారు.

## సచేతనమైన హృదయం

నిరంతరం మనం ఎదుర్కొంటున్న చిక్కు సమస్యల్ని విశదంగా తెలియపరుస్తూ ఆ చిక్కుపరిస్థితుల్ని అధిగమించడానికి తగిన సలహాల నిస్తూ ఎల్లప్పుడూ దేశక్షేమానికే

పాటుపడవలసిన వ్యక్తి జర్నలిస్టు. మరి నేడు పత్రికలు ఎలా వున్నయ్? ఓ మధురమీనాక్షి కథానికా, ఓ సినిమా నక్షత్రం చీకటిజీవితం, ఒక పళ్ళపొడి ప్రకటనా, నవ్వు తెప్పించని పనికిమాలిన కార్టూను, ఓ తెలిసీ తెలియని రాజకీయ విమర్శ, ఓ తార, తారడూ ముఖచిత్రం—ఇవీ మన వారపత్రికల మాసపత్రికల స్థూలస్వరూపాలు. సజీవమైన విమర్శ, సచేతనమైన హృదయం, సానుభూతితో కూడిన దృక్పథం ఎన్నిపత్రికల్లో నేడు మనకు కానవస్తున్నది?

నేటి విప్లవరచయితలసంఘం ఉపాధ్యక్షులు శ్రీ కొడవటిగంటి కుటుంబరావుగారు ఇరవైఏళ్ళ క్రితం చెప్పిన ఈ విషయంకూడా గమనించండి.

"మన పత్రికలకు డబ్బులేదు. విజ్ఞానవంతమైన వ్యాసాలు రాసే రచయితలు తక్కువ. పత్రికారచన ఇంకా ఒక గౌరవనీయమైన వృత్తిగా పరిణమించలేదు. యథార్థమైన వార్తలు సంపాదించేందుకు మనకు సాధనాలుకూడా లేవు. ఏదోవూరులోనో కాల్పులు జరిగితే అక్కడి యథార్థసంఘటనలు మనకు నెలలపర్యంతం తెలియరావు." (కుటుంబరావు గారూ ఎంత నిజం చెప్పారండీ. మొన్న జలగాన్ భివాండీల్లో మతకలహాల గురించి ఎన్నిరకాల కథనాలు వచ్చాయండీ స్వామి 'ఇల్లస్ట్రేటెడ్ వీక్లీ ఆఫ్ ఇండియా' చెప్పింది వేరు, జనసంఘం వారు చెప్పింది వేరు.)

ఇరవై ఏళ్ళక్రితం కొ. కు. గారు చెప్పిన పరిస్థితి నేటికీ ఏమీ పెద్దగా మారలేదు.

## విప్లవం వర్ధిల్లాలి

ఒక రకంగా చూస్తే మన సంప్రదాయాలకూ నేడు మనం చేయవలసిన కృషికీ మధ్య ఒక సంఘర్షణ ఉన్నదేమో అనిపిస్తుంది. పోతనగారు "సంతుష్టుడీ మూడు జగముల పూజ్యుడు" అన్నారు. సంతుష్టితో ఉంటే పురోగమనం ఎక్కడిదీ? "తృప్తి నల్లమందు లాంటిది. మనుష్యుల బుర్రల్లో కుమ్మరి పురుగుల్ని పెట్టి వదలాలి. లేకపోతే తృప్తిపడి కునికి పాట్లుపడుతూ శక్తిలేని వాళ్ళయి మాట్లాడక అన్నిటికీ సహించి వూరుకుంటారు. ఓరిమి గాడిదలసుగుణం. ఇతరులు పెట్టే బాధలకు లొంగి సహించి ఓరిమితో పడివుండడం మానవుణ్ణి నాశనంచేస్తుంది. "ఓరిమి కలిగివుండం డని బోధించేవాళ్ళు ప్రజల్ని కనుకప్పి గాడిదలుగా చేద్దామని చూస్తున్నారన్న మాట" అన్నాడు మాక్సిమ్‌గోర్కీ.

ఆయన ఇంకా ఇలా అన్నాడు "విప్లవం అతిసహజమూ ఉదాత్తమూ అయిన సంఘటన. మాతృగర్భంలోని శిశువు పైకి వొచ్చేందుకు అటూఇటూ కదిలే ప్రయత్నం వంటిదే అది. త్యాగం చేయం డని ప్రజలకు బోధించడం వట్టి దగా. సామాన్య ప్రజ త్యాగం చేయవలసిన దేముంది. ప్రాణాలు తప్ప."

రేపటి ఉషస్సులో విప్లవం వొస్తుంది. దీర్ఘరాత్రి గడిచి వెలుతురులోకి వెళ్ళే సమయం వస్తున్నది. ఉషస్సుముందు ఉన్న తమస్సులో నేడు సంఘం వుంది. ఈ గడియలో పత్రికా రచయితల బాధ్యత గురుతరమైనది. అంచేత నిజాన్ని నిర్భయంగా చాటి ప్రజలకు సరిఅయిన ప్రబోధ విజ్ఞానాలు కలిగించే పత్రికలు అసంఖ్యాకంగా రావాలి మనకు కావలసింది ఆర్థిక స్వాతంత్ర్యమే కాదు. పరిపూర్ణ భావస్వాతంత్ర్యంకూడా.

✱

# యువభారతి

# ప్రచురణలు



1. సరస్వతీ సాక్షాత్కారము
   (రసపుష్టి కలిగిన కావ్యం) — అనుముల కృష్ణమూర్తి రు. 3-00
2. జీవనగీత*
   (మానవాళి నివాళులెత్తిన కారుణ్యోపనిషత్తు,
   ఖలీల్ జిబ్రాన్ The Prophet కు తెనుగుసేత) — కాళోజీ రు. 2-50
3. వీచికలు*
   (నలుగురు యువకవుల కవితాసంకలనం)
   కృష్ణమూర్తి, చక్రవర్తి, వెంకట్రావు, విశ్వనాథం రు. 2-00
4. పంచవటి*
   (కథల సంపుటి) — అవసరాల రామకృష్ణారావు, మంజుశ్రీ,
   శీలా వీర్రాజు, లత, సి. ఆనందారామం రు. 2-00
5. రచన
   (మారుతున్న విలువలు - రచయితల బాధ్యతలు - గోష్ఠిపై
   37 గురు ప్రముఖుల వ్యాససంపుటి) రు. 7-00
6. కావ్యలహరి* - ఉపన్యాసమంజరి
   (ప్రాచీనాంధ్ర ప్రబంధాలకు మణిహారం)
   ఆచార్య దివాకర్ల వేంకటావధాని రు. 5-00
7. అక్షరాలు*
   (పదముగ్గురు యువభారతీయుల కవితా సంకలనం) రు. 2-00
8. చైతన్యలహరి - ఉపన్యాసమంజరి
   (ఐదుగురు చైతన్యమూర్తులపై వ్యాసరూపక ఉపహారం) రు. 6-00
9. మహతి - స్వాతంత్ర్యయుగోదయంలో ఆంధ్రసారస్వత సందర్శనం
   (నూర్గురు ప్రముఖుల వ్యాససంకలనం) రు. 20-00
10. ఫ్రీ ఇండియా ఫోర్జెస్ ఎహెడ్
    (34 వ్యాసాల సంకలనం) రు. 10-00

---

* ప్రతులు లేవు

# యువభారతి

## త్వరలో రానున్న ప్రచురణలు

1. స్వరాలు – యువభారతీయుల కవితాసంకలనం
2. ఉషస్సు – యువభారతి సాహితీమిత్రుల కవితాసంకలనం
3. మళ్ళీ వెలుగు – శ్రీ శీలా వీర్రాజుగారి వచనకవితాకావ్యం
4 వికాసలహరి – జాతివికాసానికై దోహదం చేసిన ఐదుగురు మహనీయులపై ఉపన్యాస వ్యాస సంకలనం.

# మళ్ళీ వెలుగు

(వచన కవితా కావ్యం)

రచన : శీలా వీర్రాజు

* నగరజీవితాన్నీ, సామాజిక వ్యవస్థను వివరంగా చర్చిస్తూ వ్రాయబడిన యీ గ్రంథాన్ని ఆధునిక ద్వ్యర్థికావ్యంగా పేర్కొనవచ్చు.

* ఉషస్సు, ఉదయం, మధ్యాహ్నం, సాయంకాలం, సంధ్య, రాత్రి, అర్ధరాత్రి– అని ఐదు అధ్యాయాలక్రింద, ఆయాసమయాలలో నగరజీవితాన్ని సమగ్రంగా ఆవిష్కరించిన వర్ణనాత్మక కావ్యం యిది.

* ఒక్కొక్క అధ్యాయాన్నీ ఒకొక్క సామాజిక స్థితికి సంకేతంగా స్వీకరించి, చైతన్యరహితమైన, జడమయమైన అర్ధరాత్రి చీకటి చిరకాలం నిలవదని, త్వరలోనే యీ చీకటి తొలగిపోయి మళ్ళీవెలుగు వస్తుందనే ఆశావాదాన్ని ప్రకటిస్తూ అభ్యుదయ భావవాహికగా నడిచిన ప్రగతిశీలక కావ్యం.

* తెలుగు కవితారంగంలో ఈ కావ్యం ఒక సరికొత్తప్రయోగం.







సాహితీమిత్రులు
✻యువభారతి

సాహితీమిత్రులుగా యువభారతిలో చేరడం అంటే మీ అండదండలను మాకు హృదయ పూర్వకంగా అందించటానికి అంగీకరిస్తున్నారన్నమాట.

## 'యువభారతీ'యులైన సాహితీమిత్రులకు ఈ పథకంలో సమకూరే సదుపాయాలు:-

* ప్రతిసంవత్సరం ఐదురూపాయలు చెల్లించడంతో యువభారతి సాహితీ మిత్రులుగా పరిగణింపబడతారు.

* తక్షణమే ఒక ఉచిత పుస్తకం.

  1973 వ సంవత్సరంలో మూడు రూపాయల ప్రచురణ పూర్వ విరాళంపై ప్రచురింపబడే పుస్తకం మీకు ఉచితంగా అందుతుంది. నేరుగా అందించడంగానీ, పోస్టుద్వారా పంపడంగానీ జరుగుతుంది,

* 1973 వ సంవత్సరంలో యువభారతి నిర్వహించే సాహిత్య కార్యక్రమాల వివరాలు, ఆహ్వానాలు అందుతాయి.

* 1973 వ సంవత్సరంలో మీరు యువభారతి ప్రచురణలను 25% మినహాయింపుతో సొంతం చేసుకునే సదుపాయం ఉంటుంది.

* సాహితీమిత్రులు అని వెల్లడించే సభ్యత్వచిహ్నం అందుతుంది.

* యువభారతి సమావేశాలలో మీరు సాహితీమిత్రులుగా, అతిథులుగా పాల్గొనవచ్చు.

* అన్నింటికన్నమిన్న యువభారతికి తోడ్పడగలుగుతున్నామన్న సంతృప్తి; మీకా సంతృప్తి కలిగించేలా, యువభారతిని తీర్చిదిద్దడంలో మీ సహకారం అందించటం.






సమాజంలో సాహిత్యం
కావ్యలహరి చైతన్యంలా
నవలాస్యం చేయాలని
యువభారతి లక్ష్యం!

సాహితీ మిత్రులుగా
యువభారతి సంస్థ మీకు
ఆహ్వాన మందిస్తున్నది.

సాహిత్య కళా సంస్కృతి సాధనకూ
సమ్యక్ శోధనకూ
విస్తృత స్నేహారాధనకూ
విశ్వశ్రేయ స్సాధనకూ
'సాహితీమిత్ర' పథకంలో
సభ్యులుగా చేరండి
విశేషాలకు, వివరాలకు
మరువకండి!

**యువభారతి**

సాహితీ సాంస్కృతిక సంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు-3


VIRTAS PRINTER